## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్చ్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్చ్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120028858

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# ఆంధ్రమహాభారతము - ద్రౌపది

- ఒక ఐతిహాసిక విశ్లేషణ -



డాక్టర్ వాడపల్లి చక్రపాణిరావు



# ఆంధ్రమహాభారతము - ద్రౌపది

## —ఒక ఐతిహాసిక విశ్లేషణ



డా. వాడపల్లి చక్రపాణిరావు,

M.A., M. Phil., Ph. D.,

తెలుగు లెక్చరర్

శ్రీ కోనసీమ భానోజీ రామర్సు కళాశాల,

అమలాపురం.



★ ★

This book is published with the financial assistance of Tirumala Tirupathi Devasthanams under their scheme–

**"AID TO PUBLISH RELIGIOUS BOOKS"**

# ఆమోదం

డాక్టర్ లకంసాని చక్రధరరావు, ఎం. ఏ; పిహెచ్.డి.,
రీడరు, తెలుగుశాఖ,
డైరెక్టరు, ప్రధానసంపాదకులు, తెలుగువ్యుత్పత్తికోశపథకం
ఆంధ్రవిశ్వకళాపరిషత్, వాల్తేరు.

డాక్టర్ వాడవల్లి చక్రపాణిరావు ఎమ్. ఏ; ఎం. ఫిల్; పిహెచ్. డి., ఆంధ్రోపన్యాసకులు, శ్రీ కోనసీమా భానోజీరామర్సు కళాశాలా - అమలాపురం విరచించిన "ఆంధ్రమహాభారతము - ద్రౌపది" సిద్ధాంతవ్యాసానికి ఆంధ్రవిశ్వకళాపరిషత్ వాల్తేరువారు పి ఎచ్. డి. పట్టాన్ని బహూకరించి తమ పట్టాలకు మంచికొత్తవిలువల్ని సంతరించుకొన్నారు. ఈ సిద్ధాంత వ్యాసానికి పర్యవేక్షకుడుగా ఉండి ఈ మహాభారత యజ్ఞంలో యాజ్ఞసేనితో పాటు నేనుకూడా నిమిత్తమాత్రుణ్ణి కాగా చక్రపాణి సర్వంనిర్వహించాడు.

"ధర్మే చార్థేచ కామేచ మోక్షేచ భరతర్షభ।
యది హాస్తి తదన్యత్ర యన్నేహాస్తి నతత్క్వచిత్"

(శ్రీమహాభారతమ్ - ఆదిపర్వణి 62 అధ్యా 53)

అనే వైశంపాయనోక్తి మహాభారతవిషయంలో వాస్తవమైనట్లుగానే ఈ 'ఆంధ్రమహాభారతము - ద్రౌపది' గ్రంథంలో లేనివిషయం లేదు. ఈ సిద్ధాంతవ్యాసాన్ని మహాభారతదర్పణంగా మనం పేర్కొనవచ్చు. సంస్కృతాంధ్రాంగ్లాలలో పాండిత్యమున్న డాక్టర్ చక్రపాణిరావు గారు తమ విశ్వరూపాన్ని ఈగ్రంథంలో ప్రదర్శించారు. బహుజనాదరణ పాత్రమైనవ్యావహారిక భాషలో ఈరచనను సుందరంగా సాగించారు. వీరు భారతగాథల్లోని ద్రౌపదీ పాత్రను విశ్లేషించి ఆదర్శనారీమణిగా

# స్పందన

K. PARVATHI KUMAR, M. Com., F.C.A.
Chartered Accountant
VISAKHAPATNAM

పుణ్యచరిత, మహాపతివ్రత, మహాభారత గ్రంథ కథానాయిక అయినటువంటి ద్రౌపదీ సాధ్వి గురించి వివరించటం శ్రీకృష్ణుని అవతారతత్వమును గురించి విశదీకరించటంవలెనే అతిక్లిష్టము. సమకాలికమానవతా విలువలకు అందని దివ్యచరిత ద్రౌపదీదేవి. ఆనాటికి ఈనాటికికూడా శ్రీకృష్ణుని వలెనే పరిపూర్ణ అవగాహనకు అందని ఒక దివ్యశక్తి ద్రౌపదీదేవి.

ఆమెజననము, ఆమె వివాహము, ఆమె జీవితమునందు ఎదుర్కొనిన సంఘటనలు అద్వితీయములు. పరిమితమైన మానవదృష్టికి అందని సత్యములు. ఆనాడూ ఈనాడూ ఆమెచరిత్ర ఒకసమస్యవలె పరిణమించినది. పరిమితమైనటువంటి ఆలోచనా పరిధిగల మానవులకు ఆమె జీవితము దురవగాహ్యము.

కేవలము భౌతిక ప్రపంచమే సర్వస్వమని తలపోయువారికి భౌతిక కక్ష్యకు ముందు వెనుకల లోకముల అనుభూతి లేనివారికి ఆమె జీవన విధానము అంతుపట్టదు. సామాన్య తాత్కాలిక దృష్టితో చూచినపుడుగూడా ఒకమానవుని జీవితమునందలి ఒక సంఘటనను ప్రత్యేకముగా విడదీసి పరికించిన ఆసంఘటనయందు ఆమానవుడు ధర్మయుక్తముగా ప్రవర్తించెనని చెప్పలేము. ఉదా॥కు శ్రీరాముడు, శ్రీకృష్ణుడు ఒనర్చిన యుద్ధములను పూర్వాపరములను మరచి పరిశీలించనచో అదియొక హింసాకాండగా గోచరమగును. అటులనే గౌతమ బుద్ధుని జీవితమున కేవలము సన్న్యసించిన ఘట్టమును మాత్రమే పరిశీలించినచో భార్యకు తనయునకు తల్లిదండ్రులకు ద్రోహము చేసిన వాడుగా కనవచ్చును. కావున పూర్వాపరముల సమగ్ర అవగాహన

కలిగినవారికే మాత్రమే దివ్యమూర్తులయొక్క ప్రవర్తనము, సందేశాత్మక స్వరూపముగా అవగతమగును. అట్లుగాక మొత్తము విషయమును ఏకీలు కాకీలుగా విడదీసి ఒక భాగమును మాత్రమే పరిశీలించినచో సమగ్ర అవగాహనము, సదవగాహనము కలుగకపోగా దురవగాహనకు దారితీయును. అవతారమూర్తులగు వారియందరియందు గూడా పరిమితి దృష్టిగల మానవులు ప్రతినిత్యము చేయుదూషణయిందుకు తార్కాణము.

ప్రకృతి సృష్టిని పరిపూర్ణముగా అర్థముచేసుకొనవలె నన్న అనుభూతి పరంగా భౌతికాతీత లోకముల దర్శనము ఉండవలెను. అటువంటిదర్శనము కలిగినవారికి మాత్రము దివ్యమూర్తి ద్రౌపదీమహాసాధ్వి జీవితం అవగతము కాగలదు. శ్రీకృష్ణుని వలెనే ద్రౌపదీదేవి కూడా జగత్కల్యాణార్థమై భూమికి దిగివచ్చిన ఒకశక్త్యంశ. ఆమె ప్రాతిపదికగా భరతభూమియందు 5000 సంవత్సరముల క్రింతం ఒక మహా యజ్ఞం సంకల్పించబడి భూమికి భారమైనటువంటి నరపతుల సంహారము జరిగినది. అహంకారము, ఈర్ష్య, అసూయ, కాముకత్వము కలిగిన ఎందరో నరపతులకు ద్రౌపదీదేవిని "ఎఱ" గానుంచి వారి సంహారమునకు పరిష్కార మార్గమును ప్రకృతి ఏర్పరచినది. ఈ మొత్తము మహాయజ్ఞము నందు తనను ఒక సమిధగా భగవత్కార్యము కొరకై సమర్పణ చేసికొన్న అనన్య భక్తిపరురాలు ద్రౌపదీదేవి. సర్వమును వాసుదేవ స్వరూపమైన అంతర్యామికి అర్పణము చేసికొని తన కర్తృత్వమును అత్యంత శ్రద్ధతో నిర్వహించిన స్త్రీమూర్తి ద్రౌపదీదేవి.

శ్రీకృష్ణునితో సమానముగా ధర్మసంస్థాపనకు తోడ్పడిన సాధ్వి ద్రౌపతీదేవి. అందులకే ఆమె నామము కూడా "కృష్ణ" అని భారతమునందు నిర్వచింపబడినది. ద్రుపదరాజపుత్రిక యగుటచే ద్రౌపది యను నామము స్థిరపడినది. శ్రీకృష్ణునకు అత్యంత సాన్ని

హిత్యము కలుగుటకు కారణము ఆమె వాసుదేవోపాసనాతత్పరతయే. పరపురుషులచే అవమానింపబడినపుడుగాని, అరణ్యవాసము నందుగాని, తన తనయులను సమూలముగా అన్యాయముగా సంహరించినపుడుగాని ఆమె జూపిన స్థిత ప్రజ్ఞత్వము అనిర్వచనీయము. అశ్వత్థామ, సైంధవ రాజులయందు ఆమె జూపిన కరుణ అద్వితీయము. సహనము, ప్రేమ, కరుణ యిత్యాది సమస్త కళ్యాణ గుణములను తనతోపాటు సహజ ముగనే కొనివచ్చి ఆయా సందర్భానుసారము ఆ గుణములను ప్రక టించుచూ పాండవేయులను క్షాత్ర ధర్మమునందు నిలుపుతూ సమస్త జగత్కార్యమును ఒంటరిగా నిర్వహించిన అవతారమూర్తి ద్రౌపదీ దేవి. ఆమె జననము అగ్నిహోత్రమునుండి సంభవించినదిగా భారతము నందు తెలియజేయబడుచున్నది. అగ్నిహోత్రమునుండి దేహమును కల్పించుకొని దిగివచ్చు ప్రక్రియ యింకనూ అవగాహన కాని విష యము. వైజ్ఞానికముగా మానవుడు ఎంత పురోగతిని సాధించినప్పటికీ క్రిందటితరమువారి పరిపూర్ణతను యింకనూ సాధించవలసియున్నది. అగ్నినుండి వెడలివచ్చినటువంటి దివ్యశరీరధారి ద్రౌపది శరీరతత్త్వము నకు మానవ గర్భమునుండి వెలువడిన మానవ శరీరతత్త్వమునకు హస్తిమ శకాంతరమున్నది. శ్రీకృష్ణుని ప్రత్యక్ష — అంతర్థానములుకూడా ఆయన దివ్యశరీరమునకు తార్కాణము. అటులనే ద్రౌపదీదేవి దివ్య శరీరము సమకాలిక మానవ శరీరములకు విభిన్నమై యున్నది. ఈ కార ణముచేతనే ఆమె దివ్య శరీరమును పలువురు పలువిధముల ఆశించి భంగ పడిరి. వైజ్ఞానికముగా అట్టి శరీరతత్త్వమును అవగాహన చేసుకొన గలిగి ననాడు ద్రౌపదీదేవి చరితము కొంత అవగాహనముకాగలదు. అటులనే ఒక జీవిగా సృష్టియందు మెలగుతున్న ఆమె చరిత్రను ద్రౌపదీదేవి మొత్తము జన్మలతో అవగాహన చేసికొనినపుడు ఆమె బహుభర్తృ త్వము యొక్క ధర్మ సూక్ష్మత అవగాహన కాలదు. ధర్మవిదుడైన వేదవ్యాసుని అవగాహన మేరకు సామాన్య మానవుని అవగాహన పెరిగిననాడు మాత్రమే ద్రౌపది యొక్క బహుభర్తృత్వము అర్థము

చేసికొనగల సామర్థ్యము కలుగును. ధర్మవేత్త ద్రుపదమహారాజుకూడా వేదవ్యాసుని ఉద్బోధ అనంతరము మాత్రమే పంచపాండవులతో ఆమె వివాహమును ధర్మయుక్తమని అంగీకరించినాడు.

ధర్మస్వరూపమననెట్టిదో వెంట్రుకవాసికూడ తెలియని ఈనాటి సమాజములో ఆమెను అర్థం చేసుకోవటం దుర్లభము. మనసు, ఇంద్రియములు, శరీరము, యోగముద్వారా పరిశుభ్రము గావించుకొన్ని బుద్ధికక్ష్యలోనుండి మనోమయ, ప్రాణమయ, అన్నమయ కోశము లకు నిరంతరము వెలుగు ప్రసారము గావింపబడిన వ్యక్తికి మాత్రమే ఆమె ధర్మాచరణము గోచరించును. ధృతరాష్ట్రుడు, దుర్యోధనుడు, దుశ్శాసనుడు, కర్ణుడు, శకుని మొదలగువారు అటువంటి బుద్ధియోగము లేకుండుటవలన ఆమెను అవమానింపబూనిరి. సదా బుద్ధి యోగము నందు జీవించు భీష్ముడు, విదురుడు, గాంధారి, కుంతి, ధర్మరాజు యిత్యాదులు ఆమెను ధర్మమూర్తిగా గౌరవించి ప్రేమించిరి. అపరిశుద్ధ మైన మనస్సుతో పరిశుద్ధమయిన విషయములను అవగాహన చేసుకొనలేము. పరిశుద్ధ విషయావగాహనమునకు పరిశుద్ధమైన మనస్సు అత్యంత ఆవశ్యకము. నిరంతర విశ్వప్రేమయందు జీవించువారు మాత్రమే ద్రౌపదీదేవి ప్రవర్తన యందుగల ధర్మసూక్ష్మములను అర్థము చేసుకొనగలరు. అట్టి అవగాహన లేనివారు ఆమె ప్రవర్తనను సమర్థించిననూ, తూలనాడినను గుడ్డివాని కనురెప్ప తెరుపుమాతలవలె నుండును.

గురుదేవులు శ్రీ ఎక్కిరాల కృష్ణమాచార్య దివ్యస్పర్శ కలిగి మహా భారతమునందలి ద్రౌపది వ్యక్తిత్వము గూర్చి సోదరుడు చక్రపాణిరావు చేసిన పరిశోధన ప్రశంసనీయము. ఈ పరిశోధనయందు మాష్టరుగారి భావపరంపర చోటుచేసుకొనినట్లుగా దృగ్గోచరమగును. పరిశోధనా ప్రయత్నమునందు సోదరుడు చక్రపాణిరావు పొందిన దివ్యాను భూతియే అతనికి దక్కిన ఫలమని నా భావన. ఇతర ఫలితములు తాత్కాలికములు. ఇట్టి పరిశోధనా రచనలు సోదరుడు చక్రపాణిరావు మస్తిష్కమునుండి కోకొల్లలుగా తెలుగుజాతికిఅందవలెనని మాష్టరు గారిని ప్రార్థిస్తూ ...

— కంభంపాటి పార్వతీ కుమార్.

# పుణ్యావిధి

"కృతమెఱుఁగుట పుణ్యము ........" ఆదికవీసధర్మం. "ఆంధ్రమహాభారతమూ - ద్రౌపది, ఒక ఐతిహాసికవిశ్లేషణ" అనే ఈసిద్ధాంతవ్యాసం ఇలా రూపొందడానికి ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ ఎందరో మహానుభావుల అండదండలు నాకు అందాయి. వారిలో ముందుగా పేర్కొనదగినవారు నా పరిశోధన పర్యవేక్షకులైన డాక్టర్ లకంసాని చక్రధరరావుగారు. ఉదారహృదయంతో నన్ను ప్రోత్సహించి, మార్గదర్శకత్వం వహించి నన్ను పట్టభద్రుణ్ణిచేసిన వారి సహృదయతకు నానమస్సుమాంజలులు. వారి 'ఆమోదం' వారి సహృదయతకు ప్రతిబింబం.

మహాభారతాన్ని ఒక గ్రంథంగాకాక జీవితకావ్యంగా అధ్యయనం చేయడం ఎలాగో నాకు బోధపడింది డాక్టర్ మోపిదేవి కృష్ణస్వామిగారి సాన్నిధ్యం వల్ల. వారి 'భారతం - ధర్మాద్వైత్వం' గ్రంథానికి నేను ప్రత్యక్షరసాక్షిని - ప్రత్యక్షసాక్షినీ అయితే వారు నాయీగ్రంథరచనకు అంతరంగ సాక్షులు. పూజ్యగురుదేవులు ఎక్కిరాల కృష్ణమాచార్యులవారి 'వెలుగు' ను ఏకొద్దిగానైనా నేను దర్శించగలిగానంటే ఆపుణ్యమూ, పురుషార్థమూ కృష్ణస్వామి గారివే!

ప్రకృతిలో ప్రతిదీ కాలగర్భితం. దేనిసమయం దానికి ఉంటుంది. అలాగని మనం అకర్మణ్యులం అయిపోయామో అవకాశం మనచేతులు దాటిపోయి మరొకర్ని వరిస్తుంది. అప్పుడింక చేయ గలిగేది ఏమీ ఉండదు - ఈ విషయం నాకు నిరంతరం గుర్తుచేస్తూ, ఈ గ్రంథకర్తృత్వగౌరవం నాకు దక్కేలా చేసినఘనత మా శ్రీమతిది. ఈజ్ఞానయజ్ఞంలో ఆమె అక్షరాలా సోమిదమ్మ!

మహాభారతం మీద ఎన్నో విమర్శగ్రంథాలు వచ్చాయి. సుమారు పది సంవత్సరాలుగా దొరికినవి దొరికినట్లుగా చదువుతూ వచ్చాను. ఆసంస్కారం ఈ గ్రంథరచనకు ఎంతగానో తోడ్పడింది. మహానుభావులైన ఆయా గ్రంథకర్తలందరికీ నేను ఎంతగానో ఋణపడిఉన్నాను. ఋషిఋణం అంటారు బహుశా అదేనేమో!

"ఐతిహాసిక విశ్లేషణ" అనేది మనవిశ్వవిద్యాలయాలకు మరీ నూతనాంశం. శ్రీమతి ఇరావతీకర్వే గారి "యుగాంతం" తెలుగు అనువాదాన్ని నేను ఈమధ్యనే,

అంటే, నా సిద్ధాంతవ్యాసరచన పూర్తయి, డిగ్రీకూడా వచ్చేశాక, చదవగలిగాను. ఆమె విశ్లేషణ కూడా చాలాబావుంది. కాకపోతే, ఆగ్రంథప్రభావం నా గ్రంథంపై ఉండే అవకాశంలేదు. అసలు మాదృక్పథాలే వేరు. కాగా, ఈ విధమైన పరిశోధనకు తెలుగులో ఇదే తొలిప్రయత్నం. నాకృషిని ప్రశంసిస్తూ మాపర్యవేక్షకుల్నీ, ఆంధ్రవిశ్వవిద్యాలయాన్నీ అభినందిస్తూ చక్కని నివేదకలు పంపిన పరీక్షాధికారులకు నాకృతజ్ఞతలు.

ఇందులో నేను ప్రతిపాదించినవి మహత్తరమైన విషయాలని నేననను. కాకపోతే, ఇంత సులువుగానూ, సూటిగానూ ఇతిహాసాలను దర్శించడమనే పద్ధతి మాత్రం ఈనాడు కొరవడిందనీ, ఆగ్రంథాలను మనం చదువుకోవలసిన విధంగా చదువుకోవడం లేదనీ మాత్రం గట్టిగా చెప్పగలను. అలా చెప్పడానికే నేనిప్పుడీ గ్రంథం ప్రచురించడానికి తొందర పడుతున్నాను.

దైవానుగ్రహమూ, రాజాదరణా నాయీప్రయత్నానికి అండగా ఉన్నాయనడానికి నిదర్శనం శ్రీమత్తిరుమల తిరుపతి దేవస్థానం వారు, తెలుగు విశ్వవిద్యాలయం వారూ ఆర్థికంగా ఈగ్రంథ ప్రచురణకు తోడ్పడటమే. ఆయా అధికారులకు నాకృతజ్ఞతలు తెలుపుకొంటున్నాను.

పూజ్యగురుదేవులు మాస్టర్ ఇ. కె గారి దివ్యస్మృతికి అంకితం చేయబడిన ఈ గ్రంథాన్ని ఆమూలాగ్రంగా చదివి, ఆనందించి, తమభావాలను నాతో కలబోసుకున్న మాన్యసోదరులు, జగద్గురుపీఠం, అంతర్జాతీయవిభాగానికి అధ్యక్షులు అయిన శ్రీ కంభంపాటి పార్వతీ కుమార్ గారికి నా నమస్సుమాంజలులు

గ్రంథంలో నేను ప్రతిపాదించిన విషయమంతా ప్రతిబింబించేటట్లు అర్థవంతమైన చక్కని ముఖచిత్రాన్ని సమకూర్చిపెట్టిన కళాతపస్వి చిరంజీవి కూచిసాయి శంకర్‌కు నా శుభాశంసనలు. ముఖచిత్రాన్ని అందంగా ముద్రించియిచ్చిన గౌతమి ఆఫ్‌సెట్ ప్రింటర్స్, రాజమండ్రి వారికి ధన్యవాదాలు.

అందరినీ మించి పేర్కొనదగింది ఈ అక్షర యజ్ఞంలో ప్రముఖపాత్ర వహించిన ఆత్మీయులు వక్కలంక వేంకటకృష్ణారావు గారిని. ముద్రణ కార్యాన్ని వ్యాపారంగాకాక యోగసాధనంగా నిర్వహిస్తున్న ముద్రాతపస్వి ఆయన. ఈ పుస్తకాన్ని అచ్చువేసి యివ్వడమే తన అదృష్టమని భావించిన ఆయన సహృదయతను

ఎంతని ప్రశంసించను? సర్వబాధ్యతలూ తనవిగా ఎన్నోవ్యయ ప్రయాసలకులోనై ఈ గ్రంథాన్ని సర్వాంగ సుందరంగా తీర్చిదిద్ది సకాలంలో అందించిన వారి మంచితనానికి నా జోహారులు. వారిశ్రీమారుతీ ప్రెస్‌లో ఈ యజ్ఞంలో యథాశక్తి వారికి తోడ్పడిన కార్మికసోదరులకందరకూ నా ధన్యవాదాలు.

ఈ గ్రంథావిష్కరణ జనవరి గురుపూజా మహోత్సవాల్లో వైభవంగా జరగడం నా అదృష్టం. దివ్యపురుషుల సన్నిధిలో ఈకార్యక్రమానికి ఏర్పాట్లుచేసి సహకరించిన జగద్గురుపీఠం కార్యనిర్వాహకవర్గానికి నా కృతజ్ఞతలు

సర్వే భద్రాణి పశ్యంతు!

వాడవల్లి చక్రపాణిరావు

మాస్టర్ కుటీర్,
కొంకాపల్లి,
అమలాపురం.
1 - 1 - 1990.





# కృష్ణాముఖం

నేను మొదటిసారి Paul Gauguin (పాల్ గోగేన్) యొక్క 'The Yellow Christ' వర్ణచిత్రం చూసినప్పుడు ఒక విలక్షణమైన ఆనంద పారవశ్యం కలిగింది. 'మనభారతీయ కళా ప్రమాణాలకి (art-values) సన్నిహితంగా వున్నందువల్ల ఆచిత్రం అంతటి ఆనందాన్ని యిచ్చిందా' అని నాలో నేను ప్రశ్నించుకొని సరైన సమాధానం కోసం వెదుకులాడేను. అయితే పాశ్చాత్య కళా ప్రమాణాలతో రచించబడిన ఎన్నోచిత్రాలు కూడా అంతకుముందు నాకు గొప్పఆనందం కలిగించాయి. అందువల్ల అదికారణం కాదని తెలుసుకొన్నాను.

ఆబొమ్మలో శిలువపైనున్న క్రీస్తు చిత్రం ముందు ముగ్గురు గ్రామీణస్త్రీలు మోకరిల్లి ప్రార్థన చేస్తూ ఉంటారు. బొమ్మలోని కొండలు, చెట్లు చదునుగా చేయబడినట్లు (flattened-out) గా ఉంటాయి. అందులో ఉపయోగించబడిన ప్రధాన వర్ణం పసుపు పచ్చ. ఆ కళాఖండం జానపదకళకి అత్యంత సన్నిహితంగా ఉంటుంది. అయితే సామాన్య జానపద కళకి, ఆ చిత్రానికి ఒక ప్రబలమైన వ్యత్యాసం ఉంది. ఏ జానపద కళా రూపమైనా ఆ మేరకు ఆ జాతి శీలాన్ని (ethos) సుస్పష్టంగా ఆవిష్కరిస్తుంది. ఎందువల్లనంటే జానపదకళలోకి స్రష్టయొక్క హృదయం స్వేచ్ఛగా స్వచ్ఛంగా ప్రవహిస్తుంది. స్రష్ట స్వానుభవాన్ని యథా తథంగా ఏ ప్రలోభాలూ లేకుండా తన కళా రూపంలో చూపగల సరళ మనస్కుడు (simple-minded). అందువల్లనే ఆ కళారూపంలో ఆజాతి చైతన్యం నిసర్గ సుందరంగా ప్రతిఫలిస్తుంది. కాని గోగేన్ విషయంలో అలాకాదు. 'ది యెల్లోక్రైస్ట్' చిత్రంలో ప్రార్థన చేసుకొంటున్న స్త్రీల అనుభవాలకి, విశ్వాసాలకి, సామాన్య బుద్ధికి, దృష్టికి మాత్రమే గోగేన్ ప్రాణంపోసి, రూపం

యిచ్చాడు. అంతేకాని తన స్వంత అనుభవానికి రూపకల్పన చెయ్య లేదు. నిజానికి, అప్పటికింకా అతను సాధకుడే. తన అనుభవ, విశ్వా సాలేమిటో, అసలు తనేమిటో తరువాత తాహితీ ద్వీపంలో కళా తపస్సు చేసి రసనిష్పత్తి పొందేవరకు గోగేన్ దర్శించుకోలేకపోయాడు. ఒక కళాకారుడి బౌద్ధిక వృక్షం భావాకాశంలో ఎంత ఎత్తుఎదిగినా దాని చైతన్య మూలం సమాజ మృత్తికలో స్థిర ప్రతిష్ఠితమైఉండదన్న గ్రహింపులోంచి, ఆ మృత్తిక జీవలక్షణాలని అవగాహన చేసుకొని ఆవిష్కరించుకోగల శక్తిలోంచి అతడి సృజనాత్మకత పుట్టి పెరిగి పూర్ణ రూపం దిద్దుకోవాలి. అప్పుడే అది జాతికి సర్వసంక్షేమాన్ని కలుగ జేస్తుంది.

ఏ కళాకారుడైనా అతనిలోని కళాకారుని గుర్తించుకొని, గ్రహించుకొని తన'వ్యక్తి'ని ఆ కళాకారుడిలో లీనం చెయ్యడానికి సాధన చేసి అది సిద్ధించిన తరువాత ఆ 'తనని' అత్యంత సువిశాల గంభీర సమాజచైతన్యంలో సంలీనం చేసుకోవడానికి సాధన చేస్తాడు. అటు వంటిసాధనలో పూర్ణసిద్ధి పొందిన ఎందరో మహానుభావులు అమూల్య శాశ్వత నిధులని మానవజాతిపరం చేసి వెళ్ళిపోయారు. అటువంటి మహాత్ములలో కృష్ణ ద్వైపాయనవ్యాసుడు ఆద్యుడు. ఆయన సార్వకాలికమైన, సార్వదేశీయమైన 'నిరంతర మానవుడిని' గ్రహించ గలిగాడు. అందుకనే మహాభారత మహేతిహాసం అన్నిసంకుచిత పరి మాణాలను దాటి దేశకాలాపరిచ్ఛిన్నుడైన ఆ నిరంతర మానవుడి సొత్తు అయింది. సాహిత్యపరంగా 'బాణోచ్ఛిష్టం జగత్సర్వం' అని ఎలా అనుకుంటామో అదే విధంగా మొత్తం మానవజాతి జీవన పరంగా 'వ్యాసోచ్ఛిష్టం జగత్సర్వం'అని ఎంతో తాదాత్మ్యంతో చెప్పుకుంటాము. మహాభారతాన్ని ఆంగ్లచిత్రంగా నిర్మిస్తున్న పీటర్ బ్రూక్ ఇదే భావాన్ని మారదర్శన్ ఇంటర్వ్యూలో ఇటీవల వెల్లడి చేసారు. వ్యాస భారతం పట్ల ఆయన అవగాహన అంత గాఢమయినదీ, సమగ్రమయి

నదీను. వ్యాసుడు త్రిమూర్త్యాత్మకుడు, నిరంతరవర్తమాన కాలంలో వుండేవాడూ, అందువల్ల చిరంజీవీను. కనుకనే ఇంతటి సార్వజనీనమైన మహేతిహాసాన్ని అంతటి దక్షతతో విసర్జించాడు. మన కవిత్రయం వారి మాటలలో చెప్పాలంటే అతడు "సూరిచేతోరుచిరాబ్జ బోధనరతుడు, వేదమయుడు, అఖిల మునీంద్రాద్యుడు, ధర్మశరీరుడు, ఆగమ పుంజ పదార్థతత్త్వ నిస్సంశయ కారుడు, నిర్వాణదానక్రియా శీలుడూ"ను. ఆంధ్రమహాభారత కర్తలైన కవిత్రయమువారు "త్రయీ మూర్తి అయిన వ్యాసభగవాను" లే!·

ఇటు గురుకృప, అటు వ్యాసానుగ్రహం, ఈ రెంటికీ తోడుగా సజ్జన సాంగత్య ప్రేరణ, వీటన్నిటికీ ఆధార భూతమైన ఉత్తమ సంస్కారం కలిగిన వాడవల్లి చక్రపాణి రావుగారు ఋణత్రయాన్ని తీర్చగల ఈజ్ఞాన క్రతువుని నెరవేర్చారు. భారతేతిహాసం వంటి మహా గ్రంథాలు చదివి కథా భాగాలని సక్రమంగా అవగతం చేసుకోవడం ఒక భాగమైతే వాటిలో అంతర్వాహినిగా ప్రవహిస్తున్న సనాతన ఆర్ష చైతన్య స్రోతస్వినిని చదువరి తన నిజజీవన కేదారంలోకి ప్రవహింపజేసుకుని, యింకింప చేసుకో గలగడం ఒక మహత్తరవరం. దాని వల్ల కాలస్థల ప్రమేయాల సంకెళ్ళలో (chains of spacio-temporal dimensions) చిక్కుపడిన వ్యక్తికి వాటినుండి బయటపడే మార్గం తెరుచుకుంటుంది. కాని మహాగ్రంథాలు మనం మన పరిమిత బుద్ధితో చదివి అర్థం చేసుకొనే సామాన్య పుస్తకాలు కావు. మన దీక్ష, అనురక్తి, శక్తి, ప్రపత్తులను బట్టి అపార కరుణతో అవే మనకి తమ ఆత్మను ప్రకాశితం (reveal) చేస్తాయి. చక్రపాణిగారు తమ చదువును, పాండిత్యాన్ని, ఇతర లౌకిక వ్యక్తిత్వ సంకేతాలను వదలి పెట్టి కేవలం గురుశిశువుగా "వ్యాసాయ విష్ణురూపాయ" అని మననం చేస్తూ కృష్ణవేదధ్యానంతో పంచమవేదాధ్యయనంలో చేతులు ముకుళించి వ్యాసభగవానుని ఉపాసించారు.

ఆయన బాదరాయణ ఆరాధనాభావం ఎటువంటిదంటే "కవిర్మనీషీ పరిభూః స్వయంభూః" అన్న ఈశ్లోక్తిని కవిపద నిర్వచన వాక్యంగా సంభావించి దానికి వ్యాస భగవత్పాదుని లక్ష్యార్థంగా ఆవిష్కరించ గలిగినటువంటిది [పుట 24]. ఆ ఉపాసనా ఫలితంగా శిక్షితచిత్తులై భారత సంహితకి పుండరీకాక్షుడైన వాసుదేవుని ప్రకటార్థంగా దర్శించారు. ఆ వాసుదేవానుగ్రహసిద్ధిగా ద్రౌపదీ తత్త్వం గ్రహించగలిగారు. ఎంతో సమన్వయ శక్తి, సమ్యక్ దృష్టి, నిశిత బుద్ధి ఆర్ద్ర హృదయము ఉంటేతప్ప భారతంలో ద్రౌపది పాత్రని అర్థం చేసుకొని ఆమెను గురించి ఒక ప్రామాణిక గ్రంథం వెలువరించడం అసాధ్యం. ఆమె జీవితమంతా అంతటి విలక్షణంగాను, అసాధారణంగాను, సామాన్యసమన్వయ బుద్ధికి అతీతంగాను, లోకోత్తరంగానూ నడిచింది. చక్రపాణిగారు అటువంటి గ్రంథ రచనకు తగిన పైలక్షణాలు కలిగిఉండటమే కాక ప్రత్యేకంగా గురూపదిష్టపథగమనైకరతిదీప్తితో జీవన మందిరాన్ని కాంతిమయం చేసుకున్నవారు. అందువల్లనే ఈ గ్రంథంలో మొదటినుండి చివరి వరకూ అనేక సందర్భాలలో సర్వజనామోదకరమైన కొన్ని గుప్తవిషయాలని బహిర్గతం చేయగలిగారు. కృష్ణవేద రోదసిలో బాదరాయణవ్యోమనౌకలో చక్రపాణిచోదకులు ద్రౌపదీ దివ్య తేజోమండలంలోకి మనలను తీసుకొని వెళ్ళి కొన్ని రమ్య రహస్య సుందరలోకాలని అన్వేషింపజేసి, కొన్ని నవ్యసీమలకి తెరలు తొలగించారు. అయితే మన అన్వేషణకి "ఐతిహాసిక విశ్లేషణ" అనే ఒక ఆదర్శమూ, తద్వారా ఒక అర్థవంతమైన అవధీ ఉన్నాయి. వాటికి అనుగుణంగానే మనరమణీయ ప్రయాణం సాగుతుంది. ఇతిహాసాన్ని ఆయన సాకూతంగా ఇలా నిర్వచించారు:

"...... ఇతిహాసం కేవలం చరిత్రకాదు. ......... జరిగిన సంఘటనలవెనుకటి శాశ్వతమైన సృష్టి ధర్మాలను ఆ సంఘటనలతో అన్వయించి చూపుతుంది ఇతిహాసం. ............ చరిత్ర సన్నివేశాన్ని సంబంధిత వ్యక్తులకి పరిమితం చేస్తుంది. ఇతిహాసం

సన్నివేశానికి విశ్వజనీనతను ఆపాదిస్తుంది" [పుట 75]

తరువాత ఇతిహాస తత్త్వాన్ని ఇలా వివరించారు:

"ఒడ్డును తాకే ప్రతితరంగమూ జలాశయ గర్భంనుంచే ఆవిర్భవిస్తున్నట్లుగా భౌతికంగా కనిపించే ప్రతి సన్నివేశమూ ఆంతర లోకాలనుంచే రూపుకట్టుకుంటుంది. అందువల్లే ఇతిహాసాల్లోని కథ భౌతికలోకానికి మాత్రమే సబంధించినదిగా కాక భౌతికలోకానికి మూలమైన ఆంతరలోకాలకు కూడా సంబంధించి ఉంటుంది. వ్యక్తుల ప్రవర్తనా, మనఃప్రవృత్తులేకాక వారి అంతఃకరణ ప్రవృత్తులు ఆత్మతత్త్వముకూడా ఇతిహాసంలో ప్రతిబింబిస్తాయి. ఒక్కమాటలో చెప్పాలంటే మానవుడు అహంకారంనుంచి పరిశుద్ధుడైన తరువాత (ఋషిత్వాన్ని పొంది) ప్రకృతిలో ఏ విశ్వతత్త్వాన్ని వేదంగా దర్శించగలుగుతున్నాడో అదే విశ్వతత్త్వాన్ని చారిత్రక సన్నివేశాల్లో గూడా దర్శించడమే ఇతిహాసం.

"సమస్త విజ్ఞానమూ వేదంలో ఇమిడి ఉన్నట్లుగానే ఇతిహాసంలోనూఉండటంలో ఆశ్చర్యం లేదు." (పుట 78)

వ్యాసతత్త్వ దర్శనానుభవ స్పర్శాలేశం లేనివారు అనగలిగిన మాటలు కావివి.

చక్రపాణిగారు ఆయన వ్యాసంలో ద్రౌపదిని కారణజన్మురాలు, ఉదాత్తశీలవతి, ఉత్తమ సంస్కారి, మహా సౌందర్యరాశి, అమలతేజస్విని, అపూర్వ మనస్విని, అసాధారణ ప్రజ్ఞావతి, అవ్యయస్త్రీచైతన్యశక్తి, సంయమితఅద్భుతవ్యక్తిగా తాము దర్శించి పరితృప్తహృదయ సంస్పందంగా వెలార్చారు. వివిధవాదాలని, భేదాలని గాఢంగా పరిశీలించి తన భావాలని ప్రతిపాదించిన తీరు వారి సమ్యక్ దృష్టికి సూక్ష్మ సమన్వయ కౌశలానికి తార్కాణం. పాంచాలి పంచభర్తృత్వం, నాలాయన్ని అసాధారణకామం విషయాలలో ఆర్ష ధర్మబద్ధమైన వారి వివరణలు స్పష్టీకరణలు, ప్రతిపాదనలు, నిర్ణయాలు, పాఠకుడిని ఎన్నో

వక్రీభావాలు (prejudices), అపర్యాప్తుల (inadequacies) నుంచి విముక్తుల్ని చేయడమే కాక కొన్ని గహన ధర్మాలని విడమరిచి చెప్పి ఇటువంటి జటిల విషయాలన్ని సరిగా అర్థంచేసుకోవటానికి అవసరమైన సమగ్రదృక్పథాన్ని పాఠకుడికి అందిస్తాయి.

వ్యాసంయొక్క బాహ్య రూపాన్ని పరిశీలిస్తే గ్రంథనామం, విషయ సేకరణ, వ్యాసప్రణాళిక, అధ్యాయ నామకరణం, వస్తుసమర్పణ ఇత్యాది గ్రంథ శరీరానికి చెందిన ఉత్తమాంగ, ప్రధానంగ, ఉపాంగ, సూక్ష్మాంగ నిర్మాణం ఎంతో నేర్పుతో అర్థవంతంగా సాగింది. వ్యాస హృదయగతరమ్యహర్మ్య రామణీయకతలు అవలోకించాలంటే స్వయంగా వ్యాసం ఆమూలాగ్రం చదివి తీరవలసిందే. చదవనూ చదువుతారు. గ్రంథశైలికూడా అటువంటిది. నావంటి నాన్‌స్పెషలిస్ట్ హృద్యంగా చక్కని నవలలాగ చదువుకోవటానికి వీలైన, సరళమైన, సుగమమైన మెత్తని శైలి. ఇంతటి మంచి విషయాలు, ఇంతచక్కని భాషలో అందరికీ అందుబాటులోకి రావటానికి ప్రత్యక్ష, పరోక్ష కారకులైనవారందరూ మహానుభావులే. వారందరికీ నావంటివారం ఋణపడి ఉండవలసిందే. చక్రపాణిగారు యిటువంటి రచనద్వారా తాము ఋణవిముక్తులై నాబోటివారిని ఋణగ్రస్తుల్ని చేస్తున్నారు. కాని ఇటువంటిఋణం స్వేచ్ఛాకారకమైనదే కనుక ఆయనవంటివారు ఎంతైనా ఇవ్వదగిందీ, నావంటివారు ఎంతైనా గ్రహించగలిగిందీను— ఉభయులకీ ఎంతో ఆనందదాయకంగా!

సంక్షిప్తంగానైనా రెండు, మూడు విషయాలు చెప్పకుండా ముగించలేను. అందులో మొదటిది ఈగ్రంథ ముద్రణావకాశం నాకు లభించటానికి కారకుడైన నాబాల్య స్నేహితుడు, ప్రాణమిత్రుడు శ్రీ దేవరకొండ శ్రీనివాసరావు. చక్రపాణిగారి సహోద్యోగి, మిత్రు డూనూ. నాకు ఫోన్‌చేసి పిలిపించి అమలాపురంలో చక్రపాణిగారికి పరిచయం చేసాడు. చక్రపాణిగారు వారివైపునుంచి వివరాలన్నీ నాకు

చెప్పి నానుంచి వారికి కావలసిన వివరాలన్నీ అడిగి తెలుసుకొని వారి గ్రంథాన్ని మా మారుతీ ప్రింటర్స్‌లోనే ముద్రించటానికి తత్‌క్షణం నిర్ణయం తీసుకొని నాకు సంపూర్ణ స్వేచ్ఛని యిచ్చి సర్వభాధ్యతలూ నాపై పెట్టారు. మా ప్రెస్‌వర్కర్ - మిత్రుల సంపూర్ణ సహాయ సహకారాలవల్ల కృష్ణాదేశాన్ని కృష్ణసంకల్పం మేరకి కృష్ణ సహాయంతో పూర్తిచేసాను. ఈ గ్రంథసంబంధమైన ఏవిషయమైనా కృష్ణమయమే. ద్రౌపది అసలుపేరూ కృష్ణే! చక్రపాణిగారి గురువర్యులు, వారి పర్యవేక్షకులు, వారిమిత్రులు, వారు, నేను అంతా అందరూ కృష్ణమయమే! సర్వేసర్వత్రా వైష్ణవతేజం, వైష్ణవీబీజం విస్తరించుకుంది. ఈద్రౌపదికి కన్నతండ్రి చక్రపాణిగారే అయినా సుమారు తొమ్మిది మాసాలుగా నాదగ్గర తనకు నచ్చిన ముద్దు ముచ్చటలు తీర్చుకొని మనోహరంగా అలంకరించుకొని పెద్దపేరంటానికి సిద్ధమౌతున్న ఈ చిన్నారి తల్లిమీద నాకుఏర్పడ్డ ప్రేమ శ్లోకద్వయంగా రూపం సంతరించుకొంది. ఆమెకీ నాయందలి ప్రీతి తక్కువదికాదు. ఈ సర్వాలంకరణ సేవాభాగ్యం నాకు కలగటానికి ఆమె అవ్యాజప్రేమే మూల కారణం.

కృష్ణార్పణం హవిః కృష్ణః కృష్ణాగ్నౌ కృష్ణేన హుతమ్ ।
కృష్ణో హి తేన గంతవ్యం కృష్ణకర్మ సమాధినా ॥

"శ్రీ పురుహూతికా"
13-6-9, శివాలయం వీధి
రామచంద్రపురం - 533 255
30-12-1989

వక్కలంక వెంకటకృష్ణారావు

## విషయసూచిక

## అధ్యాయం నాలుగు : సంభావనం



## అధ్యాయం అయిదు : సందేశం



## అనుబంధాలు :



## ఉపయుక్త గ్రంథ సూచిక : 

# నివేదనము



సీ. వేదసూక్తాదుల విదితమ్ముగాఁ జేయు
ప్రాక్పశ్చిమాఖండ వారధి యెవఁ
డతిలోకమగు భాగవతరహస్య ప్రక్రికా
శము రచించినధన్యతము డెవండు
మనుజసంతతికెల్ల మంద్రిమార్గముఁ జూపి
నిఖిలసేవ్యుండౌ మనీషి యెవఁడు
సుతరోగము తొలంగనుతవైద్యుఁడై లోక
తతిరోగములు బాపుధన్యుఁ డెవఁడు
ఈజీవరాశికి రాజయోగంబిచ్చు
నవజీవనుండౌ మనస్వి యెవఁడు
శాంతికి దాంతికి సత్యధర్మములకు
నాలంబనంబౌ మహాత్ముఁ డెవఁడు

తే.గీ. వ్యాసకృష్ణులరూపమై వాసికెక్కి
వెలుఁగెతానుగనిల్చెనే వేదమూర్తి
ఎక్కిరాలాన్వయాబ్ధి పూర్ణేందుఁడట్టి
కృష్ణమాచార్యునకు నిత్తు కృతినిభక్తి ।



# ఆంధ్రమహాభారతము - ద్రౌపది

—ఒక ఐతిహాసిక విశ్లేషణ

## అధ్యాయం ఒకటి - నేపథ్యం

1. కథావిస్తీర్ణసలిలం కార్ష్ణంవేదం మహాహ్రదం...

2. వ్యాసాయ విష్ణురూపాయ...

3. సూత్రే మణిగణా ఇవ...

4. ద్యూతం ఛలయతామస్మి...

5. యథా దీపో నివాతస్థో నేఙ్గతే...

# ఆంధ్రమహాభారతము - ద్రౌపది

—ఒక ఐతిహాసిక విశ్లేషణ,

## -: 1. కథావిస్తీర్ణసలిలం కార్ష్ణంవేదంమహాహ్రదం :-

శ్రీ మహాభారతం స్థూలదృష్టికి ఒక గోత్రకలహ వృత్తాంతంగా కనిపిస్తుంది. సాక్షాత్తూ జనమేజయ మహారాజే వ్యాస మహర్షిని ఆ మహేతిహాసాన్ని తెలుపవలసిందిగా వేడుకొంటూ, "ఇట్టి గోత్రకలహ మేల పుట్టె" నని ప్రశ్నించాడు.

పాండవధార్తరాష్ట్రులు అపార పరాక్రములు. వ్యాస భీష్మాది కురువృద్ధులు రాజ్యాన్ని పంచియివ్వగా ఎవరివంతువారు పాలించుకొనక వారు 'వీఁగి' 'ధృతిచెడి' ప్రజాక్షయకరంగా దెబ్బలాడుకొన్నారు, పెద్దలైనవారి మాటలు వారు పాటించలేదు – అనేభావం జనమేజయుని మాటల్లో వ్యక్తమవుతుంది. అంతే కాదు, వ్యాసభీష్మాదులు సమస్తం తెలిసినవారై ఉండీ, వారిని వారింప లేకపోయారని కూడా ఆమహారాజు అనుకొన్నాడు. వ్యాసునితో అతడు పలికిన మాటలు ఇవి :

"ప్రీతితో మీరును భీష్మాది కురువృద్ధ
రాజులు నుండి భూరాజ్యవిభవ
మెల్ల విభాగించి యిచ్చినం దమతమ
వృత్తుల నుండక వీఁగి పాండు
ధృతరాష్ట్రనందనుల్ ధృతిచెడి వారేమి
కారణంబునఁ బ్రజాక్షయము గాఁగ
భారతయుద్ధ మపార పరాక్రముల్
చేసిరి మీ పంపు సేయ రైరి
యెఱిఁగి యెఱిఁగి వారి నేటికి వారింప, రిట్టి గోత్రకలహ మేలపుట్టె
దీనికలతెఱంగు దెలియంగ నానతి, యిండు నాకు సన్మునీంద్రవంద్య!"[1]

---

1. ఆంధ్రమహాభారతము - ఆది - 3 - 5

పరమదయానిధి అయిన వ్యాసమహర్షి జనమేజయుణ్ణో, తద్వారా లోకాన్నీ అనుగ్రహింపదలచినవాడై తన శిష్యుడైన వైశంపాయనుణ్ణి తాను రచించిన జయేతిహాసాన్ని ఆ రాజుకు వినిపించవలసిందిగా ఆదేశించాడు.

వైశంపాయనుడు ఆమహర్షికి నమస్కరించి, విద్వాంసుల అనుగ్రహంపొంది, భారతాఖ్యానాన్ని వినిపించడం మొదలుపెట్టాడు.

ఆ భారతాఖ్యానం కమనీయమైన ధర్మార్థకామమోక్షాలకు సాధకం. ఆసక్తితో వినేవారికి అభిమతశుభాలను ఇస్తుంది. రాజులకు రాజ్యాభివృద్ధీ, నిత్యాభ్యుదయమూ కలుగజేసే ప్రభావం గలది. అనేక జన్మలకు చెందిన సమస్తపాపాలనూ పోగొట్టగలిగిన సామర్థ్యం దానికీ ఉంది. అలాగని దానిలో ఊహాపోహాలు ఉన్నాయనుకోవడానికి వీల్లేదు. అది 'సత్యవాక్ప్రబంధము'. శతసహస్ర శ్లోకాలు గలిగి సర్వలోక పూజ్యమై, బుధనుతుడైన వ్యాసమహామునిచే రచింపబడి భారతవీరుల సద్గుణానుకీర్తనాలతో విలసిల్లే అగాధ నానా వేదవేదాంతవిద్యాయుక్తం. దానిలో వర్ణించబడిన భారతవీరులు సామాన్యులు కారు. వారు వినుత పరాక్రములు, ధృతవివేకులు, సత్యసమన్వితులు, యశోధనులు, కృతజ్ఞులు, ఉత్తములు, ధర్మపరులు, శరణాగతానుకంపనులూనూ.[1]

అలాంటి మహానుభావుల చరిత్ర కనుకనే దానికి అంతటి ఇతిహాసగౌరవం.

లోకంలో దాయాదులైన అన్నదమ్ములు ఎంతమంది కలహించుకోవడం లేదు? వారందరి చరిత్రలూ, గ్రంథస్థమై మాన్యతను పొందడం లేదు గదా! కురుపాండవుల చరిత్రకు మాత్రం ఇంతటి మహత్త్వమూ, పవిత్రతా ఎందుకు రావాలి?

1. ఆంధ్రమహాభారతము, ఆది - 3 - 9, 10, 11

నిదానించి పరిశీలిస్తే, భారతయుద్ధం కౌరవపాండవులకే పరిమితం కాలేదు. బలదేవ రుక్మలు తప్ప, తక్కిన రాజలోకమంతా ఆ యుద్ధంలో పాల్గొన్నారు.[1] పదునెనిమిది అక్షౌహిణుల సైన్యం 'రోషాహతాన్యోన్యమై', పదునెనిమిది దినాలు మహా ఘోరంగా పోరాడి నాశనమైంది.[2]

రాజ్యంకోసమే ఆయుద్ధం జరిగిందనుకొందామంటే, దారినిపోయే దానయ్య వంటి కర్ణుణ్ణి పిలచి, చేరదీసి, అంగరాజ్యమిచ్చి, ఆదరించిన దుర్యోధనుడు, సాక్షాత్తూ పినతండ్రి బిడ్డలైన పాండవులు తమకు గ్రాసవాసోదైన్యం లేకుండా అయిదూళ్ళిచ్చినా సరిపెట్టుకొంటామని కబురంపితే, 'వాడిసూదిమొన యించుక మోపినయంత మాత్రమైన' భూమినైనా యివ్వననడం విడ్డూరం కాదా? కృష్ణుడంతటివాడు దుర్యోధనునికి ఈ విషయమై ఎంతగా చెప్పినా ప్రయోజనం లేకపోయింది.

"తోడం బుట్టిన భీమపార్థుల మహోదోర్దర్పముల్ లావు లై
తోడంచుం బెఱవారి దుర్బలుల నెందుం జొచ్చి దైన్యంబునం
గూడం బెట్టుదు నీవ పాండుసుతులం గుందింపఁగా సత్యముం
బాడిం దప్ప రొకప్పుడుం గినియరా బంధుత్వ మే లొల్లవో!"[3]

అని కృష్ణుడు అడిగినదానికి దుర్యోధనునిదగ్గర తిన్ననైనసమాధానంపది?

దిగ్విజయంచేసి, మహావైభవంగా రాజసూయం నిర్వహించి, సకల రాజలోకానికీ సార్వభౌముడై విలసిల్లిన ధర్మతనయుడు చేతకాని

1. "ఇట్లు బలదేవ రుక్మల కిద్దఱకును
గయ్యమునకు సన్నాహంబు గలుగదయ్యెఁ
గాని తక్కు లోకమ్మునఁ గలుగు నృపతి
కోటి యిరువాఁగు నందును గూడె ననికి" — ఉద్యోగ - 4 - 181

2. ఆది - 1 - 69

3. ఉద్యోగ - 3 - 334

వాడిలా జూదమాడి రాజ్యాన్ని కోల్పోవడం, అవమానాల పాలవ్వడం, అడవుల్లో ఇడుములు పడటం, అన్నీ సహించి, అవతలివారి ఆంతర్యం ఎరిగిఉండీ, అధమపక్షం అయిదూళ్ళయినా ఇవ్వండి, సరిపెట్టుకొంటాం అంటూ ప్రాధేయపడుతున్నట్లు అడగడంలో ఔచిత్యం ఏమిటి? పరాక్రమోపజీవులైన పాండవులకు రాజ్యం ఒకరిచ్చేదేమిటసలు?

వచ్చినవాడు ఇంద్రుడని తెలిసీ, తన శరీరభాగాలైన కవచకుండలాలను ఏమాత్రం సంకోచించకుండా కోసియివ్వగలిగిన దానశీలీ, ("దానం వై భూత రక్షణః" -అని యక్షునితో ధర్మరాజు) యుద్ధ నిర్ణయం జరిగిపోయాక, "...కర్ణునకుం బుట్టువు దెలిపి సహోదర స్నేహం బావహించెద నట్లైన నాహావంబు వలని కడంక యుడుగ కుండునె..."[1] అని వచ్చిన కుంతిని కూడా ఆదరించి, అర్జునుణ్ణి తప్ప తక్కిన నీ బిడ్డల్ని చంపనని మాటిచ్చి మనిచిన దయార్ద్ర హృదయుడూ, అయిన కర్ణుడు అంతటి జననష్టానికి ఎలా ఒప్పుకున్నాడు? 'కర్ణునితలభారతం' అనిగదా అనుకొంటాం! అతనికైనా కొద్దిపాటి వివేకం లేకపోయిందే! స్థూలదృష్టితో చూస్తే దుర్యోధనునికి పాండవుల పట్లగల ద్వేషభావాన్ని మరింతగా పెంచి పోషించి, తుదకు అతని పతనానికి మార్గదర్శకుడు అయ్యాడేగాని ఏమి ఉపకారం చేశాడు తన మిత్రునికి?

పరమ విజ్ఞాననిధులైన భీష్మద్రోణాదులు తమజీవితాల్లో ఎదురైన ఎన్నో సమస్యలను ఎంతో విజ్ఞతతో పరిష్కరించి లోకోపకారం చేశారే! ఈ సమస్యని నిజంగానే పరిష్కరించలేక వదిలేశారనుకోవాలా? లేక ద్రుపదుడు భావించినట్లుగా కేవలం 'కూటికై' వారు ధృతరాష్ట్రుని ఆశ్రయించి పడివున్నారనుకోవాలా?[2] వారు తలచు

1. ఉద్యోగ - 4 - 58 వచనం.

2. "కూటికై ద్రోణభీష్మలు గుమతి యనక
యనుసరింతురు ... ... ..." ఉద్యోగ - 1 - 36

కొంటే దుర్యోధనుని అకృత్యాలను ఆపి ఉండలేకపోయేవారా? వారి ఉపేక్షలోనే ఆంతర్యం ఏమై ఉంటుందో! పోనీ, వారు కల్పించుకోక పోగా, విపత్సమయంలో సాహసించబోయిన భీమున్ని 'ఇది కోపంబున కవసరంబుఁగాదు'[1] అంటూ వారే ప్రశాంతచిత్తుని చేయడం ఏమిటి?

పుణ్యంచేసినవారు స్వర్గానికీ, పాపంచేసినవారు నరకానికీ గద్దాపోవాలి! కానీ భారతంలో యుద్ధానంతరం పాండవ పక్షం వారే కాదు, కౌరవులు కూడా స్వర్గాన్నే చేరుకొన్నారని చెప్పబడటం విచిత్రం. లౌకికదృష్టితో చూస్తే కౌరవులు తాముచేసిన అకృత్యాలకూ, అత్యాచారాలకూ నరకానికి పోవలసిందే, కానీ అలాజరుగలేదు.

కాబట్టి కౌరవులూ, పాండవులూ లోకములోని అందరి దాయాదులవంటివారు కారనీ, వారిమధ్య జరిగింది రాజ్యసంబంధమైన పోరాటం కాదనీ గ్రహించవలసి ఉంది.[2]

వైశంపాయనుడు జనమేజయ మహారాజుకు పాండవ ధార్త రాష్ట్రల భేదకారణాన్ని సంగ్రహంగా వివరించే సందర్భంలో కూడా ఎక్కడా రాజ్యంకోసమని వారు కలహించుకొన్నారన్నమాట చెప్ప లేదు. బాల్యమాదిగా దుర్యోధనుడు పాండవుల 'విపుల గుణోన్నతి

---

1. సభా 2 - 250 పద్యము.

2, "భారతయుద్ధం భూమ్మీద జరిగిన కారణం కేవలం కురుపాండవుల మధ్య చెల రేగిన కుటుంబ కలహాలు మాత్రమే గనుక అయితే అందులో పరమగురువైన వ్యాసమహర్షి స్వయంగా కల్పించుకోవలసిన అవసరం లేదు. సాక్షాత్తూ నారాయణ ఋషి అవతారమైన శ్రీకృష్ణుడూ కల్పించుకోవలసిన పనేలేదు. ఒకరి కుటుంబ కలహాలతోగాని, వ్యక్తిగత సమస్యలతోగాని పరమగురువులకు, మహాత్ములకు ఏమిటి సంబంధము? మహాభారతయుద్ధం ఒక 'దైవికమైన' కారణంచేత పైలోకా లలోజరిగిన దేవతల నిర్ణయం ప్రకారం ఈ భూమ్మీద జరిగించవలసివచ్చింది..."

—భగవాన్ వేదవ్యాస, Vol. II

రచన : డా॥ ఇ. వేదవ్యాస, I.A.S., Ph.D.

సైపక' దుర్నయంతో కీడుచేస్తూ వచ్చాడనీ, తరువాత కూడా 'పాండవుల గుణసంపదలు చూచి సహింపనోపక' మాయా ద్యూత వ్యాజాన ధర్మజుణ్ణి రాజ్యభ్రష్టుణ్ణి చేశాడనీ స్పష్టపరిచాడు.[1] అరణ్యా జ్ఞాతవాసాలు ముగించుకొని వచ్చిన పాండవులు "...మును వేఁడికొనక మఱి భారతాజి సేయంగ మొనసిరి..." అంటే, రాజ్యం కోసం వారు ఎంత వేడుకొన్నా ప్రయోజనం లేకపోయిందీ —యుద్ధం తప్పలేదూ అని.

ఇక్కడ దుర్యోధనుడిది వ్యక్తిగతమైన స్వార్థమూ, లోక సామాన్యమైన రాగద్వేషాలు కావనీ ఏదో ఒక అతీతమైన శక్తి అతని స్వభావాన్ని నియంత్రిస్తూ ఉండగా ఆస్వభావానికి లోబడి మాత్రమే అతడు ఆ తీరున ప్రవర్తించాడనీ, భారతంలో స్పష్టంచేయబడింది.

అతనిని నియంత్రించిన ఆ శక్తిని గురించిన ప్రస్తావన కూడా భారతంలో వచ్చింది. స్త్రీపర్వంలో పుత్రశోకంతో తల్లడిల్లుతున్న ధృతరాష్ట్రుణ్ణి సమాశ్వాసిస్తూ వ్యాసమహర్షి, దుర్యోధనుడు భూ భారాన్ని తీర్చడానికి అవతరించినవాడంటూ, అతడు 'సకలప్రజాసంహార కారణంబై కల్యంశంబున' జన్మించినవాడని వివరించాడు. అతని స్వభావాన్ని గురించి చెబుతూ,

"ఒరులయున్నతి సయిరింపనోపఁ డధిక
బలుఁడు క్రోధి శూరత్వసంపన్నబుద్ధి
బుద్ధి సెప్పిన వినియెడు ప్రోడ గాఁడు
గాన వైరంబు విడువఁడు కౌరవేంద్ర!"

"తమ్ముఁడు శకునియుఁ గర్ణుఁడు
నమ్మానవపతికిఁ దగినయనుచరు లతనిన్
సమ్మదమునఁ గలసినన్నృపు
లమ్మెయి వారలు వినాశమగు టే లుడుగున్."

1. ఆది - 3 - 12 నుండి 19 వరకు

"తమ తమ తప్పుల్లఁ దా రెఱియంగా
విమలమతీ యిట్టు వీరికి నై శో
కమున దహింపఁగఁ గాదు మనంబున్
సముచిత మిత్తఱి శాంతత సుమ్మీ!"[1]

అని అటువంటివార్ని కారణంగా భారతయుద్ధం అనివార్యమైందని తెలిపాడు

సంజయుడు రాయబారానికి వెళ్ళివచ్చి, ధృతరాష్ట్రునికి 'చెప్పవలసిందంతా' చెప్పినప్పుడు, ఆ గ్రుడ్డిరాజు తన హృదయపు లోతుల్లోనుంచే '...ధర్మమున ముకుందుని నాశ్రయింపవయ్య, యతనిఁ జొచ్చిన బ్రతుకుదీవుఁ దమ్ములు సుతులున్' అంటూ క్రోధునును బ్రతిమాలాడు. దుర్యోధనుడు అందుకు ఒప్పుకోలేదు. కృష్ణుడు గొప్పవాడై తేకావచ్చును. కానీ అతడు అర్జునుని చెలికాడు కనుక అతనిని ఆశ్రయించడం పొసగదన్నాడు. అతని మాటలు :

"... ... ... ... ... ఇజ్జగంబుల
న్నిని నొక పెట్ట గ్రమింగినను నెట్టన సర్వము గాచె నేనియు
న్వినుము ముకుందుఁడర్జునుని నెచ్చెలి నాఁ జెవులార వించు నిం
క నతని నొక్కొ–బాముననుఁగా దృతిపెంపఱ నాశ్రయింతునే"[2]

నారదాది మునులు నచ్చచెప్పబోయినప్పుడు కూడా అతడు ఎంతో తెగింపుతో,

"మునులార! నన్ను విధి యే
మని మును పుట్టించె నట్టులయ్యెడుఁగా కీ
వినఁ జవిగాని పలుకులకుఁ
బని గలదే? యుడుగుఁడింక బహు భాషణముల్"[3]

అంటూ తిరస్కరించాడు.

---

1. స్త్రీ పర్వం - 1 - 79, 80, 81
2. ఉద్యోగ - 2 - 322
3. ఉద్యోగ - 3 - 325

ఇంక అతని ఆప్తమిత్రుడైన కర్ణుని విషయం :

శ్రీకృష్ణుడు సంధికై హస్తినకు వచ్చి ఆఖరి యత్నంగా కర్ణునితో రహస్య సంభాషణ సాగిస్తాడు. ఆ సందర్భంలో కర్ణుడు కృష్ణునితో —

"ధర్మతనయుండు దాను నా తమ్ముఁడగుట
యెఱిఁగెనేనియు సామ్రాజ్య మేల పూను
నట్టి ధార్మికుఁ డాధిపత్యంబుఁ జేయ
వలవదే శాశ్వతంబుగ వసుధ కెల్ల.

"అనుజులు ఋత్విజులుగ నీ
పని యిటు సేయుమని నీ వుపద్రష్టవు గా
విను కురుకుమార పశువిశ
సనమున రణయజ్ఞ మతఁడు సమ్మతిఁ జేయున్

"దానం బుణ్యభూమియగు కురుక్షేత్రంబున మము బోంట్లెల్లను సద్గతి వడయుదురుగాక......"[1] అని పలికాడు.

పాండవులు ధర్మపరులని, వారి వెనుక శ్రీకృష్ణుడు ఉన్నాడని తెలిసీ, తాము వారిపట్ల అన్యాయంగా ప్రవర్తిస్తున్నామనే స్పృహతోనే దుర్యోధనాదులు స్వభావానుగుణమైన ఆవేశాలకులోనై, అలా అనుచితంగా ప్రవర్తించారు— అనే విషయం పైసందర్భాలను బట్టి స్పష్టమవుతోంది.

"స్వభావనియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్"[2] అని భగవానుడు చెప్పినట్లుగా, ఈ కారణంగానే వారు పాపాల్ని పొందక స్వర్గస్థులయ్యారని సమన్వయించుకోవచ్చు.

పాండుకుమారులు బాల్యమాదిగా దుష్టకౌరవ్యులచే అనేక

1. ఉద్యోగ - 4 - 44, 45, 46
2. శ్రీమద్భగవద్గీత - 18 - 47

మైన బాధలకు లోనవుతూవచ్చారు. అసమర్థులై అన్నీ భరించుకొంటూ వచ్చారా? అంటే వారిచరిత్ర అందుకు భిన్నంగా ఉంది.

ద్రుపదమహారాజును జయించి తెచ్చి గురుదక్షిణగా సమర్పించడం, హిడింబాసుర, బకాసుర సంహారాలు, అంగారపర్ణుని జయించడం, ఖాండవ విజయం, దిగ్విజయంచేసి రాజసూయాధ్వరం నిర్విఘ్నంగా నిర్వహించడం, ఘోషయాత్రా సందర్భంగా గంధర్వులను ఓడించడం, సైంధవపరాభవం, కీచక సంహారం, గోగ్రహణ ఘట్టంలో అఖండ విజయం సాధించడం వంటివి సామాన్య విషయాలుకావు. అంతటి పరాక్రమవంతులైన పాండవులకు కౌరవులొక లెక్కలోనివారే కారు. కాని ఎంతోసహనంతో వారు అన్ని దుర్మార్గాలనూ సాగనిచ్చారు. ఆ క్షమ మానవీయ మనడానికి వీల్లేనిది. శ్రీకృష్ణుడంతటివాడు ధర్మజుని సంయమనాన్ని కీర్తించకుండా ఉండలేకపోయాడు.

"ఉల్లము సత్యసంయమము నూనినవాఁడవు నీవు విక్రమం
బొల్లమిఁ గౌరవాధముల యుద్ధతి మై మెయిఁ జెల్లెఁ గాక యొం
డెల్లను నేల నీదుమది నించుకకిన్క జనించినన్ మహీ
వల్లభ! యడ్డ రూ పఱచె వారక వైరికులంబు సర్వమున్"[1]

"చతురంభోధి పరీత
క్షితి తల సామ్రాజ్యలక్ష్మికిం బతివి జగ
న్నుత నీవ నీవు దలఁచిన
నతి దుష్కరమెందు లే దనర్గళమహిమన్"[2]

అని కృష్ణుడు పలికినమాటలు ధర్మజుడూ, తక్కిన పాండవులూ శాంత శీలురనే విషయాన్ని నిరూపిస్తున్నాయి. వారెందుకు అన్నిపాట్లు పడ్డారో భాగవతంలో భీష్ముడు వివరించాడు. తనను చేరవచ్చిన పాండవులను ఉద్దేశించి, అంపశయ్యమీదఉన్న భీష్ముడు,

1. ఆరణ్య - 4 - 158

2. ఆరణ్య - 4 - 161

"ధరణిసురులు, హరియు, ధర్మంబుదిక్కుగా
బ్రదుకఁదలఁచి మీరు బహువిధముల
నన్నలార! పడితి రాపత్పరంపర
లిట్టి చిత్రకర్మ మెందుఁ గలదు?"[1]

అంటూ ఆశ్చర్యాన్ని ప్రకటించాడు.

మానవాతీతమైన పాండవుల సహనానికి అసలైన కారణం ఇక్కడ మనకు దొరుకుతోంది.

కౌరవుల ఆవేశపూరితమైన దుష్టప్రవర్తన వారి స్వభావం నుంచి వ్యక్తమైనట్లే, పాండవుల క్షమదమాది గుణసంపదకూడా వారి స్వభావంనుంచి వ్యక్తమైందని వేరుగా చెప్పనక్కరలేదు.

సృష్టియావత్తూ త్రిగుణాత్మకమైన ప్రకృతిలో నిండిఉంది. జీవరాసుల స్వభావం అనేది ఆ ప్రకృతినుంచే రూపొందుతూ ఉంటుంది. వ్యక్తులు తమతమ స్వభావాలకు తగిన కర్మాచరణంతో ఆ స్వభావాల్ని తమకు ప్రసాదించిన ప్రకృతిని ఆరాధించడంద్వారా సిద్ధిని పొందుతారని భగవద్గీత నిర్దేశిస్తోంది.[2] కురుపాండవులు తమతమ స్వభావాలకు అనుగుణమైన ప్రవర్తనలతో కూడిన కర్మాచరణం చేసి, అస్వభావం ఏ దివ్యప్రకృతినుంచి తమకు వచ్చిందో ఆ దివ్యప్రకృతిని ఆరాధించారు కనుకనే వారు సిద్ధిపొందిన తీరుకూడా వర్ణించబడింది భారతంలో.

కాబట్టి భారతాన్ని కేవలం కౌరవపాండవుల చరిత్ర అనుకోవడానికి వీల్లేదు. అలాంటప్పుడు దాన్ని రాజ్యంకోసం దాయాదుల మధ్య జరిగిన పోరాటం అని అసలే అనుకోలేంగదా!

మహాభారతంలో నిరూపితమైన కౌరవపాండవుల ప్రవర్తనల ద్వారా వ్యక్తమైన వారివారి స్వభావాలు సర్వమానవ సాధారణమైన

1. శ్రీమదాంధ్రమహాభాగవతము - 1 - 206
2. "యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతమ్ ।
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః ॥" - భగవద్గీత - 18-46

స్వభావాలవంటివి కావనీ, అతిమానుషమైనవనీ (super human) కూడా ఈ సందర్భంగా గమనించవలసిఉంది.

''అతులబలాఢ్యు లైన యమరాంశసముద్భవు లెల్లఁ బాండుభూ
పతిసుతపక్ష మై సురవిపక్షగణాంశజు లెల్ల దుర్మదో
ద్ధతకురురాజపక్ష మయి ధారుణిభారము వాయ ఘోరభా
రతరణభూమి నీల్గిరి పరస్పరయుద్ధము సేసి వీరులై''1

అని వైశంపాయనుడు జనమేజయునికి ముందుగానే చెప్పి, ఆదృష్టితో మాత్రమే భారతకథను అర్థంచేసుకోవలసిందని సూచించాడు.

అంశావతార వివరణంలో వారంతా ఎవరెవరేయే అంశల తో జన్మించారోకూడా చెప్పబడింది. వారందరూ కలసి నిర్వహించిన ఒక మహాయజ్ఞమే మహాభారతయుద్ధం.

అదొక విష్ణుమయమైన మహాయాగం అంటూ వైశంపాయనుడు జనమేజయునికి ఇలాస్పష్టం చేశాడు.

"అనలుఁడు భాస్కరుండును సుధాంశుఁడు నధ్వరసంప్రవర్తకుల్
వినుము నరేంద్ర! యీక్రతువు విష్ణుమయం బిది నిర్వహించి ర
ర్జునుఁడును గర్ణుఁడున్ సమరరూపమునం దగ నీప్రబంధ మిం
పొనరఁ బఠించినన్ వినిన నొందు నరుం జిరసౌఖ్య సంపదల్"2

సూక్ష్మలోకాల్లో అగ్ని, సూర్యుడూ, చంద్రుడూ, భౌతిక లోకాల్లో అర్జునుడూ, కర్ణుడూ, సమరరూపమైన ఈ యాగాన్ని నిర్వహించారని దీన్నిబట్టి బోధపడుతోంది.

కాబట్టి, భారతయుద్ధంలో పాల్గొన్న వీరులూ, పరోక్షంగా ఆ యుద్ధానికి దోహదం చేసినవారూ—అందరూ కారణజన్ములైన దివ్య ప్రజ్ఞలే గానీ అందరి మానవులవంటివారూ కారని అంగీకరించక తప్పనిసరి అవుతోంది.

---

1. ఆది - 3 - 56
2. కర్ణ - 3 - 397

దేవదానవాద్యంశలచేజన్మించిన పాండవకౌరవులు భూలోకం లో సాధించినదేమిటి? యుద్ధంచేసిచనిపోవడమేనా? "స్వకర్మణా తమభ్యర్చ్య-" అంటే ఇదేనా? అనిపించడంసహజం. కనుక నే జనమేజయుడు,

అమరాసుర ముఖ్యులయం
శములను మహిఁ బుట్టి సకలజనపాలక సం
ఘములకు భారతరణారం
గమునను లయ మొంద నేమికారణ మ...?"[1] ని

వైశంపాయనమహర్షిని అడిగాడు. అప్పుడు వైశంపాయనుడు ఆ వెను కటి కథను వివరించాడు. (ఆ కథ తరువాతి అధ్యాయంలో విశ్లేషించ బడుతోంది.) దానిప్రకారం భూభారనిర్వాపణార్థం వారందరూ జన్మించి ఆ కార్యాన్ని నెరవేర్చి వెళ్ళిపోయారు.

కనుకనే మహాభారతమన్నది "ధరణిభరంబు వాప నవతారము నొందిన విష్ణుఁడత్తైఅంగరుడుగ నిర్వహించి..."[2]న తీరును వివరించే మహేతిహాసమేగానీ కేవలం దాయాదుల కలహావృత్తాంతం కాదని గుర్తించి, దానికి 'పుండరీకాక్షుని వాసుదేవుఁ బ్రకటార్థముగాఁ గని'[3]అధ్యయనం చేయాలని నిర్దేశింపబడింది.

విష్ణుసన్నిభుఁడైనపారాశర్యుఁడు "పాండవుల కీర్తిం బ్రకటించుటకును, మఱియుం గొందఱు జనపతుల చరిత్రంబులు జనులకెఱింగించుటకును, దేవదేవుండగు వాసుదేవుని సంక్రీడావిశేషంబులు వివరించుటకును, సర్వదేవజాతుల జన్మంబులును దదీయ సాయుజ్యంబులును దేటపఱుచుటకును సకలధర్మంబులునుం దెలుపుటకునుగాఁ బంచమవేదం బయిపరఁగునిమ్మహాభారత సంహిత మొనర్చె"[4] నని ఏతద్గ్రంథాంతాన చెప్పబడింది.

---

1. ఆది - 3 - 49
2. మౌసల - 219
3. స్వర్గారోహణ - 91
4. స్వర్గారోహణ - 81

మహాభారతపారిజాతం కృష్ణార్జునోత్తమ నానాగుణకీర్తనార్థ ఫలమై అమరుతోందని ఉగ్రశ్రవసుని ఆభాషణం.[1]

భగవానుడు అర్జునునితో—

"మత్తః పరతరం నాన్యత్కించిదస్తి ధనంజయ ।
మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ ॥"[2]

అని చెప్పినట్లుగా, స్థూలదృష్టికి భారతసంహిత "భరతకుల ముఖ్యుల వంశచరితానుకీర్తనం" అనిపించినా, సూక్ష్మదృష్టికి అందులో ఉన్నది పురుషోత్తముడైన వాసుదేవుని చరిత్రే అనీ, ఆ అంతస్సూత్రానికే కురు పాండవుల కథ కూర్చబడిందనీ స్పష్టపడుతుంది. ఈ కారణంగానే మహాభారతానికి వేదగౌరవమూ, కార్ష్ణవేదమనే ఖ్యాతీ వచ్చిఉంటాయని ఊహించవచ్చు.

"కార్ష్ణం వేదం పంచమంచ యన్మహాభారతం విదుః ।
జయేతి నామ తేషాంచ ప్రవదంతి మనీషిణః ॥"

అని భవిష్యపురాణం.

కృష్ణ సంబంధమైన వేదం కార్ష్ణవేదం.

మరి మార్కండేయమైతే,

"వ్యాసవాక్యజలౌఘేన కుతర్కతరుహారిణా
వేదశైలావ తీర్ణేన నీరజస్కా మహీకృతా
కలశబ్ద మహాహంసం మహాఖ్యాన పరాంబుజం
కథావిస్తీర్ణసలిలం కార్ష్ణం వేదం మహాహ్రదం

1. ఆది - 1 - 66

2. భగవద్గీత - 7 - 7

తదిదం భారతాఖ్యానం బహ్వర్థ శ్రుతివిస్తరం" అంటూ భారతాన్ని కృష్ణసంబంధమైన ఒక మహాసరస్సుగా వర్ణిస్తోంది.[1]

భారతగాథతో శ్రీకృష్ణునికిగలసంబంధం మరింత వివరంగా మరో అధ్యాయంలో చూపబడింది. ప్రస్తుతానికి దీని నిలా వదిలి, ఈ గాథను లోకానికి అందించడంలో వ్యాసమహర్షి ఆంతర్యం ఏమిటో, ఆయన తపన ఎంతటిదో, ఆయన ఎంతటి మహిమాన్వితుడో ముచ్చటించుకొందాం.



1. భవిష్య, మార్కండేయ పురాణాల్లోని ఈ రెండు శ్లోకాలు శ్రీవారణాసివారి "మహాభారత తత్త్వకథనము - అనేక కర్తృత్వ నిరాకరణము" నుండి ఉద్ధృతాలు.

## 2. వ్యాసాయ విష్ణు రూపాయ...

భారతమహేతిహాసం కృష్ణకథాసూత్రానికి అనుసంధానించబడిన భరతవీరుల వంశచరితానుకీర్తనమనీ, కేవలంగోత్రకలహావృత్తాంం కాదనీ తెలుసుకొన్నాం. దాని విశ్వజనీనతను గూర్చి నన్నయ మహాకవి ఇలా వర్ణించాడు :

"ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రం బని
యధ్యాత్మవిదులు వేదాంత మనియు,
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రం బని
కవివృషభులు మహాకావ్య మనియు,
లాక్షణికులు సర్వలక్ష్యసంగ్రహ మని
యైతిహాసికు లితిహాస మనియుఁ
బరమపౌరాణికుల్ బహుపురాణసముచ్చ
యం బని మహిఁ గొనియాడుచుండ
వివిధవేదతత్త్వవేది వేదవ్యాసుఁ
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై
పరఁగుచుండఁ జేసె భారతంబు"[1]

ఈనాటికీ పండితులు భారతాన్ని 'విశ్వవిజ్ఞానకోశము'గా పరిగణించి, దానిలోని రహస్యాలను వెలికిదీయటానికి ప్రయత్నాలు చేస్తూనే ఉన్నారు.[2]

"సాహిత్యచరిత్రకు తెలిసినంతవరకు సంస్కృతభారతమంతటి గ్రంథము విశ్వసాహిత్యములోనే లేదు. పాశ్చాత్య వాఙ్మయములో

1. ఆది - 1 - 32

2. ఉదాహరణకు - ఉస్మానియా విశ్వవిద్యాలయంనుంచి 1979లో వెలువడ్డ డా॥ మూలపల్లి చంద్రశేఖరశర్మగారి "మహాభారతము-విశ్వవిజ్ఞానకోశము" సిద్ధాంతవ్యాసం.

ప్రసిద్ధిచెందిన, బృహద్గ్రంథములైన Iliad మరియు Odyssey అను రెండును కలిసి భారతములో ఎనిమిదవ భాగమగును..." అని ఆధునికుల నిష్కర్ష.[1]

ఈ మహాగ్రంథాన్ని వ్యాసభగవానుడు—

"నమో ధర్మాయ మహతే నమః కృష్ణాయ వేధసే
బ్రాహ్మణేభ్యో నమస్కృత్య ధర్మాన్ వక్ష్యామి శాశ్వతాన్"[2]

అంటూ ప్రారంభించి,

"ఊర్ధ్వబాహు ర్విరౌమ్యేష న కశ్చిదపి శృణోతిమే
ధర్మాదర్థశ్చ కామశ్చ స కిమర్థం న సేవ్యతే।"[3]

అని ఘోషిస్తూ ముగించాడు.

'ధర్మానికీ, కృష్ణునికీ, బ్రాహ్మణులకూ నమస్కరించి, శాశ్వతమైన ధర్మాన్ని గురించి చెబుతున్నాను-'

'ధర్మం వల్లనే అర్థకామాలు సిద్ధిస్తున్నాయే, ఆ ధర్మాన్ని సేవించండని చేతులెత్తి ఆక్రోశిస్తున్నా నామాట ఎవ్వరూ పట్టించుకోరేం?'-అని పై శ్లోకాల భావం.

కురువంశ కథను చెబుతూ వ్యాసుడు తాను శాశ్వతమైన ధర్మాన్ని చెబుతున్నా ననడం, చివరికి, ధర్మాన్ని సేవించండి అని సందేశ మివ్వడం గమనించదగిన విషయాలు.

---

1. ఆంధ్రమహాభారతములో రసపోషణము (విరాటోద్యోగపర్వములు), పుట - 16, అముద్రిత సిద్ధాంతవ్యాసం - రచన : డా॥ ఎల్లూరి శివారెడ్డి, ఉస్మానియా-1981

2. సంస్కృత భారతము - ఆది - 5 - 3

3. సంస్కృత భారతము - స్వర్గా - 5 - 75

"ధరతి విశ్వం ధర్మః" - ఈవిశ్వాన్ని ధరించేది ధర్మం.[1]
ధర్మంనుంచి రూపుదాల్చేది దైవం.
దైవం సృష్టిగా దిగిరావటాన్ని నిరూపించేది వేదం.
వేదాన్ని దర్శింపజేసేవాడు బ్రాహ్మణుడు.

కనుక, ముందుగా ధర్మానికి, దైవానికి, బ్రాహ్మణులకీ నమస్కరించాడు వ్యాసమహర్షి.

తన కళ్ళముందు జరిగిన నాశనాన్ని గురించి నిర్వేదంతో తల్లడిల్లిపోతున్న ఆమహానుభావునికి నిదానించిచూస్తే క్రమంగా సత్యం హృదయగతమైంది.

"భారతస్యేతిహాసస్య ధర్మేణాన్వీక్ష్యతాం గతిమ్ ।
ప్రవిశ్య యోగం జ్ఞానేన సోఽపశ్యత్ సర్వ మంతతః ॥"[2]

—అంటే, యోగస్థితిలో జ్ఞానంద్వారా భారతపరమార్థమంతటినీ ఆయన తనలోనే దర్శనం చేసుకొన్నాడన్నమాట!

కౌరవులూ, పాండవులూ మామూలు మానవుల స్థాయికి చెందినవారు కారు. మామూలు మానవుల స్వభావం కొన్ని పరిమితులకు లోబడివుంటుంది. కాని, వీరిస్వభావాలు అసాధారణమైనవి. సర్వ మానవస్వభావాలూ ఏమూలప్రకృతినుంచి క్రమపరిణామం చెందుతూ వస్తాయో ఆ మూలప్రకృతినుంచే తిన్నగా ఇవి రూపుకట్టుకొన్నాయి.

---

1. "Dharma is the abiding Law of Supreme Nature or Swabhava, the permanent foundation of the peripheral fluctuations of the universe, and is said to reveal itself to seers only who are equipped with sincerity, insight and determination"
—*Aryan Dharma, By Dr. E. Ananthacharya, Pub. : The World Teacher Trust, Visakha.*

2. సంస్కృత భారతము - ఆది - 1 - 29

కనుకనే సర్వమానవ ప్రవృత్తులూ భారతపాత్రలలో సమన్వయం చెందుతున్నాయి.

“ … … ఏయుగమున, ఏమానవుడు నేలమీద ఎక్కడ నిలబడి చూచుకొన్నను అతని అంశ మహాభారతమున ఏదో ఒక పాత్రలో, ఏదో ఒక ఘట్టమున అగుపించగలదు…”[1]

—అని ఇందువల్లనే చెప్పుకోగలుగుతున్నాం.

భారతంలోని ఒక్కొక్కపాత్ర ఒక్కొక్క జీవనది వంటిదనుకొంటే, లౌకికపాత్రలన్నీ ఆ జీవనదులనుంచి గ్రహించబడి, చెంబులు, గిన్నెలు, ముంతలు మొదలైనవాటిల్లో నింపబడ్డ నీటివంటివని చెప్పవచ్చు. భారతానికి అంతటి సార్వజనీనత సిద్ధించడానికి గల కారణాల్లో ఇదీ ఒకటి.

దైవప్రకృతి, ఆసురప్రకృతి అని మూలప్రకృతి (జీవసృష్టికి మూలమైన ప్రకృతి) రెండు విధాలు.[2] ఈ రెంటి సమతౌల్యం వల్లనే సృష్టి నడుస్తోంది. ఆ సమతౌల్యాన్ని నిర్వహించేదే ధర్మం.

దైవాసురప్రకృతులు (Positive and Negative forces) మధ్యగల సమతౌల్యం (Equilibrium) చెడినప్పుడు కలిగేదే 'ధర్మగ్లాని' అనీ, ఆ గ్లానిని మాన్పటానికి సమతౌల్యాన్ని నిర్వహించే ధర్మంనుంచి దైవం దిగిరావటాన్నే 'అవతరణం' అనీ అంటారు.

ఎప్పుడు ధర్మానికి గ్లాని కలిగినా దానిపర్యవసానంగా అధర్మం పెచ్చుపెరుగుతూంటుంది. అంటే, ఆసురప్రకృతి విజృంభణం అధికమవుతుంది. దాన్ని తటస్థీకరించటానికి దైవప్రకృతి ప్రయత్నిస్తుంది.

1. మహాభారతము - మానవస్వభావ చిత్రణ, పుట - 97
రచన : డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య.

2. “ద్వౌ భూతసర్గా లోకేఽస్మిన్ దైవ ఆసుర ఏవ చ।”
-భగవద్గీత - 16 - 6

ఈ ప్రయత్నంలో భాగంగానే ఒక్కోసారి అవతారమూర్తిగా దైవం దిగిరావలసి వస్తూంటుంది.

ఇది సర్వలోకాలకూ సంబంధించిన వ్యూహం.

భౌతికలోకంలోకూడా ఇలాగే జరుగుతూ ఉంటుంది.

ఈ విషయాన్ని శ్రీకృష్ణుడు భగవద్గీతలో అర్జునునితో ఇలాచెప్పాడు:

"యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత ।
అభ్యుత్థానమధర్మస్య తదాఽత్మానం సృజామ్యహమ్ ॥"

"పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ ।
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే ॥"[1]

ధర్మానికి గ్లాని కలిగినప్పుడూ, అధర్మం పెచ్చుపెరిగినప్పుడూ నన్ను నేను సృష్టించుకొంటాను.

సాధువుల్ని రక్షించడానికి, దుష్కృతుల్ని అంతంచేయడానికి ధర్మాన్ని సంస్థాపించడానికి యుగయుగాల్లో నేను దిగివస్తూ ఉంటాను. —అని పై శ్లోకాల భావం.

త్రేతాద్వాపరయుగాల సంధికాలంలో పరశురాముడు ఇరువది ఒక్కమార్లు క్షత్రియసంహారం చేయడంతో క్షత్రియకాంతలు ధర్మమార్గంలో బ్రాహ్మణులవల్ల సంతానాన్ని పొందారు. ఆ సంతానం రాజధర్మాన్ని చక్కగా పాటిస్తూ, ధర్మంతప్పకుండా, ప్రజారక్షణం చేస్తూండటంతో సస్యసమృద్ధీ, ప్రజావృద్ధీ జరిగాయి. భూదేవి ప్రజాభారపీడిత అయ్యింది. తన్నివారణార్థం బ్రహ్మ దేవదానవుల అంశలతో మానవుల్ని కొందరిని సృష్టించాడు. అలా సృష్టించబడిన వారిలో దైవాంశసంభూతులందరూ పాండవులపక్షాన, రాక్షసాంశ సంభవులందరూ కౌరవులపక్షాన చేరారు. వారికీ వీరికీ సహజవైరం కారణంగా మహాభారతయుద్ధం సంభవించింది.[2]

---

1. భగవద్గీత - 4 - 7, 8 శ్లోకాలు. 2. ఆది 3 - 51 నుంచి 56

ఇక్కడ, దైవప్రకృతి ప్రభావం అధికమై భూమిపై సమతౌల్యం లోపించడం సూచింపబడింది. భూదేవి దేవతలతో కూడిన త్రిమూర్తులతో

"భూరిప్రజానిరంతర
భారము దాల్చ టిది కరము భారము దయతో
మీ రీభారమునకుఁ బ్రతి
కారము గావించి నన్నుఁ గావుండ.."[1]ని విన్నవించుకొంది.

భూదేవికే కాదు, ఇంద్రాది దేవతలకుకూడా అది దుస్సహమైంది. వారు బ్రహ్మవద్దకు పోయి, "భట్టారకా! మర్త్యులమర్త్యులయి వర్తిల్లువారయిన వారికిని మాకును విశేషంబెద్ది?"[2] అని దుఃఖించారు. భారతయుద్ధానికి మూలమైన ధర్మగ్లాని యొక్క స్వరూపం ఇది.

మహాభారతయుద్ధమనే మానవనాటకానికి(human drama) వెనుక గల దివ్యమైన జగద్వ్యూహాంయావత్తూ బోధపడటంతో అది ఒక విశ్వజనీనమైన శాశ్వతసన్నివేశమనికూడా వ్యాసభగవానుడుగుర్తించాడు.

తన అవతార పరమార్థాన్ని తాను గుర్తెరిగి, లోకహితార్థమై, తనవంతు కర్తవ్యాన్ని తాను నిర్వహిస్తూ, శ్రీకృష్ణునికి సహాయకునిగా పనిచేసిన మహానుభావుడు వ్యాసభగవానుడు.

వేదాల్లో వర్ణించబడిన సృష్టికథ (శాశ్వతధర్మం) అంతా భౌతికకక్ష్యలో తనకళ్ళముందరే నిదర్శనప్రాయం (illustrative) గా జరుగుతున్న అనుభూతి కలగడంలో ఆయన పరవశించి పాడుకున్నాడు. ఆ పాట భావితరాలవారికి బంగారుబాట అని ఆయన ఆంతర్యం. "భారతమిషమునఁ బలికితి వేదార్థభావమెల్ల"[3] అని ఆ మహానుభావుడు చెప్పుకున్నది ఇందుకనే. మహాభారతానికి పంచమవేదమనే ప్రసిద్ధి కూడా ఇందువల్లే వచ్చి ఉంటుంది.

---

1. ఆది - 3 - 53
2. ఆది - 7 - 265 వచనం
3. ఆంధ్రమహాభాగవతము - 1 - 85

''భారతాఖ్య మగులేఖ్యంబై నయామ్నాయము''ను కృష్ణ ద్వైపాయనుడు 'కావించె' నని తిక్కనగారు ఈ అంశాన్ని ఎంతో సముచితంగా ప్రస్తావించారు.[1] ఆమ్నాయాన్ని (వేదాన్ని) లేఖ్యం కావించడం అని కాకుండా భారత మనేపేరుతో లేఖ్యమైన వేదాన్నే ఆయన గ్రథనం చేశాడని చెప్పడం విశేషం. అలేఖ్యమైన వేదం (సృష్టి లోని శాశ్వత ధర్మం లేక విశ్వతత్త్వం) భారతగాథగా రూపుకట్టుకొని లేఖ్యమైంది. దాన్ని భావితరాలవారికి అందించడంకోసమని వ్యాస మహర్షి ఆరాటపడ్డాడు -అని గమనించవలసి ఉంది.

ఈ పంచమవేదం ఎంతటి మహత్తరమైన దంటే—

"వేదములకు నఖిలస్మృతి
వాదములకు బహుపురాణ వర్గంబులకున్
వాదైన చోటులను దా
మూదల ధర్మార్థకామమోక్షస్థితికిన్."[2]

ఒక విషయమై అనేకమైన సిద్ధాంతాలు, రాద్ధాంతాలు ఉండవచ్చు. తీరికూర్చుని చర్చించుకొంటే వాటివల్ల ఎటూ తేలదు. అవే సన్నివేశాలుగా జీవితంలో ఎదురైనప్పుడు వాటిని మనం ఎలా పరిష్కరించుకొన్నామో, ఫలితాలేమిటో, మంచిచెడ్డలేమిటో, సాధక బాధకాలేమిటో- ఇత్యాదిగా గల అనుభవం ఆ సిద్ధాంత రాద్ధాంతా లకంటే లోకానికి ఎంతగానో ఉపకరిస్తుంది. కనుక, మన పరిస్థితివంటి పరిస్థితిలోనే ఉన్న ఇతరులకి విశేషంగా సహకరించేది మన అనుభవం గాని ఆ సిద్ధాంతాలు వగైరాలు కావు అని మనం అంగీకరించితీరాలి.

తిక్కనగారు మహాభారత ప్రామాణ్యాన్ని గురించి ఈ దృష్టి తోనే పైవిధంగా చెప్పిఉంటారని అనుకోవచ్చు.

1. విరాట - 1 - 3

2. విరాట - 1 - 4

ధర్మార్థకామమోక్షాల విషయంలో శ్రుతి, స్మృతి, పురాణాదుల్లో పరస్పర విరుద్ధమైన ప్రతిపాదనలు ఉండవచ్చు. లేదా, వాటి ద్వారా మనకు కావలసిన సమన్వయం ఒక్కోసారి దొరకకపోవచ్చు. అటువంటప్పుడు తగిన పరిష్కారాన్ని చూపగలిగింది ఒక్క మహాభారతమే!

అయితే, మహాభారతపరమార్థము పట్టుపడటం అంత సులభమా? దానికి వ్యాసముని అనుగ్రహం ఉండవలసిందే! ఆయన దయవల్ల భారతంలో మనజీవితానికి శ్రుతి కుదిరిందో ఇంక చెప్పనక్కరలేదు- మనజన్మ ధన్యమైపోయినట్లే! మనకు సమస్తమైన వేదాల తాలూకూ సంస్కారమూ అలవడినట్లే! శాశ్వతమయిన ఆనందస్థితిని మనం పొందినట్లే!

మహాభారతరచనలో వ్యాసుడు ఉద్దేశించిన పరమ ప్రయోజనం ఇదేనని సూతుడు శౌనకాదులతో ఇలా అంటున్నాడు.

"వ్యాసమునీంద్ర సారకరుణాతిశయంబున భారతార్థము
ద్భాసితమైన యట్టి నుతభాగ్యునకున్ సకలాగమార్థ సం
వాసన మావహిల్లు జనపంక్తులు కీర్తనచేయ శశ్వదు
ల్లాససుఖానుభూతి నచలస్థితి నొప్పు నతండుదాత్తుఁడై"[1]

భారతాన్ని అన్ని కావ్యాల మాదిరిగా చదువుకోవడంగాక వ్యాసునిపట్ల పూజ్యభావం కలిగి, దానిలోని పరమార్థాన్ని హృదయంలో భాసింపజేసుకోవాలి. అప్పుడు మహాభారతంలో కురుపాండవులకథ గౌణమనీ, వేదవ్యాసమహర్షి దానిలో ప్రధానంగా ప్రతిపాదించదలచినది ధర్మాన్ననీ స్పష్టపడుతుంది.[2]

---

1. స్వర్గా - 92
2. "వ్యాసముని పట్టి భారతకథ చెప్పదలచినాడా? లేక తన బోధనకు కథను అవలంబముగా స్వీకరించినాడా? అను ప్రశ్నకు సూటిగా జవాబు చెప్పదలచినచో కథ గౌణమే అనిపించును. భారతకథాంతమున ఆయన (23వ పేజీలో చూడుడు)

కథ కేవలం ఒక భోజనపాత్ర లాంటిది. పాత్రని మనం భుజించం. అలాగని పాత్రలేకుండానూ భుజించలేం. పాత్ర ఉండాలి, పాత్రలోని పదార్థాలను మాత్రమే మనం భుజించాలి. అలాగే, భారతంలోని కథనీ అంగీకరించాలి, కథద్వారా ప్రతిపాదించబడుతున్న పరమధర్మాన్నీ అంగీకరించాలి.

భారతంలోని పరమార్థం (ధర్మం) జోలికి పోకుండా, ప్రకటార్థం తీసుకొందామనుకొన్నా, ఆకథకంతటికీ సూత్రధారుడు శ్రీకృష్ణ భగవానుడని స్ఫురించకమానదు. కౌరవులు పరోక్షంగానూ, పాండవులు ప్రత్యక్షంగానూ అతని దివ్యప్రభావానికి ఏవిధంగా లోనవుతూవచ్చారో అడుగడుగునా భారతంలో కనిపిస్తూనే ఉంటుంది.

"ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి ।
భ్రామయన్ సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా ॥"1

'సర్వజీవుల హృదయాల్లోను ఈశ్వరుడు ఉంటాడు. ఆయన ఈ జీవులందరినీ సృష్టి అనే యంత్రం పైకి ఎక్కించి, మాయచే త్రిప్పుతూ ఉంటాడు.' —అనే సత్యం భారతాన్ని హృదయంతో చదివిన వారందరూ అనుభవించగలుగుతారు.

అంతేకాదు, మరికొంచెం నిదానించిచూస్తే, సర్వోపనిషత్సారమైన భగవద్గీత మహాభారతసారమ (quintessence) ని కూడా

(22వ పేజీ) చేయెత్తి "ఊర్ధ్వబాహుర్విరామ్యేష......" అని ఘోషించినాడు. ఆయన చెప్పిన ఈ ధర్మము ఏ ధర్మమని ఎవరైనను అడుగవచ్చును. ఆ ధర్మమును సంకుచితదృష్టితో చూచుటకు మనకధికారములేదు. 'ధరతి విశ్వం ధర్మః' అని దానివ్యుత్పత్తి. మానవునికి ఎన్నోధర్మములున్నవి. అందులో తాను ఏ మూలతత్త్వమునుండి అవతరించెనో ఆ తత్త్వమును అధిరోహించుట పరమధర్మము. ఆ ధర్మమును భారతము సవిస్తరముగా ప్రపంచించినది."

—ఆంధ్రమహాభారతములో రసపోషణ (విరాటోద్యోగపర్వములు.)

—డా॥ ఎల్లూరి శివారెడ్డి. పుట - ౨౭౩

1. భగవద్గీత - 18 - 61

అవగతమవుతుంది. ఒక వ్యక్తి తన జీవితానుభవసారాన్ని ఒకసందేశం గా వినిపిస్తే, ఆ సందేశానికీ, ఆ వ్యక్తి జీవితానికీ ఎలాంటి సంబంధం ఉంటుందో, భారతానికీ, భగవద్గీతకు కూడా అలాంటి అవినాభావ సంబంధమే ఉంది.[1]

ఈ విధంగా ఇటు కథనుంచి చూసినా, అటు పరమార్థంనుంచి చూసినా భారతంలో ప్రధానంగా ప్రతిపాదించబడినది పరమధర్మమే ననేవిషయం బుజువవుకోంది.

ఇంతటి మహత్తరమైన దివ్యగ్రంథాన్ని వ్యాసభగవానుడు గనుక మాత్రమే రచింపగలిగాడు. ఆయనను 'కవి' అని చెప్పదలచు కొంటే "కవిర్మనీషీ పరిభూ స్స్వయంభూః" -అనే ఈశావాస్య నిర్వచ నం ప్రకారం మాత్రమే చెప్పాలి.

బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి -నారాయణ తత్త్వాన్ని అనుభ వించి, అనుభూతికి అందించినవాడు నారాయణుడుకాక మరెవ్వరవు తాడు? అందుకే కాబోలు విష్ణుపురాణం

"కృష్ణద్వైపాయనం వ్యాసం విద్ధి నారాయణం ప్రభుమ్ ।
కోహ్యన్యః పుండరీకాక్షాన్మహాభారతకృద్భవేత్ ॥"

1. "భారతమును పారాయణము చేసినవారికి భగవద్గీతలోని విషయమంతయు కథా సరణిలో వికీర్ణమై యుండుట అనుభవములోని విషయము. ఇది పొందవలసిన అనుభవముగాని చూపవలసిన లెక్కగాదు." -డా॥ ఎ. శివారెడ్డి,
-ఆంధ్రమహాభారతములో రసపోషణము, పుట - 330

"భారతే సర్వవేదార్థో భారతార్థశ్చ కృత్స్నశః ।
గీతాయామస్తి తేనేయం సర్వశాస్త్రమయీ స్థితా ॥" -గీతాప్రశస్తి

"భగవద్గీతకు కర్తయైన కృష్ణుని ఒకవ్యక్తిగా గాక ఒక తత్త్వంగా గుర్తించాలని వ్యాసుడే వ్రాసేడు. అట్లు గుర్తించినప్పుడు వ్యాసుని జయగ్రంథం అంతలోను మొదటినుంచి చివరివరకూ చెప్పబడిన కథాభాగం అంతా భగవద్గీతాప్రోక్తమైన కృష్ణతత్త్వం చెప్పేదిగానే అంతరార్థపరంగా మనకు అవగాహన మౌతుంది..."
-అంతరార్థమహాభారతము, నివేదనము, పుట - 14
కళాప్రపూర్ణ, డా॥ వేదుల సూర్యనారాయణశర్మ.

(పుండరీకాక్షుడు తప్ప భారతకర్త అన్యుడెవరు కాగలరు? కృష్ణద్వైపాయనుడైన వ్యాసుణ్ణి నారాయణ ప్రభువే అని తెలియాలి.) అంటూ ప్రబోధిస్తోంది.

పరమకరుణతో భారతగాథను వినిపిస్తున్న వైశంపాయనుడు అతిశ్రద్ధగా వింటున్న జనమేజయమహారాజును ఉద్దేశించి, తన పరమ గురువైన వ్యాసమహర్షి నిగూర్చి

"విద్వన్మోదవిధాయి నిర్మలవచోవిస్ఫూర్తివిఖ్యాతుఁ గృ
ష్ణద్వైపాయను నీ వెఱుంగుము విభున్ నారాయణుంగా విప
శ్చిద్వంద్యం బగు భారతాధ్యయనముం జేయంగ శక్తుండు ధ
ర్మాద్వైతుండు సరోజలోచనుఁడ కా కన్యుండు తద్వాచ్యుఁడే!"[1]

అని పరవశంతో కీర్తించాడు. ఆటువంటి మహర్షికి—

"వ్యాసాయ విష్ణు రూపాయ వ్యాసరూపాయ విష్ణవే।
నమో వై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమోనమః ॥ అంటూ

అంజలి ఘటించి, ముందుకు సాగుదాం.



1. శాంతి - 6 - 476

## 3. సూత్రే మణిగణా ఇవ...

మహాభారతం భరతకుల ముఖ్యుల వంశచరితాను కీర్తనమై ఉండగా దానిలో శ్రీకృష్ణుని ప్రమేయం ఏమిటన్నది పరిశీలించవలసిన విషయం.

ధర్మరాజనాయకమైన భారతేతిహాసం కృష్ణసంబంధి కావడం విశేషమే!

పరమభాగవతోత్తమ అయిన కుంతి దేవదేవుని స్తుతిస్తూ,

"మలయమునఁ జందనము క్రియ
వెలయఁగ ధర్మజునికీర్తి వెలయించుటకై
యిలపై నభవుఁడు హరి యదు
కులమున నుదయించె నండ్రు గొందఱనంతా!"[1]

అని పలికింది. ఒకవిధంగా ఇది యదార్థమే.

తామరాకుమీద నీటిబొట్టువంటి శ్రీకృష్ణుడు తాను చేసిన ఏమహాకార్యానికీ అంటనట్లే, జయించిన రాజ్యాలకూ అంటలేదు. కంసుని మర్దించి, మథురకు ఉగ్రసేనుని రాజుగా చేయడంతో మొదలైన అతని ధర్మసంస్థాపన ప్రణాళిక, పాండవులచే జరాసంధుని చంపించి, దిగ్విజయం చేయించి, ధర్మజుని రాజసూయాభిషిక్తుని చేయడంతో ముగిసినట్లే. కానీ, దానికి విఘాతం వచ్చి అది అధర్మానికీ, అత్యాచారాలకూ దారితీయడంతో మహాయుద్ధంలో కౌరవులనందరినీ చంపించక తప్పలేదు ఆయనకు. ఆ తర్వాత యుధిష్ఠిరుని పునఃప్రతిష్ఠితుని చేయడం జరిగింది. కనుక శ్రీకృష్ణుని జీవిత ప్రయత్నమంతా ధర్మజుని రాజ్యాభిషిక్తుని చేయడంగా పర్యవసించిందని చెప్పవచ్చు. ఆ దృష్ట్యా అతడు పుట్టిందే ధర్మజుని కీర్తిని వెలయించడానికని కొందరు అనుకొంటున్నారనడం ఎంతో సమంజసం.

---

1. శ్రీమదాంధ్రమహాభాగవతము - 1 - 193

పాండవుల చరిత్రను పరిశీలిస్తే, బాల్యమాదిగా వారు శ్రీ కృష్ణుని శిక్షణలో ఉన్నారని తెలుస్తుంది. కృష్ణుడు ప్రత్యక్షంగా వారికి చాలాకాలంవరకూ కనబడకపోయినా పాండురాజూ, కుంతీ, భీష్ముడూ, వ్యాసుడూ మొదలైన వారందరూ పాండవులను శ్రీకృష్ణుని జగద్వ్యాపారానికి అనువుగా తీర్చిదిద్దారని విశదపడుతుంది.

తమ పక్షాన రాయబారిగా పంపుతూ శ్రీకృష్ణునితో ధర్మరాజు—

"ఆపదఁ గడవం బెట్టఁగ
నోపి శుభం బైనదాని నొడఁగూర్పను మా
కీ పుట్టువునకుఁ బాండు
క్ష్మాపాలుఁడు నిన్నుఁ జూపి చనియె మహాత్మా!"[1]

అనీ, 'మేము నీకు ప్రద్యుమ్నాది కుమారులవంటివారం' అనీ అంటాడు. అప్రాకృతమైన జన్మమూ, అసాధారణమైన సామర్థ్యమూ గల తన బిడ్డలకు వారి జీవిత పరమావధి ఏమిటో ఆ రాజర్షి బోధించిమరీ వెళ్ళిపోయాడన్నమాట!

రాయబారానికి హస్తినకు వచ్చి తనను దర్శించిన కృష్ణునితో కుంతీమహాదేవి,

"నీశిక్షఁ బెరుఁగుట నీతిమంతులుఁ బుణ్య
పరులు శూరులుఁగదా పాండుసుతులు
... ... ... ... ... ..."[2]

అంటుంది. అంతేకాదు, కృష్ణుడు ఆమెను ఊరడించి, ధైర్యం చెప్పాడు. అప్పుడు అతని మాటలు విని,

"...మోము విచ్చుచు మురారికి నిట్లనుఁ గుంతి పాండునం
దనులకుఁ దండ్రియున్ గురువు దైవము నారయ నీవ కావె నీ
మనమున ధర్మమున్ హితము మంచిగఁ జూచి విధించినట్లు చే
సి నెగడువారు గాక నినుఁ జేరిన నాపద లొంద నేర్చునే."[3]

1. ఉద్యోగ - 3 - 6 2. ఉద్యోగ - 3 - 183 3. ఉద్యోగ - 3 - 207

అన్నది. ఆ మహాతల్లి తనకన్నబిడ్డలను ఆ జగద్గురునికి ఎంతటి విశ్వాసంతో సమర్పించుకున్నదో గదా!

వారు కూడా అందుకు తగినట్లుగా పెరిగి, తమ వ్యక్తిత్వాలను ఆ పరమేశ్వరునికి సమర్పణం చేసుకొని అనేకపరీక్షలను ధైర్యంగా ఎదుర్కొని, స్థైర్యంతో నిలబడగలిగారు.

భక్తపరాయణుడైన భగవానుడు పాండవులను తన విశ్వప్రణాళికలో భాగస్వాములుగా, ఉపకరణాలుగా స్వీకరించాడు.

"యే భజన్తి తు మాం భక్త్యా మయి తే తేషు చాఽప్యహమ్"[1]

భక్తితో నన్ను సేవించేవారిలో వేనూ, నాయందు వారూ ఉంటామని భగవానుని వాగ్దానం.

కనుక, మహాభారతం పేరుకు పాండవులకథే అయినా దాని నిండా నిండిఉన్నది శ్రీకృష్ణుని దివ్యవైభవమే.

పాండవుల జీవితసన్నివేశాల్లో అడుగడుగునా వ్యక్తమైనది పరమేశ్వరుని లీలావిలాసమే అనే విషయం భాగవతంలో మరింత స్పష్టంగా వర్ణించబడింది. భారతపారిజాతతరుమూలాలు విస్తరించి ఉన్నది భాగవతంలోనే గాదా!

కుంతీదేవి గమనోన్ముఖుడైన శ్రీకృష్ణుని ఉద్దేశించి భక్తితో కీర్తిస్తూ,

"తనయులతోడనే దహ్యమానంబగు
జతుగృహంబునయందుఁ జావకుండఁ
గురురాజు పెట్టించు ఘోరవిషంబున
మారుతపుత్రుండు మడియకుండ
ధార్తరాష్ట్రుఁడు సముద్ధతిఁ జీర లొలువంగ
ద్రౌపది మానంబు దలఁగకుండ
గాంగేయకుంభజ కర్ణాది ఘనులచే
నాబిడ్డ లనిలోన నలఁగకుండ

1. భగవద్గీత - 9 - 29

విరటు పుత్రిక కడుపులో వెలయు చూలు
ద్రోణనందను శరవహ్నిఁ ద్రుంగ కుండ
మఱియు రక్షించితివి పెక్కుమార్గములను
నిన్నునేమని వర్ణింతు నీరజాక్ష!"[1]

అంటూ ఆ దివ్యానుగ్రహాభరితసన్నివేశాలను పరవశిస్తూ స్మరించుకొంది.

శరతల్పగతుడైనభీష్ముడు "...మావిజయుం జేరెడు వన్నెకాఁడు మదినావేశించు నెల్లప్పుడున్" అంటూ చేసిన శ్రీకృష్ణస్తవంలో పరమేశ్వరుడైన శ్రీకృష్ణుని ఆశ్రితజనపక్షపాతాన్ని ఎంతగానోకొనియాడాడు.

"... ... ... ... ...
జయముం బార్థున కిచ్చువేడ్క నని నాశాస్త్రాహతిం జాల నొ
చ్చియుఁ బోరించు మహానుభావుఁ........." డనీ,

"నరుమాటల్ విని నవ్వుతో నుభయసేనామధ్యమక్షోణిలోఁ
బరు లీక్షింప రథంబు నిల్పి పరభూపాలావళిం జూపుచుం
బరభూపాయువు లెల్లఁ జూపులన శుంభత్కేలి వంచించు నీ
పరమేశుండు ... ... ... ..." అనీ,

"తనవారిఁ జంపఁ జాలక
వెనుకకుఁ బో నిచ్చగించు విజయుని శంకన్
ఘనయోగవిద్యఁ బాపిన
మునివంద్యు ... ... ..." డనీ,

ఆ బ్రహ్మజ్ఞాని శ్రీకృష్ణుని వర్ణించడం జగద్విదితం.[2]

శ్రీకృష్ణుని నిర్యాణాన్ని ధర్మజునికి తెలుపుతూ క్రీడి—

"మనసారథి, మనసచివుఁడు,
మనవియ్యము, మనసఖుండు, మనబాంధవుఁడున్,
మనవిభుఁడు, గురుఁడు, దేవర
మనలను దిగనాడి చనియె మనుజాధీశా!"

1. శ్రీ॥మ॥ భాగవతము-1-188 2. శ్రీ॥మ॥ భాగవతం-1-218నుండి223వరకు

"దిక్కుల రాజుల నెల్లను
ప్రక్కించి ధనంబుగొనుట, మయకృతసభ ము
న్నెక్కుట, జన్నము సేయుట
నిక్కము హరి మనకు దండ నిలుచుటఁ గాదే!"

అంటూ పలికిన మాటల్లో[1] కృష్ణుడు పాండవుల క్షేమాన్ని ఎన్నివిధాలుగా విచారించేవాడో తెలుస్తుంది.

"అనన్యాశ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్॥"[2]

అనిగదా భగవానుని ప్రతిజ్ఞ!

మహాభారతంలో కూడా పాండవుల శరణాగతిని, కృష్ణుడు వారిపట్ల బాధ్యత వహటాన్ని నిరూపించే సందర్భాలు అనేకం ఉన్నాయి.

ద్రౌపదిని వివాహమాడి, దుర్యోధనకృత లాక్షాగృహ ప్రయోగంనుంచి విముక్తులైన పాండవులను ధృతరాష్ట్రుడు పిలువనంపగా వారప్పుడు

"కురుముఖ్యులు ధృతరాష్ట్రవి
దురభీష్ములు గురులు మాకు ద్రుపదప్రభుఁడున్
గురుఁడు మురాంతకుఁడు జగ
ద్గురుఁ డిందఱమతమునను నగున్ శుభయుక్తుల్."[3]

అని ప్రకటించుకొన్నారు. అంతేకాదు, వారాప్రకారంగా జీవిస్తూవచ్చారనికూడా వారిచరిత్ర నిరూపిస్తోంది. కనుకనే కృష్ణుడు సర్వావస్థల్లోనూ వారిని కనిపెట్టుకొని ఉంటూ, వారికి ఏ ఆపదరాకుండా కాపాడాడు. రాయబారానికి వచ్చిన సంజయునితో అతడే స్వయంగా నిండుసభలో "పాండుతనూజకోటికి శుభంబెడఁగోరుదు..."[4] నని చాటుకున్నాడు.

---

1. శ్రీమదాంధ్రమహాభాగవతము - 1 - 358 నుంచి 368 వరకు
2. భగవద్గీత - 9 - 22
3. ఆది - 8 - 61
4. ఉద్యోగ - 1 - 336

పాండవులపట్ల కృష్ణుని అభిమానం వ్యక్తిగతం కాదు. వారు ధర్మబద్ధంగా జీవిస్తున్నారు. తాను ధర్మమార్గప్రవర్తకుడు. కనుక, వారి బాధ్యత తనదయ్యింది. ఈ విషయాన్ని

"ధర్మజుండు ధర్మతరు వర్జునుఁడు ఘన
స్కంధ మనిలసుతుఁడు శాఖ కవలు
పుష్పఫలము లేను భూసురులును వేద
ములుఁ దదీయ మైన మూలచయము."[1]

అని భగవానుడు స్పష్టపరిచాడు. ధర్మజుడనే ధర్మవృక్షానికి కృష్ణుడూ, బ్రాహ్మణులూ, వేదాలూ మూలం. కనుకనే, వారన్నిపడవలసి వచ్చిందని భీష్ముడు చెప్పటాన్నికూడా చూశాం.

భక్తులకు జరిగే అపచారం భగవానునికి జరిగే అపచారమే. అదీకాక, భగవానుడు నారాయణుడైతే, అర్జునుడు నరుడనే మహర్షి. నరునికి ఇష్టమైనవాడు నారాయణునికి ఇష్టుడు. నరునికి అనిష్టుడైన వాడు నారాయణునికీ అనిష్టుడు. పాండవులు అరణ్యంలో ఉండగా వారిని సందర్శింపవచ్చిన భగవానుడు తనను కీర్తించిన అర్జునునితో

"నరుఁడు నారాయణుండు నాఁబరగు నాది
మునుల మిద్దఱ మందు నీ వనఘ! నరుఁడ
వేను నారాయణుండ ననూనశక్తి
యుతులమై మర్త్యయోనిఁ బుట్టితిమి పేర్మి."

"నిరతంబుగ నేను నీ వనుభేద నియమంబు లేదైక్యనిష్ఠయ మనకు
నిరువురకును నీకు నిష్టుండు కాకునిష్టుండ మఱి నీకనిష్టుండ నాకుఁ
గర మనిష్టుం డట్లగా నమ్ము మనుచు... ... ... "[2]

చెప్పడం జరిగింది. ఇదే విషయాన్ని రాయబార సందర్భంలో దుర్యోధనునికి కూడా స్పష్టంచేశాడు కృష్ణుడు.

---

1. ఉద్యోగ - 1 - 336
2. ఆరణ్య - 1 - 131, 132

"అలుగుదు పాండవులకు వా
రలు నాకుం బ్రాణములు ధరావల్లభ! యి
ట్టల ముగఁ దమప్రాణములకు
నలుగుజనులు పగతు రగుట యనుమానంబే?"[1]

'పాండవులు నా ప్రాణం, వారికి హాని తలపెట్టే నీవు నాకు శత్రువువే'— అని కృష్ణుడు మాటవరుసకు అనలేదు. ద్రౌపదికి జరిగిన అవమానం అతనిని ఎంతగానో బాధించింది. ఆ దురదృష్టకరమైన సన్నివేశాన్ని వారించి ఉండినట్లయితే తానేకాక లోకాలన్నీ ఎంతో సంతోషించి ఉండేవని సంజయునితో ప్రస్తావించాడు.[2]

తనమాటగా ధృతరాష్ట్రునితో చెప్పవలసిందిగా—

"ఎందును నెవ్వరుంబడని యెంతయుఁ గష్టముపాటు వచ్చినం
గొండల మంది పాండువిభుకోడలు దవ్వుల నున్ననన్ను గో
విందుఁడ కావు మంచుఁ బలవించుట యాఁగఁగ రానియప్పుఁబో
లెం దలపోయ వేఁగయి చలింపక యున్నది యెప్పుడున్ మదిన్"[3]

అనిపలికాడు. సంజయుడు, గుడ్డిరాజు ఇరుపక్షాల బలాబలాల ప్రసక్తి తెచ్చినప్పుడు, పాండవులకు "బలమును సత్త్వంబు హరియ......"[3] అని ఖండితంగా చెప్పాడు.

పాండవులుకూడా తాము కృష్ణునికంటే వేరని ఎన్నడూ భావించలేదు. వారికసలు ప్రత్యేకమైన అస్తిత్వం ఉన్నట్లే వారు మర్చిపోయారు. వ్యక్తిత్వాలను పరమాత్మకు సమర్పణం చేసుకున్న మహానుభావులకు అస్తిత్వాలేం మిగులుతాయి?

---

1. ఉద్యోగ - 3 - 226
2. "అత్తఱి భీష్మముఖ్యులగు నచ్చటి వృద్ధజనంబులెల్ల నో
రెత్తక యూరకుండిరి మహీశ్వరు చిత్త మెఱుంగకున్కిఁ దా
నొత్తి కుమారులం గినియనోపఁడ యక్కట! మాన్పఁగన్న నా
చిత్తమ కాదు లోకముల చిత్తములెల్లను సంతసింపవే!"
ఉద్యోగ - 1 - 346
3. ఉద్యోగ - 2 - 129

యుద్ధంలో భీష్ముని జయించినందుకు కృష్ణుడు ధర్మరాజును అభినందించగా అతడు వెంటనే

'... ......ఏ, మనఁగా నొకమానిసులమె? యప్రతిహతవీ

రుని నిన్నుఁబడసి యింతటి పనులకుఁ జాలితిమిగాక భక్తాధీనా!'[1]

అని కృష్ణుని సర్వనిర్వాహకత్వాన్ని స్మరించుకొన్నాడు.

అలాగే, కర్ణవధానంతరంకూడా ధర్మజునితో 'కర్ణుఁడు భవదీయ క్రోధాగ్ని నిహతుఁడై క్రాఁగె' నని పలికాడు.

అప్పుడు ధర్మరాజు "......భవత్ప్రసాదజీవనులము" అంటూ,

"అఖిలరక్షకుండ వగునీవు భక్తుల
మైన మమ్ముఁ గాచుటరుదె తలఁప
భయము నెవ్వగయును బాసి నాకంటికి
నిదుర వచ్చె నేఁడు నీరజాక్ష!"[2]

అని తనహృదయశల్యం తొలగినవిషయాన్ని స్పష్టంచేశాడు. అంతేకాక,

"సకల ధరణీవలయ సామ్రాజ్యమునకు నేఁ
డేను భర్తనైతి నెల్లపెంపు
గలిగి నీదుకరుణఁ గడిఁది మగండగు
పగతుఁ డశ్రమమునఁ దెగుటఁ జేసి."[3]

అంటూ తన సంతోషాన్నీ, కృతజ్ఞతనూ ప్రకటించుకొన్నాడు.

యుద్ధంలో విజయం సాధించి, రాజ్యాన్ని పొందిన వెంటనే ధర్మరాజు శ్రీకృష్ణునితో

"అమలభవదీయసుప్రసాదమునఁ జేసి
పితృపితామహక్రమ యోగ్య పీఠమైన
వినుత సామ్రాజ్యమున కేను విభుఁడనైె కృ
తార్థతానంద పూర్ణుండనైతిఁ గృష్ణ"[4]

1. భీష్మ - 3 - 438
2. కర్ణ - 3 - 390
3. కర్ణ - 3 - 394
4. శాంతి - 1 - 386

అని పలికాడు. కృష్ణుడుకూడా తనకర్తృత్వాన్ని అంగీకరిస్తూ అర్జునితో స్పష్టంగా "ఏను రక్షింప జయము నీ కెసకమెసఁగె......" అని ప్రకటించుకున్నాడు.[1]

కనుకనే హరిగుణోపచితభాషణమైన శ్రీమద్భాగవతంలో

"పాంచాలీ కబరీ వికర్షణ మహాపాపక్షతాయుష్కులం
జంచద్దుర్వ్యాల ధార్తరాష్ట్రుల ననిం జపించి గోవిందుఁ డి
ప్పించెన్ రాజ్యము ధర్మపుత్రునకుఁ గల్పించెన్ మహాఖ్యాతిఁ జే
యించెన్ మూఁడు తురంగమేధములు దేవేంద్రప్రభావంబునన్"[2]

అని భారతకథకంతటికీ సూత్రప్రాయుడు శ్రీకృష్ణుడని స్పష్టంగా చెప్పబడింది.

మరొక్క విశేషం—

పాండవుల నిమిత్తంగా శ్రీకృష్ణుడు ఏకలవ్య, శిశుపాల, జరాసంధాదులను పిలుకుమార్చి,[3]

"పూజ్యుఁడ వెల్లవంశముల భూపతులందును ధర్మనిర్మల
ప్రాజ్యవిభూతి నద్దివిజపాలకు నట్టిఁడ నీక యొప్పె సా
మ్రాజ్యము, దైవసంపదయు, మానుష సంపద పేర్మిఁ గావునన్
యాజ్యుఁడ విప్డు నీవ భరతాన్వయభూషణ! ధర్మనందనా!"[4]

అంటూ ధర్మజునిచే రాజసూయం నిర్వహింపజేసి, "అప్రమత్తుండవయి నిఖిల ప్రజారక్షణంబుసేయు" మని నియోగించాడు.[5] శ్రీకృష్ణుని ఈ నియోగాన్ని భంగపరచి, పాండవులను రాజ్యభ్రష్టుల్ని చేసి, అధికారం చేజిక్కించుకొన్నవారు కౌరవులు. తన అనుశాసనాన్ని భంగపరచిన

1. శాంతి - 6 - 457 2. ఆంధ్రమహాభాగవతము - 1 - 174
3. "......ఇట్లు యేకలవ్య శిశుపాల జరాసంధాదుల నీ కకానొక్కొక్క తెఱంగు నం బిలుకు మార్చితి నిత్తఱి వారలున్నఁ గౌరవపతి వారలం దెమ్ముకొను నమ్ము వ్వురుఁగూడిన సెవ్వరికి నోర్వరాకుండు......" ద్రోణ - 5 - 239
4. సభా - 1 - 278 5. సభా - 2 - 80

వారిని దండించి, శ్రీకృష్ణుడు తిరిగి ధర్మజుని చక్రవర్తిగా సుప్రతిష్ఠితుని చేశాడు.[1] 'యుధిష్ఠిరప్రతిష్ఠాత్తుఁడు'గా కీర్తింపబడుతున్నాడు ఇప్పటికీ.

ఈ సందర్భంగా గమనించవలసిన ముఖ్యాంశం ఒక్కటుంది. కౌరవులు అనహంకారుడు, అక్రోధనుడు, అతృష్ణుడూ అయిన ధర్మజుని పట్లా, అతని సోదరులు, భార్యపట్లా నెరపిన దౌర్జన్యం కేవలం వ్యక్తిగతంగా కాగా, జగదాచార్యుడైన శ్రీకృష్ణుని అనుశాసనాన్ని ధిక్కరించడం ద్వారా చేసిన అపచారం జగద్వ్యవస్థకంతటికీ సంబంధించినది. అందువల్ల శ్రీకృష్ణుడు పాండవుల నెపంగా కౌరవులను బంధుమిత్రాదులతో సహా నిగ్రహించాడు. 'సాత్త్విక రాజస తామస వికారంబుల త్రిప్పలంబడక ధర్మంబాచరించుచు భావశుద్ధిని కలిగియుండు' సంజయుడు ధృతరాష్ట్రునితో హరిమహాత్త్వాన్ని గూర్చి విన్నవిస్తూ ఈ విషయాన్ని ఇలా స్పష్టంచేశాడు.

"పురుషోత్తముం డెల్ల భువనంబులును దాన
యఖిల భూతాత్మకుండై విహార
లీల విచేష్టించు నీలోకముల మాయ
దొట్టి యొక్కొకమరి పుట్టి పెరిఁగి
కర్మానుచరణముల్ గైకొని వర్తించు
శిష్ట రక్షణమును దుష్టనిగ్ర
హంబును దనపనులగుటఁ బాండవుల నె
పం బిడుకొని ధర్మబాహ్యులైన

---

1. శాంతి - 1 - 374 "......................

అంత నూర్జితశుభవేళయగుడు శంఖ
చక్రధరుఁ డాసమర్చిత శంఖమెత్తి
పృథివి కధిపతి వగు మని ప్రీతి నా పృ
థాసుతుని నభిషిక్తునిఁ జేసె నధిప!"

నీ తనూజుల నిక్కమ నిగ్రహింపఁ
దలఁచినాఁ డమ్మహాత్ముండు తథ్యమతని
నిట్టి చందంబువాఁ డని యెఱిఁగి యెవ్వ
రాశ్రయింతురు బ్రతుకుదు రట్టివారు."[1]

సర్వోన్నతుడైన ఒక అధికారి ఒక కార్యాలయంలో తనకు ప్రతినిధిగా అర్హుడైన ఒక వ్యక్తిని కార్యాలయాధికారిగా నియమించాడనుకొందాం. కార్యాలయోద్యోగులందరూ ఆనియామకాన్ని శిరసా వహించి, ఎవరిహద్దుల్లో వారుంటూ, ఎవరిపనివారు చేసుకుపోవలసిందే గదా! అలాకాక, ఆ ఉద్యోగులు మత్సరగ్రస్తులై, తమ పై అధికారిని అవమానిస్తూ, అనేకమైన అక్రమాలు చేస్తూ. చివరికీ అతణ్ణి ఆపదవి నుంచి తొలగించి, తరిమివేశారనుకొందాం. అప్పుడేం జరుగుతుంది? ఆ అధికారిని నియమించిన సర్వోన్నతాధికారి వచ్చి, ఉద్యోగులు ఆ అధికారి పట్ల ఎలాఎలా ప్రవర్తించారో విచారించి, వారివారికి తగినట్లుగా అందరినీ శిక్షించి, తిరిగి కార్యాలయాధికారాన్ని ఆ వ్యక్తికి కట్టబెడతాడు. ఇది లోకంలో సర్వసాధారణంగా జరుగుతూ ఉండే, మనకు తెలిసిన విషయం. ఈ లోకరీతినే మరింత విశాలదృష్టితో జగత్తునకంతటికి అన్వయించి చూస్తే, దుర్యోధనాదులు జగద్వ్యాపి ద్రోహకరులుగా శ్రీకృష్ణునిపట్ల సాపరాధు లనేవిషయం మరింత స్పష్టమవుతుంది.

కనుకనే, శ్రీకృష్ణుడు గీతోపదేశ సందర్భంలో అర్జునునితో 'వీరందరూ నాచేత ఇదివరకే హతులయ్యారు, నీవు కేవలం నిమిత్తంగా ఉండి, శత్రువులను జయించి, రాజ్యాన్ని పొందిన కీర్తిని తెచ్చుకో' అని చెప్పాడు.[2]

---

1. ఉద్యోగ - 2 - 318

2. తస్మాత్త్వముత్తిష్ఠ యశో లభస్వ జిత్వా శత్రూన్ భుంక్ష్వ రాజ్యం సమృద్ధమ్ ।
మయైవైతే నిహతాః పూర్వమేవ నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్ ॥

"ద్రోణంచ భీష్మంచ జయద్రథంచ కర్ణం తథాఽన్యానపి యోధవీరాన్ ।
మయా హతాంస్త్వం జహి మా వ్యథిష్ఠా యుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్ ॥"

—భగవద్గీత - 11 - 33, 34

ఇలా పరిశీలించుకొంటూ పోతే, మహాభారతం శ్రీకృష్ణుని అవతార పరమార్థాన్ని నిరూపించే మహేతిహాసమని స్పష్టమవుతుంది. కృష్ణకథాసూత్రానికి కురువంశీయుల చరిత్రలనబడే మణులు కూర్చబడటంచేతనే అది ఒక దివ్యహారంలా రూపొంది "భా - రతం" (ప్రకాశంవల్ల ఆనందాన్నిచ్చేది) అనే అన్వర్థసంజ్ఞను పొందిందని సంప్రదాయజ్ఞులైన పండితులు చెబుతూ ఉంటారు. మహాభారతంలో మౌసలపర్వం చోటు చేసుకోగలిగిందన్నా, హరివంశం ఖిలపర్వంగా పరిగణింపబడుతోందన్నా కృష్ణచరిత్రకు పాండవులచరిత్ర ముడిపడిఉండటాన్ని బట్టే గదా! బలరామకృష్ణులు అవతారం చాలించడమేమిటి కవ్వడి ముక్కుటిమూకలనుంచి స్త్రీబాలవృద్ధుల్ని కూడా కాపాడలేని నిస్సహాయుడైపోయాడు. కృష్ణునితోడిదే పాండవులబ్రతుకు అని ఎరిగిన మహానుభావుడు వ్యాసమహర్షి, కనుకనే ఆయన కింకర్తవ్యతామూఢుడై తననుచేరి "...తపఃప్రకీర్తనీయ! యింకిట యే నేమి సేయువాఁడ, నెసఁగు దయతోడ నానతి యిమ్ము నాకు" —అని ప్రార్థించిన పార్థునికి ఇలా ఉపదేశించాడు :

"ధరణిభరంబు వాప నవతారము నొందినవిష్ణుఁ డత్తెఱం
గరుదుగ నిర్వహించి యజరామరనిష్కల నిర్వికార భా
స్వర నిజసత్పదంబు నుపశాంతిపరుం డయి పొందె దానికిం
గురుకులవర్య! శోకమునఁ గుందుదు రే మిముబోఁటి బోధనుల్"

"కాలమూలంబు సర్వంబుఁ గాన దీని
కొండు తలఁపులు దక్కి మీ రుత్తమంపు
గతికిఁ జనుఁడు నిశ్చింత వికారతనులు
విడిచి యార్యజనంబులు వినుతిసేయ"[1]

శ్రీకృష్ణుని జగద్వ్యూహంలో పాత్రధారులుగా దిగివచ్చిన పాండవులు సూత్రధారుని నిష్క్రమణంతో తమవంతుపాత్ర ముగిసినట్లేనని తెలుసుకొని మహాప్రస్థానానికి తరలివెళ్ళిపోయారు.

ఇదీ పాండవుల జీవితాలు శ్రీకృష్ణునితో ముడిపడిఉన్న తీరు!

1. మౌసల - 219 - 222

## 4. ద్యూతం ఛలయతామస్మి......

భగవానుడు తన దివ్యవైభవాన్ని అర్జునునికి వివరిస్తూ భగవద్గీతలో "ద్యూతం ఛలయతామస్మి"[1] అనిచెప్పాడు. 'వంచకమైన విద్యల్లో నేను జూదాన్ని' - అని దీనిభావం.

జూదమూ, పాచికలూ మొదలైన వానివల్ల మన్యువు అన బడే రుద్రతత్త్వం ఉద్దీపిత మవుతుంది. మన్యువు అంటే పట్టుదల. ఇది కార్యసాధనకు ఆవశ్యకమైన విభూతుల్లో ఒకటి.[2] కనుక మన్యువు అనబడే ఈ లక్షణం పెంపొందడానికి జూదం ఒకక్రీడగా రూపొందించ బడి, ఉత్తములైన వారిచేకూడా ఆదరించబడుతోంది. అయితే, ఒకో సారి ఈ ద్యూతాసక్తి విపరీతమై, వివేకం నశించి, వ్యక్తులు పతన మయ్యే అవకాశం కూడా ఎంతోవుంది. అది దుష్టమైన సంస్కారాలు కలవారి విషయంలో! అటువంటివారు ఎలాంటి అకార్యాలకైనా పాల్ప డతారు. అందువల్ల సప్తవ్యసనాల్లో ద్యూతంకూడా ఒకటిగా పరిగ ణింపబడుతోంది. వ్యసని అయినవాడు తీసుకొనే నిర్ణయాలుగాని, చేసే కార్యాలుగాని వివేకవంతులెవ్వరూ ఆమోదించరు. ఇది లోకరీతి.

రాజసూయానంతరం పాండవవైభవానికి తట్టుకోలేకపోయిన దుర్యోధనుడు ఏవిధంగానైనాసరే పాండవ శ్రీని అంతటినీ అపహరిం చాలనే నిశ్చయానికి వచ్చాడు. శకుని అతని అవస్థను గ్రహించి ఉపాయం చెప్పాడు.

"భానుప్రభు లగు పాండుసు
తానాథాత్మజులలక్ష్మియెల్లను నీకున్
నే నపహరించి యిత్తు ధ
రానుత! మాయాదురోదరవ్యాజమునన్"[3]

---

1. భగవద్గీత - 10 - 36
2. మంత్రగీత - కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్య, పుట - 245
3. సభా - 2 - 122

సూర్యునివంటి తేజస్సు కలిగిన పాండవుల సంపదలను శకుని తాను వంచనతో కూడిన జూదం నెపంగా అపహరించి యిస్తానని మాటిచ్చాడు.

అయితే, ధర్మరాజు అంత తేలికగా జూదానికి వస్తాడా? భీష్మాదులు అటువంటి మోసపు జూదానికి అంగీకరిస్తారా? తమ ఆటలు సాగాలంటే గ్రుడ్డిరాజును అడ్డుపెట్టుకోక తప్పదువారికి.

శకుని దుర్యోధనులు ధృతరాష్ట్రుని దగ్గరకు వెళ్ళి వేయవలసిన వేషాలన్నీ వేసి, ఆడవలసిన నాటకమంతా ఆడారు. కడమాటగా దుర్యోధనుడు తండ్రితో

"దీని గొంతబడు మొడఁబడవేని నేఁడ
యీక్షణమ సర్వభక్షుచే భక్షితుండ
నగుదుఁ దెల్ల మే నట్లైన వగపుదక్కి-
విదురుఁడును నీవు నుండుఁడు ముదముతోడ."[1]

అంటూ కాళ్ళుపట్టుకొని చిన్నపిల్లవానిలా మారాంచేశాడు.[2]

ఉచితం కాదని లోపల అనిపిస్తున్నా ధృతరాష్ట్రునికి కొడుకు మాటకు ఒప్పుకోక తప్పలేదు.[3] పుత్రపాశ మటువంటిది మరి! ఆ తరువాత కథను ధృతరాష్ట్రుడే నడిపించాడు.

పాండవులు వివేకులుగదా! జూదానికి ఎందుకు అంగీకరించాలి అనిపించడం సహజం.

వారు వివేకులు గనుకనే అంగీకరించారు.

ధర్మజునికి ధృతరాష్ట్రునిపట్ల పితృభావం ఉంది. అతని ఆజ్ఞ పాలించాలనే వ్రతం ఒకటేఉంది. అంతకుమించి విదురునిపట్ల ఆతనికి గల ప్రమాణబుద్ధి ప్రత్యేకించి ప్రశంసింపదగింది.

1. సభా - 2 - 127

2 "...దుర్యోధనుండు దండ్రిపాదంబులపయింబడి మ్రొక్కి యీ శకుని మతంబున కొడంబడవలయుననిన..." సభా - 2 - 123

3. "...ఎద నది యుచితముగా, దని వగచుచు నాత్మజునకు నాహ్లాదముగాన్" సభా - 2 - 128

"..............................

లాలితాపూర్వసభాలోకనంబున
యందు జూదంబు కార్యంబె చెపుమ?
జూదంబుకతమున భేదంబు గా కుండ
నేరదు మాలోన నీనియోగ
మనఘ! మా కలంఘ్య మయినట్లు ధృతరాష్ట్రు
పనుపుసేయ నీకుఁ బాడి యదియ
యనుచు విధి నియుక్తుఁడయి యప్డు విదురుతో
నేఁగ నిశ్చయించె నిందుకులుఁడు."1

నూతనంగా నిర్మించిన సభాభవనాన్ని చూడటానికి రావలసిందిగా ఆహ్వానిస్తూ విదురుణ్ణి పంపాడు ధృతరాష్ట్రుడు. విదురుడు పాండవపక్షపాతి అని కౌరవులకు అందరికీ తెలుసును. అతడినే పంపాడంటే అర్థం అతనిపట్ల పాండవులకు గల ప్రమాణబుద్ధినిబట్టి అతని మాటను పాండవులు కాదనరనే గదా!

దుష్టమైన కౌరవుల ఆంతర్యం తెలిసీ విదురుడాపనికి ఎందుకు అంగీకరించాలి? రాజాజ్ఞ కనుక పాటించక తప్పదనా? పోనీ, అతడు పాండవులచేత ఆ ఆహ్వానాన్ని తిరస్కరింపజేయవచ్చునే! దుర్యోధనాదుల కుత్సితబుద్ధిని పాండవులకు తెలుపకుండానే అతడు వారినితోడ్కొని వస్తాడా? —ఇన్నిటికీ సమాధానం ధర్మరాజు విదురుణ్ణి ఆశ్వాసిస్తూ చెప్పినపై మాటలే.

'నీ నియోగం మా కెలాఅలంఘ్యమో, ధృతరాష్ట్రుని ఆజ్ఞను పాటించడం నీ కలా తప్పనిది. ఇందులో నీవు బాధపడవలసింది లేదు. నీధర్మం నీవు నిర్వర్తించావు ('నీకుఁ బాడి యదియ'). అపూర్వమైన ఆ సభాభవన సందర్శన సందర్భంలో జూదం మాత్రం కూడనిది. దాని

1. సభా - 2 - 157

వల్ల మా మధ్య విరోధం తప్పదు' —అంటూనే ధర్మరాజు 'విధినియుక్తుఁడై' విదురుసితో వెళ్ళడానికి నిశ్చయించాడని మహాకవి వాక్కు. విధి అనుల్లంఘనీయంగదా! దానికి తలఒగ్గడానికి పాండవులు నిశ్చయించుకొన్నారన్నమాట! విధి ధృతరాష్ట్రునిద్వారా తమకర్తవ్యాన్ని నిర్దేశిస్తోందని పాండవులు గ్రహించారు. పాండవులేకాదు, విదురుడూను.

"అవిలంఘనీయ మీ దు
ర్వ్యవసాయం బనుచు సత్యవచనుఁడు ధర్మా
ర్థ విదుం డప్పుడు ధృతరా
ష్ట్రవిధాతృనియోగమున కొండంబడి యె మదిన్"[1]

పాండవులను ఏదోవిధంగా ప్రాభవశూన్యులుగా చేయడమే దుర్యోధనుని లక్ష్యం. తిన్ననైన మార్గంలో చేయడానికి అతనికి నమ్మలులేవు. "యాదవుచేతిచక్రము భయంకరమై శిశుపాలమస్తకచ్ఛేదము సేసిన ..."[2] దృశ్యం అతని గుండెల్లో ముద్రవేసుకొని ఉండిపోయింది. కనుక అతనికి కపటోపాయమే ఉపాదేయమైంది. ధర్మజుని సత్యనిష్ఠా, ఋజుత్వమూ, ధర్మబద్ధతా, తనతండ్రిపట్ల అతనికిగల గురుత్వమూ—ఇన్నిటినీ 'సొమ్ము చేసుకోవా' లనుకున్నాడు, దుర్యోధనుడు. 'నువ్వు ద్యూతప్రియుడవూ, దక్షుడవూ' అంటూ ముందరికాళ్ళకు బంధంవేస్తూ, ధర్మజుణ్ణి జూదానికి ఆహ్వానించాడు. కానీ ధర్మరాజు మొహమాటపడకుండా స్పష్టంగా ఇలా చెప్పాడు:

"క్షత్రనీతిక్రమంబులుగావు సూవె
నికృతియును జూదమును ధర్మనిత్యులైన
వారి కీరెండు వర్జింపవలయు నెందుఁ
బాపవృత్తంబు జూదంబు పార్థివులకు."

1. సభా - 2 - 154

2. సభా - 2 - 97

"కుటిలమార్గు లయిన కుత్సితకితవుల
తోడఁ గడఁగి జూదమాడఁ జనదు
దానఁ జేసి యర్థధర్మ వివర్జితు
లగుదు రెట్టివారు జగములోన."

'మఱియు మాయాద్యూతంబున జయించుట మహాపాతకంబనియును ధర్మద్యూతంబున జయించుట ధర్మయుద్ధంబున జయించు నంతియ పుణ్యం బనియును నసితుండయిన దేవలుండుసెప్పె......"[1]

"మోసమూ, జూదమూ అనేవి క్షత్రనీతికి తగినవి కావు, ధర్మపరులైనవారు వానిని వర్జించాలి. రాజులైనవారికి జూదం పాప హేతువు. సుహృద్ద్యూతం సంగతి అలాఉంచితే, దుర్మార్గులూ, కపటులూ అయిన జూదరులతో అసలు జూదమాడనేకూడదు. ఆడితే అర్థమూ, ధర్మమూ కూడా నశిస్తాయి. ఒకవేళ జూదంలోనే జయించి, సంపదలు పొందదలిస్తే, ధర్మం ప్రకారం ఆడి గెలవాలేగానీ మాయా ద్యూతంలో గెలవడం మహాపాతకమవుతుంది." —ధర్మజుని ఈ మాట ల్లో – 'నాకుగా జూదమాడటం ఇష్టంలేదు. నువ్వు నన్ను మోసంచేసి జయించాలని చూస్తున్నట్లున్నావు. దానివల్ల సర్వసంపదలూ, ధర్మమూ పోతాయి సుమా! మాయా ద్యూతంలో జయించడమంటే మహాపాత కానికి ఒడిగట్టుతున్నావన్నమాటే!' –అనే హెచ్చరిక స్పష్టంగాఉంది.[2]

శకుని కల్పించుకొని, జూదాన్ని నిందించరాదంటూ ధర్మజుణ్ణి కవ్విస్తున్నట్లుగా మాట్లాడాడు.[3] అతడు మరొక్కమాట కూడా అన్నాడు:

---

1. సభా - 2 - 167, 168, 169
2. "...మీరు కుటిల మార్గులు, కుత్సితకితవులు. నేనెంత ద్యూతప్రియుఁడనయ్యు మీతో నాడుట తగదు. దీనివల్లనే నర్థధర్మవివర్జితుఁడ నగుదును' అను ధర్మజుని భావమిట వ్యంగ్యము. ఈ యధిక్షేపణము సూటిగాఁబోయి శకునికిఁ దగిలినది..."
—భారతధ్వనిదర్శనము, పుట - 335
3. సభా - 2 - 169, 171

'మేం నీఅంత బలవంతులంకాము, బలహీనులు బలవంతుల్ని జయించేటప్పుడు అనేకమాయలు చేయడం అంతటా ఉన్నదే, (ధర్మం అధర్మం సంగతి వదిలేయ్–) జయమే కదా కర్తవ్యం!'[1]

అంటే, మాకు కావలసింది నీసంపదలే. ధర్మాధర్మాలతో నిమిత్తంలేదు– అని కౌరవుల పక్షాన శకుని ప్రకటించాడన్నమాట.

ఇంతగా తెగించినవారికి ఎవరుమాత్రం ఏం చెప్పగలరు?[2]

దుర్యోధనునికి బదులుగా శకుని ఆడబోతున్నప్పుడు "అన్యుల కయి యన్యులు జూనంబాడుట యెంతయు విషమంబు" అని ధర్మరాజు అభ్యంతరం తెలిపినా పట్టించుకొనేవారే లేకపోయారు.ఆ సభలో.

"బలవద్ద్యూతార్థముగాఁ
బిలువంబడి మగుడ నగునె పెక్కులు పలుకుల్
వలుకంగ నేల యని య
త్యలఘుఁడు ధర్మజుఁడు జూదమాడఁ గడంగెన్."[3]

---

1. "బలహీను లయినవారలు
బలవంతుల నోడుచునపుడు బహుమాయల న
చ్చలమునఁ జేయుట యెందును
గలయదియ జయంబకాదె కర్తవ్యమిలన్" సభా - 2 - 170

2. "ఈ శకుని వాక్యములలో ధర్మజుని వెక్కిరించు వైఖరియు నాతఁడు జూదమాడక తప్పనిపరిస్థితిని గల్పించుయత్నమును బ్రతీయమానములగును.......ధర్మజుఁడు తప్పించుకొనుట కింక నవకాశములేదు. దీనిపై నగ్ని కాజ్యాహుతివలె 'జూదంబున కే వోడుదేని యుడుగు' మనియు శకుని పల్కెను. ధర్మజుఁడిట్లు ద్యూతక్రియకు బద్ధుఁడు కావలసివచ్చునేర్పాటును వ్యంగ్యముగా శకునిచేసెను."
భారతధ్వనిదర్శనము, పుటలు - 335, 336.

3. సభా - 2 - 172

విదురుడు మొదటినుంచీ జూదంవద్దని చెబుతూనేవున్నా, ధర్మరాజు సంపదలన్నీ కోల్పోయినప్పుడు ప్రత్యేకించి ధృతరాష్ట్రుని వద్దకువెళ్ళి మరొక్కసారి హెచ్చరించాడు— 'నీ కొడుకు కారణంగా నీ వంశం మొత్తం పాపభూయిష్ఠం కాబోతుంది. నీకు నీ బిడ్డలొకటే, పాండవులొకటీ కాదుగదా! అర్జునునికి చెప్పి దుర్యోధనుణ్ణి నిగ్రహింపజెయ్యి! దానివల్ల నీ కులానికీ, భూప్రజకూ క్షేమం కలుగుతుంది. కనీసం ఇంతటితోనన్నా ఈ జూదాన్ని వారించు' అంటూ.[1]

ధృతరాష్ట్రుడు ఆ మాటలు వినిపించుకోలేదు. తాత్కాలికంగా అతనికి చెవుడుకూడా వచ్చిందో ఏమో!

పాండవ శ్రీనిలపహరించడంతో కౌరవులు ఆగివుంటే కథ ఎలా ఉండేదో ఊహించలేం.

జూదంవల్ల అర్థధర్మాలు కోల్పోవడం జరుగుతుందని ధర్మస్వరూపుడైన ధర్మరాజు చెప్పినట్లుగా చూశాం. విచిత్రం ఏమిటంటే ఈ మాయ జూదంవల్ల పాండవులు కోల్పోయింది అర్థాన్నే. మరి కౌరవులో? వారు ధర్మచ్యుతిచెంది, "పెక్కుభంగులు గదా వివేకభ్రష్ట సంపాతముల్!" అన్నట్లుగా మానవత్వాన్ని గూడా మరచిపోయే హీనాతిహీనమైన స్థితికి దిగజారిపోయారు.[2]

ఆ తర్వాత జరిగిన ద్రౌపదీ పరాభవం మహాభారత గాథలో ముఖ్యాతిముఖ్యమైనది. ఇది సన్నివేశానుసారం అనుకోనివిధంగా అప్పటికప్పుడు జరిగిపోయిందే కానీ నిర్ణీత పథకంతో నడిచింది ఎంతమాత్రమూ కాదు (only incidental - not pre-planned). ఆ సందర్భంగా అరిష్టసూచకాలైన మహోత్పాతాలనేకం పొడకట్టాయి. ధృతరాష్ట్రుడు

1. సభా - 2 - 179 నుంచి 184

2. ఈ ఘట్టం మరో అధ్యాయంలో విశ్లేషించబడింది.

భయపడిపోయి, ద్రౌపదిని మహాపతివ్రతగా ప్రకటించి, చేసినదానికి పరిహారంగా పాండవుల రాజ్యం పాండవులకు ఇచ్చివేసి, లెంపలుగట్టిగా వాయించుకున్నాడు.

కానీ, కురుసభలో ద్రౌపదికి జరిగిన పరాభవం కేవలం నిస్సహాయురాలైన ఒక కులసతికి జరిగిన అవమానం కాదు.

ధర్మజుడు దిగ్విజయంచేసి, రాజసూయం నిర్వహించడంతో భూమండలానికంతటికీ సార్వభౌముడయ్యాడు. అతనికి ధర్మపత్ని ఐన ద్రౌపది యావత్సామ్రాజ్యానికీ మహారాజ్ఞి.

కనుక, బంధుత్వాన్ని పురస్కరించుకొని దుర్యోధనాదులు ఆమెకు చేసిన మహాపచారము ఎంత వ్యక్తిగతమందామనుకున్నా అది అంత జాతీయం కూడాను. అంటే, వ్యక్తిగా ఆమెకు వారుచేసిన అపచారం ఒక చక్రవర్తి భార్యకు, యావజ్జాతీ మహాసామ్రాజ్ఞిగా గుర్తించిన ఒక మహోన్నత స్త్రీ మూర్తికి చేసినద్రోహమన్నమాట!

కృష్ణుడు దివ్యత్వంతో సమయానికి ద్రౌపదిని ఆదుకోవడం గానీ, విదురుడు జరుగుతున్నది ఘోరమైన అధర్మం అని ఘోషించడం గానీ పాండవపక్షపాతంతో చేశారనడానికి వీల్లేదు. వారిద్దరూ ధర్మపక్షపాతులు. వారికి జాతియావత్తూ 'మహాయిల్లాలుగా' పూజించుకొనే సాధ్వీమణిని అవమానించడం ఎంతటి తీవ్రమైన పరిణామానికి దారి తీస్తుందో తెలుసు. కనుకనే వారు ఆ దురదృష్టకరమైన సన్నివేశాన్ని యథాశక్తి వారించారని గమనించాలి.

ఆ సందర్భంలో భీముడు ఆవేశపూరితుడై భీషణమైన ప్రతిజ్ఞలు చేశాడు. ధృతరాష్ట్రుడు సమయానికి తగినట్లుగా కోడలి గుణాలకు, ధర్మజ్ఞతకు మెచ్చుకొంటున్నానంటూ పాండవులను

ఇంద్రప్రస్థంలో పునఃప్రతిష్ఠించడంతో కౌరవులకు అప్పటికి భీమునివల్ల ప్రమాదం తప్పింది. కానీ, దుర్యోధనుడు తండ్రిని భయపెట్టి[1] అను ద్యూతాన్ని కల్పించి, పాండవులను ఓడించి, వారి రాజ్యాన్నీ, సర్వ సంపదలనూ వశపరచుకొని, నిర్దాక్షిణ్యంగా వారినిఅడవులపాలుచేశాడు.

ఈవిధంగా కౌరవులు తమపతనానికీ, వంశనాశనానికీ తామే కారణభూతులవ్వడమే కాకుండా, మహాజనక్షయ కారకులు కూడా అయ్యారు.

అయితే ఇదే ద్యూతం పాండవులపై ఏవిధమైన ప్రభావాన్ని చూపిందో తరువాతి అధ్యాయంలో చూద్దాం.



1. "...ఆశీవిషంబుల నలిగించి కంఠసమీపంబున విడుచునట్లు విడిచిపుచ్చి కర్జంబు దప్పితిమి." "...లావు రణంబులో మన కలంఘ్య బలాఢ్యుల నింక నోర్వఁగాన్"
సభా - 2 - 272, 273.

## 5. యథా దీపో నివాతస్థో...

ఈనాడు ప్రపంచంలో అత్యధిక సంఖ్యాకులచే ఆరాధించబడుతున్న ఏసుప్రభుని జీవితంలోనికి ఒకసారి ప్రవేశిద్దాం. ఆయన తాను సర్వశక్తిమంతుడైన దేవునికుమారుడనని చాటుకొన్నాడు. అనేకమైన మహిమలు ప్రదర్శించి తన దివ్యత్వాన్ని నిరూపించుకొన్నాడు.[1] అలాంటిప్రభువు స్వార్థపరులైన పరిసయ్యులు, ధర్మశాస్త్ర బోధకులు, ప్రధాన యాజకుల కుట్రకు బలయిపోయాడు. హేరోదు, పిలాతులు ఆయన నిరపరాధి అని తెలిసికూడా ఆయన్ని రక్షించలేకపోయారు. జనసమూహం పచ్చినెత్తురుత్రాగే బరబ్బాను అయినా క్షమించగలిగారుగానీ ఏసును మాత్రం వదలటానికి అంగీకరించలేదు. సిలువవేసే వరకూ వారు గొడవ చేస్తూనే ఉన్నారు.[2]

అంతటి మూర్ఖజనాల్ని బలిదానం ద్వారా మార్చవలసిందే గానీ మరొక మార్గం లేదని ఏసు గ్రహించాడు. కనుకనే, భగవన్నిర్దేశానుసారం సిలువపై తన రక్తాన్ని చిందించడానికి సిద్ధపడ్డాడు.

---

1. "Then said they all, Art thou then the Son of God? And he said unto them, Ye say that I am." St. Luke 22:71
"And there came a voice out of the cloud, saying, This is my beloved Son : hear him" —St. Luke 9:36

2. 20. Pilate therefore, willing to release Jesus, spake again to them.
21. But they cried, saying, Crucify him, crucify him.
22. And he said unto them the third time, Why, what evil hath he done? I have found no cause of death in him : I will therefore chastise him, and let him go.
23. And they were instant with loud voices, requiring that he might be crucified. And the voices of them and of the chief priests prevailed.
24. And Pilate gave sentence that it should be as they required.
25 And he released unto them him that for sedition and murder was cast into prison, whom they had desired; but he delivered Jesus to their will." St. Luke 23

తాను పట్టుబడటానికి కొద్దిసేపటిక్రితం ఏసు ఒలీవకొండపైకి వెళ్ళి, “తండ్రీ!... నీ చిత్తమే జరుగనీ” అంటూ ప్రార్థించాడు. ఆయన తనకు ఎంతవేదన కలిగితే అంత తీవ్రంగా ప్రార్థించాడేగాని నిర్ణయాన్ని మార్చమనిగాని, బాధను తొలగించమనిగాని పరలోకంలోని తనతండ్రిని ప్రార్థించలేదు.[1]

నిర్దోషిగా తానంతటి శిక్షను అనుభవిస్తూ కూడా ఆ క్షమామూర్తి “తండ్రీ! వీళ్ళను క్షమించు, వీళ్ళేం చేస్తున్నారో వీళ్ళకు తెలవదు.” అంటూ ప్రార్థించాడు గానీ ఎవ్వరినీ తప్పుపట్టలేదు. ప్రేమ సామ్రాజ్యాన్ని భూమికి అవతరింపజేసిన త్యాగమూర్తి ఏసుప్రభువు. ఆయన తన త్యాగంతో తనను నమ్మినవారి పాపాలను. పశ్చాత్తప్త లయినవారి హృదయాలను ఇప్పటికీ ప్రక్షాళనం చేస్తూనే ఉన్నాడు.

ఏసు జీవితంలోని ఈ ఆత్మత్యాగ ఘట్టంతో పోల్చదగిన ఘట్టమే పాండవుల జీవితంలోనూ వచ్చింది. అదే కురుసభలో వారి పరాభవ సన్నివేశం!

కురుసభలో పరీక్షకు పెట్టబడింది పాండవుల పరాక్రమం, బాహుబలమూ కాదు-వారి ధర్మదీక్ష!

---

1. 41. And he was withdrawn from them about a stone's cast, and kneeled down, and prayed,
42. Saying, Father, if thou be willing remove this cup from me; nevertheless not my will, but thine, be done.

—St. Luke - 22
The Holy Bible

"Christ performed his greatest miracle when he allowed himself to suffer on the cross, saying" Father, forgive them; for they know not what they do, (Luke : 23:34). He could have retaliated with spiritual power and saved himself. His victory has immortalised him as an example for the ages. If he was able to overcome his mortal consciousness to express divinity, other men can do the same." —Man's Eternal Quest, 1983, page 295-296

దైవమానుష సంపదల పేర్మితో సామ్రాజ్యాభిషిక్తుడైన ధర్మజునితో ముఖాముఖి తలపడలేకనే దుర్యోధనుడు అపమార్గాలు పట్టాడు. అతని మేనమామ శకుని దాపరికం లేకుండా ఈ విషయాన్ని నిండుసభలో అంగీకరించాడు. అంతేకాదు, మోసం చేసైనాసరే, జయించడమే ముఖ్యమనికూడా చాటుకున్నాడు.

'మేము నిన్ను ఓడించడమే ప్రధానంగా పెట్టుకొన్నాం. ఎన్నిమోసాలైనా చేస్తాం. నువ్వు సహిస్తావా? లేక, మోసానికి మోసమే సమాధానమని నీ దీక్షను ప్రక్కకుపెట్టి మాతో సమాన మవుతావా?' —అన్నది శకుని మాటల్లో వ్యక్తమయ్యే కవ్వింపు!

ధర్మంకోసం దుష్టకౌరవులు ఎన్ని బాధలు పెట్టినా భరించక తప్పలేదు ధర్మజాదులకు.

ధర్మాన్ని రక్షిస్తే అది మనలను రక్షిస్తుంది— అని మనస్మృతి చెబుతోంది.[1] కనుకనే వారు కౌరవులవైపు చూడకుండా ధర్మంవైపు చూశారు. ఈ సందర్భంగా ద్రౌపది సభ నుద్దేశించి పలికిన మాటలు స్మరింపదగినవి :

"అనుపమదైవయోగహతుఁ డయ్యు నవశ్యము ధర్మసంపదం
దనకునకాని ధర్మజుఁడు ధన్యుఁడు ధర్మపథంబు తప్పఁ ద్రో
క్కునె? కురువృద్ధులార! భృశకోపనుఁ డీతఁడు నన్ను నేల దు
ర్జనుఁ డిట యీడ్చి తెచ్చె నవిచారపరుండయి దుర్మదంబునన్"[2]

దైవయోగహతుడైనా సరే ధర్మరాజు ధర్మపథాన్ని వీడడని ఆమె స్పష్టంచేసింది. అంటే, పాండవులు ధర్మానికి కట్టుబడి ఊరకుండిపోయారేగానీ చేతకాకమాత్రం కాదు, మరి, మీమాట ఏమిటి? మీ ధర్మాన్ని మీరు పాటించి అధర్మాన్ని అడ్డుకోవద్దా?— అన్నది ఆమె ప్రశ్న.

1. ధర్మఏవ హతో హంతి ధర్మో రక్షతి రక్షితః ।
తస్మాద్ధర్మో న హంతవ్యో మా నో ధర్మో హతోఽవధీత్ ॥" -మనుస్మృతి-8-15
2. సభా - 2 - 218

ఎవ్వరూ ముందుకి వచ్చి అడ్డుకోలేదు.

కనుకనే ఆమె నిశ్శంకంగా "...ధర్మసంవిదులననున్న యీ భరతవీరుల వంశము నేఁ డధర్మసంపద నతినింద్యమయ్యె" నని ఎలుగెత్తి చాటింది.[1]

ద్రౌపదిని పణంగాపెట్టి ఓడినందుకు, ఆమె స్థితినిచూసి బాధపడిన భీముడు ధర్మజుణ్ణి నిందించాడు.

"శకునికైతవం బెఱింగియుం బాపద్యూతంబునఁ బ్రవర్తించి యధర్మ ప్రవృత్తుండవయితి కావున భవద్బాహుదాహంబు సేయవలయు..." నన్నాడు.

అప్పుడతణ్ణి వారిస్తూ అర్జునుడు—

"ధర్మతనూజుండు ధర్మువు దప్పిన
ధరణీతలం బెల్లఁ దల్లడిల్లుఁ
దగిలి సుహృద్ద్యూత ధర్మయుద్ధములకుఁ
బరులచేఁ బిలువంగఁబడి విభుండు
గడఁగక విముఖుండు గాఁ జన దని శుభ
ఖ్యాతిధర్మంబు లోకంబులందు
నిలిపెఁ దా నిది పతినేరమియే దైవ
వైపరీత్యంబైన వనటఁ జగునె?
గురుల ధర్మపరులఁ గోపించి ధీరు ల
తిక్రమింతురే తదీయనిత్య
ధర్మగౌరవం బధార్మికు లగుచున్న
పరులచేతఁ జెఱుపఁబడియె నిట్లు."[2]

అని పలికాడు. 'ధర్మరాజు ధర్మం తప్పితే భూమి ఇలా నిలబడుతుందా? తల్లడిల్లిపోదూ! నీవు ధీరుడివి, ఆవేశపడి, ధర్మపరుడైన పెద్దవానిమాట

1. సభా - 2 - 219
2. సభా - 2 - 223, 224

అతిక్రమించరు. ధర్మజుని అధర్మప్రవృత్తివల్ల మనకీకష్టం రాలేదు; అతని ధర్మగౌరవాన్ని అధార్మికులైన కౌరవులు చెరచబట్టి వచ్చింది. ఇది దైవంవల్ల కలిగిన వైపరీత్యమని గుర్తించుకో. దానికింత బాధ పడటం దేనికి?" —అని అతని మాటల సారాంశము.

ఏదైనా ఒక పోరామి వచ్చినప్పుడు ప్రసన్నచిత్తంతో దానిని దాని మానాన పోనివ్వాలి. కలవరపడిగాని, దుఃఖపడిగాని ప్రవర్తిస్తే ఆ సన్నివేశం మరింత క్లిష్టం అవుతుంది. దారం చిక్కుపడ్డప్పుడు ఓపికతో చిక్కును విప్పుకోవాలే గానీ చీకాకుపడి అటూ ఇటూ లాక్కుంటే ఏం ప్రయోజనం? మరింత చిక్కులుపడుతుంది, తెగిపోతుంది. అలాగే, సముద్రపు కెరటంలా సన్నివేశం విరుచుకు మీదపడుతున్నప్పుడు ఒడుపుగా వెనుదిరిగి నిలబడాలేగానీ గాబరాతో గంతులు వేయకూడదు. అప్పుడది సులభంగా దాటిపోవడమే కాక, మనల్ని గట్టు మీదికి విసిరిపడవేసి వెళ్ళిపోతుంది. ఈ సత్యాన్ని దృష్టిలో పెట్టుకుంటే అర్జునుడు ఆవేశపడిన చిన్నన్నగారిని ఎంతచక్కగా అదుపులో పెట్టడానికి యత్నించాడో అర్థమవుతుంది.

"దుఃఖేష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః ।
వీతరాగభయక్రోధః స్థితధీర్మునిరుచ్యతే ॥"[1]

అని భగవానుడు స్థితప్రజ్ఞుని లక్షణాలు నిర్దేశించాడు. దుఃఖములపట్ల ఉద్విగ్నంకానిమనస్సూ, సుఖములపట్ల విగతస్పృహా, రాగభయక్రోధాలకు అతీతంగా ఉండటం స్థితప్రజ్ఞుని గుణాలు. ఇవి ధర్మజునిలో నూటికినూరుపాళ్ళూ ఉన్నాయి.[2] అంతేకాదు, ద్రౌపదీ పాండవుల మనస్సులు ఆ సన్నివేశంలో ఎంతో నిర్మలంగా ఉండటంవల్ల వారికి

1. భగవద్గీత - 2 - 56

2. "యదృచ్ఛాలాభసంతుష్టో ద్వంద్వాతీతో విమత్సరః ।
సమః సిద్ధావసిద్ధౌ చ కృత్వాఽపి న నిబధ్యతే ॥" (భగవద్గీత - 4 - 22) అనే స్థితికి ధర్మరాజు పరమోదాహరణము.

అనావశ్యకమైన దుఃఖం కలుగకపోగా, వారిబుద్ధి పరమాత్మయందు పర్యవసించింది.[1] కనుకనే వారికి భౌతికంగా ఏమూలనుంచీ ఎలాంటి సహాయమూ అందకపోయినా 'దైవమే దిగివచ్చినట్లుగా' ద్రౌపదికి అఖండ వస్త్రప్రాప్తి జరిగింది.

అటు ఆమె పాతివ్రత్యం, ఇటు శ్రీకృష్ణుని సాధుపరిత్రాణ ప్రవణతా లోకానికి ప్రకటితమయ్యాయి.

ధర్మంకోసం ఎవరునిలబడతారో వారికోసం దైవం దిగివస్తాడన్న సత్యం మరొక్కసారి ఆవిష్కరించబడింది.

సత్యంపట్లా, ధర్మంపట్లా ఏమాత్రమూ విశ్వాసంలేని, ఆసురీగుణసంపన్నులైన[2] దుర్యోధనాదులు, పాండవుల సత్యనిష్ఠా, ధర్మదీక్షా, దైవభక్తీ బలహీనతలుగా భ్రమించి, ఆ గుణాలను పురస్కరించుకొనే వారిని నిస్సహాయులుగా చేసి, విజృంభించబోయారు. కానీ సత్యధర్మాలకు శరణాగతులైన పాండవులు తమద్వారా దివ్యవైభవం ప్రకటితమయ్యేలా ఎంతోనిగ్రహాన్ని ప్రదర్శించి, లోకానికి ఆదర్శప్రాయులయ్యారు.

గాలివీచనప్పుడు దీపం చలించకుండా స్వస్వరూపంతో ఎలా ప్రకాశిస్తుందో, అలాగే యోగిఅయిన వానికి 'తన' యందు సమస్త ప్రజ్ఞలకూ స్వస్వరూపం ఏర్పడుతుందని భగవద్గీత ఘోషిస్తోంది.[3]

అదుగో, అలాంటి యోగమూర్తులు ధర్మరాజూ, అతని తమ్ములూ, ద్రౌపదీను!

---

1. "ప్రసాదే సర్వదుఃఖానాం హానిరస్యోపజాయతే ।
ప్రసన్నచేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతి ॥" -భగవద్గీత - 2 - 65

2. "దమ్భో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్యమేవ చ ।
అజ్ఞానం చాభిజాతస్య పార్థ సంపదమాసురీమ్ ॥" - భగవద్గీత - 16 - 4

3. యథా దీపో నివాతస్థో నేఙ్గతే సోపమా స్మృతా ।
యోగినో యతచిత్తస్య యుఞ్జతో యోగమాత్మనః ॥" - భగవద్గీత - 6 - 19

శ్రీకృష్ణుడు, అర్జునుడు కృతాస్త్రుడై, దేవకార్యం తీర్చి విజయుడై తిరిగి వచ్చినందుకు ధర్మరాజును అభినందిస్తూ,

"...............................
నీధర్మనిష్ఠయు నీతపంబును జూవె
యింతకుఁ గారణం బిద్ధచరిత!
రాజ్యంబుకంటెను రాజేంద్ర! ధర్మంబ
యిష్టమై పరఁగు నీకెల్లనాఁడు
..............................."

అంటూ ప్రశంసించి,

"దమమును సత్యయుక్తియును ధైర్యనిరూఢియు నిత్యతృప్తియున్
శమమును నీకు నైజములు సన్మతి నర్థవశంబుఁ గామలో
భములును బొంద వట్లగుటఁ బార్థివకుంజర! ధర్మరాజనా
మమునఁ ద్రిలోకపూజ్యమహిమం బొగ డొందెద వెల్లకాలమున్"[1]

అని జోహారులర్పించాడు.

కృష్ణుడు వాకొన్నట్లుగా లోకంలో విఖ్యాతక్షాంతులయిన ధార్మికులు ఎంతమంది లేరు? కానీ, ద్యూతవ్యాజ్యాన సభలో దుర్యోధనుడు దుర్నీతితో చేసిన ఆ పాపాలను సహించగలిగిన 'నిష్కంప ధైర్యోన్నమచ్చేతస్సారము'[2] మాత్రం వారిలో ఏ ఒక్కరికీ ఉండదన డంలో సందేహంలేదు. ఆ విషయంలో ధర్మజునికి ధర్మజుడేసాటి, అతని సోదరులూ ద్రౌపదీ వారికివారే సాటి!



1. ఆరణ్య - 4 - 154, 155
2. ఆరణ్య - 4 - 157

# అధ్యాయం రెండు - ప్రవేశం

1. సంస్కృతాంధ్ర మహాభారతాలు
2. ఐతిహాసిక విశ్లేషణ
3. పరిశోధన ప్రణాళిక
4. ద్రౌపదిపాత్ర పరిశీలనావశ్యకత
5. మహాభారతాఖ్యానంలో ద్రౌపది ప్రాముఖ్యం

# ఆంధ్రమహాభారతము - ద్రౌపది

## — ఒక ఐతిహాసిక విశ్లేషణ

## 1. సంస్కృతాంధ్రమహాభారతాలు

పరిశీలనాంశ ప్రవేశానికి ముందు ప్రాతిపదిక ప్రాయమైన ముఖ్యాంశాల్ని ప్రతిపాదించడం జరిగింది. ఇప్పుడు పరిశీలనకు ఆధారమైన మహాభారత గ్రంథాన్ని గూర్చి స్థూలంగా పరామర్శ చేయబడుతుంది.

కవిత్రయకృతమైన ఆంధ్రమహాభారతం ఈ పరిశోధనకు ప్రధానమైన ఆధారం. ప్రతిపాదితాంశాలకు ఉపబలకంగా అక్కడక్కడా మాత్రమే సంస్కృతమహాభారతం నుంచి కొన్నికొన్ని శ్లోకాలు ఉద్ధృతమయ్యాయి.

జయేతిహాసం వ్యాసునిదనీ, వైశంపాయనుడు ప్రవచించినది భారతమనీ, ఉగ్రశ్రవసుడు శౌనకాదులకు వినిపించినది మహాభారతమనీ, —ఒక అభిప్రాయం;

మహాభారతం మొత్తం వ్యాసవిరచితమేననీ, ఒకరికి ఒకరు చెబుతూంటే విని, మరొకరు ఇంకొకరికి చెబుతున్నట్లుగా వ్రాయడమనేది వ్యాససంప్రదాయమనీ—మరొక అభిప్రాయం; సంస్కృతమహాభారతాన్ని గూర్చి విద్వల్లోకంలో ఉన్నాయి.

కవిత్రయంవారు, సూతుడు శౌనకాదులకు చెబుతున్నట్లుగా ఉన్న మహాగ్రంథం అంతటినీ వ్యాసకృతంగా భావించి ఆంధ్రీకరించారు. ఆంధ్రమహాభారతం 'వినిర్మాణమే'గాని అనువాదంకాదు. సంస్కృతభారతపు వేదగౌరవాన్ని దృష్టిలో పెట్టుకొని, ఆ వేదప్రతిపత్తికి భంగం కలుగకుండా కవిత్రయింవారు రచనచేశారు. నన్నయకంటె కించిత్పూర్వం కన్నడభాషలో పంపకవి రచించిన 'విక్రమార్జున విజయము' (క్రీ.శ 941 ప్రాంతం), రన్నకవి రచించిన 'సాహసవిజయభీమము' (క్రీ.శ 1000 ప్రాంతం) అనే రెండు భారతకథా సంబంధిత గ్రంథాలు వెలు

వచ్చాయి. వీనిలో ఈకవులు మూలకథను తమకు ఆశ్రయమిచ్చిన రాజులకు అన్వయించేలా మార్చుకుని, భారతమహిమను ఎంతవరకు తగ్గించగలరో అంతవరకు తగ్గించివేశారు. ఈ గ్రంథాలు చూశాక నన్నయకూ, తిక్కనకూ వ్యాసహృదయం ఆవిష్కరించబడవలసిన ఆవశ్యకత మరింతగా స్ఫురించి ఉంటుంది. కనుకనే వారు భారతార్థంమీదే దృష్టి పెట్టుకొని రచన సాగించారు.

కవిత్రయంవారి ఆంధ్రమహాభారతముపై ఎంతో పరిశోధన జరిగింది. ఎన్నో విమర్శగ్రంథాలు వచ్చాయి. ఈ కృషి ఇాకా కొనసాగుతూనే ఉంది. ఇప్పటివరకూ నడచిన పరిశీలన స్థూలంగా (i) తులనాత్మకం, (ii) మూలనిరపేక్షం- అని రెండువిధాలుగా ఉందనిచెప్పవచ్చు.

తులనాత్మక పరిశీలనంలో కవిత్రయంవారి భారతం వ్యాస భారతానికి అనువాదమనీ, కనుక మూలంతో పోల్చిచూడవలసిన అవసరం ఉన్నదనీ గుర్తించబడి, ఆ విధమైన తులనాత్మకానుశీలనం చేయబడింది. ఇలా పరిశీలించిన విద్వాంసులందరూ మూలంకంటె ఆంధ్రభారతం కొన్నిచోట్ల సంగ్రహీకరించబడినట్లూ, కొన్నిచోట్ల విపులీకరించబడినట్లూ, కొన్నిచోట్ల భాష్యం చేయబడినట్లూ, ఇంకొన్నిచోట్ల అన్యథాకరించబడినట్లు గమనించారు. యథామూలంగా ఉన్న సన్నివేశాల్ని కూడా వారు ప్రదర్శించారు.

మూలనిరపేక్షకమైన పరిశీలనలు కవితాశిల్పానికీ, పాత్రచిత్రణకూ, భాషాప్రయోగవైచిత్రికీ, ఛందోఽలంకారాది విశేషాలకూ సంబంధించినవి.

ప్రతిపాదితధర్మానికీ, సామాజికతకూ, లోకరీతులకూ, వివిధశాస్త్రసమన్వయానికీ సంబంధించిన అంశాల పరిశీలనం మూలమూ, అనువాదమూ- రెంటి ఆధారంగానూ సాగింది.[1]

---

1. 'తెలుగులో పరిశోధన'లో 'ఇతిహాసాలు-పరిశోధన' శీర్షికక్రింద తెలుగులో మహాభారతంపై వచ్చిన విమర్శక వ్యాసాల వివరాలు ఇవ్వబడినాయి.

కవిత్రియ భారతం గురించి ఎవరేమిచెప్పినా, ఎలాచెప్పినా, ఒక్కవిషయాన్ని మాత్రం అందరూ అంగీకరించారు. అది 'ఆంధ్రమహాభారతం మూలానుసారిగా ఉన్న స్వతంత్ర రచన' అని.

"ఆంధ్రభాషాసతికి భారతకవులు పెట్టినయట్టి యలంకారము మఱియెవ్వరును బెట్టలేకపోయిరనునది యెల్లయెడల నంగీకరింపబడిన విషయమే. ఇది యిట్లగుటకుఁ గారణమేమి యని విచారించుచో, నాదికవులు, ముఖ్యముగా తిక్కనాదులు మూలమగు సంస్కృత గ్రంథమందలి కథను ముక్కకు ముక్కగా నెరవుతెచ్చి తెలుఁగులోఁ బెట్టి యాంధ్రభాషాకన్య కెరువుసొమ్ములు గూర్చినవారుగాక, యాసంస్కృతమహాలఖనినుండి త్రవ్వియెత్తిన బంగారమును దెచ్చికొని, యాత్మీయ ప్రతిభామహాసముద్రమున నుద్భవిల్లిన యమూల్య భావరత్నములతోఁ బొదిగి యప్రతిమానశోభావిరాజమానంబులును, ననిదంపూర్వములు నగు దివ్యాభరణముల నొనర్చి యామె కలంకరించిన వారని తెలియఁ గలదు..........."

—కోరాడ రామకృష్ణయ్యగారు, ఆంధ్రబారతకవితావిమర్శనము, 1929.

"......ఉచితజ్ఞుఁడును రసజ్ఞుఁడునైన నన్నయ భారతము నాంధ్రీకరించునెడ మూలమందలి కొన్ని భాగములను సంగ్రహించియుఁ గొన్నింటిని పెంచియుఁ గొన్నికథలను తాఱుమాఱు సేసియుఁ గొన్నిచోట్ల మూలానుసరణముగాను గొన్ని వర్ణనలఁబూర్తిగా విసర్జించియుఁ గొన్నింటిని నూతనముగాఁ గల్పించియు, ప్రధానకథకు భంగము గలుగకుండ, సర్వవిధముల హృదయంగమముగా నొనర్చి మూలగ్రంథముకంటె భిన్నముగా నుండునట్లు రచించెను......"

—శ్రీ శిష్టా రామకృష్ణశాస్త్రిగారు, విమర్శవ్యాసములు-1940

"......నన్నయగారు భారతకథ మీఁదఁ బ్రధానముగా దృష్టి కలవాఁడు. అందుకనియే "కథాకలితార్థయుక్తి లో నారసి

మేలునా" నని వ్రాసినాడు. భారతకథలోనున్న రమణీయత్వ మాయనకు ప్రధానము. ఆ కథలోని మెలుపులు చూపించుట యాయనకుఁ బ్రధానము. ఆ కథలోని రహస్యము తెత్తిచూపించుట యాయనకుఁ బ్రధానము..."

—విశ్వనాథ సత్యనారాయణగారు,

శ్రీ నన్నయగారి భారతాంధ్రీకరణము-ఆంధ్ర భారతోపన్యాసములు-1969

"....అది స్వతంత్రమైన యనువాదము. అనువాదమయ్యు స్వతంత్రతాగుణశోభితము కాఁజాలుటయే యందలి వైశిష్ట్యము...."

—డా॥ దివాకర్ల వేంకటావధానిగారు,

ఆంధ్రవాఙ్మయారంభదశ, ద్వి. సం. పుట - 526

"...సూక్ష్మదృష్టితోఁ జూచినపుడు వ్యాసుఁడే మరల నొక యవతారమెత్తి తెనుఁగు భారతము 'వినిర్మించి' నాఁడనిపించును. తిక్కన తన 'ఉహామిక'ను బూర్తిగాఁజంపుకొని వ్యాసునిలో లీనమై పోయినాఁడు. తిక్కన యాంతరంగిక శిష్యుఁడును, పరమభక్తుఁడునైన మారన 'నవీన పరాశరసూనుఁడు' అను విశేషణమును దిక్కనకుప యోగించుటలోని గంభీరార్థ మిదియే యని తోఁచుచున్నది."

—నండూరి బంగారయ్యగారు,

తిక్కన - ఉద్యోగపర్వము ఆంధ్రమహాభారతోపన్యాసములు.

"...సంస్కృతాంధ్రభారతములకు విశేషముగా భేదము కనిపించుచున్నందున, కవిత్రియము వారిది యథానువాదము కాక, స్వతంత్రానువాదము, కథానువాదము అని చెప్పవలసివచ్చుచున్నది"
"...భారతార్థమునందే దృష్టిపెట్టుకొని, దానినే ఆంధ్రభారత రూపమున వ్రాసిరి. వా రనువాదకులు కాదు. పరమార్థమును గ్రహించిన నిర్మాణకుశలురు."

—డా॥ కేతవరపు వేంకటరామకోటిశాస్త్రిగారు,

తిక్కన కావ్యశిల్పము, పుటలు - 175, 180-181

"తిక్కన మూలమును అనుసరించిన పట్టులందు గూడ యథాక్షరానువాదముగాక యథోచితానువాదమే సల్పెను. అది భాషాంతరీకరణముగాక భావాంతరీకరణమే యని చెప్పనొప్పును.

—డా॥ నందూరి రామకృష్ణమాచార్య,
తిక్కన - భారతదర్శనము, పుట - 105

"అతఁడు (నన్నయ) సంస్కృతభారతమును ఆధారముగాఁ గొని తన రచనను దాదాపు స్వేచ్ఛగా కొనసాగించెను. కనుక దానిని ఛాయానుసరణమనుట యుక్తము."

—ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు,
సారమతినన్నయ, ప్రథమదర్శనము.

"కవిత్రియకృతమగు నాంధ్రభారతము వేదవ్యాసకృతమగు సంస్కృతమహాభారతమున కనువాదమనుట నిర్వివాదము. కవిత్రయమునఁ బ్రథముఁడగు నన్నయ భట్టారకుఁడు దానిని యథామూలముగా ననువదింపలేదనుటయు నిర్వివాదము...... నన్నయ మూలమునందలి కొన్ని భాగములను సంక్షేపించెను. కొన్నిటిని ప్రపంచించెను. కొన్నిటి నన్యథాకరించెను. కొన్నింటిని త్యజించెను. కొన్నింటిని నూతనముగాఁ గల్పించెను. అతఁడు యథాతథముగా ననువదించిన చోట్లును గొన్ని లేకపోలేదు. సంస్కృతభారతము నాంధ్రీకరించుటలో నన్నయ దానిని బరిష్కరించెను. ఆంధ్రభారతము పరిష్కృత (అలంకృత) మయినది.

డా॥ జొన్నలగడ్డ మృత్యుంజయరావుగారు,
వ్యాసభారతము - నన్నయ పరిష్కారము, పుట-2

"సంస్కృతమునకు అచ్చమైన ప్రతిబింబము ఆంధ్రమహాభారతము. నవీనపరాశరసూన బిరుదాంకితుఁడగు తిక్కనసోమయాజి తెలుగు భారతమును తెలుగు వేదముగ తీర్చిదిద్దెను.

డా॥ నందుల గోపాలకృష్ణమూర్తిగారు,
ఆంధ్రమహాభారతము - ఔపదేశికప్రతిపత్తి, పుట-71

"తెలుగులోనికి అవతరించిన భారతం, భారతం అనువాదంగా కాక, భారతం అనువేదంగా వ్యక్తమై వర్ణించనలవికాని విశిష్టతను సంతరించుకొన్నది...."

—డా॥ మోపిదేవి కృష్ణస్వామిగారు,
భారతం-ధర్మాద్వైతం, వ్యాసునిదర్శనం-తిక్కన సందర్శనం పుట-347

"మాతృక పురాణధర్మ పురంధ్రి. పుత్రిక అభినవకావ్య సుగంధి. తల్లికంటె ఒక గుణము పుత్రికలో నున్నదనుట ఆ తల్లికి బాధాకరముకాదు గదా! ఆహ్లాదకరమగును. ఆ తల్లి లేక ఈ పుత్రికలే దనుసంస్కారము అంతర్లీనముగా నుండిన చాలును.

"తెలుగు భారతము ఇతిహాసమయ్యును ప్రబంధమండలిగ భావింపబడినది. ధర్మప్రతిపాదకమయ్యును దానిని ధ్వని సుందరముగ సాధింపగలిగినది. కథను రసాభ్యుచితబంధముగ సంతరించుట జరిగినది."

—డా॥ పి. సుమతీనరేంద్ర
తిక్కన చేసిన మార్పులు - ఔచిత్యపు తీర్పులు పుట 8-9

ఇవీ, ఇటువంటివే అయిన ఇతరాభిప్రాయాలూ కవిత్రయం వారి భారతం అనువాదంలా కనిపించే స్వతంత్రసృష్టి అని చాటుతున్నాయి. వ్యాసహృదయాన్ని కవిత్రయంవారు మహాద్భుతంగా ఆవిష్కరించగలిగారనటానికి ఈ వాక్యాలన్నీ సాక్ష్యమిస్తున్నాయి.

నన్నయ "మహాభారతబద్ధనిరూపితార్థము 'ఏర్పడ' తెనుంగున రచియించి" నాడు.[1]

తిక్కన "అమ్మహాకావ్యంబు నర్థంబు సంగతంబు" చేశాడు.[2]

ఎట్లన, నన్నయ తిక్కనలు—

"భాసురభారతార్థములభంగుడు నిక్కమెఱుంగనేరమిన్
గాసటబీసటే చదివి గాథలుద్రవ్వ తెనుంగు వారికిన్
వ్యాసమునిప్రణీత పరమార్థము తెల్లగఁజేసినట్టి యు
ల్లాసన కల్పుల... ... ... ... ..." ని[3]

1. ఆది - 1 - 16 2. విరాట - 1 - 37 3. నృసింహపురాణము 1-9

కై మోడ్చుటమే కాదు, 'నన్నయభట్ట మహాకవీంద్రుని సరససారస్వతాంశ ప్రశస్తి దన్నుఁ జెందుటయు, సాధుజన హర్ష సిద్ధిఁగోరి... తత్కవితా రీతియుఁ గొంతదోఁపఁ దద్రచనయ కాన్' అరణ్యపర్వాన్ని పూరించాడు.[1]

భిన్న కాలాలకు చెందిన ఈ ముగ్గురు కవులూ జగద్ధితాన్ని పరమప్రయోజనంగా దృష్టిలో పెట్టుకొని, వ్యాసహృదయాన్ని తెలుగు వారికి బోధపడేటట్లు చేయడానికి ప్రయత్నించారు గనుకనే వారికి

"సరస సంస్కృత పుష్పగుచ్ఛ ప్రభూత
మగు తెనుంగను నెత్తావి కఖిల దిశలఁ
దరుణ పవమానమగు కవిత్రయ విశేష
చతురవాచానిరూఢి కంజలి ఘటింతు"[2]

అంటూ ప్రతి ఆంధ్రుడూ కృతజ్ఞతాంజలి ఘటిస్తున్నాడు. యథా మూలంగా సంస్కృతభారతాన్ని తెలిగించడమనే ప్రసక్తే అసలాకవులు ముగ్గురూ పెట్టుకోలేదని ఇందుమూలంగా స్పష్టమవుతోంది.

మహాభారతగాథను ఇతిహాసంగా కూర్చడమే కాక, ఇతిహాస రచనా విధానం ఎలావుంటుందో కూడా వ్యాసభగవానుడు ఆ గ్రంథం లోనే ఇచ్చాడు.

సంజయుణ్ణి పాండవుల వద్దకు రాయబారిగా పంపుతూ ధృతరాష్ట్రుడు అతనితో

"నీవు ధర్మజుపాలికి నెమ్మి నరుగు
మతఁడు పేరోలగం బున్నయవసరమునఁ
గాన్పు మతనికి ననుజవర్గంబునకును
బంధులకు నింపుపుట్టంగఁబలుకు మచట.

1. అరణ్య - 7 - 468, 469
2. రాజశేఖర చరిత్రము - మాదయగారిమల్లన

"నెయ్యము వాటించి కడుం
దియ్యమెసఁగ నలుకలెల్లఁ దీఱునటులుగాఁ
గయ్య మనుతలఁపులోనుగ
నయ్యమనందనుఁడు మానునట్టి తెఱఁగునన్

"శాంతిప్రకారంబునన్ గార్యంబునడిపి యొక్కటై మనుట యొడఁగూర్చి రమ్మ..."[1] అని మాత్రం చెప్పాడు. ధృతరాష్ట్రుని ఆంతర్యం బోధపడిన సంజయుడు మారుమాట్లాడకుండా రథమెక్కి ఉపప్లావ్యానికి వచ్చాడు. అక్కడ నరనారాయణులైన అర్జునుణ్ణి శ్రీకృష్ణుణ్ణి సందర్శించి, అనంతరం సభలో ప్రసంగిస్తూ, ధృతరాష్ట్రుని హృదయాన్ని మహాద్భుతంగా సభవారి ముందు ప్రదర్శించాడు. సంజయుని మాటల్లో వ్యక్తమైన ధృతరాష్ట్రుని కుటిలత్వం సభలోని వారిని అందరినీ ఆశ్చర్యపరచింది. ఆఖరికి శ్రీ కృష్ణుడు కల్పించుకొని,

"........................

........................

మీరు దమవాలు వడఁయక
నేరిమిమాటలన తేఱనేర్తురె చెపుమా!"

అంటూ, 'రాజ్యంమాట ఎత్తుతావేగానీ ద్రౌపదికి జరిగిన ఘోరావమానం సంగతేమిటి? వీరు ఇన్నీ అనుభవించింది చివరికీ కబుర్లతో కడుపునింపుకోవడానికా? ఇలా అయితే ఈ సంధి పొసగినట్లే— లాభంలేదు. ఈ పాండవుల్ని ప్రార్థించి, నేనైనా అక్కడికి వచ్చి ఆ కౌరవులకు బుద్ధిచెబుతానుండు' అన్నాడు.[2]

---

1. ఉద్యోగ - 1 - 270, 271, 272.

2. ఉద్యోగ - 1 - 340 నుంచి 353 వరకూ

"పాండవులఁదగఁ బ్రార్థించి యందుల
కక్కటి యేనైన నరుగుదెంచి
........................"

అప్పుడు సంజయుడు ... దేవా! నావచ్చిన కార్యంబు సఫలంబయ్యెఁబనివినియెద "నన్నాడు.

సంజయుడు వచ్చిన పనేమిటి? అదెలా సఫలమైంది అని ఆలోచిస్తే, అతడు వచ్చింది ధృతరాష్ట్రుని ఉద్దేశ్యాన్ని పాండవపక్షం వారికి తెలియజేయటానికి మాత్రమేననీ, కృష్ణుడంతటివాడే స్వయంగా పూనుకొంటే యుద్ధప్రయత్నాన్ని విరమింపజేయటానికి మానవ ప్రయత్నం మాత్రమే కాక దైవసంబంధమైన ప్రయత్నమూ జరుగబోతోంది గనుక తనపని నెరవేరినట్లేనని సంజయుడు భావించినట్లుగా తెలుస్తున్నది.

ఒకవైపున యుద్ధం జరుగుతూవుండగా ఆ యుద్ధసంబంధమైన విశేషాలను, ఆయావ్యక్తుల రహస్యసంభాషణలు, మనోగత భావాలతో సహా, సంజయుడు వ్యాసుని అనుగ్రహంతో ధృతరాష్ట్రునికి నివేదించాడు. అర్జునునికి శ్రీకృష్ణుడు ఉపదేశించిన 'భగవద్గీత' మొత్తం సంజయుడు గ్రహించి, వివరించినదే! శ్రీకృష్ణుని విశ్వరూపాన్ని అర్జునునితోపాటు సంజయుడూ దర్శించాడు.

'సాత్త్వికరాజస తామస వికారంబుల త్రిప్పలంబడక ధర్మం బాచరించుచు భావశుద్ధి గలిగియుండు' వాడు [1] కాబట్టి సంజయునికి ఆవిధమైన 'సిద్ధి' కలిగిందని ఊహించవచ్చు. సంజయుడు ధృతరాష్ట్రునితో మరొకమాటకూడా అన్నాడు; " ... ... నీకునుం దక్కెవ్వరికైనను నతని (అచ్యుతుని) నెఱుంగుటకు తెరువిట్టిది ......" అంటే, సంజయునిలా "వాసుదేవతత్త్వాన్ని" [2] ఒంటబట్టించుకోవాలంటే భావ

1. ఉద్యోగ - 2 - 320

2. "ఎల్లయందును దా వసియించు నెల్ల
యదియుఁ దనయందు వసియించు టంద్రు వాసు
దేవుఁ డనుపేరి కర్థంబు దెల్ల మింత
యెఱుఁగు జనులందుఁ దగ వసియించు శుభము." ఉద్యోగ - 2 - 326

శుద్ధిని అలవరచుకోవాలి అన్నమాట !

ఇంక వ్యాసభగవానుడు సరేసరి. ఆయన మహాభారతాన్ని '...... భువనంబజుండు నిర్మించినట్లు ...... నిఖిలలోకహితార్థంబు దత్తావధానుండై సంవత్సరత్రయంబు నిర్మిం'చాడు.[1] ఆయన 'తన విమల జ్ఞాన మయంబైన వాగ్దర్పణంబున' తనకు తెలిసిన సమస్త విజ్ఞానమూ, శ్రీకృష్ణుని మాహాత్మ్యమూ, పాండవాదివీరుల మహా గుణాలూ స్పష్టంగా వెలుగుతూ ఉండగా మహాభారతాన్ని రచించా డని చెప్పబడింది.[2] మహాభారత యుద్ధానంతరం పదహారు సంవత్స రాల తర్వాత వ్యాసభగవానుడు గాంధారీ,ధృతరాష్ట్రుల కోరిక మేరకు యుద్ధమృతులైన భారతవీరు లందరినీ దర్శింపజేసి, వారిశోకాన్ని పోగొట్టాడు.

మహాభారతాన్ని సూక్ష్మదృష్టితో పరిశీలించు కొంటూ పోతే, అద్భుతాలనిపించే ఇటువంటి సన్నివేశాలు ఎన్నో తగులుతాయి మనకు. ఆ సన్నివేశాల సాధ్యాసాధ్యాలను గురించి చర్చించడానికి కాక ఒక విషయాన్ని ప్రతిపాదించడానికి మాత్రమే వానిని ఇక్కడ ప్రస్తావించడం జరుగుతున్నది.

మహాభారతం ఇప్పటి మన చరిత్రల మాదిరిగా లభ్యమైన ఏవో కొన్ని చారిత్రకాధారాల సహాయంతో వ్రాయబడిన గ్రంథం కాదు. జరిగిన సన్నివేశాల్ని ప్రత్యక్షీకరించుకొని వ్రాయబడింది- అన్నది ఆ ప్రతిపాదన.

సంజయునికి దివ్యదృష్టిని ఇచ్చి వర్తమాన సన్నివేశాల్ని, ధృతరాష్ట్రాదులకు దివ్యదృష్టిని ఇచ్చి పురామృతులనూ ప్రత్యక్షీక రింప జేసిన వ్యాసభగవానుడు, లోకహితార్థమై భారత రచన చేస్తూ, జరిగిన ఆయా సన్నివేశాలను మనో నేత్రంతో వీక్షిస్తూ వ్రాశాడనటం అతిశయోక్తి కాదు.

1. ఆది - 1 - 66 2. ఆది - 1 - 30 వచనం

సృష్టిలోని చాలా విషయాలు మనం నమ్మటం, నమ్మక పోవడం అనే వాని ప్రకారం జరగడంలేదు కనుక, దీనిని కూడా మన నమ్మకాలతో ప్రమేయంలేని అటువంటివానిలో ఒకటిగా పరిగణించి, ఆధునికకాలంలో సదృశ సన్నివేశాలుంటే వానిని ప్రమాణంగా గ్రహిద్దాం.

మేడమ్ బ్లావెట్స్కీ అనే ఒకానొకరష్యన్ యోగిని (క్రీ.శ. 1831–1891), కల్నల్ ఆల్కాట్ అనే ఒక అమెరికన్ న్యాయవాది, జడ్జ్ అనే ఒకఐరిష్‌న్యాయవాది కలిసి క్రీ. శ. 1875 లో "థియో సాఫికల్ సొసైటీ" అనే ఒక సంస్థను స్థాపించారు. దాని కార్యాలయం మద్రాసులోని అడయారులో ఇప్పటికీ పనిచేస్తూనే వుంది. ఆ రష్యన్ యోగిని "Isis unveiled" (ప్రచురణ 1877), "The Secret Docirine." (ప్రచురణ 1888) అనే రెండు మహాగ్రంథాలు రచించింది. ఆ గ్రంథాల రచనకూడా మహాభారత రచన మాదిరిగానే ఒకానొక దృష్టితో సాగింది. బ్లావెట్స్కీని కొందరు దివ్య పురుషులు 'వాహిక' (medium)గా స్వీకరించి, ఆమెకు కావలసిన ఆధారాలన్నీ ప్రత్యక్షంగా చూపించి, ఆమె 'చేత' ఆ గ్రంథం వ్రాయించారు.[1] ఆ గ్రంథానికి గల 'preface'లో బ్లావెట్స్కీ ఇలా వ్రాసింది.

"These truths are in no sense put forward as a revelation; nor does the author claim the position of a revealer of mystic lore, now made public for the first time in the world's history. For what is contained in this work is to be found scattered through-out thousands of volumes embodying the scriptures of the great Asiatic and early European religions, hidden under glyph and symbol and hitherto left unnoticed because of this veil. What is

1. వివరాలకు : "యుగధర్మ ప్రతిష్ఠాపకులు - H.P బ్లావెట్స్కీ జీవితచరిత్ర" రచన : శ్రీ గుంటూరు వెంకటసుబ్బారావు, 1955

now attempted is to gather the oldest tenets together and to make of them one harmonious and unbroken whole. .... .... .... For this work is a partial statement of what she herself has been taught by more advanced students, supplemented, in a few details only, by the results of her own study and observation."[1]

ఈ గ్రంథములో బ్రహ్మాండ సృష్టిని గూర్చి, జీవన పరిణామాన్ని గూర్చి మహత్తరమైనవిషయాలు ఉన్నాయి. కుత్ హూమీ, మరువు అనే మహాత్ములిద్దరు అజ్ఞాతంగా ఆమెకు ఈ గ్రంథ రచనలో తోడ్పడ్డారు.

ప్రాచ్యపాశ్చాత్యదేశాలమధ్య ఆధ్యాత్మిక సమన్వయాన్ని పెంపొందింపజేయటానికి అవతరించిన మరొక మహాత్ముడు కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్య (1926-1984). సనాతన వైదిక విజ్ఞానాన్ని దివ్యజ్ఞాన సమాజపు వాఙ్మయంతో మేళవించి వారు ఎన్నో గ్రంథాలు రచించారు. "Spiritual Astrology" అనే గ్రంథాన్ని వారు బ్లావెట్స్కీమార్గంలోనే రచించి, తమకు ఆ దివ్యజ్ఞానాన్ని అందించిన అజ్ఞాతగురువుకే దానిని అంకితం చేశారు. ఆ గ్రంథపీఠికలో–

"The instructions conveyed in this book are from 'higher circles. These are from those whom I follow to those who follow Me.' The purpose it may serve will decide its place."[2]
అని వ్రాశారు.

ఇలాంటి మహానుభావులు ఇంకా ఎందరో!

1. An Abridgement of 'The Secret Doctrine'
Edited by Elizabeth Preston and Christmas Humphreys.

2. Spiritual Astrology - E. Krishnamacharya

వ్యాసభగవానుని ఈ ఇతిహాస రచనా పద్ధతిని కవిత్రయం వారు పట్టుకోగలిగారు. ఆంధ్రమహాభారతాన్ని రచించడంలో వారు ఇంచుమించుగా ఇదే పద్ధతిని అనుసరించారని చెప్పవచ్చు.

నన్నయ మహాకవి దివ్యదృష్టైన పరాశరాత్మజాంభోరుహ మిత్రునిగొల్చి, చేతోరుచిరాబ్జబోధనుడై, తెనుగున మహాభారత సంహితారచనబంధురుడయ్యాడు.[1]

తిక్కనసోమయాజి "...సాత్యవతేయసంస్మృతి శ్రీవిభవాస్పదంబయిన చిత్తముతోడ మహాకవిత్వ దీక్షావిధి నొంది...", "...అంతస్సన్నిధిం గలిగించుకొని యమ్మహాకావ్యంబు నర్థంబు ..." సంగతం చేశాడు.[2]

శంభుదాసకవి "నన్నయభట్ట కవీంద్రు సరససారస్వతాంత పరిశస్తి" తనను చెందగా, 'తద్రచనయకాన్' ఆరణ్య పర్వాన్ని పూరించాడు.[3]

ఈ ముగ్గురు కవులూ వ్యాసమహర్షిని వర్ణించిన తీరును పరిశీలిస్తే, వారికి ఆయనపట్ల ఎంతటి గౌరవం, ఆరాధనాభావం ఉన్నాయో స్పష్టపడుతుంది.[4] భారతసంహితను కూర్చడంలో వ్యాసుని పరమార్థాన్నీ, ప్రణాళికనూ ఈకవులు ముగ్గురూ గ్రహించవలసిన తీరులో గ్రహించగలిగారనడానికి ఈ వర్ణనలే నిదర్శనం. వారు ఒకానొక సమాధి స్థితినిపొంది, వ్యాసునితో శ్రుతికుదుర్చుకోవడంతో వారికి భారత పరమార్థం ప్రసన్నమైంది. దాన్ని వారు దీక్షతో తెలుగులో

1. ఆది - 1 - 22, 25
2. విరాట - 1 - 30, 37
3. ఆరణ్య - 7 - 468, 469
4. ఆది - 1 - 22, 31; 3 - 2; 4 - 238;
   విరాట - 1 - 3;
   హరివంశము, పూర్వభాగము - 2

సంగతం చేశారు. కనుకనే వారు రచించిన తెలుగు భారతం వ్యాసుడే దిగివచ్చి రచించినట్లుగా మహావైభవంగా నడిచింది.

అంతస్సన్నిధితో కావించే ఇటువంటి రచనను 'దార్శనిక పరివర్తనం' (Trance-creation) అనడం సముచితంగా ఉంటుంది. మూలవిధేయంగా ఉంటూ స్వతంత్రంగా ఉండటం దీని ప్రధానలక్షణం. కవిత్రయ భారతానికి అంతటిప్రశస్తీ, ప్రామాణికతా సిద్ధించడానికి అసలైన కారణం ఇదీ! తిక్కనగారిది నాటకీయమైన శైలి అనే వ్యవహారం లోకంలో ఉంది. ఆ నాటకీయత ఆయన కావాలని తెచ్చిపెట్టుకొన్నదికాదు. కొన్నిసన్నివేశాలకే పరిమితమైందీ కాదు. సంవాదాన్ని రచించినా, సమరాంగణాన్ని వర్ణించినా కన్నులకు కట్టించడం తిక్కన ప్రత్యేకత. అదెలా సాధ్యపడిందీ అంటే, పైన చూపిన ప్రకారంగా ఒకానొక దివ్యదృష్టితో తా నాఘట్టాలన్నింటినీ దర్శిస్తూ రచించాడు గనుకనే!

పోతన మహాకవి భాగవత ప్రారంభంలో

"పలికెడిది భాగవతమట
పలికించెడి విభుండు రామభద్రుండట..." అని చెప్పుకున్నాడు

సరిగ్గా కవిత్రయంవారూ అంతే!

"పలికెడిది భారతంబట
పలికించెడి విభుండు వ్యాసభగవానుండటే..." అన్నట్లుగా

వారి రచన సాగింది. వారికి ఈ మార్గం వ్యాసుడు చూపిందే కావడం విశేషం.

---

తెలుగు అకాడమీ వారు ప్రచురించిన "తెలుగు సాహిత్య చరిత్ర" (1986) బి.ఏ. పాఠ్య గ్రంథంలో కవిత్రయం వారిది దార్శనిక అనువాదం అనే ప్రతిపాదన ఈ వ్యాసకర్త చే తొలిసారిగా చేయబడింది.

## 2. ఐతిహాసిక విశ్లేషణ

వ్యాసభగవానుని మహాభారతం ప్రధానంగా ఇతిహాసం. దానిని తెలుగులోకి మార్చిన కవిత్రయంవారు కూడా ఐతిహాసికదృష్టితోనే ఆ మహాగ్రంథాన్ని దర్శించి వ్రాశారు.

(కొంతమంది పరిశోధకులు ఊహించినట్లుగా వారు దేశంలోని వివిధతాళపత్రప్రతుల్ని దగ్గరపెట్టుకొని, పాఠభేదాల్ని పరిశీలించి తమకు నచ్చిన పాఠాల్ని ఎన్నుకొని, నేడు మనవారు ప్రభుత్వ పాఠ్యగ్రంథాల్ని అనువదిస్తున్నట్లుగా అనువదించి ఉండరనిపిస్తుంది. నన్నయ తిక్కనలు తామే భారతం, భారతమే తాముగా జీవించిన మహానుభావులు. వారు జాతి శ్రేయస్సును దృష్టిలో పెట్టుకొని, తమ 'పుట్టుగ్రితార్థతంబొరయ' దానిని తెలుగున రచించిన త్యాగమూర్తులు)

ఐతిహాసికదృష్టి అంటే ఏమిటి? అన్న విషయాన్ని కొంత వివరించవలసి ఉంది.

"ఇతిహాసః పురావృత్తమ్"— అని అమరకోశం.

గత చరిత్రను నిరూపించేది ఇతిహాసం అని దీని అర్థం.

అయితే, భారతగాథ ఒకనాటి చరిత్ర అని నిరూపించడం ఎలా? అనే ప్రశ్న సహజంగానే వస్తుంది. ఎందువల్ల అంటే, చరిత్రపట్ల ఇప్పుడు మనకున్న అవగాహన వేరు గనుక! శవపరీక్షా నివేదికల (post-mortem reports) వంటి రచనలనే చరిత్రలుగా చదువుకోవడానికి అలవాటుపడిన ఇప్పటివారికి వ్యాసుని భారతం చరిత్రగ్రంథమే (by itself it is history) అంటే విశ్వసించడం కష్టంగా ఉంటుంది. అందువల్ల ఇప్పటి చరిత్రరచనకు ఆధారమైన ఆకరాల (sources) వంటివి భారతగాథకు సంబంధించి ఏవైనా ఉన్నాయా అని పరిశీలించవలసిన అవసరం కలుగుతోంది.

1) భారతకాలంనాటి పరీక్షిత్తూ, అతని కుమారుడు జనమేజయుడూ చారిత్రక పురుషులని ఋజువుచేసే శాసనాలు అనేకం ఉన్నాయి. కాని ఇప్పటి మన చరిత్రరచనకు ఆద్యులైన బ్రిటీషువారు ఏ కారణాలవల్లనో ఆ శాసనాలను పరిగణనలోకి తీసుకోలేదు సరికదా అవి ఉన్నట్లే ఎక్కడా ప్రస్తావించలేదు. ప్లీటుదొర వంటి కొందరు మాత్రం అవి సరైనవి కావని త్రోసివేశారు.[1]

2) సాగరగర్భ శిథిల పరిశోధకు (marine archeologist) లలో సుప్రసిద్ధులైన డాక్టర్ ఎస్. ఆర్. రావుగారు సముద్రగర్భంలో కలిసిపోయిన శ్రీకృష్ణుని ద్వారకానగరాన్ని గూర్చి గుజరాతులో ఇటీవల పరిశోధన మొదలుపెట్టారు. వారికి కృష్ణుని కాలంనాటి నాగరికతను నిరూపించే ఆధారాలు అనేకం దొరికాయి. మరో రెండు సంవత్సరాల్లో వారి పరిశోధనలు పూర్తికానున్నాయి— అని పత్రికలలో ప్రచురితమైన వార్తలనుబట్టి తెలుస్తోంది.

3) విష్ణుపురాణం, మహాభారతం, భాగవతం, హరివంశం వంటి గ్రంథాలలో వర్ణించబడిన ఖగోళ పరిస్థితులనుబట్టి జ్యోతిష శాస్త్ర పండితులైన పరిశోధకులు శ్రీకృష్ణుని జననకాలం, నిర్యాణకాలం, అతని జీవితంలో ఇతర సన్నివేశాలు జరిగినకాలాలు నిర్ణయించారు.

సంస్కృత భాగవతంలో

"యస్మిన్ కృష్ణో దివంయాతః
తస్మిన్నేవ తదాఽహని
ప్రతిపన్నమ్ కలియుగం."

—ఏ రోజునైతే కృష్ణుడు దేహయాత్ర చాలించి స్వర్గానికి వెళ్ళాడో ఆ రోజునే 'కలియుగం' మొదలైంది— అని చెప్పబడింది. కృష్ణుడు నిర్యాణం చెందిన సంవత్సరంలోనే పరీక్షిత్తు పట్టాభిషేకం,

1. జనమేజయుని శాసనాలు అనుబంధంలో ఇవ్వబడినాయి.

పాండవుల మహాప్రస్థానం జరిగాయి. అంతకు ముప్పయ్యారు సంవత్స రాలకు పూర్వం మహాభారతయుద్ధం జరిగింది. యుద్ధ ప్రారంభంనాడు (శోభకృత్ కార్తీక కృష్ణపక్ష త్రయోదశి, మంగళవారం) తిథిత్రయం నడిచింది. అంటే ఆ రోజు త్రయోదశితో ప్రారంభమై అమవాస్యతో ముగిసింది. కృష్ణ నిర్యాణ సమయాన గొప్ప గ్రహకూటమి సంభ వించింది. అప్పుడు గ్రహాలన్నీ మేషరాశిలోని మొదటి బిందువుకి సమీపాన చేరాయి. —ఇలాంటి ఆధారాలను బట్టి లెక్కలు కట్టి పండితులు శ్రీకృష్ణుని జన్మకాలం క్రీ.పూ. 3228 సంవత్సరం, జూలై 19 అనీ, నిర్యాణకాలం క్రీ.పూ. 3102 సంవత్సరం, ఫిబ్రవరి 18 ఉదయం అనీ తేల్చారు. శ్రీకృష్ణుని జీవితకాలం 126 సంవత్సరాలు.[1]

జనమేజయుని శాసనాల్లో యుధిష్ఠిరశకం పేర్కొనబడింది. ఆ శకం సప్తర్షులు మఖా నక్షత్రంలో ప్రవేశించినప్పటినుంచీ ఆరంభించి నదని భాగవత ద్వాదశస్కంధంలో వివరించబడింది.

మహాభారతంలో పేర్కొనబడిన రాజ్యాలు, పట్టణాలు మొదలైనవి కొద్దిపాటి మార్పులతో ఇప్పటికీ అవే పేర్లతో వ్యవహా రంలో ఉన్నాయి. వేల సంవత్సరాల నుంచీ వస్తున్న ఆ పేర్లనుబట్టి కూడా మహాభారతగాథ కల్పితం కాదని చెప్పవచ్చు.

మహాభారతచారిత్రకతను గూర్చి 'మనదేశము—మనసంస్కృతి' అనే గ్రంథంలో ఇ. వేదవ్యాస I.A S గారు ఇలా వ్రాశారు.

"మన ఆధునికచరిత్ర భారతయుద్ధంతోనే ప్రారంభమవుతుంది. అందుకని ఈనాటి మన 'చారిత్రకకాలానికీ' అంతకు పూర్వం నడిచిన 'పురాణకాలానికీ' మధ్య వంతెనవంటిదీ మహాభారతయుద్ధం. ఇది జరిగి 5-వేల సంవత్సరాలు పైగా కావస్తున్నది. (Foot Note : మహా

---

1 కోట వెంకటాచలంగారు రచించిన "కలిశకవిజ్ఞానం" మొదలైన గ్రంథాలు ఆధార ముగా డా. ఇ. వేదవ్యాస I.A.S.గారు రచించిన "యుగపురుషుడు" అనే గ్రంథం లో ఇందుకు సంబంధించిన వివరాలు అనేకం ఉన్నాయి.

భారతయుద్ధం జరిగి, ఇప్పటికి సరిగా 5072 సం॥లు అయింది. అంతే క్రీస్తుపూర్వం 3138 B.C. నవంబరు నెలలో భారతయుద్ధం జరిగినట్లు చరిత్రవల్ల తెలుస్తోంది.—

Refer : Astrological Magazine, Bangalore, March 1972 (Page 293) \

బుద్ధిపూర్వకంగా ఈ భారతంలోని అనేక చారిత్రకాంశాలను బయటకు తీయకుండా, అణచివేసి విదేశీ చరిత్రకారులు ఇది కేవలం ఒక కావ్యం క్రిందా ఊహాసంబంధమైన విషయంగానూ తీసివెయ్యడానికి ప్రయత్నం చేశారు. ఈ మహాభారతకాలంలోని ప్రముఖ పాత్రధారి శ్రీకృష్ణుడు. శ్రీకృష్ణుడు చారిత్రకవ్యక్తిమాత్రమే కాదు! చరిత్రాత్మకమైనవ్యక్తి. ఆయన మనదేశ భవిష్యత్తునే తీర్చిదిద్దిన నవభారత నిర్మాత. అనేక రాష్ట్రాలుగా, ఏరాజుకారాజు వేరేవేరే అయి, ఐకమత్యంలేక కొట్లాడు కుంటున్న సమయంలో ఆయన జన్మించాడు. దేశాన్ని సంఘటితం చేసి 'రాజసూయ' యాగం మిషగా దేశాన్ని 18 రాష్ట్రాలతో కూడిన ఏకైక ప్రభుత్వాన్ని స్థాపించటానికే తన జీవితం అంకితంచేసి అందులో ఎందరు వీరులూ, బంధువులూ (అభిమన్యునివలే), మిత్రులూ, రాజులు ఆహుతి ఐపోయినాసరే లెక్కచేయక "మహాభారత స్వాతంత్ర్య సంగ్రామాన్ని" విజయవంతంగా పరిపూర్తిచేసి ఢిల్లీలో కేంద్రప్రభుత్వాన్ని స్థాపించి, దానికి ప్రజానురంజకుడూ ధర్మమూర్తి అయిన యుధిష్ఠిరుణ్ణి పట్టాభిషిక్తుణ్ణిచేసి, నిస్వార్థంగా తానేమీ పుచ్చుకోకుండా తిరిగి ద్వారకకు చేరిన దేశభక్తుడు, త్యాగి, మహారాజనీతిదురంధరుడు. అందుకే భారతదేశచరిత్రలోనే ఈయన ఒక 'శకకర్త'-యుగపురుషుడు 'భారతం' అన్న పేరుతో యీనాటికీ మనదేశమంటూ ఒకటున్నదంటే అది ఈయన పెట్టినభిక్షే!... అందుకే మనం యీనాడు మనచరిత్రలో శ్రీకృష్ణదేవుని "భారత భాగ్యవిధాత" గా పూజిస్తున్నాం. మహానాయకుడు, కర్మయోగి. ఈయన మన భారతదేశ నిర్మాత."1

---

1. మనదేశము - మనసంస్కృతి, 2nd Edition, - 1979, పుట - 75 - 76 రచన : ఇ. వేదవ్యాస USCEFI ప్రచురణ.

ఈ ఆధారాలనుబట్టి మహాభారతగాథ పురావృత్తమని అంగీకరించవచ్చు.

అయితే, ఇతిహాసం కేవల చరిత్ర కాదు. చరిత్ర అంటే ఇప్పటి మనఅర్థం- దొరికిన ఆధారాలతో పునర్నిర్మించబడిన సంఘటనల కూర్పు మాత్రమే. ఇతిహాసం అంతకంటె భిన్నమైనది. జరిగిన సంఘటనల వెనుకటి శాశ్వతమైన సృష్టిధర్మాలను ఆ సంఘటనలతో అన్వయించి చూపుతుంది ఇతిహాసం.

ఇద్దరువ్యక్తులమధ్య యుద్ధం జరిగిందనుకొందాం. ఆ ఇద్దరి మధ్యా ఏయే బాహ్యకారణాలవల్ల, ఎప్పుడు, ఎక్కడ ఆ పోరాటం జరిగిందీ వివరించేది చరిత్ర అవుతుంది.

ఆ వ్యక్తుల మధ్య కలహానికి కారణమైన వారివారి ప్రవృత్తులూ, ఆ ప్రవృత్తులకు మూలమైన గుణాలూ, ఆ గుణాల వెనుకటి ప్రకృతి ధర్మమూ— వీటి నేపథ్యంలో ఆ యుద్ధాన్ని వర్ణించి, కళ్ళకు కట్టించేది ఇతిహాసమవుతుంది.

చరిత్ర సన్నివేశాన్ని సంబంధిత వ్యక్తులకు పరిమితంచేస్తుంది. ఇతిహాసం సన్నివేశానికి విశ్వజనీనత (Universality)ను ఆపాదిస్తుంది.

ప్రయోగశాలలో విద్యుత్తుద్వారా నీటిని విశ్లేషించి, అది హైడ్రోజన్ ($H_2$), ఆక్సిజన్ (O) వాయువుల సంయోగం అని కనిపెట్టడం చారిత్రకాంశం. హైడ్రోజన్, ఆక్సిజన్ వాయువులూ, నీరూ ప్రకృతిసిద్ధమైన సంపదలు. ప్రకృతిలో ఉండే హైడ్రోజన్, ఆక్సిజన్ వాయువులు (సంయోగంచెంది), ప్రకృతిలో నీరు ఏర్పడుతోంది అన్నది శాశ్వతమైన సృష్టిధర్మం (Natural phenomenon). ఆ చారిత్రకాంశాన్ని ఈ సృష్టిధర్మంతో అన్వయిస్తూ చెపితే అది ఇతిహాసమవుతుంది.[1]

---

1. తస్మాద్వా ఏ తస్మా దాత్మన ఆకాశ స్సంభూతః । ఆకాశాద్వాయుః ।

యుగయుగాల్లో జరిగిన మానవగాథల్లో నుంచి సృష్టిలోని శాశ్వత ధర్మస్వరూపాన్ని మనకు సాక్షాత్కరింపజేసేవి ఇతిహాసాలు.

జరిగిన మానవగాథలు కొన్ని సృష్టిధర్మాలకు లోబడి జరిగి ఉంటాయి గనుక ఇతిహాసం ఈ గాథలద్వారా ఆ సృష్టిధర్మాలను దర్శించి, సమన్వయించి చూపుతుందన్నమాట!

"...పాలకోవా అన్నది వేరుగా కనబడుతున్నా అందులో ఉన్నది పాలు పంచదారే అన్నట్లు, మానవుడు తనను తాను వేరుగా గుర్తించుకుంటున్నా తాను సృష్టిధర్మాల కలయికతో కట్టుకున్నరూపే చెట్టుతత్త్వం పండులో దిగివచ్చినట్లు, సృష్టితత్త్వం మానవుడిగా దిగివచ్చింది. మంచీచెడూ, ధర్మం, అధర్మం, సురశక్తులూ, అసురశక్తులూ, సృష్టికథలో మొదటినుంచీ ఉన్నవే, పనిచేస్తున్నవే. అవే వేరువేరు పాళ్ళల్లో దేశకాలపాత్రలను బట్టి మానవుల్లోకూడా పనిచేస్తుంటాయి. వ్యక్తుల పేర్లను వదలి వారే ప్రజలకు ప్రతినిధులో, వారిలో ఏ సృష్టిశక్తులు దోబూచులాడుతున్నాయో దర్శించగలిగితే ఆ జరిగే సన్నివేశాలు ఎప్పుడు జరిగినా, ఎక్కడ జరిగినా అదేతీరులో జరుగుతూ ఉంటాయని తెలుస్తుంది. ఇతిహాసం అన్న పదానికి అర్థం అదే. (ఇతి+హ+ఆస) 'ఈవిధంగా జరిగెనుకదా' అన్నది ఇతిహాసమనే మాటకు అర్థం. ఈ స్థితిలో మానవగాథలను దర్శించి వ్రాశారు కాబట్టే వాల్మీకి వ్యాసుల రామాయణ భారతాలు సార్వకాలికాలు, సార్వజనీనాలు అయినాయి."[1] అనే పరిశోధకుని వాక్యాలు పై అభిప్రాయానికి ఉపబలకమైనవి.

---

వాయోరగ్నిః। అగ్నేరాపః। అద్భ్యః పృథివీ..." అనే తైత్తరీయమంత్రంలో ఆత్మనుండి ఆకాశం, ఆకాశంద్వారా వాయువు, వాయువునుండి అగ్ని, అగ్నివల్ల జలములు, జలముల నుండి పృథివీ... వచ్చాయని చెప్పబడింది.

—తైత్తరీయము - వ్యాఖ్యాత డా. జి. ఎల్. ఎన్. శాస్త్రి.

1. భారతం - ధర్మాద్వైతం, వ్యాసుని దర్శనం - తిక్కన సందర్శనం, 1987. డా. మోపిదేవి కృష్ణస్వామి, పుట - 15

మహాభారతపు ఐతిహాసికతను గూర్చి కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్య ఇలా వివరించారు.

"సంఘర్షణము జీవుల పరిణామకథలో నొక ఘట్టము. పరిణామక్రమమున మానవునకు బాహ్యప్రపంచము నిమిత్తముగా తన లోపలిలోకములలో మథనము జరుగును. కాలక్రమమున ఈ మథనము నుండి వివేకమను వెన్న వెలికి వచ్చుచుండును. ఇది సామూహికముగా జరుగక వ్యక్తిగతముగా జరుగును. కనుక శాశ్వతముగా జరుగుచునే యుండును. అనగా ఎల్లప్పుడును ఒక్కొక్కనిలో ఒక్కొక్కస్థితి చొప్పున అందరిలోను అన్నిస్థితులును జరుగుచునే యుండును. క్రమోన్మీలనముచెందు వివేకము వలన నిత్యానిత్యతత్త్వవిభజనము జరుగును. ఇది జరిగినవారికిని, జరుగనున్నవారికిని నడుమ భావసంఘర్షణము జరుగుచుండును. ఇది కార్యరూపమున వ్యక్తమగుటయే యుద్ధము. మహాగ్రంథము నందలి అక్షరములవలె, ధర్మసంఘర్షణకు జీవులశరీరములు అనిత్యములైన నిమిత్తకారణములగుచుండును. అక్షరముల పతనము జరిగిపోవుచున్నకొలదియు వాని వినియోగము దాటిపోవుచుండును. గ్రంథములోని మహార్థము స్థిరపడుచుండుటయు తప్పదు. అట్లే ధర్మాధర్మ సంఘర్షణమను జగత్కథలలో వ్యక్తుల శరీరములు చనిపోవుట, శాశ్వతపు విలువలు మరలమరల స్థిరపడుచుండుట జరుగుచుండును. తప్పనిసరియైన ఈ పథమునందు అల్పదృష్టికి మృత్యువు, క్రాంతదృష్టికి అమృతత్వమును గోచరించును. ఈ మహార్థమే భారతయుద్ధసందర్భమున వ్యాసమహర్షి చే స్థాపించబడినది."[1]

ఇతిహాసానికి సంబంధించిన విశ్వజనీనత చాలా చిత్రమైనది. స్థూలదృష్టికి ఒక చారిత్రక సంఘటనగా కనిపిస్తూ, సూక్ష్మపరిశీలనవల్ల దానిలో ప్రతిపాదింపబడింది, శాశ్వతసృష్టితత్త్వం అని బోధపడటం

---

1. శంఖారావము (శ్రీ మద్భగవద్గీతా రహస్య ప్రకాశము) ప్రథమ సంపుటము.
—కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్య.

ఒక ప్రత్యేకత. ఆ శాశ్వత తత్త్వంలో లౌకికమైన రీతులూ, నీతులూ వాటంతటవే అంతర్భవించడం మరొక ప్రత్యేకత.

ఒడ్డును తాకే ప్రతితరంగమూ జలాశయ గర్భంలోనుంచే ఆవిర్భవిస్తున్నట్లుగా భౌతికంగా కనిపించే ప్రతిసన్నివేశమూ ఆంతర లోకాలనుంచే రూపుకట్టుకొంటుంది. అందువల్లే ఇతిహాసాల్లోని కథ భౌతికలోకానికి మాత్రమే సంబంధించినదిగా కాక భౌతికలోకానికి మూలమైన ఆంతరలోకాలకు కూడా సంబంధించి ఉంటుంది. వ్యక్తుల పరివర్తనా, మనఃప్రవృత్తులేకాక వారి అంతఃకరణ ప్రవృత్తులు, ఆత్మతత్త్వమూ కూడా ఇతిహాసంలో ప్రతిబింబిస్తాయి. ఒక్కమాటలో చెప్పాలంటే, మానవుడు అహంకారంనుంచి పరిశుద్ధుడైన తర్వాత (ఋషిత్వాన్నిపొంది) ప్రకృతిలో ఏ విశ్వతత్త్వాన్ని వేదంగా దర్శించగలుగుతున్నాడో అదే విశ్వతత్త్వాన్ని చారిత్రక సన్నివేశాల్లో గూడా దర్శించడమే ఇతిహాసం.

సమస్త విజ్ఞానమూ వేదంలో ఇమిడిఉన్నట్లుగానే ఇతిహాసంలోనూ ఇమిడి ఉండటంలో ఆశ్చర్యం లేదు.

"ధర్మే చార్థే చ కామేచ మోక్షేచ భరతర్ష భ ।
యదిహాస్తి తదన్యత్ర యన్నే హాస్తి న తత్ క్వచిత్ ॥"[1]

ధర్మార్థకామమోక్షాల విషయంలో ఇందులో ఉన్నదే ఎక్కడైనా ఉంది. దీనిలో లేనిది మరెక్కడా లేదు— అని వైశంపాయనుడు జనమేజయునికి చెప్పాటంటే ఇందువల్లనే!

ఒక విషయాన్ని ఏ దృష్టితో చూస్తే ఆ దృష్టికి తగినట్లుగా కన్పించడం ప్రకృతిసిద్ధమైన అంశం. (యాదృశీ భావనాయత్ర సిద్ధిర్భవతి తాదృశీ।). భారతం వంటి మహేతిహాసాన్ని కవితాదృష్టితో చూస్తే మహాకావ్యమనిపిస్తుంది. ఎందువల్లనంటే, మహాకావ్యాలన్నీ ఏ భావ

1. సంస్కృత భారతం - ఆది - 1 - 56-33

ప్రపంచంలో నుంచి రూపుకట్టుకొంటారో ఆ భావప్రపంచం కంటె విస్తృతమైన లోకాలే అందులో వర్ణింపబడి ఉంటాయి కనుక. శాస్త్ర దృష్టితో చూస్తే సర్వశాస్త్రాల సంగమస్థానం అనిపిస్తుంది; ఏ విశ్వతత్త్వాన్ని గూర్చి శాస్త్రాలు అన్వేషిస్తాయో ఆ విశ్వతత్త్వమే ఇతిహాసంలో ప్రతిపాదింప బడుతుంది గనుక. ఆత్మతత్త్వాన్వేషకులకు కావలసిన వేదాంతవిద్య అంతా అందులో దొరుకుతుంది. కారణం, ఆత్మప్రవృత్తులు దానిలో నిరూపితమై ఉండటమే. —ఇలా ఏ దృష్టితో చూస్తే ఆ విధంగానే కన్పించే ధర్మాన్నిబట్టే భారతం విశ్వజనీనంగా ప్రసిద్ధికెక్కింది.

భారతం తెలుగులోనికి అవతరించడం మొదలైననాటినుంచీ నేటివరకూ

"పరమవివేకసౌరభ విభాసిత సద్గుణ పుంజ వారి జో
త్కర రుచిరంబులై సకలగమ్య సుతీర్థములై మహామనో
హర సుచరిత్ర పావనపయః పరిపూర్ణములైన సత్సభాం
తర సరసీ వనంబు'లు ముదంబొనరం గొనియాడ నొప్పెడిన్' "1

నన్నయగారు సారమతులైన కవీంద్రులు తన కవిత్వంలోని ప్రసన్న కథాకలితార్థయుక్తినీ, ఇతరులు, అంటే సహృదయులు, అక్షరరమ్యతనూ పరిగణనలోకి తీసుకోవాలని భావించారు.2 ఇందులో మొదటిది అతని అనువాద ప్రణాళికకూ, రెండవది రచనా విధానానికీ సంబంధించినవి. నన్నయ కాలంనాటి పండితపరిషత్తులూ, తర్వాతికాలానికి చెందిన పండితులూ తెలుగులో వచ్చిన భారతాన్ని విమర్శించిన తీరు మనకి తెలియదు. ఆధునిక కాలంలో 'అచ్చుకూటములు' వచ్చాక తొలిదశలో సాగిన విమర్శలనీ, విశ్వవిద్యాలయాల పర్యవేక్షణలో మలిదశలో సాగుతున్న పరిశోధనలనీ సమీక్షించి, డాక్టర్. శలాకరఘునాథశర్మగారు "తెలుగులో పరిశోధన" అనే గ్రంథంలో ఒకవ్యాసం వ్రాశారు.

1. ఆది - 1 - 23 (కొద్దిపాటి మార్పులతో)
2. ఆది - 1 - 25

దానిలో వారు భారతంపై వచ్చిన విమర్శలను మూడు విధాలుగా వర్గీకరించారు.

i) చారిత్రక దృష్టితో వచ్చినవి :- పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి గారి 'మహాభారత విమర్శనము', దానికి సమాధాన ప్రాయంగా వెలువడిన 'మహాభారతకథాతత్త్వ నిర్ణయము', 'మహాభారత తత్త్వకథనము' వంటివి.

ii) తెలుగు సంస్కృత భారతాల తులనాత్మక పరిశీలనకు సంబంధించినవి :- కోరాడ రామకృష్ణయ్యగారి 'ఆంధ్రభారత కవితా విమర్శనము' ఈ పద్ధతికి మార్గదర్శకమైన గ్రంథమనీ, వారిమార్గంలో చాలా గ్రంథాలు వచ్చాయని డాక్టర్ శర్మగారు నిరూపించారు.

iii) కవిత్రయం వారి కవితా శక్తియుక్తుల్ని ప్రదర్శించడం :- విశ్వనాథవారి 'ప్రసన్న కథాకలితార్థ యుక్తి', ఇంద్రగంటి వారి 'సారమతి నన్నయ', నెల్లూరు వర్ధమాన సమాజంవారి 'కవిత్రయ కవితా జయంతి' మొదలైనవి.

తమ దృష్టికి వచ్చినంతవరకూ పరిశోధన గ్రంథాలనుకూడా సమీక్షించి, చివరికి వారిలా తేల్చి చెప్పారు : "ఆయా విశ్వవిద్యాలయాలలో శ్రీ రామాయణభారత గ్రంథాలపై జరిగిన పరిశోధన గణనీయంగానే ఉందని చెప్పాలి. ఇక్కడ ఒక్కమాట. తెలుగులో పరిశోధకులు 'రామాయణభారత గ్రంథాలను ఇతిహాస దృష్టితో కాకుండా కావ్యదృష్టితోనే ఎక్కువగా అనుశీలించారని చెప్పకతప్పదు. కనుకనే ఇతిహాస లక్షణ సమీక్షకై చేసిన పరిశోధనలకంటె అలంకారాది శాస్త్ర సమన్వయం, తులనాత్మక పరిశీలన, పాత్రనిర్మాణనైపుణ్యం, భాషా దృష్టి అనువానిపై సాగిన సిద్ధాంతవ్యాసాలే అధిక సంఖ్యలో ఉన్నాయి."[1]

1. 'తెలుగులో పరిశోధన' - ఇతిహాసాలు - పరిశోధన, పుట - 241
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారి 347వ ప్రచురణ, 1983.

ఇతిహాస లక్షణాలను గూర్చి ప్రాచీనాలంకారికులు చేసిన ప్రతిపాదనలను డాక్టర్ కేతవరపు వేంకటరామకోటిశాస్త్రిగారు ఇలా క్రోడీకరించారు.

"ఇంతవరకు చూపబడిన ఇతిహాస శబ్దార్థముల తాత్పర్యమిట్లు నిష్కర్షింపవచ్చును. ఇతిహాసమున ప్రధానకథ చారిత్రక సత్యమైనదిగా నుండవలయును. మరియు నందు కొంత శాస్త్రము ప్రవర్తింపవలయును. పారంపర్యోపదేశక్రమము కలిగి యుండవలయును. ఆ కథాపురుషుల యొక్క కర్మఫలానుభవము సర్వము ప్రత్యక్షముగా చూపబడ వలయును. కర్మఫలానుభవ మిహపర భేదముచేత ద్విధాభూతము గనుక నితిహాసమున నట్లే పరలోకానుభవమును చూపబడవలయును...."[1]

మనకుగల ప్రధానేతిహాసాలు రామాయణ మహాభారత ములు రెండు మాత్రమే. ఇతిహాస లక్షణాలను నిర్దేశించిన ఆలంకారికులు ఈ రెంటినీ దృష్టిలో పెట్టుకునే పైలక్షణాలు ప్రతిపాదించారు. లక్ష్యా లనుబట్టి లక్షణాలు వచ్చాయేగాని, లక్షణాలను అనుసరిస్తూ వచ్చిన లక్ష్యాలు కావవి.[2] కనుక భారతానికి ఇతిహాస లక్షణాలు ఏవిధంగా అన్వయిస్తున్నాయి? అని పరిశీలించడం అంతఅవసరంగా తోచదు. అయితే, ఇతిహాస దృష్టితో భారతగ్రంథాన్ని సమీక్షించడం అంటే ఏమిటి? అన్న ప్రశ్నవస్తుంది. భారతగాథ జరిగిన క్రమమూ, దానిలోని సంభావ్యతా అసంభావ్యతలూ, భారతంద్వారా అందుతున్న సందేశమూ మొదలైన అంశాల విశ్లేషణ ఈ పరిధికిందకు వస్తుంది. ఈ విధమైన పరిశీలన తెలుగులో ఇదివరకే కొంతజరిగింది. 'మహాభారత విమర్శనము'

1. తిక్కన కావ్యశిల్పము - ద్వితీయ ఖండము, ప్రథమోన్మేషము, పుట - 117 - 118

2. "భారతీయ వాఙ్మయంలో రామాయణ, భారతాలు తప్ప తక్కినవి భరతనాట్య శాస్త్రం తరువాతనే వెలిశాయి." -నన్నయ ప్రసన్న కథ - లోతులు, ఆచార్య ఖండవిల్లి లక్ష్మీరంజనం.

'మహాభారత మీమాంస', 'శ్రీకృష్ణ చరిత్ర', 'మహాభారత కథాతత్త్వ నిర్ణయము', 'మహాభారత రహస్యము', 'మహాభారత చరిత్ర నిరాకరణము' మొదలైనవి ఈకోవకు చెందినవే. ఈ గ్రంథాల్లో మహాభారతాన్ని ఆధునికమైన చారిత్రక దృష్టితో విశ్లేషించడం జరిగింది. అందువల్ల మహాభారత గ్రంథానికి సంబంధించిన ఇతిహాస గౌరవం కుదించివేయబడింది, వారివారి విమర్శల్లో. కీ.శే. వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి మహోదయులు "మహాభారత తత్త్వకథనము" అనే పేరుతో భారతానికి సంబంధించిన వివిధాంశాలను వివరించారు. 1. అనేక కర్తృత్వ నిరాకరణము 2. వేదవ్యాస నిందానిరాకరణము 3. శ్రీకృష్ణ నిందానిరాకరణము, 4. పాండవ నిందానిరాకరణము, 5. ద్రౌపదీ నిందానిరాకరణము, 6. దుష్టచతుష్టయచర్య —అని ఆరు భాగాలూ, "తత్త్వకథన పరిశిష్టము" అను పేరుతో "కర్ణోత్పత్తి సమీక్ష" 1, 2 భాగాలూ— మొత్తం ఎనిమిది సంపుటాలుగా వారి గ్రంథం వెలువడింది. వారు, ఆ గ్రంథరచనలోని తమ ఉద్దేశ్యాన్ని ఇలా స్పష్టంచేశారు :

"......కనుక నార్ష విద్యా సంప్రదాయ ప్రవర్తకులలో నాచార్యపీఠము నధిష్ఠించి, యార్షవిద్యోపజీవుల కహరహస్స్మరణీయుండై యున్న వేదవ్యాస మునీంద్రుని మహాభారతమందు నవ్యుల విమర్శనములచే ప్రదర్శింపబడిన సంప్రదాయ విరుద్ధాంశములకు యథామతి గొన్ని సమాధానములు చూపి యీ ఋషి ఋణము నేమాత్రమునైన తీర్చుకొనవలెనను తలంపుతోనే "మహాభారత తత్త్వకథనము" అను గ్రంథము వ్రాయబూనితిని......"[1] కనుక, వారి గ్రంథం మొత్తం మహాభారతం పై ఆధునికులు వెలిబుచ్చిన అభిప్రాయాలకు, విమర్శలకు సమాధానం మాత్రమే.

వారణాసి వారు చెప్పిన ఒక విషయాన్ని ఈ సందర్భంగా స్మరించవలసి ఉంది. ఒక గ్రంథాన్ని రచయిత ఏ దృష్టితో వ్రాశాడో,

1. అనేక కర్తృత్వ నిరాకరణము - ఉపోద్ఘాతము.

అతడు ప్రతిపాదించదలుచుకొన్నది అతని గ్రంథంలో స్పష్టంగా ఎంత వరకూ ప్రతిపాదించగలిగాడో అన్నదిమాత్రమే చూడాలి గాని, మన దృష్టితో ఆ గ్రంథం వ్రాయబడలేదని దానిని చిన్నచూపు చూడ కూడదు. మహాభారతం ఆర్ష సంప్రదాయానికి చెందినది. దానిని అనార్ష సంప్రదాయ గ్రంథ దృష్టితో విమర్శించబూనడం సరైన పద్ధతి కాదు. A, B, C, D ...లు తెలిసిన అందరికీ ఇంగ్లీషులో ఉన్న ఇంజనీరింగు పుస్తకమో, కెమిస్ట్రీ పుస్తకమో అర్థంకాదు. తగిన శిక్షణా, ప్రాథమికమైన పరిజ్ఞానమూ ఉండి తీరవలసిందే దేనికైనా! అందుకనే వారు, “...అందుచేత ననార్ష సంప్రదాయ గ్రంథావలోకనముతో గాలము గడుపుచు నార్ష సంప్రదాయము నతిక్రమించి సంచరించువారికి కార్ష సంప్రదాయ గ్రంథములు ఎట్లో కనబడుటకభ్యంతరము లేదు. కనుకనే అనార్ష సంప్రదాయ గ్రంథ దృష్టితో నార్ష సంప్రదాయ గ్రంథములను విమర్శించుటలో నెంతయో హాని సంభవించినది. ఏ గ్రంథమే సంప్రదాయమునకు జెందినదో ఆ సంప్రదాయము ననుసరించియే ఆ గ్రంథమును పరిశీలింపవలెననునది విజ్ఞులకు దెలియనిది కాదు...” అని వివరించారు.

చరిత్రకు అనేకమైన పరిమితులు ఉన్నాయి. గౌతముడు సిద్ధార్థుడై బౌద్ధమతాన్ని స్థాపించాడని చరిత్ర చెబుతుంది. బౌద్ధమత సిద్ధాంతాలను, ఆ మత ప్రభావాన్ని కూడా చరిత్ర పరిశోధకులు వివరిస్తారు. కాని, గౌతమునిలో వచ్చిన పరివర్తన స్వరూపాన్ని, అందుకు కారణమైన అతనిలోని తాత్త్విక జిజ్ఞాసనూ చరిత్ర నిరూపించదు. వివేకానందుడు అమెరికాలోని చికాగో నగరంలో జరిగిన విశ్వమత మహాసభలో భారతదేశం తరపున ప్రసంగించి, భారతీయ సంస్కృతీ వైభవాన్ని ప్రపంచానికి చాటటాన్ని చరిత్ర అంగీకరిస్తుంది. కాని, అతని వెనుక పనిచేసిన రామకృష్ణపరమహంస దివ్యశక్తిని గురించి

1. అనేక కర్తృత్వ నిరాకరణము, పుట - 129.

మాత్రం చరిత్ర మూగబోతుంది. గాంధీజీ స్వాతంత్ర్యోద్యమ నాయకత్వం వహించి, కోట్లాది ప్రజలను తన నోటిమాటతో శాసించాడని మాత్రమే చరిత్ర చెబుతుంది గానీ ఆయనకు ఆ మహత్తరశక్తి ఎలా వచ్చిందో, ఆయనను జనం మహాత్ముడని ఎందుకు సంభావించేవారో పట్టించుకోదు. దృక్పథం వేరుకావచ్చు. కానీ; శ్రీశ్రీ మాటలను ఈ సందర్భంగా స్మరించుకోకుండా ఉండలేం. 'దేశచరిత్రలు' అనే ఖండికలో అతడు చరిత్రయొక్క అసమగ్రతను గూర్చి ఇలా చెప్పాడు:

"ఏ యుద్ధం ఎందుకు జరిగెనో?
ఏ రాజ్యం ఎన్నాళ్ళుందో?
తారీఖులు, దస్తావేజులు
ఇవి కావోయ్ చరిత్రకర్థం."
"ఈ రాణీ - ప్రేమ పురాణం,
ఆ ముట్టడికైన ఖర్చులూ,
మతలబులూ, కైఫీయతులూ
ఇవికావోయ్ చరిత్రసారం."[1]

విశ్వచైతన్యాన్ని వివరించే ఇతిహాసాల్లో శిథిలగాథలకై దేవులాడటం ఐతిహాసిక సమీక్ష కాదు.

వ్యాసుణ్ణి ఒక పరమగురువుగాను, కవిత్రయం వారిని మహర్షులుగాను సంభావిస్తూ, వారు మహాభారతగాథను ఏ పరమార్థంతో లోకానికి అందించారో అదే పరమార్థదృష్టితో కథాక్రమాన్ని, వివిధ సన్నివేశాలను, పాత్రలను పరామర్శించడం, అందిన మేరకు ఆ దివ్యగాథలోని సందేశాన్ని గ్రహించడం మన కర్తవ్యం. ధృతరాష్ట్రుని అంతర్యాన్ని సంజయుడూ, వ్యాసుని హృదయాన్ని కవిత్రయంవారూ అందుకోగలిగినట్లుగా ఆ మహాగాథలోని లోతుల్ని అందుకోవడానికి చేసే ప్రయత్నాన్ని ఐతిహాసిక విశ్లేషణంగా పరిగణించవచ్చు.

1. మహాప్రస్థానం - శ్రీశ్రీ, 13వ కూర్పు 1970, పుట - 73.

## 3. పరిశోధన ప్రకాశిక

మహాభారతంలో ద్రౌపదీ మహాదేవి పాత్రను ఇతిహాసదృష్టితో విశ్లేషించడం ప్రస్తుత సిద్ధాంతవ్యాస లక్ష్యం.

ఇతిహాసం వాస్తవాంశాల కథనమే గాని కవుల కల్పనకాదు. కనుక ఇతిహాసంలో పాత్రచిత్రణం అంటూ ఉండదు. వ్యాసభగవానుడు భారతగాథలోని ఏ ఒక్క పాత్రనూ తానుగా సృష్టించలేదు. తనకళ్ళ ముందుజరిగిన వృత్తాంతాన్ని యథాతథంగా ఆయన గ్రంథస్థం చేసాడు. కవిత్రయంవారు కూడా ప్రధాన సన్నివేశాలను గాని, పాత్రల స్వరూప స్వభావాలను గాని మార్చకుండా, మూలగ్రంథపు ఇతిహాస గౌరవానికి భంగం కలుగనిరీతిలో తెలుగులో మహాభారతాన్ని రచించారు.[1] ఐతే సంస్కృతాంధ్రభారతాలను పోల్చిచూసిన వారికి కన్పించిన తేడాల మాట ఏమిటి? అన్న ప్రశ్న వెంటనే వస్తుంది. అలా పోల్చిచూసిన వారు ఒక్క విషయాన్ని అంగీకరిస్తూనే ఆ విధంగా పరిశీలించారు–

---

1. "పాత్రల శీలస్వభావాదుల ప్రదర్శనమునందు గూడ కవిత్రయమువారు పెద్దగ చేసినమార్పులు కన్పించవు. పాత్రలను, ఆ పాత్రలశీలస్వభావాదులను నిర్ణయించు సన్నివేశములను వ్యాసమహర్షియే కల్పించియున్నాడు. ఎడనెడ ఉచితములని తోచి నపట్ల రసస్ఫూర్తికై సంభాషణ క్రమమునందును, ఆంగికసాత్త్వికాభినయ వర్ణనము నందును అలతియలతి మార్పులను మాత్రమే కవిత్రయము వారు చేసినట్లు కనుపట్టును. సంస్కృత మహాభారతములో ఆంధ్రమహాభారతమును సరిగపోల్చి చూచినపుడు– నన్నయ పాత్రలు పౌరాణికములని, తిక్కన పాత్రలు లౌకికములని, నన్నయ ద్రౌపదికన్న తిక్కన ద్రౌపది గడుసరియని సిద్ధాంతములు చేయుట కవకాశము లేనట్లే తోచును. పాత్రలన్నియు వ్యాసమహర్షివి. ఆయన ఆయాపాత్రలను ఆయా సందర్భములలో ఏవిధముగ తీర్చిదిద్దునో కవిత్రయము వారుగూడ ఆ పాత్రలను ఆయా సందర్భములలో ఆ విధముగనే దిద్ది తీర్చినారు. మెరుగులు పెట్టుట విషయాంతరము."

——మహాభారతము - మానవస్వభావ చిత్రణ
డా. అప్పజోడు వేంకట సుబ్బయ్య

కవిత్రయంవారు ప్రమాణంగా తీసుకున్న సంస్కృత భారతప్రతులు ఇదమిత్థంగా తెలియడం లేదు– అని.

నిజమే, నన్నయ తిక్కనలది ఆ విమర్శకులు భావించినట్లుగా అనువాదమే అనుకొందామనుకొన్నా వారి అనువాదానికి ఆధారమైన మూలగ్రంథమేదో నిర్ణయించడం ఎలా? సరిగ్గా మనకు దొరుకుతున్న ప్రతులువంటివే వారికీ దొరికి ఉంటాయని ఊహించలేం. ఆ ముగ్గురు కవులూ అనువదించకుండా వదిలివేశారని మనం అనుకొంటున్న భాగాలు గాని, మూలానికి భిన్నంగా వారు నూతనంగా కల్పించారని చెప్పుకొంటున్న భాగాలుగాని వారుచేసినట్లే వారికి లభ్యమైన మూలగ్రంథాలలో ఉన్నాయేమో! సమిష్టిమీద చూస్తే కవిత్రయం వారి రచన వ్యాసుని రచనతో అన్నివిధాలుగాను సరిపోతోంది గనుక, ఆయాసందర్భాల్లో వారు వదిలివేసిన సన్నివేశాలు ఏవైనా ఉంటే అవి వారి దృష్టిలో వ్యాసునివి కావని భావించవచ్చును. (సనత్సుజాతీయం, భగవద్గీత వంటివానిని కావాలనే తిక్కన సంక్షేపించి ఉంటాడు.)

ఇంక, పాత్రపరిశీలన విషయానికివస్తే, లౌకికంగా నిత్యజీవితంలో ఎదురయ్యే సన్నివేశాల్లో వ్యక్తులపాత్ర (role) నీ, వారి స్వభావాలనూ ఏవిధంగా 'బేరీజు' వేసుకొంటున్నామో, ఇతిహాసాల్లోనూ అలాగే 'బేరీజు' వేసుకోవాలి.[1] ఎటొచ్చీ ఒక తేడా తప్పదు– నిత్యజీవితంలోని పాత్రలు సమకాలీనమైనవి, కనుక మనంతట మనంగా వారిని గురించి మనకు ఇష్టమైన నిర్ణయాలు చేసుకొంటాం. ఇతిహాసం

1. "జరిగినది జరిగినట్లు పారంపర్యముగా విన్నదివిన్నట్లు చారిత్రక దృష్టితో గ్రంథస్థము చేయుట యితిహాస పురాణముల ధర్మము. యథార్థకథనమేగాని వీనిలో పాత్రచిత్రణ యుండదు. కావ్యనాటకములకు, నితిహాసపురాణములకు గల మౌలిక మగు భేదమిదియే..." బి.ఏ. మొదటిసంవత్సరం తెలుగు పాఠ్యగ్రంథం (ఆంధ్రా యూనివర్సిటీ) లో 'ద్రౌపది మాతృహృదయము' అనే జోగారావుగారి (సప్తతంతువు) వ్యాసానికి గ్రంథసంపాదకుల వ్యాఖ్య.

లో పాత్రలు గతకాలీనమైనవి, ఇతిహాస కర్త ఆయా పాత్రలనుగురించి ఏమి చెప్పాడో అవే మనకి ప్రమాణాలు. అంతకు భిన్నంగా మనం భావించడం మొదలుచెడ్డ నేరమే అవుతుంది.

అమెరికాను చూసివచ్చినవాడొకడు తన పల్లెటూరి మిత్రునితో అక్కడి విశేషాలను వర్ణించి చెబుతూ, "అమెరికాలో నలభై యాభై అంతస్థుల భవనాలు ఉంటాయి, అక్కడ ప్రతి వ్యక్తికీ ఒక్కో కారుఉంటుంది. వీధుల్లో దుమ్మూ, ధూళీ అనేది ఎక్కడా కనిపించదు." అనివివరిస్తే, ఆ మిత్రునికి నమ్మడం కష్టంగానే ఉంటుంది. అతడు ఆ అమెరికా విశేషాలను నమ్మకపోవడం దోషంకాదుకాని, తన మిత్రుడు అబద్ధాలాడుతున్నాడనో, అతిశయోక్తులు చెబుతున్నాడనో అనుకొంటే మాత్రం తప్పే. చూసినవాడు చెబుతున్నదికాదని, తెలిసిన దానినిబట్టి సొంతంగా ఊహించుకొంటాననే వాడిని ఏమనగలం?

భారతకథ విషయంలో ప్రత్యక్ష సాక్షి ఒక్కడే- వ్యాస భగవానుడు. అతడు ప్రసాదించినదే మహాభారతం. దానికి దార్శనిక మైనపరివర్తనం ఆంధ్రమహాభారతం. ఆ భారతం ఆధారంగా ఆగాథలో ద్రౌపది పాత్రా, ఆమె ప్రాముఖ్యమూ, ఆమె విశిష్టతా వర్ణించబడిన తీరు విశ్లేషించబడుతోంది తరువాతి అధ్యాయాల్లో.



## 4. ద్రౌపది పాత్ర పరిశీలనావశ్యకత

మహాకవి విశ్వనాథసత్యనారాయణగారు తమ రామాయణ కల్పవృక్ష కావ్యారంభంలో

"మరల నిదేల రామాయణం బన్నచో
నీ ప్రపంచకమెల్ల నెల్లవేళ
తినుచున్నయన్నమే తినుచున్నదిన్నాళ్ళ
తన రుచి బ్రదుకులు తనవిగాన
తలచిన రామునే తలచెదనేనును
నా భక్తిరచనలు నావిగాన
................................"

అని చెప్పుకున్నారు.

మహాభారతంపై ఇప్పటికే చాలా పరిశోధన జరిగింది, అందునా ద్రౌపది పాత్రపై "సమగ్రపరిశీలనము" జరిగింది గదా, మళ్ళీ ఎందుకు ఈ ఐతిహాసిక విశ్లేషణ? అంటే, "......నా దృష్టి, రచనలు నావిగాన" అని విశ్వనాథవారి మాటలనే కొద్దిగా మార్చి చెప్పవలసివస్తుంది.

వ్యాసభగవానుడు ద్రౌపదిని అయిదుగురికి భార్య అయిన మహాపతివ్రతగా నిరూపించడం మహాశ్చర్యకరమైన విషయం.

"అహల్యా ద్రౌపదీ సీతా తారా మండోదరీ తథా ।
పంచకన్యాః స్మరేన్నిత్యం మహాపాతక నాశినీః ॥"

అంటూ నిత్యస్మరణీయులైన కన్యల్లో ద్రౌపది పేర్కొనబడటం మరింత ఆశ్చర్యకరం.

ద్రౌపది అయోనిజగా యజ్ఞగుండం నుంచి జన్మించడం, పాండవులు ఆమెను చేపట్టడం, మహోన్నతమైన వైభవాలను, మహా

దారుణమైన అవమానాలను ఆమె అనుభవించడం అసాధారణమైన విషయాలు.

దివ్యమైన ఆమె సౌందర్యం, అసామాన్యమైన ఆమె సామర్థ్యం అసహజమైన ఆమె పంచభర్తృత్వం పరమార్థదృష్టితో చూసినప్పుడు ఆమెకు వరాలుగాను, లౌకికదృష్టితో చూసినపుడు శాపాలుగాను భాసిస్తాయి.

ప్రపంచసాహిత్యంలో మహాభారతం వంటి మరో మహాగ్రంథం ఉంటే ఉండవచ్చునేమోగానీ ద్రౌపది వంటి మహోన్నతమైన పాత్ర మాత్రం ఎక్కడా కనిపించదు.

మహాభారత కాలంనాటినుంచీ నేటివరకూ ద్రౌపది ఎన్నో అపవాదులకు లోనవుతూనే ఉంది.

కర్ణాదులు ఆమెను నిండుసభలో 'బంధకి' అని పరిహసించగా ఆధునికులు ఆమెను ఒక ఆటవికజాతికి చెందినస్త్రీగా పరిగణిస్తున్నారు.

మరొక అన్యాయమైన విషయం—మహాభారత యుద్ధానికి ద్రౌపదీదేవే మూలకారణం అని చాలామంది విమర్శకులు అభిప్రాయపడటం.

"పదునెనిమిది యక్షౌహిణుల సైన్యము పదునెనిమిది దినములలో కురుక్షేత్రమున హతమయ్యెను. ఈ మహాయుద్ధమునకు ద్రౌపదియే కారణము. ఆమె మహాశక్తిస్వరూపిణి – రుద్రపత్ని – దుర్గాంశసంభూతురాలని కొన్ని గ్రంథములలో గలదు...."[1]

"ద్రౌపది లేనిచో వారివైరమింత తీవ్రరూపము దాల్చెడిది కాదు. ద్రౌపదీ వస్త్రాపహరణమే కౌరవపాండవ వైరభావమునకు శిఖరమువంటిది. విరోధము లుండవచ్చును. ఒకరికొకరపకారములు చేసికొనవచ్చును. ఈ విరోధము స్త్రీ మానభంగహేతుకమైనప్పుడు దాని వెట్టదనము తప్పరానిదిగా నుండును. ఈ సర్వవైరవృక్షమునకు ద్రౌపది

1. 'నన్నయభట్టు విజ్ఞాన నిరతి' -శ్రీ గొబ్బూరి వేంకటానందరాఘవరావు, పుట-169

మూలకందముగా గన్పించుచున్నది. ఆమెను బలాత్కారముగ దుశ్శాసనుఁడు చీరలొలుచుట, నామెను తన తొడమీఁదఁ గూర్చుండుమని దుర్యోధనుఁడు సన్నచేయుటచేత, భీముడు ప్రతిజ్ఞలు చేసెను. అందు చేత ద్రౌపదియే యీ మహావైరవ్యూహమునకు నడిబొడ్డుగాఁ గన్పించుచున్నది.......”[1]

“వ్యాసమహర్షి ద్రౌపదిని వీరపత్నిగా చిత్రించెను. ప్రపంచ మహేతిహాసములన్నియు స్త్రీ నిమిత్తముగ జరిగినవి. సీతామహాసాధ్వి కారణముగ రావణసంహారము, ద్రౌపదీ పరాభవ కారణముగ కౌరవ నాశము జరిగినవి. సమాజములో కలుగు సంఘర్షణలకు స్త్రీలకుజరుగు అవమానములు, వ్యక్తులలో ఆవేశమును ఎంతపెంచునో, భీకరప్రతిజ్ఞల నెట్లు చేయించగలవో, దోషులనెల్లు దహింపగలవో, కనీవినీ ఎరుగని దారుణ పరిణామమునకెట్లు దోహదము చేయునో ద్రౌపదీ పరాభవము నిరూపించినది. సృష్టిస్థితిలయములను మూడు శక్తులు ముప్పేటగానున్న మూర్తులే మహిళలు. భారత మహేతిహాసమునకు ద్రౌపది నాయిక. కథయంతయు ఆ మూలశక్తి కేంద్రముగా చేసికొని నడచినది.”[2]

“ద్రౌపది జీవితములో వగ, పగ ప్రధాన భూమికలు నిర్వహించినవి. ఆమె పగకు శత్రుకృతావమానమువలనివగ హేతువు. శత్రువధయే ఆమె పగకు ఉచితమైన ఉపశాంతి. సభాపర్వములో మొదలైన ఆమెవగ పగగా పరిణమించి పాండవ కార్యముల యందు ప్రదీప్తశిఖగా ప్రజ్వలించి యుద్ధపంచకమునందు విస్తరించి సమాప్తి చెందినది.”[3]

---

1. ‘నన్నయగారి ప్రసన్నకథాకలితార్థయుక్తి’ - ప్రధానకథ
—శ్రీ విశ్వనాథ సత్యనారాయణ.
2. ‘ఆంధ్రమహాభారతము - ఔపదేశిక ప్రతిపత్తి’ - పుట - 336 - 337
—డాక్టర్ నందుల గోపాలకృష్ణమూర్తి
3. ‘ఆంధ్రమహాభారతములో ద్రౌపదిపాత్ర - సమగ్రపరిశీలనము’ (అముద్రిత సిద్ధాంత వ్యాసము) ఉస్మానియా - 1981 - డా కె. యస్ ఇందిరాదేవి

ఇవి కొన్ని మచ్చులు మాత్రమే. ఇలాంటి అభిప్రాయాలను ఎన్నయినా చూపవచ్చు.

ఒక వ్యక్తిపై మరొక వ్యక్తి నిష్కారణంగా దౌర్జన్యం జరిపినపుడు, బాధ్యతగల ప్రభుత్వంవారు తాముగా జోక్యంచేసుకొని దోషిని శిక్షిస్తారు. ఇది లోకరీతి. ప్రభుత్వం తరఫున పోలీసువారు దోషిని పట్టుకొని, ఆరోపణలు ఋజువుపరచి, శిక్షించడంలో దౌర్జన్యానికి లోనైనవ్యక్తి ప్రమేయం ఏమీ లేదనే చెప్పాలి— విచారణ సమయంలో తనపై జరిగిన దౌర్జన్యాన్ని గూర్చి వివరించడం మినహాగా—. ఇక్కడ ధర్మం తనంతతానుగా వర్తించి, దోషిని శిక్షించింది. అంత మాత్రమే.

అలాకాక, దౌర్జన్యానికి లోనైనవ్యక్తి తిరగబడి దోషిని ఏమైనా చేసినా, లేక, పగపెట్టుకొని, అనంతరకాలంలో ప్రతీకారం తీర్చుకున్నా, అతడు ధర్మాన్ని తనచేతుల్లోకి తీసుకున్నట్లు అవుతుంది. అది అక్రమం. అప్పుడు ప్రభుత్వం దృష్టిలో దౌర్జన్యం చేసినవాడూ, ప్రతీకారం తీర్చుకున్నవాడూ ఇద్దరూ దోషులే అవుతారు.

ఈ రెండుసందర్భాలలోను స్థూలదృష్టికి దౌర్జన్యంచేసినవాడు చేయబడినవాని కారణంగా శిక్షించబడినట్లే కనిపిస్తుంది. కానీ, సూక్ష్మంగా పరిశీలిస్తే మొదటిసందర్భంలో దోషి దండింపబడటంలో బాధితుని ప్రమేయం ఏమీ లేదు. దోషి తనదోషం కారణంగా శిక్షింపబడ్డాడు— అంతే! రెండవ సందర్భంలో మాత్రమే దోషికి బాధితుని కారణంగా హానిజరిగింది. బాధితుని పగ దోషిని సర్వనాశనం చేసిందని చెప్పడం ఈ సందర్భంలో మాత్రమే ఒప్పుతుంది.

ద్రౌపదికి కురుసభలో జరిగిన పరాభవానికి ప్రతీకారంగా భారతయుద్ధం జరుగలేదు. యుద్ధం వరకూ వ్యవహారాన్ని లాగించీ,

"ఎవ్వరైన సంగ్రామమునన్ జయంబుగొని రాజ్యము సేయుట నిశ్చయించితిన్"[1] అని ముందుగా ప్రకటించింది దుర్యోధనుడే. యుద్ధం అనివార్యం అని తేలిన తర్వాత, పాండవుల పౌరుషాగ్నిని ప్రజ్వలింప జేయటానికి మాత్రమే ద్రౌపదికి జరిగిన పరాభవం పనికి వచ్చింది. కౌరవులు "తమ్ముఁదమలోభమనుచిచ్చు దరికొనంగఁ దెగినవా"రయ్యారు[2] గాని ద్రౌపది కారణంగా కాదు. ఈ విషయాన్ని సోపపత్తికంగా నిరూపించవలసిన అవసరం ఎంతైనా ఉంది. ద్రౌపదీదేవి కారణంగా కురువంశం నాశనమైందని గతానుగతికంగా వస్తున్న అభిప్రాయం తప్పనీ, మహాభారతయుద్ధం ధర్మంకోసం మాత్రమే జరిగిందనీ స్థాపించబడవలసి ఉంది.

భారతాఖ్యానానికి సూత్రధారుడు శ్రీకృష్ణుడనీ, పాత్రధారులు పాండవులూ, కౌరవులూ అనీ చూశాం. ఆ జగద్గురుని జగద్వ్యూహంలో ద్రౌపదీదేవి పాత్ర, అంటే, శ్రీకృష్ణుని నేపథ్యంలో ద్రౌపది–అన్న అంశానికి సంబంధించిన పరిశీలన ఇప్పటి వరకూ జరుగలేదనే చెప్పాలి. ఆమె పుట్టుకలోని పరమార్థం, దాంపత్యంలోని ధర్మసూక్ష్మత బోధపడాలంటే ఆ విధమైన పరిశీలన ఎంతో అవసరం.

ద్రౌపది ఆయా సన్నివేశాల్లో ప్రదర్శించిన ఓర్పు, నేర్పూ లోకానికి ఆదర్శప్రాయం. ఆమె వెలుగులో మన జీవితాలను మనం తీర్చిదిద్దుకోవడం కోసమని వ్యాసభగవానుడు ఆమె చరిత్రను మనకు అందించాడు. కనుక ఏతన్ముఖంగా మహాభారతంలోని ద్రౌపదిని సందర్శించడానికి సాగిన ప్రయత్నం ఇది. గోవిందుని చెలియలుగా ఆమె పాత్ర ప్రాముఖ్యాన్ని, పాండవపత్నిగా ఆమెద్వారా వ్యక్తమైన దివ్యజీవనాన్ని తరువాతి అధ్యాయాల్లో పరామర్శించడం జరిగింది.

ముందుగా మహాభారతాఖ్యానంలో ద్రౌపదీ ప్రాముఖ్యాన్ని సమీక్షించడం జరుగుతోంది.

1. ఉద్యోగ - 3 - 363 2. ఉద్యోగ - 1 - 353

## 5. మహాభారతాఖ్యానంలో ద్రౌపది ప్రాముఖ్యం

ద్రౌపది కారణజన్మురాలు.

ద్రుపదమహారాజు ద్రోణునిచే అవమానింపబడిన తర్వాత బ్రాహ్మణోపాస్తి చేసి, ద్రోణుని సంహరించగల కుమారుని, అర్జునునికి భార్యకాగల కుమార్తెనుపొందాడు. వారే ధృష్టద్యుమ్న, ద్రౌపదులు. అర్జునుడు ద్రోణ శిష్యుడు. ద్రోణ, ద్రుపదులు ఒకప్పుడు సహాధ్యాయులు. కానీ, విధి వైపరీత్యంచేత వారికి వైరం కలిగింది. ఆ వైరం ప్రతీకారాన్ని కోరింది. గురుదక్షిణగా ద్రుపదుని బంధించి తెమ్మని అర్జునుని ఆదేశించాడు ద్రోణుడు. అర్జునుడు గుర్వాజ్ఞను పాటించాడు. గుండెల్లో గుప్తపరుచుకొన్న పరాభవవాగ్నిని మాటలతో వెళ్ళగక్కి చల్లార్చుకొన్నాడు ద్రోణుడు. అయితే అది అంతటితో పోలేదు. ఆశీవిషాన్ని అలిగించి వదిలినట్లయింది. పర్యవసానంగానే ధృష్టద్యుమ్న, ద్రౌపదులు ఆవిర్భావం.

ఇది ఒక కారణం— లౌకికమైనది.

ఒకానొక మునికన్య కర్మవశాన పతిని పొందలేక శివుని గూర్చి ఘోరతపస్సు చేసింది. శివుడు ఆమెకు ప్రత్యక్షమై వరం వేడుకోమన్నాడు. ఆమె ఆతురతతో అయిదుసార్లు పతిదానం వేడుకొంది. శివుడు, 'అలాగే, నీకు దేహాంతరాన అయిదుగురు పతులవుతారు. ఇది పరమార్థం' అని దయతో ఆమెను అనుగ్రహించాడు. ఆ మునికన్య పాంచాలపతికి కృష్ణగా జన్మించింది.

ఇది మరొక కారణం— దివ్యమైనది.

ఈ రెండూకాక, విశ్వప్రణాళికకు సంబంధించిన మరొక కారణంకూడా ఉంది. త్రేతా, ద్వాపర సంధికాలంలో మర్త్యులు అమర్త్యులై, భూభారం పెరిగిపోయింది. భూదేవి దేవతలతో కూడిఉన్న హరిహరహిరణ్యగర్భుల దగ్గరకు పోయి మొరపెట్టుకొంది. యమధర్మ

రాజు సత్త్రయాగదీక్షలో ఉండి ప్రాణిహింస మానుకొన్నాడనీ, అతని దీక్ష ముగియగానే పూర్వంలా నరులను అంతం చేస్తాడనీ బ్రహ్మ, దేవతలకు తెలిపాడు. యముని అంశతోను, ఇంద్రాదుల అంశలతోను భూలోకంలో జన్మించే అయిదుగురి కారణంగా యమధర్మరాజుయొక్క పని నెరవేరుతుందని కూడా బ్రహ్మ వివరించాడు. శివునిగూర్చి తపస్సు చేసి వరంపొందిన మునికన్య ఇంద్రుని రాకను ప్రతీక్షిస్తూ ఆకాశ గంగాతీరంలో ఉండగా, బ్రహ్మ సభనుంచి దేవతలతో తిరిగివస్తున్న ఇంద్రుడు ఆమెనుచూశాడు. ఆమె కన్నీళ్ళు నీటిలోపడి కనకకమలాలు అవుతున్నాయి. అందుకు ఎంతగానో ఆశ్చర్యపడి ఇంద్రుడు ఆమెను సమీపించాడు. ఆమె ఇంద్రుని తనవెంట రుద్రునికడకు తీసుకువెళ్ళింది. రుద్రుని ఆదేశం మేరకు ఇంద్రుడు అయిదు రూపాలను పొంది, ధర్మా నిలశకాశ్వినులు ఆధానకర్తలుగా భూలోకంలో జన్మించాడు. ఆ పంచేంద్రులకు ఏకపత్నిగా ఆమె భూలోకంలో యజ్ఞవేదికనుంచి ఆవిర్భ వించింది. ఇదంతా దేవహితార్థం నడిచినకథ.

స్థూలసూక్ష్మకారణాలకు సంబంధించిన ద్రౌపది అవతరణ వృత్తాంతాలు ఇవి.

లౌకిక వృత్తాంతానికి సంబంధించి—

తనను అవమానించిన క్షత్రియునిపై క్షత్రియుడైన అర్జునుని ప్రయోగించి పరాభవించాడు ద్రోణుడు.

తనను పరాభవించిన బ్రాహ్మణునిపై పగతీర్చుకోవడంకోసం బ్రాహ్మణోపాస్తి చేశాడు ద్రుపదుడు.

అర్జునుడు నిమిత్తమాత్రుడు—

తనను జయించిన అతని పరాక్రమానికి ముచ్చటపడి, అతని తో బాంధవ్యాన్ని వాంఛించాడు ద్రుపదుడు. కుమార్తెనిచ్చి అర్జునుణ్ణి తనవానిగా చేసుకొని, కుమారునితో ద్రోణుని చంపించాలని ద్రుపదుని వ్యూహం!

ఈ కథంతా తెలిసే పాండవులు ద్రౌపదిని చేపట్టారు.

బలవంతుడైన ద్రుపదునితో పాండవులకు బాంధవ్యం ఏర్ప డినందుకు ధృతరాష్ట్రుడు హడిలిపోయి, వారిని పిలిపించి, అర్ధరాజ్యం ఇచ్చి బ్రతికిపోయాడు అప్పటికి.

పాండుపుత్రునిగా యౌవరాజ్యాభిషేకం మాత్రమే పొంద గలిగిన యుధిష్ఠిరుడూ, అతని సోదరులూ పాంచాలీ పరిణయంతో అర్ధ రాజ్యప్రాప్తిని పొందారు.

ధర్మజుడు మొదటిసారి జూదమాడి సర్వస్వాన్ని ఓడిపోయి నప్పుడు కూడా, ధృతరాష్ట్రుడు అప్పటికి తనవారిని రక్షించుకోవడం కోసమని, మార్గాంతరం లేక, ద్రౌపదిని అనుగ్రహిస్తున్నట్లుగా పాండ వుల రాజ్యం పాండవులకు ఇచ్చివేశాడు.

పాండవుల రాజ్యభాగార్హత ఇప్పటికీ వివాదాస్పదమై ఉండగా, వారికి రాజ్యభాగం అనేది ద్రౌపది కారణంగానే సిద్ధించిందనే విషయం ఆశ్చర్యకరం. అరణ్యాజ్ఞాతవాసాల తరువాత పాండవులు మా రాజ్యం మాకు ఇవ్వండి అని అడిగినప్పుడు దుర్యోధనాదులు పాండవుల రాజ్యార్హతను గురించి ప్రశ్నించే అవకాశం లేకుండాపోయింది. రాజ్యం వీరభోజ్యం అని మాత్రమే అతడు చాటుకోవలసి వచ్చింది.

పాండవుల జీవితంలోకి శ్రీకృష్ణుడు ప్రత్యక్షంగా ప్రవేశించి నదికూడా ద్రౌపదీ వివాహ సందర్భంగానే అనే విషయాన్ని గమనించి నప్పుడు ఆమె పుట్టుక వెనుక గల పరమార్థం కొంతవరకూ బోధ పడుతుంది. ఒక విధంగాచూస్తే, పాండవులను వివాహం వరకూ కుంతీ, వ్యాసభగవానుడూ, వివాహానంతరం ద్రౌపదీ, శ్రీకృష్ణుడూ నడిపించా రనిపిస్తుంది.

పరమ ధార్మికులైన భీష్మ, ద్రోణాది వీరులూ, బాహ్లికాది కురువృద్ధులూ ధర్మక్షేత్రమైన కురుక్షేత్రంలో శ్రీకృష్ణుని సారథ్యంలో

పాండవుల చేత వధింపబడటానికీ,

కర్ణ దుర్యోధనాదుల పాపం పండటానికీ కారణభూతమైనది ఒకేఒక సంఘటన—

అది కురుసభలో కులసతి అయిన ద్రౌపది పరాభవం. అది కారణంగానే జయింపశక్యంకాని మహావీరులను వారివారికి తగినట్లుగా జయింపజేయటమూ, శ్రుతిమించిన సాత్త్వికతలో మునిగిన ధర్మరాజాదుల్ని యుద్ధోన్ముఖుల్ని చేయడమూ సాధ్యపడింది శ్రీకృష్ణునికి.

యుద్ధప్రారంభంలో కూడని మోహంతో అస్త్రసన్యాసం చేసిన అర్జునుణ్ణి సమాశ్వాసిస్తూ కృష్ణుడు—

"యుద్ధ నిర్ణయం ద్వారా వీరంతా ఇదివరకే నా చేత హతులయ్యారు, నువ్వు కార్యరూపంగా వీరిని జయించి, రాజ్యాన్ని పొంది, ఖ్యాతిని గడించుకో."[1]

అని చెప్పగలగడం కూడా నిండుసభలో ద్రౌపదికి జరిగిన అవమానం కారణంగానే.

రాయబారమప్పుడు దుర్యోధనుడు తిరగబడి,

"అరయం దప్పొకయింత నావలన లే దాధర్మపుత్త్రుండు జూ
దరి వెంటం దమకించి సౌబలునిచేతన్ భూమి గోల్పోయి ము
ష్కరుడై వెండియు నొడ్డెఁగా నతఁడు నక్షప్రౌఢిమై గెల్చె నే
తెరు వైనం దనయిచ్చ తోఁ బడియె నింతే కాక యేఁ బూఁటయే"[2]

అని దోషాన్ని ధర్మజుని పైకి నెట్టజూచినప్పుడు శ్రీకృష్ణుడు మొదటినుంచీ పాండవులకు దుర్యోధనుడు చేసిన అపకారాలన్నింటినీ ఏకరువు పెట్టి, ఆఖరిమాటగా,

1. భగవద్గీత - 11 - 33, 34 శ్లోకాలు
2. ఉద్యోగ - 3 - 358

"అన్నదమ్ముల నెత్తంబులాడి సతుల
తలలువట్టి సభాస్థలంబులకు నీడ్చి
చీర లొలిపింతురే యిట్టివారి నెందుఁ
దడవుమా నీ వొకండవుదక్క నధిప!

"... ... ... ... ... ... ...
... ... ... ... ...కులము శీలముఁ గల్గిన పుణ్యకాంత క
ట్లొప్పమి సేయు టెల్లఁగని యున్న జనంబులు వించునుండఁ గాఁ
దప్పొక యింత లే దనువిధం బది నీక చనుం గుమారకా!"1

అని నొక్కిచెప్పి నొక్కిమూయించడం, 'నీ పతనానికి నీ పాపకృత్యాలే కారణాలవుతాయి సుమా'! అని హెచ్చరించడం, ధర్మజుడు 'దూటు పడకుండా' చేయడం ద్రౌపదిపట్ల కౌరవుల దుష్ప్రవర్తన మూలంగానే నని సూక్ష్మపరిశీలన వలన స్పష్టపడుతుంది.

ఇన్ని విధాలుగా భారతకథలో ప్రాముఖ్యం వహించిన పాంచాలీ వృత్తాంతాన్ని ఇతిహాస దృష్టితో పరిశీలించవలసిన అవసరం ఎంతైనా ఉంది. ఆమె పుట్టుక, వివాహం, దాంపత్యం, ప్రాభవం, పొందిన పరాభవాలు, అనుభవించిన కష్టాలు, చివరికి మహాప్రస్థానానికి సాగినతీరూ లోకసామాన్య విషయాలు కావు.

ఆమె జీవితగాథను పరమార్థ దృష్టితో చూసినవారు ఆమెను శ్రీమూర్తిగా దర్శించి పరవశించారు.

యోగదృష్టితో చూచినవారు ఆమెను కుండలినీశక్తిగా, పంచపాండవులను పంచేంద్రియాలుగా పరిగణించి ముక్తిని పొందడానికి కావలసిన సాధనసంపత్తిని భారతంలో దర్శించటానికి ప్రయత్నించారు.

1. ఉద్యోగ - 3 - 367, 368

భారతకథను ఖగోళశాస్త్రదృష్ట్యా సమన్వయింపయత్నించిన కొందరు ద్రౌపదిని కన్యారాశిగాను, ధర్మజుని మఘా నక్షత్రంగాను, అర్జునుని ఉత్తరఫల్గుణీ నక్షత్రంగాను, భీముని స్వాతీ నక్షత్రంగాను, నకులసహదేవులను అశ్వతర మండలంలోని చుక్కలజతగాను గుర్తించి ఆనందించారు.

ఆధ్యాత్మికంగా భారతాన్ని అన్వయింప దలచినవారు పాండవులను పంచేంద్రియ ప్రవృత్తులకూ, ద్రౌపదిని క్రియాశక్తికీ సంకేతంగా గ్రహించి, మానవజీవితంలో జరిగే సంఘర్షణే భారతయుద్ధమని చెబుతారు.

భారతాన్ని కావ్యదృష్టితో చూసినవారు వ్యాసునిపాత్ర చిత్రణను నన్నయ, తిక్కన, ఎఱ్ఱనల పాత్రచిత్రణ విధానాలతో పోల్చి విడివిడిగా నన్నయద్రౌపది, తిక్కనద్రౌపది, ఎఱ్ఱనద్రౌపది– అనే విధంగా విశ్లేషించారు.

ఎవరిదృష్టికి తోచినట్లుగా వారు యథాశక్తి మహాభారతంలోని ద్రౌపది పాత్రను గురించి పరిశీలనలు చేశారు.

భారతం ఆఖ్యానమనే దృష్టితో ద్రౌపది పాత్రను పరిశీలించడం ఈ వ్యాసకర్త ఆశయం.[1]



1. "స్వయం దృష్టార్థ కథనం ప్రాహు రాఖ్యానకం బుధాః"

# ఆంధ్రమహాభారతము - ద్రౌపది

—ఒక ఐతిహాసిక విశ్లేషణ

## అధ్యాయం మూడు - సందర్శనం

1. ద్రౌపది జన్మవృత్తాంతం
2. వివాహ వృత్తాంతం
3. దాంపత్య జీవితం
4. అవనీతల సామ్రాజ్యోత్సవం
5. ధర్మపత్నీత్వం – కురుసభలో పరాభవం
6. కదనకుతూహలరాగం
7. అడవుల్లో ఇడుములు
8. అజ్ఞాతంలో అవస్థలు
9. రాయబారంలో 'రమణీయత'
10. సంస్కారణయత్నం
11. బెడిసిన తంత్రం
12. సమరాంగణ సౌందర్యం
13. సమాధాన పర్వం
14. యుద్ధంవల్లసిద్ధి - గర్భశోకం
15. జనవాణి
16. అశ్వమేధంనాటి ఆర్భాటం
17. మహాప్రస్థానం
18. స్వర్గారోహణం

# ఆంధ్రమహాభారతము - ద్రౌపది

## —ఒక ఐతిహాసిక విశ్లేషణ

### 1. ద్రౌపది జన్మవృత్తాంతం

"శ్రీమూర్తియై యాజ్ఞసేని పుట్టె" నని ఆదిపర్వంలో సురాసురాంశావతార కీర్తనంలో చెప్పబడింది.[1]

స్వర్గారోహణ పర్వంలో దేవభావం పొందిన ధర్మజుడు ఉదాత్తమూర్తితో వెలుగొందుతున్న ద్రౌపదిని గుర్తుపట్టలేక, ఇంద్రుని 'ఈమె ఎవర'ని ప్రశ్నించగా, అతడు "ఈ భామ మహాలక్ష్మి ద్రౌపది యనఁగ ద్రుపదునికిఁ గూఁతురై యయోనిప్రభవంబగు మానుష రూపంబు మహితలీలముగఁదాల్చి భవదనుభూతి సెల్లించె గౌరీశ్వరు నాజ్ఞ వహించి వచ్చె" నని చెప్పాడు.[2]

శ్రీమూర్తి ద్రౌపదిగా ఆవిర్భవించిన క్రమం భారతంలో వర్ణింపబడినతీరును పరిశీలిద్దాం.

లాక్షాగృహంనుంచి తప్పించుకొని విప్రవేషాల్లో వేదాధ్యయనం చేస్తూ, పాండవులు ఏకచక్రపురంలో కాలం గడుపుతున్నారు. ఒకనాడు ద్రుపదపురంనుంచి ఒక బ్రాహ్మణుడు వచ్చాడు. గృహయజమాని అభ్యాగత పూజలతో అతనిని సంతుష్టుని చేశాడు. కుంతి, ధర్మరాజాదులు ఆ బ్రాహ్మణుని ఉపాసించి "అయ్యా! ఎందుండివచ్చితి రేదేశంబులు రమ్యంబు లెందులరాజులు గుణవంతులు?" అని అడిగారు. ఆ బ్రాహ్మణుడు తా ననేకదేశాలు చూశాననీ, పాంచాలరాజ్యంవంటి దేశమూ, ద్రుపదునివంటి రాజూ ధరాతలంలో మరెక్కడా లేరనీ చెప్పి, "ఆ ద్రుపదుడు అగ్నికుండ సముద్భవ, అయోనిజ, అగణ్యపుణ్య లావణ్యగుణ సమన్విత అయిన తన కుమార్తెను అభిమతుడైన రాజపుత్రున కిచ్చి వివాహం చేయాలని తలచి, సాధ్యసహక, స్వయంవరం

1. ఆది - 3 - 84 2. స్వర్గారోహణ - 58

ఏర్పాటుచేస్తున్నాడు" అని తెలియజేశాడు. కుంతీ, ధర్మజుడూ ఆశ్చర్య పడ్డారు. వెంటనే వారిద్దరూ "ఆ కన్య అయోనిజ ఎలా అయింది? ద్రుపదుడు ఆమెను ఏ రీతిగా పొందాడు? సవిస్తరంగా చెప్పవలసిం" దని ప్రార్థించారు. బ్రాహ్మణుడు చెప్పడం మొదలుపెట్టాడు.

పూర్వం భారద్వాజుడైన ద్రోణుడూ, ద్రుపదుడూ ఇష్ట సఖులై ఒకేచోట వేదాలు చదివి, అగ్నివేశుని దగ్గర ధనుర్వేదం అభ్యసించారు. ఆ తరువాత ద్రుపదుడు పాంచాల దేశానికి రాజయ్యాడు. ద్రోణు డొకసారి వానికడకు పోయి అవమానింప బడ్డాడు. అతడు తిన్నగా హస్తినాపురం చేరుకొని కురుకుమారులకు అస్త్రవిద్యా గురువు అయ్యాడు. గురుదక్షిణగా తనను అవమానించిన ద్రుపదుని ఓడించి పట్టి తెండని ఆదేశించాడు. ఇతరశిష్యులందరూ ప్రయత్నంచేసి విఫలురు కాగా, అర్జునుడు ద్రుపదుని జయించి బంధించి తెచ్చి గురువుకు సమర్పించాడు. ద్రోణుడు వానిని ఎగతాళిచేసి వదిలివేశాడు.

ద్రుపదునికి ద్రోణునిపట్ల ద్వేషం కలిగింది. రణరంగంలో ద్రోణుని చంపగల కొడుకునూ, అర్జునునికి దేవి కాగల పుత్రికనూ పొందాలని నిశ్చయించాడు. యాజోపయాజుల్లో యాజునివల్ల తన మనోరథం ఈడేర్చుకోగలిగాడు. కోకిలాదేవి పత్నిగా పుత్రకామేష్టి చేయడంతో అగ్నిదేవుడు ప్రసన్నుడయ్యాడు. ధృష్టద్యుమ్నునితో బాటుగా

"కులపవిత్ర సితేతరోత్పల కోమలామలవర్ణ యు
త్పలసుగంధి లసన్మహోత్పల పత్త్ర నేత్ర యరాళకుం
తలవిభాసిని దివ్యతేకముఁదాల్చి యొక్క కుమారి త
జ్జ్వలనకుంపమునందుఁబుట్టెఁ బ్రసన్నమూర్తి ముదంబుతోన్"1

ఆమెకు కృష్ణ అని ఆకాశవాణి నామకరణం చేసింది. ఆ కృష్ణ ఇప్పుడు వివాహార్హ అయింది.

1. ఆది - 7 - 19

కుంతీ, పాండవులూ లక్కయింటిలో కాలిపోయారని బ్రాహ్మణులు చెప్పగా విని ద్రుపదుడు శోకవిహ్వలుడు అయ్యాడు. అర్జునుని కొరకని పొందిన కన్యను ఇతరులకు ఎలా ఇవ్వడం? అని బాధ పడ్డాడు. విధిని నిందించాడు. అప్పుడతని పురోహితుడు ఉపశ్రుతినిబట్టి పాండవులు జీవించే ఉన్నారని గ్రహించి, ద్రౌపదికి స్వయంవరం చాటిస్తే వారు ఎక్కడఉన్నాసరే బయటపడతారని చెప్పి, అతనికి ఆనందం కలిగించాడు.

ఎవ్వరికీ మోపెట్టటానికిగానీ, పైకెత్తటానికిగాని శక్యంకాని బలమైన వింటినీ, దూరంగా ఆకాశంలో తిరిగే ప్రకాశవంతమైన కనక మత్స్యయంత్రాన్నీ నిర్మించాడు ద్రుపదుడు. దాన్ని భేదించినవానికి తనకుమార్తె నిస్తానని చాటించాడు. భూమండలాన గల ఎక్కడెక్కడి రాజకుమారులూ కాంపిల్య నగరానికి తరలిపోతున్నారు. వారంతా స్వయంవరంలో ఆ కన్యను పొందాలని ఒకరితో ఒకరు పోటీపడుతున్న వారే.

ఈ వృత్తాంతం విన్న పాండునందనులు కూడా స్వయంవరా నికి పోవటానికి ఉత్సాహపడ్డారు. కొడుకుల ఇంగిత మెరిగిన కుంతి ప్రయాణానికి సిద్ధమయింది.

వారంతా బయలుదేరి ముందుకు సాగుతూ ఉండగా దారిలో వారికి తమోహరుడూ, హరిమూర్తీ, ఆర్తిహరుడూ, పరాశరాత్మజుడూ అయిన వ్యాసభట్టారకుడు దర్శనమిచ్చాడు. "వినీతాత్ములై ధర్మవ తాత్పర్యముగ నిర్మలమతి నెగడునది" అని వారిని ఆశీర్వదించి ఇలా చెప్పాడు:

"ఒకానొక మునికన్య కర్మవశాన పతిని పొందలేక, దౌర్భాగ్యవతి అయి, శివునిగూర్చి ఘోరమైన తపస్సు చేసింది. శివుడు ప్రత్యక్షమై వరం కోరుకొమ్మనగానే ఆమె వేడుకతో "పతిదానం"

అని అయిదుసార్లు అడిగింది. శివుడు ఆమెకు "నీవు కోరినట్లే దేహాంతరాన నీకు అయిదుగురు పతులుంటారు. ఇది పరమార్థం" అని దయతో వరం ఇచ్చాడు. ఆ మునికన్యే ఇప్పుడు పాంచాలపతికి 'కృష్ణ' అనే పేరుతో జన్మించి పెరుగుతోంది. ఆ రాజు ఆమెకు స్వయంవరం ఏర్పాటు చేశాడు. మీరు ఆ ద్రుపదపురానికి వెళ్ళండి. మీకు మేలవుతుంది."

పాండవులు ప్రయాణం కొనసాగించారు. దారిలో కొందరు బ్రాహ్మణులు కలిసి, తాము ద్రౌపది స్వయంవరోత్సవానికి పోతున్నామనిచెప్పి, ద్రౌపది వృత్తాంతాన్ని వివరించారు. వారు తమబుదికి తోచినవిషయాన్ని— 'మీలో విశాల వక్షస్కుడూ, నల్లనివాడూ అయిన ఇతనిని ఆ కన్య సంతోషంతో వరిస్తుంది'— అని తెలిసి, "మా యెఱిఁగిన కార్యమిది సమంజస బుద్ధిన్" అని పలికారు. పాండవులు మరికొంతదూరం సాగేసరికి మళ్ళీ వ్యాసదర్శనమయింది. ఆగామిశుభాలను ఆవేదించి ఆ మహర్షి అంతర్థానమయ్యాడు.

బ్రాహ్మణ రూపంలో ఉన్న అర్జునుడు స్వయంవరంలో ద్రౌపదిని గెలిచాడు. కృష్ణుని అనుమతిని పొంది పాండవులు, కుంతి తమను తాము బలపరచుకొన్నారు. తల్లి ఆదేశం మేరకు ధర్మజాదులు అయిదుగురూ ద్రౌపదిని వివాహమాడ నిశ్చయించుకొన్నారు. లోకవిరుద్ధమైన ఆ విషమవిషయానికి ద్రుపదుడు అంగీకరించలేక సతమతమవుతూ ఉండగా, వేదవ్యాస మహర్షి వేంచేసి, అతనికి ఆమె పూర్వజన్మల వృత్తాంతాన్ని వివరించాడు.

పూర్వం మౌద్గల్యుడనే మహాముని 'నాలాయనియైన యింద్రసేన' భార్యగా ఉండేది. కర్మవశాన ఆ ముని ఘోరమైన కుష్ఠవ్యాధితో బాధపడుతూ ఉండేవాడు. ఆయన అతికోపనుడు. ఇంద్రసేన పరమభక్తితో ఆయనను ఆరాధిస్తూ, ఆయన తినగామిగిలిన ఆహారాన్ని ఎంతో భక్తితో ఆరగించేది. ఒకనాడు ఆమె భుజిస్తూ ఉండగా ఆహారంలో

తునిసిపడిన ఆ ముని వ్రేలు కనబడింది. ఆమె ఎంతమాత్రమూ అసహ్యించుకోకుండా దానిని ప్రక్కకు పెట్టి యథాప్రకారంగా భుజించింది. ఆ సన్నివేశాన్ని చూసిన మౌద్గల్యుడు ఆమె పతిభక్తికి మెచ్చుకొన్నాడు. ఆమెపట్ల ప్రసన్నుడై ఇష్టమైన వరాన్ని కోరుకొమ్మన్నాడు. ఆమె "నాకు కామోపభోగేచ్ఛ అధికంగా ఉంది, నీవు నీ తపశ్శక్తిచే కామరూపధరుడివై, మనోహరమైన ఐదు రూపాలుగా విభజించబడి, నన్ను తృప్తిపొందించు" అని కోరింది. ఆ ఋషి ఆమె కోరిన ప్రకారం అయిదు దేహాలతో మర్త్య, దేవలోకాల్లో సంచరిస్తూ, సూర్యరథం ఎక్కి ఆకాశగంగాజలాల్లో స్నానంచేసి, చంద్రకిరణాల్లో మునిగి, మేరు కైలాసపర్వతాల్లో క్రీడిస్తూ, ఇంకా అనేక స్థానాలలో అనేక వేల సంవత్సరాలు ఆమెతో భోగించి, తృప్తిపొందాడు. అంతటితో ఆమెను విడిచి, తపస్సుచేసి బ్రహ్మమయుడయ్యాడు. ఆమె మాత్రం తృప్తిని పొందక, కాలవశాన శరీరాన్నివిడిచి కాశీరాజుకు కుమార్తెగా పుట్టింది. ఎప్పటికీ పెండ్లి కాక, ఆమె తన దురదృష్టానికి బాధపడి, పశుపతి నుద్దేశించి ఉగ్రమైన తపస్సు చేసింది. అలా చేస్తూఉండగా ఆమె వద్దకు ప్రత్యేకంగా యముడు, వాయువు, వాసవుడు, అశ్వినులు ప్రీతులై వచ్చి తమ అంశలతో పుట్టినవారికి దేహాంతరాన ఆమె పత్నికావాలని కోరుకున్నారు. ఆ తరువాత మరికొంత కాలానికి ఆమె తపస్సుకు ఈశ్వరుడు ప్రసన్నుడై వరం కోరుకొమ్మన్నాడు. ఆమె దైన్యంతో పతిదానమని అయిదుసార్లు అర్థించింది. శివుడు కరుణించి, 'నీకు దేహాంతరాన ఐదుగురు పతులవుతా' రని వరమిచ్చాడు. లోకవిరుద్ధమైన అలాంటివరానికి ఆమె అంగీకరించలేదు. శివుడు, "నామాటగా నీకు ఆ అయిదుగురి యందూ ధర్మవిరోధముండదు. నీపట్ల దయతో ఈ వరాన్ని ఇచ్చాను" అన్నాడు. ఆమె అయిదుగురి పతులందూ ప్రత్యేకసంగమాన కౌమారమూ, పతిశుశ్రూషాసిద్ధీ, కామభోగేచ్ఛా, సౌభాగ్యమూ ప్రసాదించవలసిందిగా వేడుకొంది. శివుడామె కోరినవన్నీ ప్రసాదించి, గంగాతీరానగల ఇంద్రుని

తనదగ్గరకు తీసుకురమ్మని చెప్పాడు. ఆమె శివునికి ప్రదక్షిణం చేసి, ఇంద్రునికోసం గంగాతీరాన ప్రతీక్షిస్తూ ఉండిపోయింది.

యమధర్మరాజు నైమిశారణ్యంలో సత్రయాగదీక్షలోఉండి ప్రాణిహింస చేయకపోవడంతో మర్త్యులు అమర్త్యులయ్యారు. దానిని సహించలేక దేవతలు బ్రహ్మదగ్గరకు పోయి మొరపెట్టుకున్నారు. యముని సత్రయాగం కారణంగా దేవతల అంశలతో సూర్యమిత తేజులు అయిదుగురు పుడతారనీ, వారికారణంగా యముడు వెనుకటిలా జన క్షయం చేస్తాడనీ బ్రహ్మ వారికి ధైర్యం చెప్పిపంపాడు. వారంతా తిరిగివస్తూ ఆకాశగంగకు మధ్యలో నిలబడి ఏడుస్తున్న ఒక కన్యను చూశారు. ఆమె కన్నీళ్ళు స్వర్ణకమలాలు అవుతున్నాయి. దేవత లంతా ఆశ్చర్యపోయారు. ఇంద్రుడు ఆమెవద్దకుపోయి, వివరాలు అడి గాడు. ఆమె "నా ఏడుపు గురించి, నన్నుగురించి తెలుసుకోదలిస్తే నాతో రావలసిం" దని కోరింది. ఇంద్రుడు ఆమెవెంట బయలుదేరాడు. వారిద్దరూ హిమవత్పర్వతప్రాంతానికి వచ్చారు.

అక్కడ ఒక గుహలో రత్నవేదికమీద శివుడు వరుణరూపంతో తన భార్యతో పాచికలు ఆడుతున్నాడు.

ఇంద్రుడు అతనిని వరుణుడే అనుకొని, తనను లక్ష్యపెట్ట నందుకు కోపగించి, గర్వంగా మాట్లాడాడు.

ఆ మాటలకు రుద్రుడు రౌద్రాకారం వహించి, "నా క్రీడా రసభంగంచేసిన ఈ దుర్మదుణ్ణి పట్టితె"మ్మని ఆ కన్యను ఆజ్ఞాపించాడు. ఆమె స్పృశించడంతోనే ఇంద్రుడు విచేష్టితుడై భూతలాన పడ్డాడు. రుద్రుడు అప్పుడు ఇంద్రునితో "ఈ గుహాద్వారాన్ని తెరిచి, నీ గర్వాన్ని, బాహుబలాన్ని నిరూపించుకో'' అని ఆదేశించాడు. ఇంద్రుడు ఆ ప్రకారంగాచేసి, గుహలోపల తనవంటివారిని మరినలుగురునిచూసి ఆశ్చర్యపోయాడు. ఆ అయిదుగురినీ దేవహితార్థమై మానవులుగా పుట్టవలసిందని శివుడు అజ్ఞాపించాడు. వారు ధర్మానిలశక్రాశ్వినులు

ఆధానకర్తలుగా ధర్మజభీమార్జున నకులసహదేవులుగా జన్మించారు. వారికి పత్నిగా తపస్సు చేసి, శ్రీమూర్తి అయిన యాజ్ఞసేని యజ్ఞ వేదిక నుంచి పుట్టింది. ఇదంతా నీకు నమ్మశక్యం కాకపోవచ్చు, పోనీ, వీరి పూర్వదేహాలు చూడు" అంటూ వ్యాసుడు ద్రుపదునికి దివ్య దృష్టిని ప్రసాదించాడు.

ద్రుపదుడు వారి పూర్వరూపాలను చూసి, ఆశ్చర్యపడి, ఆనందించాడు. మరింక ఎలాంటి సందేహమూ పెట్టుకోకుండా ద్రౌపదీ వివాహాన్ని వ్యాసప్రోక్తంగా నిర్వహింపజేశాడు.

రెండు సన్నివేశాల్లో వ్యాసునిచే వివరించబడిన ద్రౌపది పూర్వజన్మ గాథలో ఆమె శ్రీమూర్తి అని, ఈశ్వరవరప్రభావం వల్ల పంచభర్తృక అయిందని, పాండవులయిదుగురూ ఇంద్రుని పంచమూర్తు లని స్పష్టపరుచబడింది.

ఈ వృత్తాంతంలో ప్రధానంగా గమనించవలసిన విషయాలు రెండు ఉన్నాయి. జగదేకవీరుడైన అర్జునునకు భార్యకాదగిన కుమార్తె నుకోరి ద్రుపదుడు బ్రాహ్మణోపాస్తి, పుత్రకామేష్ఠి ద్వారా అయో నిజగా ద్రౌపదిని పొందటం మొదటిది. ద్రౌపదీ స్వయంవరవార్తతో పాటుగా ఈ విషయంకూడా బహుశ్రప్రచారం చేయబడింది. అజ్ఞాతంగా ఉన్న పాండవులను పిలికిరప్పించడం ద్రుపదుని ఆశయం. కనుక ఆమెకు సంబంధించిన ఈ సంగతంతా లోకానికి చాటబడింది. ఈ చాటింపులో ద్రౌపది అయోనిజ, యజ్ఞకుండసముద్భవ, అనేది లోకోత్తరమైన మహత్తరాంశం. పాండవులు పుట్టి, పెరిగి, పెద్దవారై హస్తినకు వచ్చి ద్రోణుని దగ్గర విలువిద్య నేర్చుకొని గురుదక్షిణగా ద్రుపదుణ్ణి బంధించి తెచ్చి గురువుకు సమర్పించారంటే అప్పటికి వారు బాల్యందాటి కౌమారంలో ప్రవేశించి ఉంటారని నిస్సందేహంగా చెప్పుకోవచ్చు. ధృతరాష్ట్రుడు పాండవులను వారణావతానికి పంపడం, లాక్షాగృహ

దహనం, మాతృసహితంగా పాండవుల అజ్ఞాతవాసం— ఈ వ్యవధిలో ద్రౌపదీ అవతరణం జరిగిఉంటుంది. శిశువుగానే ద్రౌపది పుట్టి ఉంటే పాండవులకు ఆమెకు వయోభేదం ఎంతగానో ఉండటమేకాక అప్పటికి ఆమెకు వివాహయోగ్యమైన వయస్సు (అష్టవర్షాద్భవేత్ కన్యా అను కొన్నస్మృతికీ) ఉండేందుకే ఆస్కారం లేదు. కనుక ధృష్టద్యుమ్నుని మాదిరిగానే ద్రౌపది కూడా ఆజన్మయౌవనవతి అని గ్రహించవలసి ఉంది. ధృష్టద్యుమ్నుడు కరవాలమూ, చాపమూ ధరించి శ్రేష్ఠమైన కవచమూ, కిరీటమూ కలిగి, జ్వాలాభీలాంగుడై రథారూఢుడై పుట్టి నట్లుగా చెప్పబడింది.[1] ద్రౌపది నల్లకలువలవంటి సుకుమారమైన వర్ణమూ, పద్మసుగంధమూ, పద్మపత్రాలవంటి విశాలమైన నేత్రాలు కుటిలాలకలతో ఒప్పేదిగా ప్రసన్నమైన ఆకారంతో, దివ్యమైన తేజస్సుతో ఉద్భవించినట్లుగా చెప్పబడింది. ఒకే సందర్భాన పుట్టిన ఇద్దరు ఒకలాగానే, అంటే, సంప్రాప్తయౌవనులుగా, ఉద్భవించి ఉంటారనుకోవటంలో అసామంజస్యమేమీ ఉండదు. ఇలాంటి అసాధారణమైన పుట్టుక, ఆ తరువాత ద్రౌపది కేంద్రంగా నడిచిన ఎన్నో ఘట్టాలకు ఎంతగానో దోహదం చేసింది. శ్రీమన్నారాయణుని పరిపూర్ణావతారమైన శ్రీకృష్ణుడు దేవకీదేవి అష్టమగర్భాన అతి సామాన్యంగా అవతరించాడు. అతని వ్యూహంలో భాగంగా జన్మించిన ద్రౌపదీదేవి జన్మం మాత్రం దివ్యమూ, లోకాతీతమూను.

ఇంక ద్రౌపది పూర్వజన్మలకు సంబంధించినది రెండవ అంశం. అది వ్యాసునికీ, పాండవులకూ, ద్రుపదునికీ మాత్రమే సంబంధించిన, హృదయానుభూతికి చెందిన, అలౌకిక విషయం. ద్రుపదుడు లోక విరుద్ధంగా, తన కుమార్తెను అయిదుగురికిచ్చి పెండ్లిచేయడానికి తటపటాయిస్తున్నప్పుడు వ్యాసుడు అతనికి ఆమె పూర్వజన్మ వృత్తాంతాన్ని

1. ఆది - 7 - 17

వివరించవలసి వచ్చింది. ఈ సన్నివేశం మొత్తం కురుక్షేత్రయుద్ధ ప్రారంభంలో విషాదయోగంలో మునిగిన అర్జునుణ్ణి శ్రీకృష్ణుడు ప్రబోధించి కర్తవ్యనిష్ఠునిగా చేయడంతో పోల్చదగింది. ఆ సందర్భంలో కృష్ణుడు నిర్వహించిన పాత్రవంటి పాత్రనే ఇక్కడ వ్యాసుడు నిర్వహించి, ద్రుపదుని వ్యామోహాన్ని తొలగించి, ద్రౌపది వివాహం దైవాధిష్ఠితం అని గ్రహింపజేసి, కర్తవ్యపరునిగా చేశాడు. అవసరాన్నిబట్టి శ్రీకృష్ణుడు అర్జునునికి విశ్వరూపాన్ని ప్రదర్శించినట్లుగానే వ్యాసుడూ ద్రుపదునికి దివ్యదృష్టినియిచ్చి, ద్రౌపదీ పాండవుల పూర్వ దేహాలు చూపించాడు.[1] అప్పటికి తృప్తిపడి ద్రుపదుడు పాండవుల అయిదుగురితో ద్రౌపది వివాహానికి అంగీకరించాడు.

పంచేంద్రోపాఖ్యానంలోనూ, నాలాయనికథలోనూ సూత్రధారుడు పరమేశ్వరుడు. పరమేశ్వరుడే రుద్రుడు. రుద్రసూక్తంలో రుద్రుని ఇంద్రరూపం కీర్తించబడింది. రుద్రుడు ఇంద్రియాలకూ, మనస్సుకూ అధిపతి. వానిని అనుభవించేటప్పుడు ఇంద్రుడుగానూ, నియమించేటప్పుడు రుద్రుడుగాను చెప్పబడతాడు. "నమోఽస్తు నీలగ్రీవాయ సహస్రాక్షాయ మీఢుషే"— అన్నప్పుడు సహస్రాక్షుడు అంటే ఇంద్రుడు. రుద్రుని వివిధరూపాల్లో మేఘాలను ఆకర్షించే కిరణాలు వేలుగాగల సూర్యుణ్ణి సహస్రాక్షుడైన ఇంద్రుడు అంటారు. వేదసంప్రదాయం ప్రకారం ఇంద్రాది దేవతలూ, జీవులూ రుద్రుని శక్తిస్వరూపాలు. కనుకనే రుద్రుని 'పశుపతి' అనికూడా అంటారు.[2]

1. "...నమ్మవేని వీరలపూర్వదేహంబులఁ జూడు మని కృష్ణద్వైపాయనుండు ద్రుపదునకు దివ్యదృష్టి యిచ్చి చూపిన, '...తదీయ దేహముల్ ధీరుఁడు సూచె...' మఱియు సకల లావణ్యమూర్తియై వారల కేవురకుఁ బత్నిగాఁ దపంబుసేసిన యక్కన్యక పూర్వదేహంబును జూచి విస్మితుండయి హర్షించియున్న ద్రుపదునకు ..." ఆది - 7 - 275 వచనం, 276 పద్యం, 277 వచనం.
2. రుద్రసూక్తం - వ్యాఖ్యాత కులపతి కృష్ణమాచార్య - ఆధారంగా

ఈ కథలో రుద్రుడు తన ఇంద్రాది శక్తుల్ని జగత్కల్యాణార్థమై జీవ ప్రజ్ఞలలోనికి మేల్కొలపటం వర్ణించబడింది.

మహాపతివ్రత అయిన నాలాయని ధర్మబద్ధంగా అనేక జన్మల్లో వివిధ లోకాలలో భర్తతో కామతృప్తిని పొందటానికి యత్నించింది. కానీ ఎంతకూ కామపరితృప్తి కలుగక పోవడంతో అంతర్ముఖత్వం వహించి పశుపతిని ఆరాధించింది. అతిమానుషమైన ఆమె కామాన్ని రుద్రుడు లోకహితోచితంగా మలిచాడు. ఇంద్రియాలకు అధిపతులైన తనశక్తిరూపాలను (ఇంద్రాదులను) ఆమెకు భర్తలుగా అనుగ్రహించాడు. దానితో ఆమెపుట్టువు విశ్వప్రణాళికకుసమర్పితమయింది.

ఈ మొత్తం కథ అర్థవాదంగా వ్యాసునిచే పైవిధముగ వివరించబడింది.[1] (దీనికి సంబంధించిన మరికొన్ని విషయాలు ప్రత్యేకముగ అనుబంధంలో చర్చించబడినాయి.)

---

1. ద్రౌపదీ జన్మవృత్తాంతాన్ని సంస్కృతమూలంతో సమన్వయిస్తూ "ద్రౌపదీనిందా నిరాకరణము"లో తర్కశాస్త్రపారంగతులు బ్రహ్మశ్రీ వారణాసి సుబ్రహ్మణ్య శాస్త్రిగారు 'ద్రౌపదీ జన్మము అసాధారణమైనదే కాని అసాధ్యమైనది కాదు' అని సప్రమాణంగా వివరించారు.

"స్వర్గశ్రీః పాండవార్థాయ సముత్పన్నా మహామఖే
సేహ తప్త్వా తపోఘోరం దుహితృత్వం తవాగతా"

అనే వ్యాసునిమాటలను (సంస్కృత భారతం - ఆది - అధ్యాయం-196) సమన్వయిస్తూ స్వర్గలక్ష్మి శచీదేవియే ఋషికన్యగా పుట్టి వేదవతివలె తపస్సుచేసి, ఈశ్వరుని వరాన్ని పొంది, శ్రీరాముని కొరకు జనక పుత్రిగా సీత ఉద్భవించినట్లు, పాండవులకొరకు ద్రుపదపుత్రికగా ద్రౌపది అనే పేరుతో ఉద్భవించిందని తెలుసుకోవలసిందిగా చెప్పారు

పంచేంద్రుల వృత్తాంతాన్ని గూర్చి వారు, "పూర్వమింద్రపదవి నధిష్ఠించి విరమించిన విశ్వభుక్, భూతధామ, శిబి, శాంతి అనువారు నలుగురును అప్పటి యింద్రుని యంశమొకటియును గలిసి పంచేంద్రులయిరి." అనీ, వారి అంశలతో జన్మించిన వారే పంచపాండవులనీ, స్వర్గలక్ష్మి అవతారమైన ద్రౌపది ఈశ్వరుని సంకల్పం మేరకు వారిని భర్తలుగా పొందడంలో దోషం లేదని నిరూపించారు.

ద్రౌపదీనిందానిరాకరణము - (1952) పుట 940-947

## 2. వివాహ వృత్తాంతము

ద్రుపద పురాగతులైన బ్రాహ్మణులవల్ల ద్రౌపదీ స్వయం వర వార్తను తెలుసుకొని పాండవులు తల్లితో పాటుగా ఏకచక్రపురం నుంచి తరలివెళ్ళారు. అక్కడ ఒక కుంభకారగృహంలో 'బస' చేసి, బ్రాహ్మణ వృత్తిలో ఉంటున్నారు.

ద్రుపదుడు ప్రకటించిన స్వయంవరదినం వచ్చింది. ద్రౌపది మన్మథుని ఆరవబాణంలా చేతిలో పూలమాలను ధరించి రంగమధ్యం లో దర్శనమిచ్చింది.

ధృష్టద్యుమ్నుడు చేరిన రాజులందరినీ ఉద్దేశించి మత్స్య యంత్రాన్నీ, వింటినీ, బాణాల్ని చూపిస్తూ ఇలా ప్రకటించాడు.

"ఈ విల్లు మోపెట్టి, అయిదు బాణాలతో ఈ మత్స్య యంత్రాన్ని కొట్టినవాడు ఈ కన్యను పొందటానికి తగినవాడవుతాడు. భక్తితో మునులను సేవించినందువల్ల పొందిన విద్య ఇది. సమర్థతా, నేర్పూకలవారు ప్రయత్నించి, కీర్తినీ, శుభాన్నీ పొందవచ్చు."

అతడు చేరవచ్చిన రాజలోకాన్నీ, బ్రాహ్మణసమూహాన్నీ ద్రౌపదికి చూపించి, "వీరిలో ఎవరు ఈ లక్ష్యాన్ని భేదిస్తే వారిని నీవు వరించు" అని చెప్పాడు.

రాజులు ఒక్కొక్కరేవచ్చి మత్స్యయంత్రాన్ని కొట్టటానికి ప్రయత్నించసాగారు.

అంబరతలంనుంచి దేవతలందరూ ఆసక్తితో చూస్తున్నారు.

బూడిదమాటున అగ్నికణాల్లా బ్రాహ్మణుల మధ్య ఒప్పు తున్న పాండవులను శ్రీకృష్ణుడు గుర్తించాడు. 'పార్థుడు ఈ కన్యను పరిగ్రహిస్తాడు' అని హృదయంలో సంకల్పించాడు.

ప్రయత్నించేవారు ప్రయత్నిస్తూ ఉండగా ప్రయత్నించని వారు ఆ మాయాధనుపుజోలికి పోవడం దేనికిలే అని కూర్చుండి పోయారు. మొత్తంమీద రాజపుత్రులెవ్వరూ విజయం సాధించలేక పోయారు.

అన్నగారి అనుమతితో బ్రాహ్మణుల మధ్యనుండి అర్జునుడు లేచి ధనుస్సును సమీపించాడు. గురువులకు నమస్కరించి, ధనుస్సుకు ప్రదక్షిణంచేసి, ఎత్తిపట్టి, పూర్వపరిచితమైన విల్లును మోపెట్టినట్లుగా అవలీలగా సంధించి, అందరూ ఆశ్చర్యంతో చూస్తూఉండగా, అయిదు బాణాలతో ఆ మత్స్యయంత్రాన్ని పడగొట్టాడు.

జనంలో పెద్దకోలాహలం మొదలయ్యింది. 'ఈ కొట్టినవాడు బ్రాహ్మణ రూపంలోఉన్న ఇంద్రుడో, హరుడో, భానుడో, గుహుడో అయి ఉంటాడు. మానవమాత్రునికి రెప్పపాటులో ఇంత తేలికగా దీనిని కొట్టడం సాధ్యపడుతుందా?' అనుకోసాగారు.

ఆకాశంనుంచి దేవతలు దుందుభులు మ్రోగించారు.

బ్రాహ్మణుల ఆనందానికి మేర లేక పోయింది.

ఆ సందడిలో నకులసహదేవులను వెంటబెట్టుకొని ధర్మజుడు ఇంటికి వెళ్ళిపోయాడు.

ఎందుకైనా మంచిదని ద్రుపదుడు తన కుమారునితో కలిసి పెద్ద సైన్యంతో అర్జునునికి బాసటగా నిలిచాడు.

అప్పుడు సుందరాంగి, తోయజదళనేత్రా అయిన ద్రౌపది 'కమనీయగజరాజగమనలీల' తో వచ్చి, సురరాజ సన్నిభుడూ, నవ యౌవనోద్భాసితుడూ, అసిత రత్నరుచిరాంగుడూ, అంగజ రూపుడూ అయిన ధనంజయుని తనచేతిలోని పుష్పదామంతో అలంకరించి అర్చించింది.

ఆ వేడుకనుచూసి సహించలేక దుర్యోధనాది రాజులందరూ కోపంతో విజృంభించారు. వారంతా 'ఈ బ్రాహ్మణుడు తన విద్యతో ఈమెను గెలుచుకొన్నాడు. ఇతని తప్పేమీ లేదు, ఇంతమంది రాజుల్ని ఆహ్వానించి, ఇలా అవమానించడం ద్రుపదునిదే తప్పు' అంటూ వానిని ముట్టడించారు.

ద్రుపదుడు భయపడి బ్రాహ్మణుల చాటుకు పోయాడు. బ్రాహ్మణులు వానికి అభయమిచ్చి, దండాజినాలతో రాజులను ఎదిరించారు.

అప్పుడు అర్జునుడు "నా అస్త్రాలతో ఈ రాజుల గర్వం పోగొడతాను, చూడండి" అంటూ తానొకవైపూ, భీముడొకవైపూ విజృంభించారు. కొంతసేపటికి అర్జునుడు కర్ణుణ్ణీ, భీముడు శల్యుణ్ణీ ఎదుర్కోవలసి వచ్చింది.

కర్ణుడు అర్జునుని బాణాలను వారింపలేక యుద్ధం విరమించి, "నీవు పరశురాముడివో, ఇంద్రుడివో, అర్జునుడివో అయివుండాలి, నన్నెదిరించేటంతటిశక్తి ఇతరులకు ఎవరికి ఉంది? నీ విక్రమానికీ, విల్లు నేర్పుకూ మెచ్చాను" అన్నాడు.

అర్జునుడు తాను అతడు చెప్పిన వారిలో ఎవ్వరినీ కాదనీ, కేవలం బ్రాహ్మణుడననీ పలికి, "మాటలెందుకు, యుద్ధానికి రా" అన్నాడు.

"బ్రాహ్మణ తేజం అజేయం" అంటూ కర్ణుడు వెనక్కి వెళ్ళిపోయాడు.

శల్యుడు కూడా భీముని చేతిలో దెబ్బలు తిని, ప్రక్కకు తప్పుకొన్నాడు.

దుర్యోధనుడు వారి పరాక్రమానికి ఆశ్చర్యపడి వారెవరో తెలుసుకోండా మనుకొంటూ ఉండగా కృష్ణుడు కల్పించుకొని వారించాడు.

అంతటితో రాజులందరూ ఎవరిదారిన వారు వెళ్ళిపోయారు. తక్కినవారు ముందే సర్దుకున్నారు.

ఇంటిదగ్గర కుంతి తనకొడుకులు తిరిగి రావడం ఆలస్యమయినందుకు ఒకప్రక్క ఆందోళన పడుతూనే, మరోప్రక్క 'వ్యాసభగవానుని వాక్కులు తిరుగులేనివి గదా!' అనుకొంటూ, కుమారుల క్షేమాన్ని గురించి దేవతలను, భూదేవతలను ప్రార్థిస్తూ ఎదురుచూడసాగింది. అలాంటి సమయంలో ధర్మజ, నకుల, సహదేవులు ఇంటికి చేరుకొన్నారు.

ఆ తరువాత కొంతసేపటికి భీమార్జునులు వచ్చి తల్లికి మ్రొక్కి "మేమొక భిక్ష తెచ్చాం" అన్నారు. కుంతి అలవాటుప్రకారం "మీరు అయిదుగురూ ఉపయోగించండి" అన్నది. ఆ వెంటనే 'భువనత్రయ రాజ్యలక్ష్మి' లా ఉన్న ద్రౌపదిని చూసి, సిగ్గుపడింది. లోకవిరుద్ధమైన అలాంటి ఆదేశం తననోట వెలువడటం ఆమెకు బాధ కలిగించింది.

ఆమె నోట అనృతం ఏనాడూ రాలేదు.

ఆమె చెప్పినది ఎన్నడూ కొడుకులు అతిక్రమించనూ లేదు.

మరి ఈ మాట వ్యర్థం కావలసిందేనా? ఇప్పటివరకూ అలా జరుగలేదు.

నెరవేరటమా? అది లోకవిరుద్ధమైన విషయం అవుతుంది.

ఏది కర్తవ్యం?

ఎటూపాలుపోక, అధర్మభీత అయి ధర్మజుణ్ణి సంప్రదించింది.

అతడు ఆమెను ఊరడించాడు. అర్జునునితో "నీవు కదా ఈమెను పొందావు, అగ్నిసాక్షిగా ఈమెను నీవే పరిగ్రహించు" అన్నాడు.

"పెద్దవాడివి నీవుండగా చిన్నవాడనైన నేను వివాహం చేసుకోవడం ధర్మవిరుద్ధం కదా! ఈమెను నీవే అగ్రమహిషిగా స్వీకరించు. ఇది మా నలుగురి అభిమతమూను" అన్నాడు అర్జునుడు.

సరిగ్గా అతడలా అంటూ ఉండగా విధి ప్రేరణం వల్ల ఆ అయిదుగురి హృదయాలూ, చూపులూ ఆమెయందు లగ్నమై, వారు మన్మథావస్థకు లోనయ్యారు.

అయిదుగురికీ ఒక్కర్తెను భార్యగా సృష్టించిన బ్రహ్మ చేష్టలు పరమార్థంతో కూడినవి అవుతాయేగాని, మరోరకంగా జరగటానికి వీలు లేదుకదా!

పరిస్థితిని గమనించిన ధర్మజుడు వ్యాసవచనాలను స్మరించి, 'ఈమెను మనం అయిదుగురమూ పరిగ్రహిద్దాం, పెద్దలమాట అనుల్లంఘనీయం గదా!' అంటూ ఉండగా బలరామకృష్ణులు వేం చేశారు.

పరస్పర పరిచయాలు, మన్నింపులూ పూర్తయ్యాక, ధర్మజుడు బలరామకృష్ణులను కుశలమడిగి, "బ్రాహ్మణ వేషంలో ఉన్న మమ్మల్ని మీరెలా గుర్తుపట్టారు?" అని అడిగాడు.

కృష్ణుడు నవ్వుతూ, "మీ ప్రభావం సూర్యుని తేజస్సులాంటిది. మరుగుపరిస్తే దాగుతుందా? అదీకాక మత్స్యయంత్రాన్ని ఛేదించడమనే అతిమానుషమైన అద్భుతకార్యాన్ని నెరవేర్చడం అర్జునునివల్లకాక మరెవరివల్ల అవుతుంది? కనుక మిమ్మల్ని తేలికగానే గుర్తించాం" అనిచెప్పి, "నేటితో అధర్మ నిరతులైన ధృతరాష్ట్ర

దుర్యోధనులు చేసిన లాక్షాగృహప్రయోగం నుంచి మీరు విముక్తులయ్యారు. మీకింక మేలవుతుంది'' అంటూ వెళ్ళిపోయారు.

ద్రుపదుడు తనపుత్రికను చేపట్టింది ఎవరో తెలుసుకొని రమ్మని ధృష్టద్యుమ్నుని ఆదేశించాడు. అతడు ద్రౌపదీభీమార్జునుల వెనుకనే వచ్చి ఎవ్వరూ గుర్తించకుండా ఆ కుంభాకార గృహంలోనే ఉండి విషయమంతా తెలుసుకొని వెళ్ళాడు. అతడు తండ్రికి చెప్పిన మాటల్లో బ్రాహ్మణ వేషాల్లో ఉన్న పాండవులు ఏమేం చేశారో, ద్రౌపది వారితో ఎలా ఉందో వివరంగా ఉంది. మాటల తీరునుబట్టి ఆ యువకులు ఉత్తమక్షత్రియ వంశానికి చెందినవారుగా, నడవడినిబట్టి విప్రజాతివారుగా అనిపిస్తోందని అతడు చెప్పాడు. మరోజాతికి చెందినవారు కారనికూడా అతడు నిర్ధారణకు వచ్చాడు.

ధృష్టద్యుమ్నుడు భీమార్జునుల వెన్నంటిపోయి వారి ప్రతి చర్యనూ జాగ్రత్తగా గమనించాడు. అయితే, అతడు తండ్రికి చెప్పిన మాటల్లో బలరామకృష్ణులు కుంతినీ, పాండవులనూ సందర్శించారన్న విషయం ఎక్కడా రాలేదు. ధృష్టద్యుమ్నుని ప్రయత్నానికి బలరామకృష్ణుల పాండవసందర్శన విషయం ఎంతగానో సహకరించేదేగాని ఎంతమాత్రం ఉపేక్షింపదగిందికాదు. దానిని అతడు పేర్కొనలేదంటే అతనికి కనపట్టి ఉండదు. అంటే, బలరామకృష్ణులు పాండవులను సందర్శించడమన్నది ఇతరులెవ్వరికీ పొడకట్టని దివ్యమైన ఒక విచిత్ర సన్నివేశం అన్నమాట!

ద్రుపదుడు ఆ తరువాత పాండవులను గూర్చి తెలుసుకొని రమ్మని తన పురోహితుణ్ణి పంపాడు. ధర్మరాజు అతనితో "మీ రాజు మనోరథం నెరవేరింది, విచారించవలసిన పనిలేదు" అని పలికాడు.

ద్రుపదునికి అప్పటికీ నమ్మకం కుదరలేదు. నాలుగు వర్ణాల

వారికీ పనికివచ్చే రథాలను ఇచ్చి పాండవులను తోడ్కొని రమ్మని ధృష్టద్యుమ్నుని పంపాడు.

పాండవులు రాజయోగ్యమైన స్వర్ణరథం మీద అంతఃపురానికి వచ్చారు. అక్కడ వారికి ద్రుపదుడు అనేక విధాలైన వస్తువులతో ఎదురు సన్నాహం చేశాడు. పాండవులు యుద్ధసంబంధాలయిన వస్తువులను మాత్రం గ్రహించి, ద్రుపదుణ్ణి సమీపించారు.

ఆకారాలను బట్టి, కూర్చున్న తీరునుబట్టి ద్రుపదుడు వారిని క్షత్రియులుగా గుర్తించాడు. సందేహనివృత్తికై ధర్మరాజును "మీరు క్షత్రియులా? బ్రాహ్మణులా? మాయావులైన మంత్రసిద్ధులా? స్వర్గం నుంచి దిగివచ్చిన దేవతలా? మీ సంగతి తెలిస్తేనే గదా ఈ కన్యను ఇచ్చి వివాహం జరిపించడం సాధ్యమయ్యేది?" అని అడిగాడు.

కృష్ణుని మాటలను దృష్టిలో పెట్టుకొని ధర్మజుడిలా బదులిచ్చాడు: "మేము క్షత్రియులమే. పాండురాజ ప్రియ నందనులం. నేను అగ్రజుణ్ణి. వీరు శత్రుంజయులైన భీమార్జున నకులసహదేవులు. ఈమె కుంతీమహాదేవి."

ద్రుపదుని ఆనందానికి అవధిలేకుండా పోయింది. మంచి మాటలతోను, ఇష్టసత్కారములతోను వారిని ఆదరించాడు.

కొన్ని దినాలు గడిచాయి.

''అర్జునుడు ధర్మవిధి ననుసరించి ద్రౌపదీ పాణిగ్రహణం చేయాలి'' అని ఒకనాడు ఆప్తులసమక్షంలో ద్రుపదుడు తన అభీష్టాన్ని వెల్లడించాడు.

తాను, భీముడు ఉండగా చిన్నవాడైన అర్జునుడు ముందుగా పెండ్లి చేసుకోవడం ఎలా కుదురుతుంది? అని ధర్మరాజు అడిగాడు.

''ధర్మాన్ని అతిక్రమించడం సాధ్యపడదు గనుక ఈమెను

నీవే వివాహం చేసుకో'' అన్నాడు ద్రుపదుడు.

అప్పుడు ధర్మరాజు ఆమెను తామైదుగురమూ వివాహం చేసుకొంటామనీ, అది తమ తల్లి ఆదేశమనీ తెలిపాడు.

ధర్మజుని ధర్మతత్పరత తెలిసిన వాడైనప్పటికీ ద్రుపదుడు లోకవిరుద్ధమైన ఆ వివాహానికి అంగీకరించలేక పోయాడు.

దైవవశాన వ్యాసుడు దిగివచ్చి పరమార్థాన్ని వివరించడంతో ద్రౌపదీ కల్యాణానికి సన్నాహాలు సాగిపోయాయి.

ముందు ధర్మజుడూ, ఆ తరువాత క్రమంగా భీమార్జున నకులసహదేవులూ మహావైభవంగా ద్రౌపదిని వివాహం చేసుకున్నారు.

ద్రుపదుడు పరమానందంతో అత్యంత వైభవంగా ఆ ఉత్సవాన్ని నిర్వహింపజేశాడు.

ఈ సందర్భంగా గమనించవలసిన విషయాలు కొన్ని ఉన్నాయి.

'భార్యకు దైవవిహితుం డయిన భర్త యొక్కరుండ'[1] అనేది లోకరీతి. ఇది ఇప్పటి ఆచారమే కాదు. భారతకథా కాలంనాటి ఆచారం కూడాను. అయితే, ద్రౌపది వివాహం ఆయిదుగురితో ఎందుకు జరిగింది? అంటే, అదికూడా దైవాధిష్ఠితమే గనుక.

ద్రుపదుడు సంకల్పించినది అర్జునునికి భార్యకాగల కుమార్తెనే అయినా, అంతకంటె పరమప్రయోజనాన్ని ఉద్దేశించి, అర్జునునికీ, తక్కినవారికీకూడా భార్యకాగల కుమార్తెను ఈశ్వరుడు ప్రసాదించాడు.

ఈశ్వర సంకల్పమెప్పుడూ మన సంకల్పాలను లోకహితంతో అనుసంధానించేదిగానే ఉంటుంది గదా!

1. సభా - 2 - 229 వచనము

ద్రౌపదీ పాండవుల జన్మలు అప్రాకృతములూ, అసాధారణములూ అయినప్పటికీ వారు వర్తించింది లౌకిక ధర్మాలకు లోబడేకదా! మానవులుగా దిగివచ్చినప్పుడు సర్వమానవులకూ సమానమైన ధర్మశాస్త్రాలకు విరుద్ధంగా అయిదుగురు ఒక్క తెను వివాహం చేసుకోవడం సమంజస మెలా అవుతుంది? అన్నప్పుడు కూడా ద్రౌపదీ పాండవులది అసాధారణమైన వివాహమే కాని ఆచార విరుద్ధమైన వివాహంమాత్రం కాదు అని గుర్తించాలి. ఇందుకు తగిన ప్రమాణాలను ధర్మజుడూ వ్యాసుడూ ఇచ్చారు.

పూర్వం జటిలుడనే ఋషి కుమార్తె తన తపఃప్రభావంతో ఏడుగురు ఋషులకు ఒక్కతే భార్య అయ్యింది. అలాగే, దాక్షాయణి అనే మునికన్యక పదిమంది ప్రచేతసులకు భార్య అయింది.— ఇవి ధర్మజుడు చూపిన ప్రమాణాలు.

పూర్వం రాజర్షి అయిన నితంతుని కుమారులు, సాల్వేయ, శూరసేన, శ్రుతసేన, బిందుసార, అతిసారులనే అయిదుగురు, ఔశీనర పతి కుమార్తె 'అజిత' ను స్వయంవరంలో పొంది, వివాహం చేసుకొన్నారు.— ఇది వ్యాసుడు చూపిన ప్రమాణం.

తొల్లింటి మహాత్ములలో ఇలాంటి వివాహాలు చేసుకొన్న వారు ఇంకా చాలమంది ఉన్నారని కూడా వ్యాసుడు చెప్పాడు.

ధర్మాన్నీ, లోకరీతిని ఎంతగానో పాటించే ధర్మరాజూ, ధర్మతత్పరులైన అతని తమ్ములూ ఇలాంటి అసాధారణమైన వివాహానికి ఎందుకు సిద్ధపడ్డారు? లోకవిరుద్ధమైన ఈ వివాహంవల్ల ఎలాంటి సమస్యలు ఎదురవుతాయో, ఎన్ని అవమానాలకు తాము గురికావలసి వస్తుందో వారు ఆలోచించలేక పోయారనగలమా? ఒక్క స్త్రీని అయిదుగురు పెండ్లాడటమన్నది లోకానికి ఎదురీదటమేగాని అందులో సౌకర్యమూ, సుఖమూ ఏముంటుంది? 'ఇదేదో క్రొత్త పద్ధతి,

బాగుందని పాండవులు ఎక్కడినుంచో దీనిని తీసుకువచ్చి ప్రవేశ పెట్టారందామనుకున్నా ఈ పద్ధతి ద్రౌపదికే పరిమితం కావడం వింత కాదా? ధర్మజునికి దేవిక, భీమునికి హిడింబ, జరంధరలు, అర్జునునికి చిత్రాంగద, సుభద్రలు, నకులునికి కరేణుమతి, సహదేవునికి విజయ అని ప్రత్యేకించి ఎవరి భార్యలు వారికి ఉండటమేమిటి? –అని ఆలోచిస్తే ద్రౌపదితో పాండవుల వివాహం వ్యాసభగవానుని ఆదేశానుసారం పరమార్థాన్ని ఉద్దేశించి మాత్రమే జరిగిందనే విషయం స్పష్టపడుతుంది.

ఇటు ద్రౌపదిని పాండవులు చేపట్టడం, అటు శ్రీకృష్ణుడు పాండవులను చేపట్టడం ఒకేసారి జరిగాయి. కృష్ణుడు 'నేటినుంచీ వీరికి అభీష్టసిద్ధి కలుగుతుంది' అని అభయమిచ్చాడు.

ధర్మరాజు "మురాంతకుడు జగద్గురుడు మాకు"[1] అనిచాటి చెప్పుకొన్నాడు. ద్రౌపదీ పరిణయంతో పాండవుల జీవితాలు జగద్గురు వ్యూహానికి సమర్పితమయ్యాయని దీనిబట్టి గ్రహించవలసి ఉంది.

పాండవులు ద్రుపదుని దగ్గర ఉండటంకంటె తన దగ్గర ఉంటేనే శ్రేయస్కరమనీ, వారితో మంచిగా ఉండకపోతే మొదటికే మోసం వస్తుందనీ గ్రహించిన ధృతరాష్ట్రుడు వారిని హస్తినకు పిలిపించాడు. దుర్యోధనుడు ఒకప్రక్క పాండవ పాంచాల విభేదనో పాయాలు చింతిస్తూ ఉండగా ధృతరాష్ట్రుడు మరొక ప్రక్క భీష్మ ద్రోణ విదురులకు భయపడి గత్యంతరం లేక పాండవులకు అర్థరాజ్యం పంచి, వారిపై తాను చేసిన హత్యాప్రయత్నాన్ని కప్పిపుచ్చుకోటానికి ఎంతగానో ఆరాటపడ్డాడు.[2] ద్రౌపదీ వివాహానికి గల రాజకీయ ప్రాముఖ్యానికి ఇది ఒక నిదర్శనం.

---

1. ఆది - 8 - 61

2. భీష్మ ద్రోణుల తర్వాత విదురుడు కల్పించుకొని హితవు చెబుతూ ధృతరాష్ట్రునితో.

ఈ వివాహాన్ని జరిపించడంలో వ్యాసుని పాత్రను గురించి కూడా ఒక్కముక్క చెప్పవలసి ఉంది. లోకహితారంభుడైన వ్యాస భగవానుడు ఈ సన్నివేశంలో ఈశ్వర సంకల్పం నెరవేరేటట్లుగా తన వంతు పాత్రను తాను నిర్వహించాడేగానీ తనంతతానుగా కల్పించుకో లేదు. "ఇది మనచేసిన యదిగాదు దైవాధిష్ఠితంబు" అని ద్రుపదునితో ఆ మహర్షి పలికన మాటలే ఇందుకు నిదర్శనం.

ద్రౌపదీ పాండవుల వైవాహిక జీవితం, వారి అన్యోన్యత, తరువాతి అధ్యాయంలో పరామర్శింపబడుతోంది.

---

ఇలా అన్నాడు. "వారల బలపరాక్రమంబు లెల్లవారికి దృష్టపూర్వంబుల యట్టివారి తోడ విగ్రహంబు సేయు దుర్బుద్ధులుం గలరె? నీ పుణ్యమ్మున నమ్మహాత్ములు జననీసహితంబు లక్కయింట బ్రతికిరి; నీ యందుఁ బురోచనదగ్ధం బయిన దుర్యశః పంకంబుఁ బాండవానుగ్రహ జలంబులంజేసి కడిగికొనుము; దుర్యోధనా వరాధంబున నఖిల మహీప్రజకు నపాయంబగు నని తొల్లియు నీకుం జెప్పితినట్లు గాకుండ రక్షింపుమనిన విని ధృతరాష్ట్రిందు..." వెంటనే "మీ వచనమున కపార్థత గావింపఁగ నంత కార్యగతి మూఢుఁడనే" అని పలికి, పాండవులను రావించి అర్ధ రాజ్యం ఇచ్చాడు. - ఆది - 8 - 49 వచనం, 50 పద్యం.

## 3. దాంపత్య జీవితం

లోకంలో చాలామంది 'ద్రౌపదికి అయిదుగురు భర్తలు. అయినాగాని ఆమె పతివ్రతట!' అంటూ చులకనగా తొందరపాటుతో మాట్లాడతారేకాని అయిదుగురితో ఆమె దాంపత్యం ఎలా సాగింది? అని నిదానించి ఆలోచించరు.

"ఒకనితోడ సంసారమే ఇల్లాలికి శతావధానము. మరి ద్రౌపదీసతి కెంతటి సామర్థ్యము కావలె?..." అనే పరిశోధకురాలి వాక్యాలు[1] ఎంతగానో ఆలోచింపదగినవి.

మహాభారతంలో ప్రత్యేకించి ద్రౌపది దాంపత్య జీవితానికి సంబంధించిన విశేషాలు వర్ణించబడకపోయినా వర్ణితమైన సన్నివేశాల ద్వారా కొన్ని విశేషాలను గ్రహించే అవకాశం ఉంది.

అర్జునుడు మత్స్యయంత్రాన్ని ఛేదించి ద్రౌపదిని చేపట్టింది మొదలు ఆమె జీవితం మారిన పరిస్థితులకు అనుగుణంగా ఆశ్చర్యకరంగా క్షణాల్లో మారిపోయింది.

దైవవశాన పాండుకుమారులయిదుగురూ తనపట్ల ఆసక్తులై మన్మథావస్థలకు లోనైనప్పుడు ఆమె తడబాటు పడలేదు.

'గురువచన ప్రకారం ఈమెను మనం అయిదుగురం వివాహం చేసుకొందాం' అని ధర్మరాజు అన్నప్పుడు ఆమె చలించలేదు.

ఆ మాటకువస్తే అసలామెకు స్వయంవరంలో తనను జయించింది ఎవరు? అన్న సంశయమే కలుగలేదు.

విచిత్రంగా ధర్మజుని నోట ఆ మాట వెలువడిన వెంటనే ఆమె తనను తాను ఆ అయిదుగురికీ సమర్పించుకొంది.

1. డా. కె. యస్. ఇందిరాదేవి - "ఆంధ్రమహాభారతములో ద్రౌపదిపాత్ర - సమగ్ర పరిశీలనము" పుట - 238

కుంతీదేవి శిక్షణలో ఆమె వారి అప్పటి స్థితికి అనుగుణంగా చాలా సులువుగా మారగలిగింది. ఆది గర్భేశ్వరి అయిఉండీ, భిక్షాన్నాన్నీ, భర్తల భుక్తశేషాన్ని, ఆదరంతో ఆరగించింది. దర్భ పూరి పఱపులపై భర్తల పాదాలకు ఉపధానంగా నిశ్చింతగా శయనించింది. ఆమె అంతలా మారిపోయినందుకు ధృష్టద్యుమ్నుడే ఆశ్చర్యపోయాడు. ఆమె ఉత్తమగుణాలకు కుంతీదేవి ఎంతగానో సంతోషించింది. వివాహానంతరం ఆమె ఇలా ఆశీర్వదించింది:

"..........................

..........................

లలితాంగి! హరియందు లక్ష్మిని మఱి చంద్రు
నందు రోహిణి నింద్రు నందు శచిని
నవ్వసిష్ఠ మునీంద్రునం దరుంధతిం బోలి
సుందరి నీపతులందుఁ బ్రీతిఁ
బతి భక్తి యొప్ప నపత్యంబుఁ బడయుము
..........................[1]

"అంతేకాదు, నీ భర్తలు రాజసూయాది యాగాలు చేసేటప్పుడు నీవే ధర్మపత్నిగా వానిలో పాలుపంచుకొంటావు. నేను నీపట్ల ఆనందించినట్లుగా నీవు నీ కొడుకులు, మనుమలపట్ల ఆనందాన్ని పొందు" అని కూడా ఆమె ద్రౌపదితో పలికింది.

భర్తలతో పాటు ద్రౌపది హస్తినాపురానికి వచ్చి ఐదేళ్ళు కౌరవస్త్రీలతో కలిసి ఉంది. ఆ తరువాత ధృతరాష్ట్రుడు అర్ధ రాజ్యం ఇచ్చి పాండవులను ఖాండవప్రస్థానికి పంపడంతో ఆమె 'పట్టమహిషి' అయి, మహావైభవంతో శోభించింది.

---

1. ఆది - 8 - 4

శ్రీకృష్ణుడు పాండవులను పాలనాసిద్ధులను చేసి, ద్వారకకు తిరిగి వెడుతూ, "కొద్దికాలంలో మీ వద్దకు నారదుడు వస్తాడు. ఆయన చెప్పిన ప్రకారం నడుచుకోండి." అని ఆదేశించాడు. కొంత కాలానికి కృష్ణుడు చెప్పినట్లుగానే నారదమహర్షి వచ్చాడు. వారందరూ భక్తితో ఆయనను సేవించారు. ఆ తరువాత నారదుడు ద్రౌపదిని లోనికి పంపివేసి ఏకాంతంగా పాండవులతో ఇలా చెప్పాడు.

"మీరు సర్వధర్మాలూ తెలిసినవారు. రాజులచేత పూజింప బడేవారు. ఒకరిపట్ల ఒకరు నిత్యమైన సౌహార్దం కలవారు. సాటిలేని గుణాలతో కీర్తి కెక్కినవారు. ఇట్టి మీకు అయిదుగురికీ ద్రౌపది ధర్మా నుసారం ధర్మపత్ని అయింది. ఇది లోకాగమాలకు విరుద్ధం. ఈమె కారణంగా మీ మధ్య 'విప్రీతి' కలుగకుండా ఉండాలి. పూర్వం సుందోపసుందులనే సోదరులు స్త్రీ నిమిత్తంగా కలహించి చనిపోయారు. స్త్రీల కారణంగా ఎంతటి ధృతిమంతులకైనా భేద బుద్ధి పుడుతుంది. మీరీ సంగతిని గమనించి అన్యచింత లేక చక్కని నియమాన్ని పాటిస్తూ ద్రౌపదితో సుఖంగా ఉండండి[1]

నారదుడు చెప్పిన ప్రకారం పాండవులు విమల బుద్ధితో ఒక అంగీకారానికి వచ్చారు. దాని ప్రకారం ఆ అయిదుగురి యందూ ద్రౌపది ఒక్కొక్క యేడు ఒక్కొక్కరి ఇంట క్రమానుసారం ఉంటుంది. ఎవరి ఇంట ఆమె ఉంటుందో ఆ ఇంటి దిక్కుగా ఇతరులు పోకూడదు. తెలియక వెడితే 12 నెలలు తీర్థసేవచేస్తూ విశేషవ్రతాలు చేయాలి. ఈ విధంగా వారు నారదుని సమక్షంలో నియమం పెట్టు కున్నారు. నారదుడు వెళ్ళిపోయాడు. పాండవులు ద్రౌపదితో సుఖంగా గడపసాగారు.

---

1. ఆది - 8 - 93 నుంచి 114 వరకు

పాండవుల అభ్యుదయ వార్తను వినగానే దుర్యోధనుడు ఎంతగానో దుఃఖించాడు. ధృతరాష్ట్రుడు కూడా ఎంతో అంతస్తాపానికి లోనయ్యాడు. ఆ తండ్రీకొడుకులు ఒక్కటై పాండవవిభేదనోపాయులు అనేకం ఆలోచించారు. ఆ సందర్భంలో దుర్యోధనుడు 'అందమైన అయిదుగురు స్త్రీలను పాండవులపై విడివిడిగా ప్రయోగించి వారికి ద్రౌపది వలన విరక్తి కలిగిద్దామా? లేక, అయిదుగురికీ ఒక స్త్రీ భార్యగా ఉండటం కష్టమని ద్రౌపదికి చెప్పించి ఆమెను పాండవులపట్ల విగతస్నేహను చేద్దామా?' అని ప్రస్తావించడాన్ని దృష్టిలో ఉంచుకొని పరిశీలిస్తే, నారదమహర్షి పాండవులకు హితబోధచేయడం, పాండవులు పై విధమైన కట్టుదిట్టం చేసుకోవడంలోని ఔచిత్యం బోధపడుతుంది.

ద్రౌపది భర్తలను సేవించిన తీరు విశేషమైనది. ఆమె భర్తలతో ప్రవర్తించే విధానం దూరస్థులకు అద్భుతావహంగా ఉండేది. చనవుగల సమీపవస్తులకు మాత్రం ఆమె భర్తలను గుప్పిటపెట్టుకొన్నదనిపించేది.

పాండవులు ద్రౌపదీ సమేతంగా అరణ్యంలో ఉంటున్నప్పుడు వారిని దర్శించడానికి సత్యభామను వెంటపెట్టుకొని శ్రీకృష్ణుడు వచ్చాడు. కృష్ణుని లోబరచుకోవడానికి ఎన్నోతిప్పలు పడుతున్న సత్యభామకు ద్రౌపది దిక్పాలకులవంటి తేజస్సు కలిగిన పాండవులను సేవించినతీరూ, వారు ఆమెపట్ల అనురక్తులైన విధమూ ఆశ్చర్యం కలిగించింది. ద్రౌపది దాంపత్య రహస్యమేమిటో తెలుసుకోవాలనిపించి, ఒంటరిగా ద్రౌపదిని ఇలా అడిగింది :

"నీ ప్రియభర్తల నిర్మల చరితులఁ
ప్రకటతేజుల లోకపాలనిభులఁ
బార్థుల నీ వొకభంగిన వదలక
చెలువ యొబ్బంగి భజింతు దగిలి

యొక్కఁడొక్కనికంటె నువిద నీకేపురు
　　షనురక్తులగుట యత్యద్భుతంబు
నగుమొగంబులకాని నాతి నీదెసనెప్డుఁ
　　బతులకుఁ గింకిరిపాటు లేదు,
వ్రతము పెంపో? మంత్రౌషధసైభవంబో?
సరసనైపథ్య కర్మకౌశలమొ? చతుర
విభ్రమోల్లాసరేఖయొ? వెలఁది! నీ వి
శేష సౌభాగ్యహేతువు సెపుమనాకు."

"ఏనును నీవలన నిజము
గానిది యంతయును నెఱిఁగి కమలదళాక్షుం
బూని వశగతునిఁజేసి య
నూనస్నేహానుభోగయుక్తిఁదలిర్తున్."[1]

అమాయికమైన ఈ ప్రశ్నలకు ద్రౌపదికి మొదట కొంచెం కోపంవచ్చింది. "నన్ను అలాంటి దుష్టస్త్రీగా భావించడం న్యాయమా? అంతటి పురుషోత్తమునికి భార్యవి ఎలా అయ్యావు?" అని సున్నితంగా మందలించి, ఆమె అడిగిన 'కిటుకులు' ఏమిటో ఇలా వివరించింది :

"మందులకీ, మాకులకీ, మంత్రతంత్రాలకీ భర్తలు లొంగుతారనుకోవడం వెలితనం. అలాంటివానివల్ల మొదటికే మోసంవచ్చే ప్రమాదముంది. ఆ ప్రయోగాలు భర్తకు తెలిస్తే భర్త ఆ స్త్రీతో కాపురాన్ని పాముతో పొత్తుగా చూస్తాడు. ఒక్కొక్కసారి ఆ ప్రయోగాలు వికటించి, భర్తకు దుర్దశ ప్రాప్తించి, ఆ స్త్రీకి లేనిపోని నిందలువస్తాయి. కనుక అలాంటి వానిజోలికి పోకూడదు. భర్త భావాల నెరిగి అతని యిష్టప్రకారం నడిస్తే సమస్తమూ సమకూరుతుంది. నా భర్తలతో నేను ఎలా ఉంటూ ఇంతటి సౌభాగ్యాన్ని పొందానో వివరిస్తాను.

1. ఆరణ్య - 5 - 291 - 292

"నా పతులు ఇతర పడతులపట్ల ఆసక్తులయినా నేను కోపించను. ఎన్నడూ అహంకరించను. మనస్సును ఏకముఖంచేసి, ఎల్లప్పుడూ వారిపట్ల భక్తి కలిగిఉంటాను. చూపు, పలుకు, కోరిక, చేష్టలు వింతగా లేకుండా జాగ్రత్త పడుతూ ఉంటాను. దేవ, గంధర్వ, యక్షులలో వారైనా సరే, అన్యపురుషుణ్ణి, గడ్డిపోచగా చూస్తాను. స్నాన, భోజన, శయనాదులు భర్తలకంటె ముందుగా చేయను. భర్తలు బయటినుంచి వస్తే ఆసనపాద్యాది విధులు భక్తితో నేనే స్వయంగా నిర్వహిస్తాను. ఆయావేళల్లో నియంతగా భర్తలకు మజ్జన, భోజన క్రియలు సమకూరుస్తూ ఉంటాను. ధన, ధాన్యాలు వ్యర్థంకానీయను. ఇంటినీ, దొడ్డినీ, పాత్రలనూ శుభ్రంగా ఉంచడంలో ఏమరుపాటు చెందను. బంధువులకు ఆనందం కలిగేలా ప్రవర్తిస్తాను. తలవాకిట మెలగడం, కూడని వారితో స్నేహం చేయడం, విరోధాలు పెట్టుకోవడం, హాస్యక్తులతో పెద్దగా నవ్వటంవంటివి నాకుకిట్టవు.

"భర్తలు ప్రవాసంలో ఉన్నప్పుడు పూలూ, గంధం, ఆభరణాలూ ధరించను. మనస్సంతా వారి మీదే పెట్టుకొని, వారి రాకను కోరుతూ ఉంటాను. భర్తలు నాపట్ల మృదువుగా ఉన్నారని మితిమీరి వర్తించను. కోపించినప్పుడు వారు పాములవలె క్రూరులని భయంతో ఉంటాను. ఇలాటి ప్రవర్తనతో సేవించబట్టి భర్తల అనురాగానికి పాత్రురాలినయ్యాను కానీ నీవు చెప్పిన మందులూ, మంత్రాలూ, ఇంద్రజాలాలవల్ల మాత్రంకాదు. అలాంటివి నాకు అసలే తెలియవు."

ఈ మాటల్లో ద్రౌపది భర్తలపట్ల ఎలా ప్రవర్తించేదో స్పష్టపరచబడింది. ఇవి స్వయంగా ద్రౌపది చెప్పుకొన్న మాటలుకనుక తిరుగులేనివి. భర్తలతోటి ఆమె ప్రవర్తనను గూర్చి తెలుసుకోవడంలో ఎంతో విలువైనవి. ద్రౌపది వింతదాంపత్యం గురించి ఈమాత్రపు సమాచారాన్ని ద్రౌపదినుంచి స్వయంగా వచ్చేలాచేసిన సత్యభామకు

లోకం ఎంతేనా ఋణపడి ఉంది. ఆమె అమాయకంగా ప్రశ్నించి అసలు విషయాన్ని రాబట్టగలిగింది ద్రౌపదినుంచి.

ద్రౌపదికి, ఆమె భర్తలకు ఒకచిత్రమైన చక్కని అవగాహన ఉంది. భర్తల స్వభావాలను అర్థంచేసుకొని ఎవరికి తగినట్లుగా వారితో మెలగడం ఆమెకు అలవోకగా సిద్ధించింది. ఆమె తన భర్తలతో ప్రవర్తించిన తీరును పరిశీలిద్దాం.

**ద్రౌపది - ధర్మరాజు :** ధర్మజుడు "నగియును బొంకునందు వచనంబు, నధర్మువు నందుఁ జిత్తముం దగుల"ని[1] ధర్మతత్పరుడని ద్రౌపదికి వివాహానికి ముందే బోధపడింది. అతని ఆంతర్యాన్ని అవగాహన చేసుకోవడానికి ప్రయత్నిస్తూ, అన్నివిధాలా ఆమె అతనికి సహకరిస్తూ ఉండేది.

ధర్మజుడు కూడా ఆమెపట్ల ఎంతో అనురాగం కలిగి, ఆమె మాటలకూ, చేతలకూ తగిన ప్రాముఖ్యం ఇస్తూ ఉండేవాడు. ఆమె వివేకం, సామర్థ్యం బాగా తెలిసినవాడై గృహనిర్వహణ బాధ్యత అంతా ఆమెకు అప్పగించి నిశ్చింతగా తక్కిన విషయాలు చూసుకొనే వాడు.

పట్టమహిషిగా ద్రౌపది ధర్మజునితో యజ్ఞయాగాల్లో పాలుపంచుకొనేది. రాజసూయ సందర్భాన ద్రౌపది వైభవం దుర్యోధనాదుల అసూయావహమైంది. వైభవంలో పాలుపంచుకొన్నట్లే, ధర్మజుని ఆపదలలో కూడా ఆమె ధైర్యంగా పాలుపంచుకొంది.

కురుసభలో భర్తల ధర్మదీక్షా, తనపాతివ్రత్యమూ పరీక్షింపబడుతున్నాయని ఆమె వివేకంతో గ్రహించగలిగింది. దుశ్శాసనాపకృష్ట

1. ఆది - 7 - 250

అయి, కోపలజ్జాపరవశతను పొందినప్పుడు కూడా ఆమె "ధర్మరాజు ధన్యుడు, ఎంతటి దీనావస్థపాలైనప్పటికీ ధర్మపథాన్ని వీడడు" అని ఘంటాపథంగా చాటిచెప్పింది.[1] ఆ సన్నివేశంలో ఆమె ప్రదర్శించిన ఓర్పూ, నేర్పూ పాండవుల కీర్తికీ, ధర్మనిష్ఠకూ ఎంతగానో తగినవి.

అరణ్యవాసంలో భర్తలు దురవస్థపాలు కావడం ద్రౌపదికి దుస్సహమయింది. అధర్మపరులైన కౌరవులపట్ల ధర్మవర్తనం తగదు అని ఆమెకప్పుడు తాత్కాలికంగా అనిపించింది. ధర్మజుడు మహాజ్ఞానీ, ధర్మస్వరూపుడూ అని తెలిసికూడా ఆమె తన అభిప్రాయాలను అతనితో చెప్పడానికి వెనుకంజ వేయలేదు.

"విమలహర్మ్యంబుల విహరించు వారలఁ
బ్రియమహార్హాసన శయనరతులఁ
జందనాగురులిప్తచారు సర్వాంగుల
నతనరనాథ సేవితులమిమ్ము
వనమునఁ గ్రుమ్మరు వారిఁ గాఁ గుశబృసీ
శయనాభిరతులఁగా నియతరూక్ష
భూరేణు ధూసరీ భూతవిగ్రహులఁ గా
ద్రుతవన్యమృగ నిషేవితులఁ గాఁగ
నిట్లు సూచి చూచి యేనెట్లు చిత్తోప
శాంతి సేయుదాన సకలభోగ
విషయవిరతిఁ జేసి విధియును ధృతరాష్ట్రు
నట్లు మీకు నహితుడఁయ్యెనొక్కొ?"[2]

అని విలపిస్తూ, "క్షత్రియుడైన వానికి సహనమూ, పరాక్రమమూ రెండూ సమంగా ఉండాలి. ఇది పరాక్రమింపదగిన సమయం. నీవు

1. సభా - 2 - 218
2. ఆరణ్య - 1 - 210

ఒప్పుకుంటే చాలు, నీ తమ్ములు దుర్యోధనాదులను వధించి, ఈ దురవస్థను పోగొడతారు" అని ప్రబోధించింది.

భర్తలస్థితికి ద్రౌపది దురపిల్లినట్లుగా ఆమెపడుతున్న కష్టాలకు ధర్మజాదులుకూడా ఎంతగానో బాధపడేవారు. అరణ్యవాసంలో ఉండగా, వారంతా గంధమాదనపర్వతానికి వెడుతున్నప్పుడు, కఠినమైన మార్గంలో నడవలేక ద్రౌపది మూర్ఛిల్లినప్పుడు, ధర్మరాజు తనకారణంగా ఆమెకు అట్టిస్థితి కలిగినందుకు విలపించాడు. "ద్రుపదుడు తనకుమార్తె సుఖపడుతుంది గదాని ఈమెను మనకిచ్చిచేశాడు. కానీ నావల్ల ఈమెకు అన్నీ కష్టాలే. ఆ తండ్రికి ఈవిషయం తెలిస్తే ఎంతగా తల్లడిల్లిపోతాడోగదా!"[1] అనితమ్ములతో తనబాధను పంచుకొన్నాడు.

ద్రౌపది తనకు తాను ఎంతటి 'ఆరిందా' అయినా, ధర్మరాజు దృష్టిలో మాత్రం ముద్దరాలే. విరటుని కొలువులో చేరడానికి ముందు ఆమెనుగూర్చి అతడు

"ఇది గడుముద్దరాలు పను లేమియుఁ జేయఁగ నేర దెంతయున్
మృదు వొకకీడుపాటునకు మేకొనజాలదుదాత్తచిత్తయొం
టి దిరుగుదాని కోర్వదొకటిం దనుఁ దా నవరించు చొప్పెఱుం
గదు తగనొండులంగొలువఁగా వెరవెమ్మెయిఁగల్గు నక్కటా!"[2]

అంటూ బాధపడ్డాడు. సేవించబడటమే గాని సేవించడం ఎరుగని వైభవం ఆమెది. సంవత్సరంపాటు తనమానానతాను పరులను సేవిస్తూ ఆమె గడపటం అంటే సామాన్య విషయంకాదు. అందు కన్నమాట అతనికింత ఆవేదన!

ద్రౌపది కష్టాల్లో ఉన్నప్పుడు ఎక్కడో దూరాన ఉన్నాసరే, ఆవిషయం ధర్మజునికి తెలిసేది. సైంధవుడు బలవంతంగా ఎత్తుకుపోతు

1. ఆరణ్య - 3 - 300
2. విరాట - 1 - 103

న్నప్పుడు శకునాలనుబట్టి వేటలో ఉన్న ధర్మరాజు కీడును శంకించాడు. అప్పుడతని మనస్సంతా చేత్తో కలచినట్లయింది. శరీరం నిశ్చేష్టమైంది. కామ్యకవనం అంతా శూన్యంగా తోచింది. ఇది వారిద్దరి మధ్యాగల సహానుభూతిని (Tuning) నిరూపించే సన్నివేశం.[1]

---

1. ఈ విధమైన సహానుభూతి సాధ్యమేనా? అంటే, సాధ్యమే. స్వచ్ఛమైన ప్రేమఉన్న చోట ఇటువంటి సహానుభూతి సాధ్యమని చెప్పటానికి కీ.శే. వేటూరి ప్రభాకరశాస్త్రి గారి జీవితం నుంచి ఒక ఉదాహరణ చూద్దాం. వేటూరి వారు పరమప్రేమస్వరూపులు. మాస్టర్ సీ.వి.వి. యోగవిధానంలో సిద్ధిపొందిన మహానుభావులు.

"ఒకనాడు నాకు గుండెలో నొప్పిగా ఉంది. దీనికి కారణం ఏమని ఆలోచిస్తే కొంతసేపటికి జరిగిన సంగతి స్ఫురణకు వచ్చింది. అదియిది : శ్రీ సెట్టిగారికి శరీరములో అనారోగ్యం, విపరీతమైన గుండెనొప్పి, వీటితో అయన బాధపడేవారు. వారికి ట్రీటుమెంటు చేయగా అంతా చల్లగా సర్దుకొంది. కాని వారికా బాధపోగా నాకు గుండెల్లో నొప్పి యేమిటి? దీనికి కారణం ప్రేమ. వారు చాలా బాధపడుతున్నారు. వారి బాధపోయి సుఖంగా ఉండాలని నేను మాష్టరుని కోరుకొనేవాడిని. అంటే వారూ నేనూ ఒక్కటేనన్న భావంతో. వారు సుఖంగా ఉంటే నా సుఖమూను ఇటువంటి తీయని భావంతో ఎవరయినా భగవంతుని ఆరాధిస్తే వారి తలపులు సత్యం అవుతవి. అదే స్వచ్ఛమైన ప్రేమ."

...ప్రభాకర ప్రవచనములు (యోగమిత్రమండలి, 1981, తిరుపతి)

సోవియట్ రష్యాలో ఈ విధమైన సహానుభూతిపై 1968 ప్రాంతం నుంచీ అనేక పరిశోధనలు సాగుతున్నాయి. "...డా. పేవెల్ నావ్‌మోవ్ (Pavel Nawmov) పెళ్ళీడుకు వచ్చిన యువకులు వారు ప్రేమించిన అమ్మాయిలతో దూరదృష్టి ప్రసారం ద్వారా ఒకరి ఆలోచనలు ఇంకొకరికి అందటం, ఒకరి హృదయంలో ప్రేమ రేడియో ప్రసారంలాగ ఇంకొకరికి చేరడం గమనించేడు. ఆయన పరిశోధించిన జంటలలో నూటికి 40 శాతం అమ్మాయిలు, పురుషులు పంపిన మానసిక తరంగాలు గుర్తించగలిగేరు. మనుష్యుల మీదేకాక జంతువుల మీదకూడ కొన్ని ప్రయోగాలు చేశారు రష్యాలో. అందులో కుందేళ్ళు తమ పిల్లల నుంచి ప్రసారం అయ్యే మానసిక తరంగాలను గ్రహించగలగడం, వాటి మెదడులో ఏర్పాటు చేసిన ఎలక్ట్రోడ్‌ల సహాయంతో ఋజువైనాయి. పేవెల్‌నావ్‌మోవ్ (Pavel Nawmov) ఈ పరిశోధన

విరాటుని సభలో ద్రౌపది కీచకునిచే భంగపడినప్పుడు ధర్మరాజు నిగ్రహంతో ఊరుకున్నాడు. ప్రతీకారం తలపెట్టిన భీముణ్ణి గూఢభాషణతో వారించాడు. విరాటుడు కీచకుణ్ణి బ్రతిమాలి సభలో నుంచి పంపించివేశాక కూడా ద్రౌపది ఏదో చెప్పాలని చూస్తూ సభలో ఉండిపోయింది. సభలోని వారందరి చూపులూ ద్రౌపది మీదనేఉండటం వారు పలురకాలుగా చెప్పుకొంటూ ఉండటం గమనించాడు ధర్మజుడు. ఎలాగైనాసరే, ఆమెను అంతఃపురానికి పంపాలనుకొని,

---

గురించి చెబుతూ- "నీళ్ళలో మునిగిన ఒక సబ్ మెరీన్ లేక జలాంతర్గామిలో కొన్ని కుందేలు పిల్లలను వుంచడం జరిగింది. వాటి తల్లికుందేలును చాలదూరంలో ఒక లేబరేటరీలో పెట్టి దానిమెదడులోకి సున్నితమైన ఎలక్ట్రోడ్‌లు దూర్చి కరెంటుసూచించే యంత్రానికి కలిపేరు. ఆ తర్వాత జలాంతర్గామి నీటిలో మునిగిన తర్వాత కుందేలు పిల్లలు ఒక్కొక్కటే చంపివేయబడ్డాయి. తల్లికుందేలుకు దూరాన తనపిల్లలకు ఏం జరుగుతోందో తెలుసుకొనే అవకాశం లేదుకదా! అంతేగాక తన పిల్లలు చనిపోతున్న సంగతి తల్లికుందేలు గమనించ లేదు. అయినప్పటికీ మహాశ్చర్యం ఏమిటంటే- సరిగ్గా ఏ సెకండులో ఒక్కొక్క కుందేలు పిల్ల చంపబడిందో సరిగ్గా అదే సెకండులో తల్లి కుందేలు మెదడులో తరంగాలు రికార్డు చేయబడినాయి. నిశ్చయంగా తల్లికుందేలుకి తన పిల్లల మెదడు నుంచి భావతరంగాలు ప్రసారం చేయబడటం సుస్పష్టంగా ఋజువయింది." — అంటాడు డా॥ పేవెల్‌నావ్‌మోవ్ (Pavel Nowmov) F. N. :
'' On the Question of wordless Transmission of Information. ''
(Annotated Reports : 24th All Union Scientific Session-Moscow 1968)

"సోవియట్ సైంటిస్టులు ఆలోచనల ప్రసారం గురించి చేసిన ఇలాంటి పరిశోధనలు డజన్లకొద్దీ వున్నాయి........." "...మాస్కో నుంచి లెనిన్‌గ్రాడ్‌కి అనేకఆలోచనలని కామెన్‌స్కీ నికోలాకి అందించితే అతడు సరిగ్గా వాటిని గ్రహించాడని ఈ పరిశోధనలవల్ల వెల్లడైంది. ఉత్త ఆలోచనకంటె ఉద్రేకంతో ఆవేశంతో పంపిన భావతరంగాలను ఇంకాస్పష్టంగా గ్రహించగలిగాడని ఈ పరిశోధనలలో ఋజువైంది"
(Milan Ryzt ''Research in Telepathy in Soviet Russia'' (Journal in para-psychology Vol. 25, No. 2, 1961), Repetsky - Biotelegraph (Leningrad Banner April 1962)

—సోవియట్ రష్యాలో ఆధ్యాత్మిక పరిశోధనలు, 1979 E. వేదవ్యాస.

"పలువోకలఁ బోవుచు వి
చ్చలవిడి నాట్యంబు సూపుచాపున నిచటం
గులసతుల గఱువచందము
దొలఁగఁ నిట్లునికిఁ దగునె తోయజవదనా!"[1]

అని కొంచెం పరుషంగాపలికాడు. వాస్తవానికి ధర్మరాజు అప్పుడు అలా అనవలసిందికాదు. కానీ అనక తప్పలేదు. మరికొంచెంసేపు ఆమె అలాగే అక్కడ ఉండిపోతే ఎంతప్రమాదం!?

ద్రౌపది ఆ మాటలకు బాధపడింది. వెంటనే సాభిప్రాయంగా ఇలా అంది :

"నాదు వల్లభుండు నటుఁ డింతనిక్కంబు
పెద్ద వారి యట్ల పిన్నవారు
గానఁ బతులవిధమ కాక యే శైలూషిఁ
గా ననంగరాదు కంకభట్ట!

"అట్లగుటంజేసి నాకు నాట్యంబును పరిచితంబ. మత్పతి శైలూషుండ కాఁడు కితవుండునుంగావున జూదరియాలికి గఱువుతనం బెక్కడియది?"[2] అంటూ అక్కడినుంచి వెళ్ళిపోయింది.

సానుభూతి చూపవలసిన సమయంలో భర్తనుంచి ఎదురైన నిందాలాపానికి ఆమె మనస్సు సమస్థితిని కోల్పోయింది. అందువల్ల అంతపరుషంగా ఆమె ధర్మజునికి సమాధానం చెప్పింది. అయితే, ఇది తాత్కాలికమైన ఆవేశం మాత్రమే. ఈ ఆవేశం కూడా ఎందుకు కలిగిందో ఆమెయే ఇలా వివరించింది :

---

1. విరాట - 2 - 150
2. విరాట - 2 - 152, 153

"కినుకకుఁ జాల కెంతయును గీడ్పడి నాపడుపాటు లెల్ల వ
మ్మునఁ గలయంగ నిట్టు లొకమూర్ఖునిచేఁ దుదిఁ బొంది కోలుపో
యెనె యభిమాన మన్వగపు నేడ్తెఱ డెందము గొందలంబుఁ బొం
దిన ధృతి మాలి యేఁ బలికితిం దగ వెల్ల నెఱింగి యుండియున్.

"ఇట్టిద కాని సమస్తజనస్తవనీయుం డగు పాండవాగ్రజు నిక్కాంబ నిందించినదానం గా నని పలికి ..."[1] ఆ నింద చేసినందుకు పరిహారంగా ధర్మజుని మహత్త్వాన్ని నోరారా కీర్తించింది.

ధర్మతనయుని ధర్మనిరతి తమకే కాదు, లోకాని కంతటికీ రక్ష అనీ, అతని సత్కర్మలవల్లనే భూమి ఇలానిలబడిందనీ ఆమె విశ్వాసం. అజాతశత్రు పనేఖ్యాతికి భంగంరాకుండా దిగ్విజయం చేయడం, రాజసూయం నిర్వహించడం, ధర్మనిష్ఠకలిగి, నిత్యవ్రతంగా సత్యాన్ని పాటించడం, అంతటి గాంభీర్యమూ, ధైర్యమూ కలిగి కరుణోత్తరుడు, బ్రాహ్మణ సమృద్ధికరుడు, వంశోద్ధరణ చేసేవాడు, ఉపకారపరుడు అని ప్రసిద్ధికెక్కడం మహానుభావుడైన అతనికి తప్ప ఇతరులకి సాధ్యంకాదని ఆమె భావించింది. అతని వైభవాన్ని ఒకసారి స్మరించి అంతటి మహాత్ముడు ఇప్పుడు దిక్కుమాలినవానిలా ఒకని నాశ్రయించి ఉండటం చూడలేకపోతున్నానని ఆక్రోశించింది.

"విచ్చలవిడి నాట్యంబు సూపు చాడ్పున" అని ధర్మజుడు అనడం అభిమానవతి అయిన ఆమెకు తీవ్రమైన పరితాపాన్ని కలిగించింది. ఆమె ఉన్నస్థితిలో అలాంటిమాటను సహించడం ఎంతటివారికీ సాధ్యం కాదు. ధర్మజుడు అంతకీ ఎంతో నిబ్బరంగా తూచినట్లుగా మాటలు ఉపయోగించాడు. ఆమెమాత్రం 'ధృతిమాలి', ఆవేశంలో "పతులవిధము కాకయే శైలూషిఁ గాననంగ రాదు కంకభట్ట!" అంటూ మాట తూలింది. అంతమాత్రాన ఆమె పాతివ్రత్యానికి భంగం కలిగిందని

1. విరాట - 2 - 186, 187

భావించడంసరికాదు.[1] భార్యగా తనకుగలిగిన సంతోషాన్ని, ఆనందాన్ని భర్తలతో పంచుకొంటున్నట్లే దుఃఖాన్నిగాని, విషాదాన్నిగాని ఆమె వారితోపంచుకోవడం తప్పు అనలేం గదా! ఇక్కడ, ఆమె మనస్సుకు నొప్పితోచింది. కోపంవచ్చింది. ఆ కోపాన్ని భర్తమీదకాక ఎవరిమీద చూపిస్తుంది? అంతగా ప్రేమించి ఆరాధించే ఆమెకు ఆమాత్రం అతనిపై కోపగించే చనవు ఉండటంలో తప్పేముంది? సభలోనిజనం ఆమెను చూసి గుజగుజ లాడుతున్నారనిగదా ధర్మరాజు బాధపడి అంతటి మాట అన్నాడు. కనుక సైరంధ్రి సంస్కారానికి తగినట్లుగా మాట్లాడి, ఆమె సభవారి అనుమానాలను నిరాధారమైనవిగా నిరూపించడానికి యత్నించినట్లయిందికూడా.

దాంపత్య మున్నప్పుడు పరస్పరమైన లాలింపులు ఎంత సహజమో, మందలింపులూ అంతసహజమే మరి!

విరాటుడు కోపంతో "పేడిని పొగడటం ఆపమంటే ఆపవేం?" అంటూ చేతిలోని పాచికను విసిరి కొట్టగా, అది ధర్మజుని ముఖంపై తగిలింది. బొటబొటారక్తం కారింది. సమయానికి సమీపానేఉన్న ద్రౌపది వెంటనే తనచీరచెంగుతో అతనిగాయాన్ని ఒత్తిపట్టింది. ఆ తరువాత ప్రక్కనున్న స్వర్ణకలశంలోని నీటిని చేతిలో పోసుకొని గాయాన్ని కడిగింది.ఆమె అలాఎందుకు చేస్తోందో అర్థంకాని విరాటుడు ఆమెను కారణం అడిగాడు. అప్పుడామె

---

1. "................................
ద్రౌపది కష్టమైనసతి ధర్మము గాదనియూరకుండ కా
క్షేపము సేయు భర్తల సుశీలత కయ్యది లోపమర్భకా!''
దృష్టాంతములు :- ఆరణ్య - 1 - 143; విరాట - 2 - 295;

—భారత సంశయవిచ్ఛేదము, 1939; 22 పద్యం
కీ. శే. వడ్లు సూర్యనారాయణగారు.

"విమలవంశంబునను బుణ్యవృత్తమునను
వఱలునీతనిరక్తంబు వసుమతీశ!
ధరణిపై నెన్నిబిందువుల్ దొరఁగె నన్ని
వర్షములు గల్గు నిందనావర్షభయము."[1]

అనిచెప్పి నీకు హాని కలుగకుండా ఇలాచేశానని సమర్థించుకొంది. ధర్మజుని దివ్యప్రభావాన్ని ఆమె చక్కఁగా గ్రహింప గలిగిందనటానికి ఇది ఒకఉదాహరణ.

అందరితో కలిసిఉన్నప్పుడు ద్రౌపది తనను ధర్మజునితో కలుపుకొని ఒకవిధమైన పెద్దరికాన్ని తనకుతాను ఆపాదించుకొంటుంది. రాయబారానికి వెళ్లనున్న శ్రీకృష్ణునితో తనభంగపాటును చెప్పు కొంటూ, " ....... ... యిట్లు బన్నములు వడిన ధర్మనందనుండు నేను రాజరాజుపీనుంగుఁ గన్నారఁగానఁబడయ మైతిమేనిఁ గృష్ణ!"[2] భీమునిబాహుబలం, కత్తివిక్రమం వ్యర్థంగదా?' అనిపలికింది.

యుద్ధానంతరం ధర్మరాజు బంధువధకు విషాదంచెందగా ఆమె తనదుఃఖాన్ని దిగమ్రింగుకొని, ఎంతోచనవునుప్రదర్శిస్తూ, "...నీమదిఁ బట్టుకొన్నయున్మాదము హీనమానవుల మనంబునఁ బుట్టిన పెట్టివోలె నసాధ్యదులఁదీర్చుటొప్పదు నిజానువర్గము మీఁదఁగల్గు నత్యాదరసాంద్ర సారకరుణామృత మానఁగనిమ్ము నెమ్మదిన్" అని చెప్పింది.[3]

ద్రౌపదీ ధర్మజుల దాంపత్యం ఉదాత్తమూ, మహోన్న తమూ, మహిమాన్వితమూ అని ఈపరిశీలనవలన స్పష్టపడుతోంది.

---

1. విరాట - 5 - 261
2. ఉద్యోగ - 3 - 117
3. శాంతి - 1 - 101

**ద్రౌపది - భీముడు :-** ద్రౌపది కోరినవానిని సమకూర్చడంలోను, ఆపన్నురాలైనప్పుడు ఆమెనుఆదుకోవడంలోను భీముడు చూపినచొరవ, సాహసం ఆమెపట్ల అతనికిగల ప్రేమకు, ఆదరభావనికి నిదర్శనాలు.

కురుసభలో ద్రౌపదికి జరిగిన అవమానానికి భీముడు తట్టుకోలేకపోయాడు. కోపరక్తాంతనయనుడై, అంతకాకారంతో అతను చేసినప్రతిజ్ఞలు అతిభయంకరమైనవి. క్రోధావేశంతో ఆయుధాలకేసి చూస్తూ, ధర్మజుని ముఖంలోకి చూపులు ప్రసరిస్తూన్నభీముణ్ణి భీష్మాదులు శాంతింప జేయకపోయినట్లయితే కౌరవులపని నాటితోనే ముగిసిపోయేది. ధర్మపుత్రుని అనుజ్ఞ లేకపోవడంతో అప్పటికి వారు బ్రతికిపోయారు.

ఆశ్రమంలో ఒంటరిగాఉన్నద్రౌపదిని అపహరించుకు పోవడానికి యత్నించినసైంధవుణ్ణి అర్జునుడు అడ్డుపడక పోయినట్లయితే భీముడు ప్రాణాలతో వదిలేవాడేకాదు. అప్పటికే "ఒడలెల్ల బిండి కూడుగఁ బొడిచి యెగయనెత్తిత్రిప్పి భూస్థలి మఱియుం బడవైచి యురము మొగమును నడచి" వేశాడు.[1]

అజ్ఞాతవాస సమయంలో కీచకుడుద్రౌపదిని అవమానించడాన్నికళ్లారా చూసినభీముడు కోపంతో ఊగిపోతూ "ప్రళయకాలానలమున గండరించిన రూపంబు కరణి" అతిభయంకరమైన ఆకారంతో అతిశయిల్లాడు.[2] ఆకోపంలో కీచకునితోపాటుగా విరాటుని కూడా అంతంచేద్దామని చూశాడు. ధర్మరాజు కళ్లతోనే అతనిని వారించి, పైవారికి అర్థంకాని మాటలతో అతనిక్రోధాన్ని ఉపశమింపజేశాడు.

భీముడు ఆ రాత్రి వంటయింటిలో పడుకొని ఉండగా ద్రౌపది ఎవ్వరూ చూడకుండా అతనిని సమీపించి కీచక సంహారానికి

1. ఆరణ్య - 6 - 248
2. విరాట - 2 - 134

ప్రేరేపించింది. ఆమె వెళుతూనే అడిగిన మాట— "నన్నంతగా అవమానించిన కీచకుడు ఎప్పటిలా సుఖంగా నిద్రిస్తూ ఉంటే నీవు ఇలా ఎలా పడుకొని ఉండగలిగావు?" అని అతనిని తట్టి లేపింది.

భీమునికి ఆమె ఎందుకు వచ్చిందో తెలుసు. కానీ ఆమె నోటి నుంచి జరిగిందంతా చెప్పిద్దామని ముచ్చట పడ్డాడు. ఏమీ ఎరుగనట్లుగా "ఇంత ప్రొద్దుపోయి ఇక్కడకు ఎందుకు వచ్చావు? నిన్ను ఎవ్వరూ కనిపెట్టలేదు కదా!" అని అడిగాడు.

వెంటనే ద్రౌపది, "అంతా తెలిసీ నన్నడుగుతా వెందుకు? జరిగింది అప్పుడే మర్చిపోయావంటే నేను మళ్ళీ చెప్పే అవసరమే లేదు; అలాకాక అసలేంజరిగిందో వివరంగా తెలుసుకోవాలని అడిగానంటావా? అది మంచిదే. ఏమి జరిగిందో మొదటి నుంచీ చెబుతాను విను"— అని మొదలు పెట్టి విషయమంతా చెప్పింది. ఆ తరువాత ఎంతో నిష్ఠూరంగా

"విరా సుభటత్వమున్ బలము మిన్నక పోవఁగ దుస్ససేనుఁ డ
ట్లా సభలోన నన్ బఱిచె నంతియ కాక జయద్రథుండు సం
త్రాసభరంబు లే కనుచితం బొనరించినఁ జెల్లి పోయె నేఁ
డీ సభికుల్ గనుంగొనఁగ నిట్లయితిన్ వగ నాకు వింతయే!"[1]

అని పలికి, ధర్మజుడు తనను నిందించిన విషయాన్ని మనస్సులో పెట్టుకొని "ఆ కీచకుడు నన్ను తన్నినప్పుడు ధర్మరాజు చూస్తూ ఊరుకున్నాడు చూశావా?" అన్నది.

భీముడు ధర్మజుని సమర్థిస్తూ, "నీ పరాభవాన్ని, నా విజృంభణాన్ని చూసి, మేరువంతటి ధైర్యం కలిగిన ధర్మజుడు అలా వారించాడు గనుక సరిపోయింది, లేకపోతే, సమయభంగమై, నీవూ నేనూ కారణంగా ఆ ఆపదంతా వచ్చిపడిందని అందరూ నిందించేవారే

1. విరాట - 2 - 176

గదా! ధర్మరాజు పొగడదగినవాడు కానీ నిందార్హుడు కాడు", అని పలికాడు.

ద్రౌపది ఆ మాటలతో ఏకీభవించింది. ధర్మజుని ఎలాంటి పరిస్థితిలో నిందించవలసి వచ్చిందో వివరించింది. అతని ప్రాభవాన్ని వర్ణించింది. ఆ తరువాత భీముని పరాక్రమాన్ని, అతడు సాధించిన విజయాలను వర్ణించి, అతని ప్రస్తుతపు దురవస్థకు తాను ఎంతగా దుర పిల్లుతున్నదో వివరించింది.

"బక, హిడింబ, కిమ్మీర, జరాసంధులను వధించిన నీచేతులు వంటకట్టెలను విరుస్తూంటే చూస్తున్ననాకు ఎంతో విచారంగా ఉంటోంది. వినోదం కోసమని విరాటుడు నిన్ను క్రూరజంతువులతో పోరిస్తూఉంటే, మహనీయమూ, జగన్మాన్యమూ అయిన నీ శరీరం ఇలాంటి నీచక్రియలకు లోనవుతోంది కదాఅని బాధపడుతూ ఉంటాను. నీవలాపోరే సందర్భాల్లో నిన్నుగూర్చి విషాదాన్ని, సంతోషాన్ని నేను పొందుతూ ఉండటం గమనించినసుదేష్ణ, పరివారమూ నాకు నీపట్ల హృదయంలో ఏదో ఆసక్తి ఉందని గుసగుస లాడుకొనేవారు. నేను నీ రూపంపై మనసుపెట్టి చూస్తూ ఉండిపోయి, ఎప్పటికో స్పృహవచ్చి వారికేసి చూసి వారంతా నన్నే గమనిస్తున్నారని తెలుసుకొనేదాన్ని. కనుక నాపరాభవానికి నీవు నీకు తోచినవిధంగా మనగుట్టురట్టు కాకుండా శత్రుసంహారం చేయాలి" అంటూ ఆమె భర్తను ఉత్సాహ పరిచింది. చివరిమాటగా—

"వానిఁ డెగఁ జూడనైతేని వాయుపుత్త్ర
నీవు గనుగొన నురినైన నీరనైన
నగ్నినైన విషంబునైన నేను
మేను దొఱఁగుదు నెట్టు నీ యానసుమ్ము"[1]

అని ఒట్టుపెట్టుకుంది.

1. విరాట - 2 - 229

ఆమె మాటలకు భీమునికి నవ్వు వచ్చింది. చిరునవ్వుతో "కీచకుని చంపటానికి నువ్వు నాకు ఇంతగా చెప్పాలా? నా కళ్ళముందు నిన్ను అవమానించి వాడింకా బ్రతికి ఉన్నాడంటే స్త్రీలకు రక్షణ కల్పించేవారే లేనట్టు లెక్క. ఇప్పటికే ఆలస్యమైంది. రేపు ఎట్టి పరిస్థితుల్లోను ఆ కీచకుని మట్టుపెట్టి తీరుతాను. ధర్మజుడు కాదు, జాలి పడి నువ్వేవచ్చి అడ్డుపడినా సరే, వానిని విడువను." అన్నాడు.

ఆ తరువాత వారిద్దరూ ఆలోచించి కీచక వధకు పథకం సిద్ధంచేశారు.

"కీచకుడు సంకేత స్థలానికి వచ్చేటట్లు చేశాను, నా పని పూర్తయినట్లే, ఇంక నీపనే మిగిలి ఉంది, చీకటిపడితే ఏమిచేస్తావో చెప్పు చూద్దాం" అంది ద్రౌపది.

భీముడు నవ్వుముఖంతో

"నన్నడుగ నేల? నీవును
నన్నీ చుండు నేమిమాట లాడితి రది నా
కున్నట్టు లెఱుఁగ జెప్పుము
నిన్నే మెచ్చించువాఁడ నీరజవదనా!"1

అంటూ వేళాకోళంగా మాట్లాడాడు.

ఆమె తాను కీచకుణ్ణి అంగీకరింపజేసిన విధమంతా వివరించింది.

భీముడు తనక్రోధం కృతార్థత్వాన్ని పొందేటట్లుగా మహా టోపంతో కీచకునితో యుద్ధంచేసి వానిని చంపుతానని చెప్పాడు.

ద్రౌపది కంగారు పడింది. "నీవలాచేస్తే మన ప్రయత్న మంతా వృథాఅయి జననిందకు లోనవుతాం. ధర్మజుడు బాధపడతాడు. రహస్యం బయటపడకుండా నువ్వు శత్రువుని చంపాలి" అని హెచ్చరించింది.

---

1. విరాట - 2 - 273

ఈవిధంగా భీముడు, శత్రుసంహారం గూఢంగా జరగాలని ధర్మరాజు చెప్పినమాటనే, తెలివిగా ద్రౌపదినోట పలికించాడు.

నర్తనశాలలో కీచకుడు ప్రవేశించినప్పుడు భీముడు వానితో కొంతసేపు సరసోక్తులాడాడు. ఆసరసోక్తులు విని ద్రౌపది ఆనందించాలని అతనిఉద్దేశం.

కీచకుణ్ణి పరిమార్చినతరువాత భీముడు రహస్యంగా అగ్నిని తెచ్చి దానిని మండించి ఆవెలుగులో కీచకుని శవాన్ని ద్రౌపదికి చూపించాడు. ద్రౌపది సంభ్రమాశ్చర్యాలతో చూస్తూ, ముక్కుమీద వేలుపెట్టు కొని, "కీచకుడా! దీనికోసం గదా నీవంతగా మిడిసిపడ్డావు. ఇంక సుఖాన్ని పొందుతావులే," అని పలికింది.

నా పంతాన్ని నెరవేర్చి, భార్య అవమానాన్ని, దుఃఖాన్ని పోగొట్టగలిగాను గదా! అనే ఆనందంతో భీముడు ద్రౌపదిని ఉద్దేశించి

"చింతాశల్యము వాసెనే భుజబలోత్సేకంబు నీ కెక్కెనే
శాంతిం బొందెనె రోషపావకుఁడు దుశ్చారిత్రునిం జూచితే
సంతోషించితె యిట్లుగాక బ్రతుకన్ శక్యంబె దుర్వృత్తి నీ
చెంతం జేరినయట్టి వీరులకు నాచేతం బయోజాననా!"[1]

అని అడిగాడు. ఆమె మెచ్చుకోవాలి, అతడు తృప్తిపడాలి. ఆమెకోసం గదా అంత శ్రమపడిందీను!

ద్రౌపది ఆనందాతిశయంతో అతనిని అభినందించింది,

"కొలువులోపల నిన్నగోప మల్లెత్తినఁ
దలఁకక నిలిచిన ధైర్యమహిమ
నేఁడిందుఁ జనుదెంచి నిర్వికారతఁ బ్రజ
కన్నులు గప్పిన గౌరవంబు

1. విరాట - 2 - 358

మనవారిలోన నొక్కనినైనఁ బిల్వక యు
త్సాహంబు సేసిన సాహసంబు
లోకదుర్జయుఁడగు నీ కీచకునిని ద్రె
ళ్ళిడి రూపు మాపిన కడిమి సొంపు

చూడఁ దలపోయ మెచ్చ సంస్తుతి యొనర్ప
నాదరంబె నీయుత్తమ నాయకత్వ
మెఱిఁగి నినుఁగొనియాడ నేనెంతదాన
మహిత విస్మయానంద నిర్మగ్ననైతి"[1]

అనే ఆమెపలుకులు అతనికి కర్ణరసాయన మయ్యాయి.

ఉపకీచక సంహారానంతరం కూడా ఆమె గూఢంగా చమత్కారంగా అతనికి తనకృతజ్ఞతలను తెలుపుకొంది.

"కీచకుల దెసఁబుట్టిన కిల్బిషంబు
పాచి నన్ను రక్షించిన పరమధర్మ
రతికి గంధర్వపతికి నిరంతరంబు
భక్తి యుక్తిమెయిఁ బ్రణమిల్లి బ్రదుకుదాన!"[2]

ఆమె 'మరీ అంతయిదిగా' అలాచెప్పడం అతనికి అసహజం అనిపించిందో, నచ్చలేదో, వినేవారికి అర్థంకానివిధంగా ఆమెతో ఇలా అన్నాడు: "భార్యకు ఏదైనాప్రమాదం కలిగితే రక్షించనివాడు భర్త ఎలా అవుతాడు? అది మగవానికర్తవ్యం, లోక సహజమూను. నువ్వు నీమనస్సులో కోరుకునేదికూడా ఇదేగదా! ఇంతమాత్రానికి వారిని పొగడాలా?"

ఈ సన్నివేశంలో ద్రౌపదీ భీముల దాంపత్యంలోని సున్నితమైన పరస్పరానురాగం ఎంతో సహజంగా చిత్రితమైంది. ద్రౌపదిపట్ల

1. విరాట - 2 - 360

2. విరాట - 3 - 39

భీముడు ఎంతసరసంగా ఉంటాడో ఇక్కడ వర్ణించబడినట్లు మరెక్కడా భారతంలో వర్ణించబడలేదు.

ద్రౌపదికి భీముని సమక్షంలో ఉన్నప్పుడు అపురూపమైన కోరికలు కలిగేవి. ఆమె కోరినవి ఎంత దుర్లభమైనవైనా సరే అతడు సాహసంతో సాధించిపెట్టి ఆమెను ఆనందింప జేసేవాడు.

అరణ్యవాసంలో బదరీవనాన్ని సందర్శించినప్పుడు ద్రౌపదీ భీములు గంధమాదనపర్వతసానువుల్లో విహరిస్తూఉండగా అపూర్వరమణీయమైన సౌగంధిక కమలం ఒకటి గాలికి కొట్టుకొనివచ్చి వారి ముందుపడింది. ద్రౌపది దానినిచూసి, అలాంటి పువ్వులు ఇంకాకావాలని కోరింది. భీముడు వెంటనే బయలుదేరిపోయి, కుబేరుని సేనలను ఓడించి సౌగంధికకమలాలను తీసుకొనివచ్చి ఆమె ముచ్చటను తీర్చాడు. ఈ సందర్భంగా భీమునికి హనుమద్దర్శనం అయింది. తత్ఫలితంగానే అర్జునుడు కపికేతనుడయ్యాడు.

మరొకసారి,పాండవులు మాల్యవంతాన్ని సందర్శించి సమీపవనంలో విహరిస్తూఉండగా వారిముందు పంచవర్ణ సురభి కుసుమాలు కొన్ని ఎగిరివచ్చిపడ్డాయి. వానిని చూసి అందరూ ఆశ్చర్యపోయారు. అప్పుడు ద్రౌపది, భీముడు ఒంటరిగా ఉన్నప్పుడు అతని దగ్గరకువెళ్ళి, "ఈపువ్వులు ఇదివరకటి సౌగంధికకమలాల కంటె ఎంతో పరిమళంగాను, సుకుమారంగాను ఉన్నాయి. ఇలాంటివి నేను ఎన్నడూ చూడలేదు. ఈపువ్వులు తెచ్చియిచ్చి నాకు మనఃప్రియం కలిగించు" అనిఅడిగింది. భీముడు తక్షణమే పోయి, కుబేరుని ప్రియసఖుడయిన మణిమంతుణ్ణి యుద్ధంలో జయించాడు. కుబేరుడు సేనలతో వచ్చి, భీముని పరాక్రమానికి విస్మితుడయ్యాడు. భీముని వెదుకుతూ ధర్మరాజు రోమశ, నకుల, సహదేవులతో అక్కడికి చేరుకొన్నాడు. కుబేరుని చూసి, వారంతా నమస్కరించారు. కుబేరుడు భీముని సాహసం తనకు

ఎంతో ఉపకారకమయిందని వివరించి, పాశుపత సంపాదనకు వెళ్ళిన అర్జునుని క్షేమసమాచారం వారికి తెలిపి, వారందరినీ ఆనందింపజేశాడు. భీముడు పంచవర్ణ పుష్పాలను ద్రౌపదికి సమర్పించి, సంతోషం కలిగించాడు.

ఈ రెండు సన్నివేశాలూ భీముని ఇబ్బంది పెట్టేవిగా కనిపించినా ద్రౌపదికోసం భీముడు ఎంతటి సాహసం చేయడానికైనా సిద్ధపడతాడని నిరూపిస్తున్నాయి. ద్రౌపది ఉద్దేశించినా ఉద్దేశింపక పోయినా, ఆమె కోరికల వెనుక మహత్తరాంశం ఏదో ఉంటుందనే విషయాన్ని కూడా ఈ సన్నివేశాలు నిరూపిస్తున్నాయి.

ఒకరిని ఒకరు ఆనందింప జేసుకొనేదిగా బీమ ద్రౌపదుల దాంపత్యం ఈ విధంగానే సాగి ఉంటుందని ఊహించ వచ్చు.

**ద్రౌపది - అర్జునుడు :-** ద్రుపద మహారాజు పుత్త్రకామేష్టిని చేయడంలో మహావీరుడైన అర్జునునికి భార్యకాగల కుమార్తెను సంకల్పించాడు. ఆకన్య వివాహప్రాప్త అయింది. కాని, అప్పటికె పాండవులూ, కుంతీ లక్కయింట అగ్నికి ఆహుతయ్యారని కొందరువిప్రులవల్ల ద్రుపదునికి తెలిసింది. ఆయన ఎంతగానో దుఃఖించాడు.

"ఇంద్రసమానున కిందీవరశ్యామ
సుందరాంగున కింద్రనందనునకు
దేవిఁ గాఁ బ్రీతితో దీని నీఁ గాంచితి
నని యున్నచో విధాతృనకు నిట్లు
వాడియె విఘ్న మాపాదింప నిమ్మహా
ధ్వరమునఁ బుట్టిన సరసిజాక్షి

నేనెట్లు లోరులకు నీనేర్తు నని దుఃఖ
పరవశుఁడయి యున్న ధరణిపతికి,
..............................[1]

అర్జునుడు ఇంద్రసమానుడు. నల్లకలువల వంటి కాంతిగల సుందరమైన దేహం కలవాడు. ఇంద్రుని కుమారుడు. అలాంటి వానికోసం ఎంతో ప్రయాసపడి యాగాన్ని నిర్వహించి ఈ కుమార్తెను తాను పొందాడు. అతడు లేకపోతే తన ప్రయత్నమూ, ఆమె జన్మమూ రెండూ వ్యర్థమై పోతాయి గదా! అని ద్రుపదుడు శోకించాడు. విధిని నిందించాడు. ఆ కన్యను మరొకరికిచ్చి వివాహం చేయడం ఎలాగా? అని అతడు మథన పడుతూ ఉండగా అతని పురోహితుడు శకునాలను బట్టి పాండవులు జీవించే ఉన్నారనీ, ద్రౌపదికి స్వయంవరం చాటిస్తే వారు బయట పడతారనీ చెప్పాడు.

అర్జునుడు లోకహితంకోసం ఇంద్రునిఅంశతో అవతరించిన మహానుభావుడని ద్రుపదునికి తెలుసుననీ, అతనికి అన్నివిధాలా సహక రించేదిగా అతడు తనకుమార్తెను సంకల్పించి, తీర్చిదిద్దాడనీ దీనిని బట్టి స్పష్టపడుతోంది.

అయితే అర్జునుడు పరమగురువైన వ్యాసమహర్షి మాటలను బట్టి ద్రౌపదితో వివాహం పరమార్థాన్ని ఉద్దేశించినదే కాని లౌకిక ప్రయోజనాన్ని ఉద్దేశించినది కాదని గ్రహించాడు. కనుకనే ఆమెను స్వయంవరంలో గెలిచి, తనతో ఇంటికి తీసుకొనివచ్చి, ధర్మజునితో "నీవు పెద్దవాడవు కాబట్టి ఈమెను నీవే గ్రహించు" అని నిర్మమంగా అనగలిగాడు.

ద్రౌపదిపట్ల అర్జునునికి అనురాగమేకాదు, ఎంతో ఆరాధనా భావంకూడా ఉండేది. ఆమెను అతడు ఎంతగానో గౌరవించేవాడు.

1. ఆది - 7 - 23

ఆమె మహాపతివ్రతఅనీ, ఆమె మనస్సును కష్టపెట్టే పనులుచేస్తే శుభం కాదనీ, ఆమె వాక్కు అమోఘమైనదనీ అతని విశ్వాసం. సుభద్రను వెంటబెట్టుకొని, ఇంద్రప్రస్థపుర సమీపంలో ఒకచోట విశ్రమించి నపుడు, ద్రౌపదిని ఎదుర్కోవడం అతనికి సమస్యగా తోచింది. జాగ్రత్తగా ఆలోచించి సుభద్రతో ఇలా చెప్పాడప్పుడు :

"మన యివ్విధంబునఁ జనునప్పుడు నిన్నుఁ జూచి ద్రుపద రాజపుత్త్రి యప్రియంబులు వలుకునో యప్పరమ పతివ్రత పలుకు సిక్కువం బగుం గావున నీవేకతంబ గోపాల బాలికలతో ముందఱ నరిగి యక్కోమలిం గనుము............"[1]

అర్జునుని మాటప్రకారం సుభద్ర ముందు కుంతీదేవికి, తరువాత ద్రౌపదికి మ్రొక్కింది. ఆ సందర్భంగా ద్రౌపది ఆమెను "పంకజాక్షి! నీ పతి ప్రతిపక్ష వీరవిజయుఁడయ్యెడు నీవును వీరపుత్త్ర జనని వగుమ"ని దీవించింది.[2]

అర్జునుడు ఆ సమయాన ఏవిధమైన ఆశంసనం ద్రౌపది నోటినుంచి వెలువడాలని ఆశించాడో ఆ విధమైన ఆశంసనం ఆమెనుంచి వెలువడటం ఆశ్చర్యం! ఈ మాటలను ద్రౌపది అనాలోచితంగా గాని, వాస్తవాన్ని తెలుసుకోలేక గాని పలికిందని అనుకోవడానికి వీలులేదు. అర్జునుడు ద్వారకకుచేరిన వర్తమానాన్ని శ్రీకృష్ణుడు 'వడిగలచారుల' ద్వారా ధర్మజునికి తెలియజేశాడు.[3] ధర్మజునికి చేరిన సమాచారం ద్రౌపదికి తెలియకుండా ఉండదుగదా! అందులోనూ అది అర్జునుని క్షేమానికి సంబంధించినదికూడాను! ఇప్పుడు ఒక్కసారిగా సుభద్ర

1. ఆది - 8 - 211
2. ఆది - 8 - 212
3. "... అప్పుడ వడి గలచారుల రావించి ద్వారవతి యం దర్జునుం డున్నవాఁ డను కుశలవార్త ధర్మజున కెఱింగింప నింద్రప్రస్థపురంబునకుం బుచ్చి యున్నంత.." ఆది - 8 - 180

క్రొత్తపెండ్లికూతురుగా గోపాల బాలికలతో ఒక్కర్తే తరలివచ్చి పాదాలకు నమస్కరించిందంటే ద్రౌపదివంటి సూక్ష్మగ్రాహి అయిన స్త్రీ ఆమాత్రం ఊహించలేకపోతుందనుకోలేము. పెద్దమనసుతో ఆమె సుభద్రను అలా దీవించడమే ఇక్కడి విశేషం.

అర్జునుడు కార్యార్థి అయి వెళ్ళవలసివచ్చినప్పుడు ద్రౌపది అతనిని తగినవిధంగా ఉత్సాహపరిచి పంపించేది. వ్యాసుని ఆదేశానుసారం ధర్మజుడు పాశుపతసంపాదనకై అర్జునుని నియోగించాడు. అతడు బయలుదేరివెడుతూఉంటే ద్రౌపది అతనితో

"అరికృతదుష్పరాభవమహార్ణవమగ్నుల మమ్ము నందఱం
గరుణ సముద్ధరింపుము జగన్నుత! యన్నియు పూనఁ గాని యీ
భరము వహింపఁబూనిన యపారగుణాన్వితు నిన్ను దిక్కులుం
ధరణియు సోముఁడున్ నభము ధాత్రియు గాదృను గాచుచుండెడున్"[1]

అని దీవించింది. అంతకుముందు తాను, భీముడు ధర్మజునితో చేసిన ప్రసంగాన్ని దృష్టిలో ఉంచుకొని, "అవమానాలను సహింపజాలని క్షత్రియకులంలో కాక, ఇకమీదట నాపుట్టుక మంచిక్షమ కలిగిఉండే బ్రాహ్మణకులంలో కలుగుగాక!" అని ఎంతో వ్యంగ్యంగా అర్జునునితో ప్రసంగించింది. ఆమె "తనస్నేహలాలసవిలోలాపాంగవిలోకనంబులం బాథుఁ బరిగృహీతపాథేయు"ని చేసింది.[2] ప్రేమపూర్వకంగా ఆమె ఇచ్చిన ఆ దారిబత్తెం, అర్జునుడు ఊర్వశి అంతటి అప్సరకాంత బారి నుండి తప్పించుకొని, సఫలమనోరథుడై తిరిగివచ్చేలా చేసింది. అయితేనేం అర్జునవియోగానికి ఆమె ఎంతగానో పరితపించింది. అర్జునుడు తిరిగి రావడంతో ఆమె 'హృదయనయనారవిందములకు' ఆనందం కలిగింది.[3]

---

1. అరణ్య - 1 - 285
2. అరణ్య - 1 - 286
3. "ఇట్లు చనుదెంచి ధనంజయుండు ... ద్రౌపదీ నయనారవిందంబుల కానందంబు సేయుచున్నంత..." అరణ్య - 4 - 41

కురుసభలో ద్రౌపదికి జరిగినఘోరావమానానికి అర్జునుడు చాలాబాధపడ్డాడు. భీమునిలా అతడు బయటపడలేదు. ఆ తర్వాత కూడా అతడు ఎక్కడా తేలలేదు. ధర్మపాశానికి బద్ధుడై కోపాన్ని ఉపశమింపజేసుకొని అతడు ఊరుకోబట్టి సరిపోయింది గాని లేకపోతే కర్ణాదులఅంతు అప్పుడే తేలిపోయేది. ఒకవిధంగా దుర్యోధనాదులకు ప్రతీకారం ఘోషయాత్రా సందర్భంలోనే జరిగిపోయింది. ద్రౌపదికి దుర్యోధనాదులు చేయబోయిన అవమానంకంటె, ద్రౌపది, తక్కిన కౌరవస్త్రీల సమక్షంలో దుర్యోధనాదులకు అప్పుడు జరిగిన అవమానం మహాఘోరమైనది. కనుకనే అతడు ప్రాయోపవేశానికి సిద్ధపడ్డాడు. ఆ సంగతిని అలా ఉంచితే, ద్రౌపదికి జరిగిన అవమానానికి అర్జునుడు ఎంతగా కోపించాడో గోగ్రహణ సందర్భంలో తెలుస్తుంది.

అర్జునుడు కర్ణునితో తలపడి యుద్ధం చేస్తూ,

"సభలఁ బలుకుదీవు సరిలేరు నాకని
యిదె రణంబు వచ్చె నెల్లవారి
కెఱుఁగవచ్చు దీనఁ బెఱచోట రజ్జైన
యట్లు పూరగింప నగునె యిచట"

"పలుకవచ్చుఁగాక పలికినయట్టుల
చేయవచ్చుఁ నెట్లు దాయ యెందుఁ
బోయెదట్లు ద్రుపదపుత్త్రికఁబఱుపంగఁ
గాంచి నగినఫలము గందు గాక!

"ఏనపుడు ధర్మపాశా
ధీనుడ నై కోపమునకు దీకొనరింపం
గా నేరకున్న మెయిమెయిఁ
బోనయ్యెం గాక యింకఁబోవహ్న యిచటన్"[1]

1. విరాట - 5 - 88, 90, 91

అంటూ తనపరాక్రమాన్ని ప్రదర్శించాడు. అప్పుడు జరిగినయుద్ధంలో కౌరవు లందరినీ చిత్తుగా ఓడించి, ఉత్తరునిచే వారి తలచీరలు ఉత్తరింప జేసి, "రాజుఁ బెద్ద వారలుఁ జీరలూలువఁబడిరి, సిగ్గితే బిరుదులు వైచిరి"[1] అని తృప్తిపడి తిరిగివెళ్ళాడు విజయుడు. ద్రౌపదిపట్ల కౌరవులు చేద్దామని యత్నించి విఫలమైన కార్యాన్ని అర్జునుడు వారి పట్ల చేసిచూపించాడు ఈ సందర్భంలో.

ద్రౌపదీపరాభవం అర్జునునికి ఎంతటి హృదయశల్యమో పరమేశ్వరుడైన శ్రీకృష్ణునికి బాగా తెలుసు. సంజయుడు గాలిని మూటకట్టుకొని రాయబారానికి వచ్చినప్పుడు కృష్ణుడు తనంతతాను గా కల్పించుకొని మాట్లాడుతూ, కురుసభలో కర్ణుడు ఆడినమాటలను గుర్తుచేసి,

"నరునకు నది వాఙ్మయమగు
శరమై హృదయంబు నాటి చలియింపకదు
ర్భరవేదనఁ జేయంగాఁ
జిరకాలము దచ్చికిత్స చేసెనె చెప్పుమా?"[2]

అని అడిగాడు. అంతటి దుర్భరవేదనను అతడు ఎలా తనలో ఇముడ్చు కోగలిగాడో ఆశ్చర్యమేమరి!

ద్రౌపది అర్జునునితో చనువుగా సరసోక్తు లాడేదనటానికి ఒకదృష్టాంతాన్ని చూపవచ్చు. కీచకోపకీచకుల్ని భీమునిచే చంపించిన తరువాత సైరంధ్రిగా ద్రౌపది నర్తనశాలకు వచ్చింది. విరాటకన్యలు ఆమెను పరామర్శించారు. ఆ సందర్భంలో బృహన్నల, "ఆపాపాత్ముడు నీపట్ల చేసిన అపచారాన్నీ, వారంతా మృతిపొందిన తీరునూ నీ మాటల్లో తెలుసుకోవాలని ఉంది చెప్పవూ?" అని ఆమెను అడిగాడు.

1. విరాట - 5 - 222
2. ఉద్యోగ - 1 - 351

ఆమె సాభిప్రాయంగా ఇలా అంది :

"కన్నియల కాట గఱపుచున్న నీకు
నకట సైరంధ్రి యిప్పుడేమయ్యెనేని
ఖేదమొక యించుకయు లేమిఁగాదె నస్మి
తాననంబుతో నన్నిటు లడుగు టెల్ల"[1]

ఈ మాటలకు బృహన్నల కొద్దిగా బాధపడ్డాడు. వెంటనే అతడు

"నీ వలుగుల పడుటకు దుః
ఖావేశము వొందెనే నిరర్థక మగు ని
య్యేవపుఁ బుట్టువు పుట్టిన
నావగ పెవ్వరికి నెఱ్ఱు నళినదళాక్షీ!
"నీ తోడి పరిచయము లే
దే తలపోయఁగ ననింద్య వెందును నీవి
ట్లాతుర వగుటకె నా మది
నే తాపము లేదు నైజ మెఱుఁగవు గంటే?"[2]

'నా స్వభావం నీకు తెలియనిదా? నీ గురించి నేనెంతగా బాధపడతానో నీ వెరుగవా?' అంటూనే అతడు తాను ఊర్వశి శాపంవల్ల తక్కిన వారివలెకాక శరీరాంతరాన్ని పొందాననీ, అందువల్ల శత్రుసంహారం తనకు వీలుపడదనీ గూఢంగా చెప్పాడు. అతని మాటలకు ఆమె లో లోపల నవ్వుకొని, "నీ మనస్సు నాకు తెలియనిది కాదు, ఇక్కడ నువ్వు ఇలా వర్తించడమే నాకు ఇష్టం" అని చెప్పి అంతఃపురానికి వెళ్ళి పోయింది.

ద్రౌపదితో పాండవులు మహాప్రస్థానం చేసేటప్పుడు ముందుగా ద్రౌపది 'యోగమెడలి' పడిపోయింది. ఆమె అలా పడిపోవ

1. విరాట - 3 - 48
2. విరాట - 3 - 50, 51

టానికి కారణం ఏమిటని భీముడు ధర్మజుని అడిగినప్పుడు అతడు "... ఇమ్మగువ యింద్రదంతనయు దేసఁ బక్షపాతిని దానఁజేసి సుకృతములు ఫలియింపమి జూపె దీనికిట్టి దురవస్థవాటిల్లె..."[1] నని చెప్పాడు. ఈమాట లనుబట్టి ద్రౌపదికి అర్జునునిపట్ల పక్షపాతం ఉండేదని అనుకోవలసివస్తోంది. కాని, ఆమె ప్రవర్తనలోగాని, మాటలలోగాని ఎక్కడా ఆమెకు అలాంటి భేదదృష్టి ఉన్నట్లుగా కనిపించదు. మరి, ధర్మజుడు శరీరంవదలి వెళ్ళి పోతున్న భార్యను గురించి అలా ఎందుకు చెప్పాడు? అతడు పరమ ధర్మపరుడు. ఇతరుల గుణదోషాలను ఎంచి చూసే స్వభావం కాదు అతనిది. యోగస్థితిలో అతడు తనకు కలిగిన ఒకానొక 'సిద్ధి' కారణంగా ఆమెకు సంబంధించిన ఆ విషయాన్ని భీముడు అడిగితే చెప్పగలిగాడే గాని, ఆమెప్రవర్తనలో తప్పులెంచుదామని మాత్రంకాదు. అర్జునుని పట్ల ఆమెకు పక్షపాతం ఉన్నదీ అంటే తక్కినవారిపట్ల ఆమెకుగల ఆరాధనాభావంలో లోపం ఉన్నదని అర్థంకాదు. ముందుగా ఆమెకు గల అర్జునపక్షపాత వైఖరిని గూర్చి విచారించి, ఆ తరువాత అది ఆమె యోగనిష్ఠకు ఎలా ప్రతిబంధక మయిందో తెలుసుకొందాం.

కురుక్షేత్ర యుద్ధానంతరం, యాగాశ్వంతో వెళ్ళి, విజయుడై తిరిగివస్తున్న అర్జునుని ఆగమనాన్ని తెలిపిన శ్రీకృష్ణుణ్ణి ధర్మరాజు "అర్జునుడు సర్వశుభ లక్షణగాత్రుడూ, పరమసౌఖ్య యోగ్యదేహుడూ గదా, కాని, నా గురించి అనేక యుద్ధాలు చేసి, ఎన్నో పాట్లు పడ్డాడు. అతని శరీరంలో ఎక్కడైనా అలాంటి అలజడులు పొందవలసి రావ డాన్ని సూచించే లోపం ఉన్నదా?" అని అడిగాడు. అప్పుడు కృష్ణుడు అర్జునుని దేహలక్షణాలను వివరించాడు. ఆ మాటలు విన్న ద్రౌపది "పద్మనాభుం బ్రీతిస్ఫీతంబగు/ప్రస్ఫీతంబగు చూడ్కి నాలోకించిం"ది. లోకనాథుడైన కృష్ణుడు "అది అర్జున విషయంబైన ప్రీణనంబు/ప్రణ యంబు తెలంగగుట యెఱింగికొ"న్నాడు.[2]

1. మహాప్రస్థానం - 34 2. అశ్వమేధ - 4 - 156 పాఠాంతరాలతో

ద్రౌపదికి ధర్మజుడు చెప్పిన అర్జునపక్షపాతం ఏకోద్దిష్టాన్నైనా సూచితమయ్యే సన్నివేశం ఇదొక్కటే. సర్వహృదయాధినాథుడు గనుక ఆమె చూపుల్లోని ఆంతర్యాన్ని పసిగట్టగలిగాడు శ్రీకృష్ణుడు. పరమపురుషుని సన్నిధిలో ప్రకృతి తనను తాను ఆవిష్కరించుకోవడం సహజమేకదా! శ్రీకృష్ణుని ముందు భారతంలోని తక్కిన పాత్రలు తమతమ స్వభావాలను వ్యక్తపరచుకొన్నట్లే ఇక్కడ ద్రౌపది కుండా తన ప్రమేయం లేకుండానే తన హృదయాన్ని తానుగా వ్యక్తం చేసుకొంది.

శ్రీకృష్ణుడు భగవద్గీతలో యోగికి ఉండవలసిన సమదృష్టిని గూర్చి ఇలా చెప్పాడు :

"సుహృన్మిత్రార్యుదాసీన మధ్యస్థ ద్వేష్య బంధుషు।
సాధుష్వపి చ పాపేషు సమబుద్ధి ర్విశిష్యతే ॥"
"యోగీ యుంజీత సతత మాత్మానం రహసి స్థితః।
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీ రపరిగ్రహః ॥"1

యోగి మిత్రాదుల్లో ఉండేదీ 'తన' అస్తిత్వమేననే సమదృష్టిని కలిగి ఉండి, ఏకాకిగా, అంటే, 'నేను' అనే ప్రజ్ఞగా, ఉంటాడని పై శ్లోకాల భావం. మహాప్రస్థానం అంటే బాహ్యాంతర ప్రవృత్తులన్నింటినీవదలివేసి, ఆత్మవంతుడై పైలోకాలకు చేరుకొనే ప్రయత్నం. ఆ ప్రయత్నానికి సమబుద్ధి' సిద్ధించి తీరవలసిందే. ద్రౌపదివిషయంలో ఆ విధమైన సమ దృష్టి అర్జునునిపట్ల ఆమెకుగల ప్రత్యేక మమకారం కారణంగా చెదిరి పోయింది. అందువల్లనే ఆమెకు యోగసిద్ధికలుగలేదు. అందువల్ల ఆమె సశరీరంగా ముందుకు సాగలేక పోయింది.

గమనింపదగిన విశేషం ఏమిటంటే, ద్రౌపది పుట్టింది అర్జునుని భార్యగానే. ద్రుపదునిసంకల్పం ద్రౌపది సంస్కారంగా పరిణ మించి ఉండటమే అందుకుకారణమై ఉంటుంది.

1. భగవద్గీత - 6 - 9, 10 శ్లోకాలు

**ద్రౌపది - నకులుడు :-** కురుసభలో ద్రౌపదికి జరిగినపరాభవా నికి నకులుడు ఎంతగానో బాధపడ్డాడు. "... నాకంటె నద్జున నకుల సహాదేవులుం గుంతీ దేవియు నంతస్తాపంబున నెంతయు సంతప్తులగు చున్నవారు..."[1] అనే భీముని మాటలు నకులుని అంతస్తాపాన్ని నిరూ పిస్తాయి.

అజ్ఞాతవాస దీక్ష చెల్లించుకోవడానికి పాండవులు విరాట నగరానికి వస్తూఉండగా ఆ అడవిమార్గాన ద్రౌపది నడవలేక అలిసి పోయింది. అప్పుడు ధర్మరాజుడు ద్రౌపదిని మోసుకొని రమ్మని నకులునికి చెప్పాడు. నకులుడు ఆమెను సంతోషంతో మోసితెచ్చాడు.

విరాటపర్వంలో భీముణ్ణి కీచకవధకు పురికొల్పే సందర్భంలో ద్రౌపది నకులుని గురించి ఇలా చెప్పింది :

"తన యొప్పు దురఁగన్నఁ దగిలి యెవ్వరికైన
మలఁగి క్రమ్మఱఁ జూడ వలయువాఁడు
తనవర్తనము విన్న మునిజనంబులకైన
నలవరించికొనంగ వలయువాఁడు
తనబంటుతన మాజిఁగనిన మార్తులకైనఁ
బలుమాఱు నగ్గింప వలయువాఁడు
తనవితరణకేళి వినినఁ గల్పకతరు
వులకైనఁదల యూఁప వలయువాఁడు

నకులుఁ డొరులకు నశ్వ శిక్షకుఁడు గాఁగ
నగునె యాతని దుస్థితి యనుదినంబుఁ
గాంచి కన్నీరు డించుచుఁ గడవరాని
దైవఘటనకు నొత్తుఁ జిత్తంబు లోన."[2]

---

1. ఆరణ్య - 1 - 262
2. విరాట - 2 - 208

నకులుడు మహాసుందరాంగుడు. అతని ప్రవర్తన తపస్విజనులకు కూడా ఆదర్శప్రాయమైనది. అతని పరాక్రమం శత్రువులచే కూడా పొగడబడేది. అతడు దానగుణంలో కల్పతరువును మించినవాడు. అంతటి వానికి అశ్వశిక్షకుడు కావలసిన దుర్గతి కలిగిందని ఆమె వాపోయింది.

ద్రౌపది - సహదేవుడు :- సహదేవుణ్ణి గురించి ద్రౌపది భీమునితో ఇలా చెప్పింది :

"ఆ రూపం బవికార మా భుజబలం బత్యంత నిర్గర్వ మా
శౌరత్వంబు దయా రసానుగత మా శుంభత్క్రియాజ్ఞానమా
ర్యారంభ ప్రతికూల వాదరహితం బా యాగి సమ్మానవి
స్తారోదాత్తము మాద్రి పిన్నకొడు కే తన్మాత్రుండే చూడఁగన్"1

అందమైన రూపమూ, గర్వంలేని భుజబలమూ, దయతో కూడిన శౌర్యమూ, తిరుగులేని క్రియాజ్ఞానమూ, సాటిలేని దానగుణమూ గల సహదేవుడు తంత్రీపాలు డనే పేరుతో గోపాలకునిగా అడవుల్లో పడి తిరుగుతూ ఉంటే ద్రౌపదికి ఎంతో బాధగా ఉండేది. అత్తగారి ఆదేశం మేరకు ఆమె సహదేవునిపట్ల ప్రత్యేకమైన శ్రద్ధచూపేది.

నకుల సహదేవులు అసామాన్యమైన పరాక్రమం కలవారనీ, తనపట్ల అత్యంత ఆదరం కలవారని ద్రౌపది సైంధవుని హెచ్చరిస్తూ చెప్పింది.

"ఘోరన విస్ఫులింగములు వొడ్మగ నుగ్రవిషంబు గ్రక్కుచుం
గ్రూరవిచేష్ట నాలుకలు గ్రోయు మహోరగరాజ యుగ్మముం
జేరి పదాహతిం గినియఁ జేయఁదలంచుటగా నెఱుంగు దు
ర్వారులు మాద్రిపుత్త్రుల కవజ్ఞ యొనర్ప దలంచు టేర్పడన్"2

1. విరాట - 2 - 209 2. ఆరణ్య - 6 - 178

తనకు ఏమాత్రం అపకారం జరిగినా అది తమకు అవమానంగా భావి స్తారు నకుల సహదేవులు; వారిని అవమానించడమంటే భయంకరమైన విషసర్పాలను కాళ్ళతో తన్ని కోపింపజేయుటయే! మరింక వారిని ఎదిరించడం ఎవరితరమూ కాదు— అని ద్రౌపది పలుకులయొక్క భావం.

నకులసహదేవులకు ద్రౌపదిపట్ల ఎంతో ప్రేమ ఉండేది. ఆమె కష్టాలకు వారు ఎంతగానో బాధపడేవారు. అవసరం వచ్చినపుడు వారు ఆమెకు ఎలాంటి పరిచర్య చేయడానికైనా వెనుకాడేవారుకారు.

అరణ్యవాసంలో ఒకసారి ద్రౌపదీ సహితులై పాండవులు గంధమాదన పర్వతానికి వెడుతున్నప్పుడు ద్రౌపది నడవలేక మూర్ఛ పోయింది. అప్పుడు నకులసహదేవులు చిగురుటాకులవలె ఎర్రనైన ఆమె పాదాలను తమచేతులతో మెల్లిగా ఒత్తి ఆమెను సేదతీర్చారు.[1]

విరాటనగరానికి వెడుతున్నప్పుడు కూడా ద్రౌపది నడవ లేకపోగా వారిద్దరూ ఆమెను మోసుకువచ్చారు.

ద్రౌపదిపట్ల నకుల సహదేవులకు ఎంతటి గౌరవం, ఆదర భావం ఉండేవో ఈ పరిశీలనవల్ల స్పష్టపడుతోంది.

ఆ మాటకువస్తే, పాండవులు అయిదుగురూ ద్రౌపదిని కేవలం భార్యగా కాక, ఆత్మీయురాలిగా, ఉత్తమమైన స్నేహితు రాలిగా పరిగణిస్తూ, ఆమెను తమ ప్రాణంకంటె ఎక్కువగా చూసుకొనే వారు. ఈ విషయం పాండవులకు సంబంధించిన వారికి అందరికీ తెలుసు. సైంధవుడు ద్రౌపదిని అపహరించుకుపోయినందుకు ధాత్రేయిక అనే పరిచారిక అతిదీనంగా విలపిస్తోంది. అప్పుడు ధర్మజుని రథసారథి ఇంద్ర సేనుడు ఆమెకు ధైర్యం చెబుతూ,

---

1. "...కపలు దాని పల్లవ తామ్రమపాద తలంబు లాయుధాభ్యాస పరిణంబునం గిణీ భూతంబు లయిన తమ కరతలంబులంజేసి మెత్తన యొత్తుచుండిరి."
ఆరణ్య - 3 - 298

"పాండుపుత్త్రుల బహిఃప్రాణంబు నుత్తమశీలసమగ్రఁ బాంచాలతనయఁ గొనిపోవునంతటిగుండె గల్గెనె విమోహాంధమానసుఁడైన సైంధవునకు నేఁగుఁ గాకేమి మహీతలగతుఁడైన గగనంబునకు వేగ యెగసి చనినఁ బోనిత్తురే వారివుత్తురుగాక యుద్ధురవృత్తిఁబార్థులా దురితచరితు..."[1]

వని ఓదార్చాడు. ద్రౌపదీపాండవులఅన్యోన్యత అంతప్రసిద్ధమన్నమాట!

"..............................

ప్రాణంబులకునెల్లఁ బ్రాణంబుగా విరారు
నెయ్యంబు తియ్యంబు నెఱపనడచి

... ... ... .... ..."[2]తినని ద్రౌపది స్వయంగా భర్తలకు తనపట్లగల ఆదరభావాన్ని ఒకానొక సందర్భంలో భీమునితో ప్రసంగిస్తూ ప్రకటించింది.

"దాంపత్యానికి ప్రధానమైనది అన్యోన్యానురాగం. ఆ అనురాగం స్త్రీమూర్తిలో ఆరాధనగా పరిణమించి, భక్తిగా పర్యవసించడమే పాతివ్రత్యం. భార్య అంటే భర్తచేత భరింపబడేది అని అర్థంకావచ్చు. కాని భర్తకొరకు బాధ్యత పడగలిగినప్పుడే స్త్రీమూర్తికి పరిపూర్ణత్వం సిద్ధిస్తుంది...."[3]

అలాంటి పరిపూర్ణత్వం సిద్ధింపజేసుకొన్న మహాపతివ్రత ద్రౌపదీదేవి.

ఆమెకు ధర్మజునివల్ల ప్రతివింధ్యుడు, భీమసేనునివల్ల శ్రుతసోముడు, అర్జునునివల్ల శ్రుతకీర్తి, నకులునివల్ల శతానీకుడు, సహదేవునివల్ల శ్రుతసేనుడు అనే కుమారులు జన్మించారు. వారు ఉపపాండవులుగా వ్యవహరించబడేవారు.[4]

1. అరణ్య - 6 - 197    2. విరాట - 2 - 216
3. "భారతం-ధర్మాద్వైతం-వ్యాసుని దర్శనం-తిక్కన సందర్శనం" పుట - 232
4. ఆది - 8 - 228

## 4. అవనీతల సామ్రాజ్యోత్సవము

కుమారుల వివాహానంతరం కుంతీమహాదేవి కోడలి గుణాలకు ఎంతో ఆనందించి, యిలా ఆశీర్వదించింది.

"నీ భర్తలు పరాక్రమంతో పూని, భూమండలంలోని రాజులందరినీ జయించి, నవఖండమండితమైన యీ మహీతల మంతటినీ పాలిస్తూ, రాజసూయమూ మొదలైన యాగాలు చేస్తూండగా, ధర్మానుసారం పత్నివిగా నువ్వే ఆ వైభవాల్లో పాలుపంచుకో!"[1]

అంతవరకూ "కటుకు దర్భపూరి పటువులు, భిక్షాన్నమ శనము" గా ఉన్న తన కుమారులు, ద్రౌపదిని చేపట్టినంత మాత్రాన భూమండలాధిపతులు కాగలరని ఆ తల్లి ఎలా ఊహించిందో!

రాజసూయం చేయగలరని ఎలా చెప్పగలిగిందో!

నిలువనీడ కూడా లేని స్థితిలో కాలూనడానికింత చోటు వారికేసరికల్లా భవిష్యత్తునంతటినీ ఆమె చెప్పగలిగిందంటే ఆశ్చర్యమే!

ఏ ఆధారం లేకుండా ఆమె అలా చెప్పదు గదా!

నిదానించి చూస్తే, ఆమె తనంత తానుగా కేవలం ఆశతో అలా అనలేదనీ, మహాపురుషుల అమోఘ వాక్కులు ఆధారంగా, భర్త సంకల్పానికి అనుగుణంగా మాత్రమే ఆశీస్సుగా ఆమె అలా పలికిందని స్పష్టపడుతుంది.

లాక్షాగృహం నుంచి ప్రాణాలతో బయటపడిన తల్లీబిడ్డలను పరామర్శించటానికి వచ్చిన వ్యాసమహర్షికి కుంతీదేవి "బాష్పపూరిత నయనయై మ్రొక్కి"ంది. ఆమె హృదయగతావేదనను అర్థంచేసుకొన్న ఆ పరమగురువు ఆమెకు ఊరార్చి యిలా పలికాడు :

1. ఆది - 8 - 5

"నీ కొడుకు ధర్మనిత్యుం డీయుధిష్ఠిరుండు నారాయణ భుజంబులంబోని తన నలువురి దమ్ముల బలంబున సర్వపార్థివుల శాసించి సార్వభౌముండై రాజసూయాశ్వమేధాది క్రతువులు సేసి పితృపైతామహంబైన రాజ్యలక్ష్మి ననుభవించుచుం గురుకులంబు నెల్లం బవిత్రంబు సేయు"[1]

ఆ మహాముని వాక్కులు అప్పటి ఆమె శోకాన్ని ఉపశమింపజేశాయి.

గురువచనానుసారం పాండవులు అయిదుగురూ ద్రౌపదిని పరిణయమాడటానికి నిర్ణయించుకోగానే బలరామకృష్ణులు అక్కడ సాక్షాత్కరించారు. "...లాక్షాగృహ ప్రయోగంబు వలన విముక్తుల రయితి రింకమీకు లగ్గగు"[2] నంటూ కర్తవ్య నిర్దేశపూర్వకంగా ఆశీర్వదించి వెళ్ళిపోయారు.

పరమగురువైన వ్యాసుడూ, జగద్గురువైన కృష్ణుడూ పాండవులను ఈ ప్రకారంగా అనుగ్రహించడం అలా ఉంచితే, కుంతీదేవికి కూడా తన కుమారులు రాజసూయాది బహు యాగాలు చేయాలనే ఆకాంక్ష అంతరాంతరాల్లో బలంగా ఉండిఉండటం వల్లనే ఆమె నోట వెంట ఆ విధమైన దీవెన వచ్చి ఉంటుందని చెప్పడానికి ఒక ఆధారం చూపవచ్చు.

పాండురాజు జీవించిఉండగా రాజసూయం చేయాలని వాంఛించాడో లేదో మనకు తెలియదు; కానీ, అతడు దిగ్విజయం చేసి, సకలావనీశులనూ జయించాడు.[3] ఉదారమతితో అంధుడైన అన్న

1. ఆది - 6 - 231 వచనం 2. ఆది - 7 - 222 వచనం

3. "శరనిధి పరివృత విశ్వం
భరఁ గల భూపతులు పాండుపతి కృతమునఁ గిం
కరులై ప్రతిసమకల్పిత
కరులై రవి మొదలుగాఁగఁ గౌరవ్యులకున్" —ఆది - 5 - 40

గారిని రాజుగా చేసి, అతనిచే శతాశ్వమేధాలు చేయించాడు.[1] విధి వక్రించి, అతడు శాపానికి లోనయ్యాడు. అపుత్రకుడైన అతనికి ధర్మానిల శక్రాశ్వినుల వరాలవల్ల సంతానం కలిగింది. ఇంద్రవరప్రసాదిగా అర్జునుడు జన్మించినప్పుడు దివ్యవాణి ఆ కుమారుని గూర్చి చెప్పిన మాటల్లో "......ఈతండ నిఖిలావనీతలేశులనోర్చి రాజసూయము ధర్మరాజు నునుచు..."[2] నని స్పష్టంగా ఉంది. పాండురాజు కుంతివల్ల ముగ్గురు పుత్రులను పొంది, "త్రిభువన రాజ్యంబు వడసినంతియు సంతసిల్లి కుమారులతోడి వినోదంబులందగిలి..."[3] ఉండేవాడని వర్ణింపబడింది. ఆ ముగ్గురు కుమారుల ప్రభావాన్నీ, వారి భావిజీవితౌన్నత్యాన్నీ కుంతీపాండురాజులు ముచ్చటించుకొంటూ ఉండేవారనీ, తన కుమారులు రాజసూయం చేస్తారని పాండురాజు మురిసిపోతూ ఉండేవాడనీ భావించడం అసంగతం కాదు. తాను దిగ్విజయం చేశాడు— రాజసూయం చేయలేకపోయాడు. తన కుమారులు తనను మించిన పరాక్రమవంతులై దిగ్విజయమూ, రాజసూయమూ చేసి, సార్వభౌములు కాగలరనే అతని ఆనందంలో పాలుపంచుకొనేది కుంతీమహాదేవికదా! అయితే, కుమారుల ప్రాభవాన్ని కనులారా వీక్షించి, ఆనందించే భాగ్యం పాండురాజుకి లేకపోయింది. భర్త కలలు తన కుమారులు పండించాలనే దీక్షతో గదా ఆ మహాతల్లి అన్ని కష్టాలూ పడి వారిని సాకుతూ వచ్చింది! ఇప్పుడు ఆ బిడ్డలకు అనురూపవతి అయిన భార్య వచ్చింది. ఆమె మెట్టిన వేళావిశేషంతో తమ కష్టాలు కడతేరుతున్న సూచనలు కూడా కనిపించాయి. ఆశ కింత ఆలంబనం దొరికితే చాలుగదా! అల్లుకుపోతుంది. ఆమె అంతరాంతరాల్లోని ఆకాంక్ష ఇలా ఆశీస్సుగా వెలువడింది.

1. ఆది - 5 - 42
2. ఆది - 5 - 124
3. ఆది - 5 - 128 వచనం

ఇక్కడ మరొక్క విశేషం కూడా ఉంది. ద్రౌపది కుంతీదేవికి ప్రథమ సందర్శనంలోనే "భువనత్రయ రాజ్యలక్ష్మి" లా అనిపించింది.[1] రూపమే కాదు, ద్రౌపది ప్రవర్తన కూడా అన్ని విధాలుగాను ఆమెకు నచ్చింది. కుంతీదేవి శిక్షణలో ద్రౌపది తనను తాను పరిస్థితులకు అనుగుణంగా మలుచుకొంది. ఆమె భర్తలకు అయిదుగురికీ సమానరీతిలో సేవలు చేయడం కుంతికి మరింత సంతోషం కలిగించి ఉంటుంది.

"చతురుదధివలయ నిఖిల
క్షితితల సామ్రాజ్యలక్ష్మికిని మూలంబై
సతి యాజ్ఞసేని పతులకు
నతి ముదమొనరించెఁ దుల్యమగు శుశ్రూషన్"[2]

సమస్త భూమండలాధిపత్యానికి తగిన శోభతో ఆమె భర్తలను సేవించి వారికి మహానందాన్ని కలిగించిందని చెప్పడాన్నిబట్టి ఆమె సమస్త సామ్రాజ్య సంపదలకూ ఆలవాలమన్నమాట!

అంతటి దివ్యవైభవం ప్రకటితమవుతూ ఉండే ద్రౌపదిని పాండవులు పరిణయమాడారంటేనే చాలు, వారి జాతకాలు తిరగబడినట్టేనని సామాన్యులు కూడా చెప్పగలుగుతారు, కుంతీదేవి విషయం మరింక చెప్పాలా?

ధర్మజుడు చెప్పినట్లుగా "గురులలోనఁ బరమగురువు దల్లియ."[3] అలాంటి తల్లిమాట అమోఘం కదా!

ద్రౌపదితో పాండవుల వివాహ పర్యవసానంగానే అంధరాజు పాండవులను పిలువనంపి, అర్ధరాజ్యమిచ్చాడు. ఇంద్రప్రస్థం రాజధానిగా

---

1. ఆది - 7 - 208 వచనం
2. ఆది - 8 - 3
3. ఆది - 7 - 254

ఖాండవప్రస్థంలో ధర్మజునిపాలన మహావైభవంగా నెలకొన్నది. వాసు దేవాభీష్టానుసారం అపూర్వమైన మయసభకూడా అమరింది ధర్మజునికి. "ఉదయాస్తాచలసేతుశీతనగ మధ్యోర్వీపతులు తరలివచ్చి మదమాతంగ తురంగ కాంచన లసన్మాణిక్య గాణిక్య సంపదలు ముదమారనిచ్చి" సేవిస్తూండేవారు.[1] అంతలో పరమగురుడైన నారదుడు రావడం, మయసభను చూసి విస్మితుడై, అపూర్వమూ, దివ్యమూ అయిన దానిని లోకపాలుర సభాభవనాలతో పోల్చి వర్ణించడం, ఆ సందర్భం లో యముని సభలో ఉన్న పాండురాజు ప్రసక్తి రావడం జరిగాయి. పాండురాజు నారదునితో తాను యమలోకంలో ఉండిపోయినట్లూ, రాజసూయం చేసిన ధన్యులు ఇంద్రలోకంలో ఉన్నట్లూ తన కుమారుడైన ధర్మజునికి చెప్పి, వానిని తగినవిధంగా రాజసూయం చేసేందుకు ప్రోత్సహించవలసిందని చెప్పాడు.

> "అనుపమ శక్తిమంతులు మదాత్మజులేవురు దేవతావరం
> బున నుదయించియున్నకృతపుణ్యులు వారలోన నగ్రజుం
> డనఘుడు రాజసూయము మహామతిఁ జేయుఁగ నోపు శత్రుసూ
> దనుఁడయి సార్వభౌముఁడయి తమ్ములబాహు బలంబు పెంపునన్.

> "అట్లేని నాకు నస్మత్పితృపితామహనివహంబు తోడ నాకాధిపలోక సుఖావాప్తి యగును."[2]

తన కుమారులు సాటిలేని శక్తిమంతులనీ, దేవతావరంవల్ల జన్మించినవారనీ, రాజసూయం చేయదగిన వారనీ పేర్కొని, వారు రాజసూయం చేస్తే, తనకూ, పితృవర్గానికీ స్వర్గప్రాప్తి కలుగుతుందని చెప్పడం గమనార్హం.

---

1. సభా - 1 - 19
2. సభా - 1 - 90, 91

నారదుడు పాండురాజు చెప్పిన మాటలన్నీ ధర్మజునికి విని పించి, తనపంతుగా,

"న్యాయమున రాజసూయము
సేయుము నీ పితృగణంబుఁ జెచ్చెర నధిక
శ్రీయుతు సురగణ పూజ్యులఁ
జేయుము శక్రుసభ నుండఁ జేయుము వారిన్"[1]

అని ప్రబోధించాడు. "...సుతజన్మఫలం బతిముదమునఁ బితృవరులకు హితమొనరించుటయ..."[2] కనుక ధర్మజుడు వెంటనే రాజసూయ నిర్వహణోన్ముఖుడయ్యాడు.

అనుజ కృష్ణుల తోడ్పాటుతో దిగ్విజయం కావించి, ధర్మ రాజు యజ్ఞదీక్షితుడయ్యాడు.

ఆ సన్నివేశంలో ధర్మరాజు మూర్తమైన ధర్మంలాగాను, బ్రహ్మర్షుల మధ్యఒప్పే బ్రహ్మలాగాను, ఉన్నాడని వర్ణించబడింది.[3] మరి అతని ప్రక్కన ద్రౌపదీదేవి ఎంత వైభవంతో ఉండిఉండాలి!

సమస్త రాజలోక సమక్షంలో ఆమె రాజసూయ వేదికపై ధర్మజునితోపాటు ఆశీనురాలై, "వసుధామరమంత్రపవిత్ర వారి ధారా వళి" తో మహాసామ్రాజ్ఞిగా అభిషిక్తురాలయింది.[4]

ఆ సందర్భంగా ధర్మరాజు ఆమెను ప్రత్యేకించి "...అఖిల జనులఁ బోలుచు మృష్టాన్న తతులఁ దృప్తులను జేయ ..."[5] నియో గించాడు. ద్రౌపది అన్నపూర్ణలా సాక్షాత్కరించింది. యాగం జరిగి

1. సభా - 1 - 92
2. సభా - 1 - 94
3. సభా - 1 - 289, 290
4. సభా - 2 - 216
5. ఆంధ్రమహాభాగవతము - 10 - 767

నన్నాళ్ళూ లక్షమంది బ్రాహ్మణులు భోజనం చేసి లేచేసరికల్లా తనంత తానుగా మోగేటట్లు ఏర్పాటు చేయబడిన శంఖం క్షణమైనా విరామం లేకుండా మోగిందంటే ఎన్నిలక్షలమంది బ్రాహ్మణులు తృప్తిపడి ఉంటారో! వారందరూ "అన్నదాతా సుఖీ భవ!" అంటూ నిండుమనస్సులతో ఆ చల్లని తల్లి ద్రౌపదీ మహాదేవిని దీవించే ఉంటారు గదా! కనుకనేనేమో, ఆమె ఒక సందర్భంలో భీమునితో స్వయంగా "వినుతింపందగు రాజసూయమునఁ బృథ్వీదేవతాకోటికెల్లను సంతృప్తి నెమొనర్చి వారి దయఁ గళ్యాణాత్మనై..." తి నని చాటుకొంది.[1] బ్రాహ్మణులే కాదు, సమస్త జనులూ ఆమెవల్ల తృప్తిని పొందారు. అప్పటి ఆమె సామర్థ్యాన్ని స్వయంగా చూసిన దుర్యోధనుడు ఎంతో అసూయతో తండ్రితో ఇలా చెప్పుకొని విలపించాడు :

"జన్నంబు చూడంగ సకలభూముల నుండి
వచ్చిన రాజన్యవరుల నవని
సురులను వైశ్యుల శూద్రుల నాత్మీయ
బంధు సుహృద్వీరభటనియోగ
జనులను బేదల సాధుల నిత్యంబుఁ
దాన పరీక్షించి తగ వెతింగి
యన్నంబు దయఁబెట్టి యందఱుఁ గుడిచినఁ
దనుమధ్య యర్థరాత్రంబునపుడు
గాని కుడువ దట్టి కమలాక్షి ద్రౌపది
యడియుఁ గాక యమ్మహాధ్వరమున
నధముఁడయ్యుఁ గడుఁ బ్రియంబున నభ్యర్చి
తుంపకాని వంచితుండు లేఁడు."[2]

అంతటి మహాధ్వరంలో ఎంత అల్పుడైనా ప్రియమార పూజింప

1. విరాట - 2 - 217 2. సభా - 2 - 116

బడ్డాడేగానీ ఆశతో వచ్చి మోసపడినవాడు ఒక్కడైనా లేడంటే ఎంతటి మహత్తరమైన విషయమది!

"రాజసూయావభృథంబునందు శుచియై పెంపొందిన వేణి వట్టి యీ యేవురుఁజూడఁగా సభకు నీడ్చెంగులాంగన నిట్లొనర్చు రే?"[1] అంటూ ద్రౌపది శ్రీకృష్ణునితో తన పరాభవాన్ని గురించి చెప్పుకొని విలపించిందంటే, నిజమే మరి, ఆమె ఆనాటి వైభవాన్ని గుర్తు తెచ్చు కొంటే, ఎవరికైనా, ఆమెపట్ల కౌరవులు చేసింది ఎంతటి మహాపరాభవమో స్పష్టపడుతుంది; 'అలాంటి మహాతల్లికా అంతటి ఘోరావమానం?' అనిపించి తీరుతుంది.

## ద్రౌపది నవ్వు :-

రాజసూయానంతరం ఎక్కడి వారక్కడికి మరలిపోగా, దుర్యోధనుడూ, శకునీమాత్రం మయసభా వైభవాన్ని చూడాలనే వేడుకతో నిలిచిపోయారు.

అపూర్వమైన ఆ సభాభవన రమణీయతకు విస్మితుడై దుర్యోధనుడు ఒకనాడు ఒంటరిగా సభలోని ఆయాప్రదేశాలను తిలకించ సాగాడు. ఆ సందర్భంలో అతడు మూసివున్న ద్వారాన్ని తెరిచిఉన్న ట్లుగాను, తెరిచిఉన్న ద్వారాన్ని మూసిఉన్నట్లుగాను భ్రమపడి దెబ్బ తిన్నాడు. సమతల ప్రదేశాన్ని ఎత్తైనదిగా భావించి ఎక్కబోయాడు. నీలపుమణులతో పొదగబడన ప్రదేశాన్ని జలాశయం అనుకొని బట్టలు పైకిపట్టుకొని దిగబోయాడు. స్వచ్ఛంగా ప్రకాశించే నీటితో కూడిఉన్న జలాశయాన్నిచూసి మామూలు ప్రదేశమనుకొని నడవబోయి బట్టలు తడిసిపోగా వెనుకకు మళ్ళాడు. అప్పుడు "వానింజూచి పాంచాలియుఁ బాండుకుమారులును నగిర"ని చెప్పబడింది.[2] విషయం తెలుసుకొని

---

1. ఉద్యోగ - 3 - 110

2. సభా - 2 - 86

ధర్మనందనుడు ధృతరాష్ట్ర తనయునికి సమీర తనయుని చేత దివ్య వస్త్రాలు, దివ్యభూషణాలు ఇప్పించి పంపాడు. దుర్యోధనుడు సభా ప్రలంభానికి సిగ్గుపడి, పాండవులను వీడ్కొని హస్తినకు వెళ్ళిపోయాడు.

ద్రౌపది నవ్వటాన్ని గూర్చి దుర్యోధనునికంటె మహాభారత విమర్శకులే ఎక్కువగా పట్టించుకొని, బాధపడ్డారనిపిస్తుంది. ఈ నవ్వు కారణంగానే దుర్యోధనుడు కక్షకట్టి కురుసభలో ద్రౌపదిని అవమానింపబోయాడని చాలమంది విమర్శకులు భావించారు. కొందరైతే ద్రౌపది పట్ల దుర్యోధనుని అనుచిత ప్రవర్తనను ఈ కారణంగా సమర్థించాలని కూడా ప్రయత్నించారు. మరికొందరు ఆ సన్నివేశంలో ద్రౌపది నవ్వడంలో తప్పులేదనీ, దుర్యోధనుడు అంతగా పగబూనడమే తప్పనీ భావిస్తున్నారు. వీరిదృష్టిలో "ద్రౌపది రాగాదివికారములు లేని రాతి బొమ్మకాదు. కావున మానవసహజమైన వికారము ఆ సన్నివేశమున ఆమె పొందినది. ఇది ...స్ఖాలిత్యము కావచ్చునుగాని అపరాధము మాత్రము కాదు. ఈ చిన్ని పొరపాటునకు ఆమె చెల్లింపవలసిన పరిహారము మహాభారతమంతటిది. నడుమనడుమ తన దుర్గతికి వేదనము నభివ్యక్తము చేసినను మొత్తముమీద ఆ దుష్ఫలితము నంతటినీ ఆమె ఓర్పుతో అనుభవించినది."[1]

ఈ విషయమై ఒక నిర్ణయానికి రావటానికి ముందు ఒకటి రెండు విషయాలను గమనించవలసి ఉంది.

దుర్యోధనుడు ధృతరాష్ట్ర నందనుడే అయినా తండ్రివలె అంధుడు మాత్రం కాదు. మరి, అతనికి మయసభలో ఏదిఏదో సరిగ్గా ఎందుకు కనబడి ఉండవు? అతని మనస్సు సరిగా లేదు కనుక. అప్పటికే అది అసూయావిష్టమయిపోయింది. అందువల్ల అతనికి సభ అంతా వ్యత్యస్థంగా అనిపించింది. భంగపడ్డాడు. ఆ భంగపాటుకు ద్రౌపదీ పాండవులు

1. "మహాభారతము - మహిళ" పుట - 26, జక్కా వెంకటరమణప్ప

నవ్వడం కూడా దుర్యోధనుని భ్రాంతి తప్ప వాస్తవం కాదు. రాజసూయంలో "నానాదేశాగతులైన రాజులు దెచ్చి యిచ్చిన యుపాయనంబులు గైకొనే"[1] బాధ్యత ధర్మజునిచే దుర్యోధనునకు అప్పగించబడింది.

"సన్ను రత్న పరిగ్రహణంబు నందుఁ
బాండవుండు నియోగించెఁ బార్థివేంద్ర
సర్వరత్నాకరైక ప్రశస్తరత్న
పుంజముల కాస్పదము ధర్మపుత్త్ర గృహము"[2]

అని దుర్యోధనుడు తండ్రితో సంభాషించేటప్పుడు చెప్పుకున్నాడు కూడా. యాగసందర్భంగా దుర్యోధనునిమనస్సుకు బాగాహత్తుకొన్నవి రెండే రెండు విషయాలు. అవి 1. పాండవుల సంపద, 2. ద్రౌపది సామర్థ్యమూను. "భావిపురాతనాద్యతన పార్థివలక్ష్ములు పాండవేయు లక్ష్మి విభవంబుతోడ నుపమింప సమంబులుగావ''ని నిశ్చయానికివచ్చి వారి పేర్మికి సహించలేక కృశుడూ, వివర్ణుడూ అయ్యాడు.[3] అయితే, ద్రౌపది విషయమై అతడు అసూయపడ్డాడు అనడంకంటె ఆమె సామర్థ్యానికి ఎంతగానో ప్రభావితుడయ్యాడు అనడం (Very much impressed) సమంజసంగా ఉంటుంది, సామాన్యంగా అసూయ అనేది సర్వసమానుల మధ్యే కలుగుతూ ఉంటుంది కనుక. ద్రౌపది వంటి సర్వసమర్థురాలు భార్యగాదొరికినందుకు పాండవులపై అతడు అసూయ పడితే పడవచ్చు, అది వేరు విషయం. మయసభను తిలకించేటప్పుడు కూడా ఈ రెండు విషయాలూ దుర్యోధనుని మనస్సులో తిరుగుతూ ఉండిఉంటాయి. కనుకనే అతనికి మూసిఉన్న ద్వారమేదో, తెరిచిఉన్న ద్వారమేదో, ఉన్నతప్రదేశమేదో, సమతలమేదో, జలాశయమేదో,

1. సభా - 1 - 288 వచనము
2. సభా - 2 - 108
3. సభా - 2 - 114

కానిదేదో కానరాలేదు. పడిపోయినప్పుడు వాస్తవంలోకివచ్చి, తన భంగపాటును ఎవరైనా, ముఖ్యంగా ద్రౌపదీ పాండవులు, చూశా రేమోనని చుట్టూ చూసుకొని ఉంటే, సభాభవనంలోని శిల్పాలో, సేవకజనమో ద్రౌపదీ పాండవుల రూపంలో నవ్వుతున్నట్లుగా భ్రమ కొల్పి ఉండవచ్చు. అతడు అభిమానవంతుడు గదా, తాను పడినదాని కంటె, పడటాన్ని ఎవరుగమనించారో అన్నదానికి ఎక్కువగా విలువను ఇవ్వడం సహజమే!

నన్నయగారిది చాలా చిత్రమైన రచనా విధానం. ద్రౌపదిని పాండవులు అయిదుగురూ వివాహం చేసుకొందామని నిర్ణయించుకో గానే వారికి బలరామకృష్ణుల దర్శనం కలిగింది. అది వారికి మాత్రమే గోచరించిన ఒకానొక అద్భుతదర్శనం. ద్రౌపదీ పాండవులు దుర్యోధన ప్రలంభానికి నవ్వడమనే విషయం కూడా ఇంచుమించుగా అటువంటి సన్నివేశమేనని చెప్పదగినది. దుర్యోధనునికి సంబంధించినంతవరకూ అది వాస్తవం. దానిని కాదు అనలేము. "హిప్నోటిజమ్" అనేది ఇప్పు డిప్పుడే ప్రచారంలోకి వస్తున్న ప్రాథమిక దశలో ఉన్న ఒకవిజ్ఞాన శాస్త్ర విభాగం. దానిప్రకారం ఒకవ్యక్తిమనస్సు భ్రమలో ఉన్నప్పుడు అతడు చేస్తున్న పని అతనికి వాస్తవంగానే ఉంటుంది. హిప్నాటిస్టు, పచ్చిమిరపకాయను 'తియ్యటి అరటిపండు, తిను' అనిచెప్పి 'మీడియం' చేతికిస్తే, ఆ 'మీడియం' దానిని అరటిపండు తింటున్నంత అనుభూతి తోనూ తినగలుగుతున్నాడు. పైవారికి అది మిరపకాయ అయినా తింటున్న 'మీడియం' కు మాత్రం అది అరటిపండే! అలాగే దుర్యో ధనుని లెక్కలో ద్రౌపదీ పాండవులు అతనిని చూసి నవ్వినట్లే.

దానిని భ్రాంతిగానే ఎందుకు అనుకోవాలి? యథార్థద అనుకో కూడదా? అంటే, దుర్యోధనుడు దానినంత తీవ్రమైన విషయంగా పరి గణించ లేదనే విషయాన్ని, అతనికది నిజమో, భ్రాంతో తెలియని

స్థితిలోనే ఉండిపోయాడనే విషయాన్నిబట్టి అది యదార్థం అయిఉండదని నిశ్చయంగా చెప్పవచ్చు.

నన్నయ తానుగా చెప్పినప్పుడు "పాంచాలియుఁ బాండు కుమారులును నగిరి" అన్నాడు. 'పాండుకుమారులు' అంటే ధర్మరాజు కూడానా? భీమసేనుడు ఒక్కడేనా? అర్జునుడూ, నకుల సహదేవులూ కూడా ఉన్నారా? ద్రౌపదితో కలిసి వారు దుర్యోధనుడు భంగపడ తాడని ముందే ఊహించి నవ్వడానికి సిద్ధంగా సభలో ఎక్కడైనా దాగి ఉన్నారా? లేక, యాదృచ్ఛికంగా వీరు అటువచ్చినప్పుడే దుర్యోధనుడు నీటిలో పడిపోయాడా? పడిపోతే, జాలిపడవలసిందిపోయి నవ్వే టంత సంస్కారహీనులు ఆ ఆరుగురిలో ఎవ్వరు? తనను అపహరింప వచ్చిన సైంధవుని ఆంతర్యం తెలిసికూడా ద్రౌపది, "...భూవర! తగు విందనైతి కురువర్యుల యింటికి నట్లు గావునంబరువడి నాసన క్రియయుఁ బాద్యముఁ గైకొను మాదరంబుతో..."[1] అని అతనిపట్ల గృహస్థ మర్యాదను పాటించిందే, అటువంటి ద్రౌపది దుర్యోధను డంతటివాడు, చుట్టపుచూపుగావచ్చి, తమయింట భంగపడితే అంత సంస్కారహీనంగా నవ్వుతుందా? అలా నవ్వేస్వభావం గలదే అయితే ఆమె సత్యభామతో

"పలుమాఱుం దలవాకిట
మెలఁగుట యుసతీజనైక మిత్రత కలహం
బుల కెలయుట నగుపలుకులఁ
బెలుచ నగుట నాకుఁగాని పేరివి మగువా"[2]

అని చెబుతుందా? మగవారి కంటబడటానికే ఇష్టపడని అంతఃపుర కాంత తడిసిన బట్టలతో నిలబడి ఉన్న పరపురుషుని చూసి నవ్వుతుందా? —అనేవి ఆలోచించవలసిన విషయాలు.

1. ఆరణ్య - 6 - 162
2. ఆరణ్య - 5 - 302

దుర్యోధనుడు శకునికైతవానికి తండ్రిని అంగీకరింపజేసే ప్రయత్నంలో తన సభాప్రలంభాన్ని ప్రస్తావించిన తీరు దీనికి భిన్నంగా ఉంది. తనను చూసి పాండవులు నవ్వినట్లుగా అతడు మూడుసార్లు మూడు విధాలుగా తండ్రికి చెప్పాడు.

మూర్ధాభిషిక్తుడైన ధర్మజునికి సాత్యకి ముత్యాల గొడుగు పట్టాడనీ, భీమార్జునులు బంగారు చామరాలతో వీచారనీ, కృష్ణుడు, నకులసహదేవులు, ధృష్టద్యుమ్నుడూ దగ్గరుండి వివిధరాజులచే ధర్మజునికి మ్రొక్కించారనీ చెబుతూ,

"..................దానిఁజూచి
యేను మొదలుగా మహీపతులెల్లను
దీప్తిదఱిఁగి యుండఁ దివిరి మమ్ము
నగిరి కృష్ణ పాండునందన ద్రౌపదీ
సాత్యకులుఁ గరంబు సంతసమున"1

అని ఒకసారి చెప్పాడు. అంతటి సందడిలో ద్రౌపదికి ఇతనినిగూర్చి నవ్వే వెసులుబాటు ఎక్కడదొరికిందోమరి! భీముడునవ్వాడన్నా, సాత్యకినవ్వి ఉంటాడన్నా నవ్వారేమోలే, అని సరిపెట్టుకోవచ్చు. ధర్మతనయుడూ, శ్రీకృష్ణుడూ కూడా నవ్వారంటే సందేహించ వలసి వస్తోంది.

ధృతరాష్ట్రుడు కుమారుని ప్రయత్నానికి వెంటనే ఆమోదం తెలుపలేదు. "ధర్మజుని సంపదకంటె అయిదురెట్లు సంపద నీకు ఉన్నది. నీకు ఇష్టమైన యాగాన్ని అంతకంటె వైభవంగా చేసుకో" అని సమాధాన పరచబోయాడు. దుర్యోధనుడు, ధర్మరాజుతో జూదమాడి అతని సంపదలన్నిటినీ గెలుచుకోవడమే తనకు యజ్ఞం-తక్కిన యజ్ఞయాగాలతో పనిలేదు అని స్పష్టపరిచాడు. ఇందుకు కారణంగా తన సభాప్రలంభాన్ని పేర్కొన్నాడు.

1. సభా - 2 - 119

" ... హరినీల బద్ధస్నిగ్ధమణిస్థలంబునందు జలబుద్ధింజేసిం బరిధానోత్కర్షణంబుసేసి, విమల శిలాతలబుద్ధి నుదక పరిపూర్ణంబయిన వాపి సొచ్చి కట్టిన పుట్టంబు దడియం ద్రెళ్ళిన నన్నుం జూచి వృకోదరుండు నగియె దాని నంతయు నెఱింగి ధర్మరాజ చోదితులయిన కింకరులు నాకుం బరిధానంబులు దెచ్చి యిచ్చిరి." అని భీముడు ఒక్కడే నవ్వినట్లుగా పేర్కొన్నాడు. అన్నగారి మాటను పాటించి ఆ సమీర నందనుడు దివ్యాంబరాలు మొదలైనవన్నీ ఇచ్చినప్పటికీ అంతా పోయింది ఇక్కడ. ఇదే సందర్భంలో ఇంకా అంటున్నాడు.

" మఱియు వివృతద్వారంబుఁ గవాట ఘటితంబని చొరనొల్లక, కవాట ఘటితంబు వివృతంబుగా వగచి చొరంబోయి తత్కవాటస్ఫటిక శిలా ఘట్టిత లలాటుండనైన నన్నుంజూచి యనేక సహస్ర విలాసినీ పరివృతయయి యున్న ద్రౌపది నగియె నంత నకుల సహదేవులు పఱతెంచి యిదె వాకిలి యిట వచ్చునది యని నన్నుం దోడ్కొని పోయి రట్టి సభా ప్రలంభంబు నాకు హృదయ శల్యంబయి యున్నది"[1] దుర్యోధనుడు ఇక్కడ ద్రౌపదికి వేయిమంది విలాసినీ జనాన్ని కూడా సమకూర్చాడు.

దుర్యోధనునికి కావలసింది పాండవులను ప్రాభవ శూన్యులుగా చేయటం-అందుకు తండ్రి అనుమతించకపోతే పని జరుగదు-అతడేమో వ్రేలికివేస్తే కాలికి, కాలికివేస్తే వ్రేలికి వేస్తున్నాడే గాని ఒక పట్టాన అంగీకారాన్ని తెలుపడంలేదు. అందువల్ల దుర్యోధనుడు మయసభలో తన భంగపాటును ఇన్ని విధాలుగా ప్రస్తావించవలసి వచ్చింది.

" అహితవృద్ధి యుపేక్షితంబగుడు నల్ప
మగు మహావ్యాధియును బోలెనది యసాధ్య

1. సభా - 2 - 140 వచనం

మయి యుపేక్షకు విర్భూలితాత్ముఁ జేయుఁ
గాన పాండవ శ్రీ యుపేక్ష్యంబుగాదు

"దాని నెవ్విధంబున నయిన నపహరింప వలయునట్లుగాని నాఁడు నా హృదయ తాపంబున కుపశమనంబు గాద..."ని [1] దానిని దీనితో ముడిపెట్టి చివరికి ఎలాగో తండ్రిని ఒప్పించుకోగలిగాడు.

ద్రౌపదీ పాండవులు తన ప్రలంభానికి నవ్వారో లేదో దుర్యోధనునికి స్పష్టంగా తెలిసిఉంటే తండ్రికి అతడు ఇన్ని కథలు అల్లి ఇంత శ్రమపడి చెప్పవలసిన పనే ఉండేది కాదు. నిజంగా వారు నవ్వడమే జరిగి ఉంటే అతడు ఇంత తేలికగా పరిగణించి ఉండేవాడే కాడు. కక్షకట్టి, సాధించి, 'ఇది నీ వానాడు నన్ను చూసి నవ్వినందుకు ప్రతిఫలం' అని స్పష్టంగా ద్రౌపది ముఖాన చెప్పి ఉండేవాడు. అతడలా చెప్పక పోవడాన్ని బట్టి కూడా ఈ విషయానికి అతడంతగా ప్రాధాన్యత నివ్వలేదని భావించడానికి వీలవుతోంది. [2]

---

1. సభా - 2 - 145, 146

2. "ప్రతివాదులనునట్లు ఆమె నవ్వుటను బట్టియే దుర్యోధనుఁడట్టి దురంతమును తలపెట్టిన యెడల అనాడు నన్ను జూచి నవ్వినందులకు నీకీశాస్తి చేసినామని యా దుర్యోధను డనడా? అట్లనకుండుటనుబట్టి కూడా ఆమె నవ్వలేదని ఆ దుర్యోధన దుర్మార్గమునకది కారణము కాదని స్పష్టము."

"మహాభారతతత్త్వకథనము" - ద్రౌపదీ నిందానిరాకరణము, పుట - 965

"ద్రౌపది పరిహాసమున కాఅభిమానధనుడు అంతగా దురపిల్లియున్నచో పరాభవసమయమందైనను ఆమెకది గుర్తుచేయక మానడు. దురాలోచనమందైనను ఆమె ఆధిక్యమును గుర్తించినాడే కాని ప్రత్యేకముగా పరిహసించి తన్నవమానించినట్లుగా భావించి తూలనాడలేదు, కాగా పాండవుల కౌరవుల దెబ్బ ఆ పడతికి తగిలి పరాభవింపబడినదే కాని అందామెదోసమిసుమంత లేదు."

"ఆంధ్రమహాభారతములో ద్రౌపదిపాత్ర - సమగ్రపరిశీలనము", పుట - 252

నన్నయ తాను అక్కడ (అమూలకంగా) అలా చెప్పి, దుర్యోధనునిచే ఇక్కడ తండ్రికి ఇలా చెప్పించడంద్వారా అదంతా అతని భ్రాంతి అనే విషయాన్ని చమత్కారంగా నిరూపించినట్లయ్యింది.

ద్రౌపది తనను చూసి నవ్విందనే విషయాన్ని దుర్యోధనుడు తండ్రిని తనప్రయత్నానికి సుముఖునిగా చేసుకోవడంవరకూ మాత్రమే వినియోగించుకొని వదిలివేశాడు. కాని అది అంతటితో పోలేదు. ధృతరాష్ట్రుని మనస్సుకు చాలా గట్టిగా నాటుకుంది, ఆమె అలానవ్విందంటే ప్రకృతి మానవ భామినియే అయిఉంటుంది, ఆమె జన్మకు సంబంధించిన దివ్యగాథలన్నీ కల్పితమయి ఉంటాయని అతడు తన మనస్సులో ఒక నిశ్చయానికి వచ్చేశాడు. అందువల్లనే నిండుసభలో నిష్కారుణంగా ఆమెను తనవాళ్లు అవమానిస్తూ ఉంటే ఏమీ తెలియని వానిలా ఉండిపోయి, గాంధారివచ్చి దుర్నిమిత్తోత్పత్తిని గూర్చి చెప్పే సరికల్లా భయపడిపోయాడు. అప్పటికి అతనికి తను ద్రౌపదినిగూర్చి ఏర్పరచుకొన్న అభిప్రాయం తప్పని తెలిసి వచ్చింది. ఆమెను పరమ పతివ్రత, తపస్విని, పాండవధర్మపత్ని, ధర్మరత, అయోనిజ-ప్రకృతి మానవ భామిని కాదు-దివ్యాంగన అని అంగీకరించి, కోడలును మందలించి, తప్పిదాన్ని సరిదిద్దుకొన్నాడు. ముంచుకువచ్చే వరకూ ఉపేక్షహించడానికీ, ముంచుకువచ్చేక ఆమె పతివ్రత అని తనంతతానుగా ప్రకటించడానికీ కారణం, అప్పటివరకూ ఆమెపట్ల ధృతరాష్ట్రునికి గల చులకనభావమే. లోలోపల భయపడుతూ, పైకి మాత్రం దేవుడు లేడని భావిస్తూ ఉండేవానికి ఏదైనా ప్రమాదం ముంచుకు రాగానే వెంటనే అది తనభావం తప్పు అయినందువల్లనే వచ్చిందనిపించి, అమాంతం అతడు భక్తుడు అయిపోతాడు. ధృతరాష్ట్రుని ఒప్పుకోలు కూడా సరిగ్గా అటువంటిదే.

## 5. ధర్మపత్నీత్వం - కురుసభలో పరాభవం

ద్రౌపది ధర్మ బద్ధంగా పాండవులకు భార్య అయింది. లోకంలో "భార్యకు దైవవిహితుండైన భర్త యొక్కరుండ" అనే సాధారణ ధర్మం ప్రబలంగా ఉన్నమాట వాస్తవమే. ద్రౌపదికి అయిదుగురు భర్తలు ఉండటమనేదికూడా దైవవిహితమే, అని వ్యాసుడు నిరూపించాడు. కనుక ద్రౌపది పాండవుల ధర్మపత్ని అనడంలో సందేహానికి తావులేదు.

ద్రౌపదికాక ధర్మజునకు దేవిక, భీమునకు జలంధర, అర్జునునకు సుభద్ర, నకులునకు కరేణుమతి, సహదేవునకు విజయ అనే భార్యలు ఉన్నట్లుగా భారతంలో చెప్పబడింది. వీరుకాక భీమునికి హిడింబ, అర్జునునికి ఉలూపి, చిత్రాంగదలు అనేవారు కూడా భార్యలే. వీరెవ్వరూ ద్రౌపదివలె భర్తలతో సర్వావస్థలందూ కలిసి ఉండినట్లుగా కనిపించదు. పాండవుల ప్రాభవానికీ, దైన్యానికీకూడా పట్టపురాణి ద్రౌపది మాత్రమే. పాండవులలో ద్రౌపది వివాహం పరమప్రయోజనాన్ని ఉద్దేశించీ, తక్కినవారి వివాహాలు లౌకికప్రయోజనాన్ని ఉద్దేశించీ జరిగినవి కావడమే ఇందుకు కారణం.

ధర్మస్వరూపుడైన ధర్మజునికి అతని నలుగురు తమ్ములూ తమ వ్యక్తిత్వాలను సర్వ సమర్పణ చేశారు. ధర్మజుడు వాసుదేవునికి తనను తాను సమర్పణ చేసుకొన్నాడు. వెరసిమొత్తం అందరూ ఒకే ధర్మప్రణాళికలో భాగస్వాములయ్యారు.

ద్రౌపదీ స్వయంవరానికి ఎక్కడెక్కడి రాజకుమారులూ వచ్చారు. వారిలో జరాసంధ, శిశుపాల, దుర్యోధన, కర్ణ, జయద్రథ, బృహద్రథ, సత్యవ్రత, చిత్రాంగద, భగదత్తాదులు కొందరు. వారంతా మత్స్యయంత్రాన్ని కొట్టడానికి ప్రయత్నించి భంగపడ్డవారే. వారిలో

కర్ణుడు పెంట్రుకవాసిలో విఫలుడయ్యాడు. అతడు తాను ద్రౌపదిని పొందలేక పోయానన్న అసంతృప్తి, అర్జునుడు పొందాడన్న అసూయా హృదయపులోతుల్లో నిలిచిపోయి సెలవేయగా, ద్రౌపది పట్ల ఒకవిధ మైన చులకనభావాన్ని ఏర్పరచుకొన్నాడు.

దుర్యోధనుడు పాండవులపట్ల ద్రౌపదిని విగత స్నేహాను చేద్దామని సూచించినప్పుడు కర్ణుడు.

"... ... ... ... ... ...
ఒక్క సతికిఁ బతులు పెక్కండ్రు రగుటది
సతుల కోర్కిగాన యతివకృష్ణ
సుందరాంగి వారియందేల యుపరక్త
యగు మనోముదంబుఁ దగులుఁ గాక"[1]

అని స్త్రీల మనోభావాల నెరిగిన 'పెద్దమనిషి' లా ద్రౌపదిని పలువురి పై ఆసక్తి కలిగిఉండే సామాన్యగా మాట్లాడాడు.

పాండవుల వైభవం దుర్యోధనునికి దుస్సహమయింది. రాజసూయమప్పుడు 'ధర్మపుత్రుని గృహము సర్వ రత్నాకరైక ప్రశస్తరత్నపుంజముల కాస్పద' మవడం కళ్ళారా చూసి సంతప్తుడై, వేసవిఎండలకు ఇంకిపోయిన జలాశయంలా కృశించి పోయాడు. అతనికి తనకు లేదని ఏడుపు కాదు - పాండవులకు ఉందని ఏడుపు. దాని పర్యవసానమే జూదం.

అప్పటివరకూ విదురుని బుద్ధిబలాన, ఆపగేయుని బాహుబలాన వర్తిస్తున్న ధృతరాష్ట్రుని రాజ్యతంత్రం ద్యూత నిర్ణయంతో దారి తప్పింది. పాండవుల సర్వసంపదలూ మాయజూదంలో శకుని గెలుచుకొన్నాడు.

---

1. ఆది - 8 - 26

అనంతరం వరుసగా సహదేవ, నకుల, అర్జున, భీములనూ, తననూ పణంగా చేసి ధర్మజుడు ఓడిపోయాడు. అప్పుడు శకుని

"ఇలా ఎందుకుచేశావు? నీకు మరొక సంపద - పాంచాల కన్య ఉందికదా? ఏం, ఆమె నీసొత్తుకాదా? అంటూ ప్రేరేపించాడు.

ధర్మరాజు ద్రౌపదినికూడా పణంగాపెట్టి ఓడిపోయాడు.

పెద్దలందరూ కలతపడి మిన్నకుండిపోయారు.

విదురుడు ముఖం త్రిప్పుకొని ఒళ్ళు మరిచి దుఃఖించాడు. తక్కిన పెద్దలంతా పెద్దపెట్టున విలపిస్తూంటే సభాక్షోభమయింది.

ఆ సందర్భంలో దుర్యోధనుడు గర్వితుడై విదురునితో "ద్రౌపదిని తీసుకురా, దాసీలతో కలిసి ఇల్లు తుడుస్తుంది" అనిపలికాడు.

విదురుడు సహించలేక పోయాడు— "నీవంటి మూర్ఖులు ఎక్కడా ఉండరు. నన్ను ఇలాంటిపనికి ఆజ్ఞాపిస్తావా? నీవంటి దుష్టుల సంపదలు ఎంతో కాలం నిలబడవులే'' అని హెచ్చరిస్తూ,

"అవనీతలసామ్రాజ్యో
త్సవమునకును యోగ్యయైన సతి ద్రౌపది పాం
డవ ధర్మ పత్ని నీకం
తవమానము సేయనేమి యనపాశ్రయయే?"1

అని ప్రశ్నించి, జరిగిందంతా అధర్మమని ఘోషించాడు.

దుర్యోధనుడు విదురుని లక్ష్యపెట్టలేదు. ద్రౌపదిని తోడ్కొని రమ్మని ప్రాతికామిని పంపాడు.

1. సభా - 2 - 203

ప్రాతికామి ద్రౌపది వద్దకు వెళ్లి, విషయం తెలిపి, "నిన్ను కౌరవేశ్వరునివద్దకు తీసుకుపోవడానికి వచ్చాడు. వెంటనే రావలసింది" అన్నాడు.

ద్రౌపది అదరలేదు, బెదరలేదు. స్థిరబుద్ధితో
"ఏ యుగంబునందు నెట్టి దుష్కృతవుండు
భార్యనొడ్డి యోటువడిన భర్త
గలఁడె? యిది వినంగఁ గడు నపూర్వంబయ్యె
నిట్లు సేయునొక్కొ యిందుకులుఁడు?

"మున్న దనోటువడి మఱి నన్నోటు
వడియెనో నన్ను మున్నోటువడి విభుండు
గన్నఁ దనోటు వడియెనో యన్న! నాకు
నెఱుఁగఁజెప్పుము దీని నీవెఱుఁగుదేని.

"ఎఱుంగవేని నక్కితవు నడిగివచ్చి మఱి నన్నుందోడ్కొని పోవనగునేనిఁ దోడ్కొనిపొమ్ము" 1 అని పలికింది.

ప్రాతికామి తిన్నగా ధర్మజుని దగ్గరకు వెళ్లి ఆమాటలన్నీ చెప్పాడు. ధర్మరాజు సమాధానం చెప్పటానికి నోరురాక తలవంచుకొని ఉండిపోయాడు. అది అవకాశంగా తీసుకొని దుర్యోధనుడు

"ఇది సందిగ్ధమైన విషయం, ఇందరిలో అడిగితే అతడేం చెప్తాడు? ఆమెను తీసుకురా! ఆ సమాధానమేదో ఇక్కడే తెలుసుకొంటుంది." అన్నాడు.

ద్రౌపదికి సభకు రాక తప్పలేదు. తనంతతానుగా ప్రాతికామి వెంట వచ్చి, కురువృద్ధుల సమీపంలో నిలబడింది.

ద్రౌపదిని చూడలేక సిగ్గుతోను, దుఃఖంతోను, తలవంచు

1. సభా - 2 - 208, 209, 210

కొని ఉండిపోయిన పాండవుల పైలక్ష్యానికి సంతోషించి దుర్యోధనుడు ద్రౌపదిని అక్కడినుంచి తీసుకొనిరమ్మని దుశ్శాసనుణ్ణి ఆదేశించాడు.

ద్రౌపది భయంతో వేగంగా గాంధారి దగ్గరకు వెళ్ళింది.

"నేను రజస్వలను, ముట్టకుండు మేకవస్త్రను నయి యున్న దాన మఱి గురుబంధు జనాధిష్ఠి తంబైన సభకు నెట్లు రానేర్తును"1 అంటున్నా వినకుండా వెంటపడి దుశ్శాసనుడు

"నిన్ను జూదంలో శకుని గెలిచాడు. కురూత్తమునిసొత్తు వయ్యావు. నీ భర్తలైన పాండవులు నిన్నూ, రాజ్యాన్నీ, తమనూ ఓడిపోయారు. నీవు ఏకవస్త్రవైనా, విగతవస్త్రవైనా నాకేమి? నిన్ను తీసుకొనిపోక తప్పదు" అంటూ సభలోని వారంతా నివ్వెరపోయి చూస్తూఉండగా, ఆమె జుట్టుపట్టుకొని ఈడ్చుకు వచ్చాడు.

చెదిరిన దృష్టితో, పాలిపోయిన ముఖంతో, గాలికి నేలకూలిన పతాకంలా ఉన్న ద్రౌపది కోపలజ్జాపరవశురాలయి,

"ఎలాంటి దురవస్థలోనూ ధర్మజుడు ధర్మపథాన్ని తప్పడు. వెనుకముందులు ఆలోచింపక, గర్వంతో ఈ దుర్జనుడు నన్నిలా ఈడ్చుకువచ్చాడు. ఇది తగదని వారించక, కురుముఖ్యులంతా చూస్తూ ఉండిపోయారు. నేటితో అతిపవిత్రమైన భారతవీరుల వంశం అధర్మం పాలయి, అతినింద్య మయ్యింది." అని పలికి భయంతో హృదయంలో కృష్ణుణ్ణి స్మరించింది.

---

1. సభా - 2 - 215

ఏకవస్త్రను, రజస్వలను అని చెప్పడం కనీసం మానవతా దృష్టితోనన్నా (ధర్మాధర్మాల ప్రసక్తి నటుంచి) వదిలిపెడతారేమోనని- కానీ అదే వారిలో కరువైంది. కఠినాతికఠినంగా, అమానుషంగా ఆమెను అవమాన పరిచారు. ఇంతకుమించి ఆమె రజస్వల అన్న విషయానికి వేరే ప్రాముఖ్యం ఏదీ లేదు.

పెద్దలెవ్వరూ పలుకకుండటం చూసి, జరుగుతున్న అన్యాయాన్ని సహించలేక పిన్నవాడైన వికర్ణుడు తానుగా కల్పించుకొని శక్తిమేరకు ధర్మనిర్ణయం చేశాడు. అతడు ద్రౌపది అధర్మవిజిత అనీ, ఏకవస్త్రగా ఉన్న ఆమెను సభకు ఈడ్చుకు రావడం అన్యాయమనీ తేల్చి చెప్పాడు.

వృద్ధులున్న సభలో ఒంటివాడైన బాలుని మాటకు విలువ ఏమి ఉంటుంది?

కర్ణుడు అతనిని ఒక బేలగా పరిగణించి, "ద్రౌపది ధర్మవిజితే, కాకుంటే పాండవులు ఎందుకు ఊరుకుంటారు?" అని అడిగాడు. అక్కడితో ఆగక ఆమెను సభకు తీసుకురావడంలో ధర్మవిరోధం లేదని వాదించాడు. అందుకు అతడు చెప్పిన ఉపపత్తి – స్త్రీకి దైవవిహితుడైన భర్త ఒక్కడే ఉంటాడు. ఈమె అనేక భర్తృక. కనుక 'బంధకి' అనబడుతుంది– అని. ఇలాంటిదాన్ని విగతవస్త్ర చేసి తెచ్చినా ధర్మవిరోధం లేదు అని తేల్చాడు. బంధకి అంటే వేశ్యజాతిస్త్రీ అనిఅర్థం.[1]

ద్యూతప్రయత్నంలో ఎక్కడా కర్ణుని ప్రమేయం ఉన్నట్లు కనబడదు. ద్రౌపది విషయం చర్చకు వచ్చేసరికి మాత్రం అతడు ఒంటికాలిపై ముందుకురికాడు. ద్రౌపదిపట్ల అతనికి గల చులకనభావమే ఇందుకు కారణం.

ద్రౌపది వివాహంలోని సంబద్ధతా, అసంబద్ధతలను నిర్ణయించే అర్హతగాని, అధికారం గాని కర్ణునికిలేవు. కనుక ద్రౌపదిని అతడు 'బంధకి' అనడం నోటి దురుసుతనమే.

కర్ణుని మాటప్రకారం ద్రౌపది బంధకి అనుకున్నా, బంధకి కూడా స్త్రీయే కదా! ఎలాంటి స్త్రీనైనా గౌరవించాలని కర్ణుడెరిగిన

1. 'బధ్నాతి ఉదాసీనమపి పురుషం స్వవశం కరోతీతి బన్ధకీ' - అనివ్యుత్పత్తి.

ధర్మశాస్త్రాలు చెబుతూఉండగా, ఏకవస్త్ర అయిన ద్రౌపదిని, పరమ పతివ్రతను, అవమానించడం, విగతవస్త్రను చేసినా ధర్మ విరోధం లేదు అనడం అత్యంత హేయమైన ఉన్మత్తప్రలాపం.

ద్రౌపది దాసి అయింది కనుక ఆమెనుగూర్చి కర్ణుడు అలా పలకడంలో తప్పులేదు అనడానికైనా - దాసిని మాత్రం నోటికి వచ్చినట్లు మాట్లాడవచ్చునని ఎక్కడ ఉంది? దుర్యోధనుని వద్దగల భృత్య జనాల్లో ఇతరులని ఎవ్వరినైనా ఎప్పుడైనా కర్ణుడు అలానిందించాడా!

కనుక ఏప్రకారం చూసినా కర్ణుడు ద్రౌపదిపట్ల మహాప చారం చేసినట్లే.

అతడు అన్నమాటలు వ్యర్థంగా పోలేదు. దుర్యోధనుడు మరింత ఉత్సాహంతో విజృంభించి ద్రౌపదీ పాండవుల వస్త్రాలను అపహరించవలసిందిగా దుశ్శాసనుణ్ణి ప్రేరేపించాడు.

చేసేదిలేక పాండవులు తమకు తాముగా తమ తమ పై పుట్టాలను తీసి అక్కడపెట్టారు. దుశ్శాసనుడు ఏమాత్రం సంకోచించక ద్రౌపది కట్టుబట్టను విప్పబోయాడు. ఒక వస్త్రాన్ని తీస్తే అలాంటిదే మరోవస్త్రం ఆమె జఘనభాగాన ఉండటాన్ని అతడు గమనించాడు. దానినితొలగిస్తే మరోవస్త్రం! అతడు ప్రయత్నించినకొద్దీ ఆమె ఒంటిపై వస్త్రాలు వస్తూనే ఉన్నాయి.

సభ్యులందరూ విస్తుపోయి ఆనందించారు.

దుశ్శాసనుడు ఒలిచి, ఒలిచి, ఆ వస్త్రాలు కొండంతరాశి కాగా, శక్తితగ్గిపోయి, ఒలవలేక సిగ్గుపడి నూనివేశాడు.

"కురువృద్ధులూ, గురువృద్ధులూ, బంధువులూ, అనేకులు

చూస్తూఉండగా మదంతో విజృంభించి ద్రౌపదిని ఇలా అవమానపర చిన ఈదుశ్శాసనుణ్ణి లోకభీకరంగా చంపి, గుండెలు చీల్చి రక్తం త్రాగుతా" నని భీముడు ఆ సందర్భంగా భీకరమైన ప్రతిజ్ఞ చేశాడు.

విదురుడు కల్పించుకొని ద్రౌపది ప్రశ్నకు సమాధానం చెప్పకపోతే సభలోని వారికందరికీ దోషం చుట్టుకుంటుందని హెచ్చ రించినా ప్రయోజనం లేకపోయింది.

అప్పుడు ద్రౌపది

''అవ్విధంబున నొప్పి యా స్వయంవరమునాఁ
డఖిల భూపతులచే నట్లుసూడఁ
బడి పాండవుల ధర్మపత్నినై గోవిందు
చెలియలనై పీనిచేత నిట్లు
పరిభూత నగుచు సభామధ్యమున మహీ
పతులచేఁ జూడంగఁ బడితి నింత
వడుదునె యిపుడు నాపలుకుల కెవ్వరుఁ
బ్రతివచనం బేల పలుకరైరి

ధన్యులార! యే నదాసినే దాసినే
యెఱుఁగఁ జెప్పి పనుపుఁడెల్ల దాని
...........................
...........................''[1]

నని రోదించింది.

అప్పుడు భీష్ముడు "నీ ప్రశ్నకు సమాధానం యుధిష్ఠిరుడే చెప్పాలి. ధర్మసూక్ష్మతను తెలుసుకోవడం ఎవరికైనా చాలాకష్టం.

1. సభా - 2 - 244

దీనిఫలితాన్ని త్వరలోనే ఈ కురుకులపాంసనులు అనుభవిస్తారు''[1] అని చెబుతూ ఉండగా కర్ణుడు ద్రౌపదిని చూసి నవ్వుతూ,

"అయిదుగురికంటె ఒక్కభర్త ఉండటం మంచిది. జూదంలో భార్యను ఓటుపడనివానిగా తగిన భర్తను ఇప్పటికైనా పొందు'' అంటూ వేళాకోళం చేశాడు.

అప్పుడు దుర్యోధనుడు తనను చేరరమ్మని ఆమెకు తొడ చూపించాడు.

దానిని చూసి భీముడు ప్రళయకాలంలో విజృంభించే యముని లా మహాభయంకరంగా

"ధారుణి రాజ్యసంపద మదంబునఁ గోమలిఁ గృష్ణఁ జూచి రం
భోరు నిజోరుదేశమున నుండఁగఁ బిల్చిన యిద్దురాత్ము దు

---

1. సభా - 2 - 245

"......భీష్ముడు ఈ సందర్భమున ధర్మనిర్ణయము చేయఁజాలకకాక, చేయనిష్టపడక యిట్లు పలికెను. ఆతని ధర్మాభిజ్ఞతకు మహాభారతమునఁ గొల్లలుగా నుదాహరణములు గలవు. కావున నిట నిట్టి యర్థమును వ్యంగ్యముగా భావించుకొనవల యును. 'అమ్మా! నీపడిన యీ యవస్థకు నోటితో నుత్తరమీఁగాదు. ఈ యుధిష్ఠిరుఁడు తనపేరును సార్థకమొనరించి మిమ్మిట్లు చేసిన యీ నీచులను దారుణముగా వధించు టయే యిట సదుత్తరము' అనునర్థమిట వ్యంగ్యము. ఈ యభిప్రాయము 'దీనిఫలంబు వేగంబ యిక్కురుకులపాంసను లనుభవింతు'రను వాక్యము వలన దృఢమగుచున్నది. మఱియు నిందలి పాపఫలం బనుభవింతురను దానిచే భీష్ముఁడు ద్రౌపదీ ప్రశ్నమునకు వ్యంగ్యముగా సమాధానము చెప్పుటయైనది. కురుకులపాంసనులదే యధర్మము; నీవు దాసివికావు; కాని నేనీవిషయము చెప్పియేమి? చెప్పకయేమి? దీనికీదుష్టులను యుద్ధమున సంహరించుట తక్క వేఱునిష్కృతి లేదుసుమా! అనునర్థము వ్యంగ్యము. దీనివలన భీష్ముని హృదయమునఁ గౌరవులయెడఁ గలిగిన క్రోధాతిశయమును, ద్రౌపదియందును బాండవుల యందును గల సానుభూతియు, వారి దుఃఖము వలనఁ గలిగిన దుఃఖో ద్వేగమును వ్యక్తము లగుచున్నవి.'' —భారతధ్వనిదర్శనము, పుట - 337

ర్వార మదీయ బాహుపరివర్తిత చండగదాభిఘాత భ
గ్నో రుతరోరుఁ జేయుదు సుయోధను నుగ్రరణాంతరంబునన్"[1]

అంటూ ప్రతిజ్ఞ చేశాడు.

భీష్మ, విదుర, ద్రోణాదులు "ఇది కోపంబున కవసరంబు గాద"ని భీముని శాంతింపజేశారు.

ఆ సమయాన అనేకమైన మహోత్పాతాలు పొడకట్టాయి. గాంధారి ధృతరాష్ట్రునితో జరిగినదంతా చెప్పి కలిగిన దుర్నిమిత్తాలను కూడా వివరించింది. అప్పుడు ధృతరాష్ట్రుడు దుర్యోధనుని పిలిపించి,

"పరమపతివ్రతన్ సభకుఁదపస్వినిఁ బాండవధర్మపత్ని ధ
ర్మరత నయోనిజం బ్రకృతి మానవభామినిఁ గాఁ దలంచి దె
ప్పరములు వల్కఁగాఁదగునె బాల్యము నాదిగ దుష్టభావనం
బెరిఁగితి నీనిమిత్తమునఁ బెద్దయు దుఃఖితులైరి పాండవుల్

"వారివలన నీదురాగ్రహంబుడుగు మని కొడుకును భంగిం" చాడు.[2]

ఇది ఒకవిధంగా సార్వభౌముని తీర్పు.

కర్ణుడు ద్రౌపది బంధకి అని ఆరోపించి ఆమెను విగతవస్త్రను చేసినా ధర్మవిరోధం లేదని ప్రతిపాదించాడు. దుర్యోధనుడు వంతపాడి తనకంటె యోగ్యుడు లేడన్నట్లు తనను చేరరమ్మని ఆమెను పిలచాడు.

విదురుడు ఆమె కులసతి అనీ, పాండవ ధర్మపత్ని అనీ, ఆమెను అవమానించడం అధర్మమనీ ఘోషించాడు.

గుడ్డిదైన కురున్యాయస్థానం తానుగా నోరువిప్పి న్యాయాన్ని, ధర్మాన్ని చెప్పలేకపోయింది. ద్రౌపది తాను దాసినా? అదాసినా? అని నిగ్గదీసి అడిగినా సమాధానం తిన్నగా రాలేదు.

1. సభా - 2 - 249 2. సభా - 2 - 255, 256

దైవ వశాన ఆమె పాతివ్రత్యం ప్రత్యక్షంగా నిరూపితమై, కురువంశ వినాశకర చిహ్నాలు కనిపించే సరికి ధృతరాష్ట్రుడు భయంతో మాత్రమే నోరువిప్పి తీర్పు చెప్పాడు.

వరాల నెపంగా పాండవుల సంపదలను, రాజ్యాన్ని పాండవులకు ఇచ్చివేసి, " ఏను బుద్ధిలేక జూదంబు పేక్షించితి నల్పబుద్ధి సత్త్వం డయిన వృద్ధు నన్నును వారి తల్లి యయిన గాంధారినిం దలంచి దుర్యోధనాదులు సేసిన దుర్నయంబులు సేకొనకుండునది. సర్వశాస్త్రవిదుండైన విదురుండు మంత్రిగా, సర్వధర్మ విదుండవైన నీవు రక్షకుండవుగా నిక్కురుకులంబునకు లగ్గగు"[1] నంటూ లెంపలు వాయించుకొన్నాడు. తాత్కాలికంగా, జరుగబోయిన ప్రమాదంనుంచి బయట పడ్డాడు.

నిండు సభలో కర్ణుడు మాటలతోను, కొడుకులు చేతలతోను ద్రౌపదిని అవమానిస్తూంటే చెవిటివానిలా మిన్నకుండిపోయిన గ్రుడ్డి రాజుకు ఇంతకథ నడిచాక గాని పాండవుల ధర్మపరతా, ద్రౌపది పాతివ్రత్యమూ అవగతం కాలేదు.

ఏ సభలో ద్రౌపది బంధకి అని ఆరోపించబడిందో ఆ సభలోనే ధృతరాష్ట్ర సార్వభౌమునిచే ఆమె పరమపతివ్రత అని ప్రకటించబడటం విశేషం. ఆమె కారణంగా పాండవధార్తరాష్ట్రుల కోపవేగాలు ఉపశమించాయి. కీర్తిమంతులు, ధీరులు, పురుషసింహాలూ అయిన భర్తలు విపత్తిసాగరంనుండి ఆమె కారణంగానే ఉద్ధరింపబడ్డారు.

పాండవులు లోకహిత దృష్టితో జగద్గురుని సారథ్యాన మయసభలో రాజసూయాన్ని మహావైభవంగా నిర్వహించారు. అది కృష్ణకృత శిశుపాలవధతో నిర్విఘ్నంగా నెరవేరింది.

---

1. సభా - 2 - 267

కౌరవులు మాత్సర్యంతో పాపవ్యవసాయబుద్ధులై శకుని సారథ్యాన కురుసభలో మాయాదురోదరం నిర్వహించారు. ఇది కర్ణ దుశ్శాసనకృత ద్రౌపదీ పరాభవంతో ముగిసింది.

మయసభలో పాండవులపట్ల బాధ్యతపడిన శ్రీకృష్ణుడే కురుసభలో కూడా పాండవులకు దిక్కయి, ద్రౌపదీ మానసంరక్షణ కావించాడు. దాయాదులైన కురుపాండవుల కలహంలో కృష్ణుని ప్రమేయానికి కారణం ఇదీ! సంజయుడు రాయబారానికి వచ్చినప్పుడు కృష్ణుడు అతనితో

"ఎందును నెవ్వరుం బడని యెంతయుఁ గష్టముపాలు వచ్చినం
గొందల మంది పాండువిభుకోడలు దవ్వులనున్న నన్ను గో
విందుఁడ కావుమంచుఁ బలవించుట యాఁగఁగరాని యప్పుఁబో
లెం దలపోయ వ్రేఁగయి చలింపక యున్నది యెప్పుడున్ మదిన్"[1]

అని చెప్పి, 'ఇలాంటి నేను రథం నడుపుతూ ఉంటే, గాండీవం ఎక్కుపెట్టి అర్జునుడు రెండు చేతులతోను బాణాలు వేస్తూండగా మీరంతా ఎలా తప్పించుకొని పోగలుగుతారు?' అని అడగటం ఈ సందర్భంగా స్మరింపదగినది.

ధృతరాష్ట్రుడు కలుగబోయే అనర్థాలకు భయపడి పాండవులను వదిలివేస్తే, దుర్యోధనుడు ఊరుకోలేదు. అతణ్ణి మరోరకంగా హడలగొట్టాడు. "ఇంతటి అపకారం చేసి వారిని వదలడం పాములను అలిగించి కంఠసమీపాన వదలడమే అవుతుంది. ఇప్పుడు వాళ్ళు మన పైకి ఎత్తివస్తే జయించడం మనతరమవుతుందా?" అనేసరికి ధృతరాష్ట్రుడు భయపడిపోయి అనుద్యూతానికి అంగీకరించాడు. మళ్ళీ

1. ఉద్యోగ - 2 - 129

పాండవులను ఓడించి, రాజ్యాన్నీ, సంపదలనూ లాక్కొని అడవులకు పంపిచారు.

ద్రౌపది కారణంగా మొదటిసారి తప్పిపోయిన యుద్ధాన్ని పదమూడేళ్ళ తరువాత తమంత తాముగా కోరి తెచ్చుకొని పతన మయ్యారు కౌరవులు.

భర్తలు ఏ శ్రీకృష్ణుని నమ్ముకొని, ధర్మానికి కట్టుపడి, అవమానాలను సహించి, కష్టాలకూ, నష్టాలకూ లోనయినా చలించ కుండా నిలబడ్డారో అదే శ్రీకృష్ణణ్ణి హృదయంలో నిలుపుకొని, తన పాతివ్రత్యాన్ని ప్రకటితంచేసుకొన్న మహామహిమాన్విత ద్రౌపదీదేవి.

అగ్నిపరీక్షవంటి శీలపరీక్షలో నెగ్గి, వనవాసానికి భర్తలతో బయలుదేరిన ద్రౌపదిని ఉద్దేశించి కుంతీదేవి

"ధవలాక్షి! నీకతంబునఁ
బవిత్రమై ద్రుపదుకులముఁ బాండుకులంబున్
భువనముల వెలిఁగె నీవు
ధ్రువమగుటను జొచ్చుటను శుభస్థితి తోడన్"[1]

అని ప్రశంసిస్తూ, దీవించి పంపింది. సముచితమైన ఈ మాటలు ఆ సహనమూర్తిని ఎంతగా సమాశ్వాసించి ఉంటాయో!



1. సభా - 2 - 290

## 6. కదన కుతూహలరాగం

మధ్యస్థులైన మహానుభావుల ఉపేక్షవల్లా, ధృతరాష్ట్రుని అవివేకంవల్లా పాండవులు పన్నెండేళ్ల అరణ్యవాసానికీ, ఒక సంవత్సరం అజ్ఞాతవాసానికీ అంగీకరించి రెండవమారు ద్యూతమాడి, ఓడిపోయారు.

రాజ్యోప భోగములు విడిచి, భీష్మ ధృతరాష్ట్ర విదుర కృప ద్రోణాదుల అనుమతి పొంది, తల్లికి మ్రొక్కి, భార్యా సమేతులై పాండవులు వనవాసానికి బయలుదేరారు. ముందు ధర్మరాజూ, వెనుక తమ్ములూ, ద్రౌపదీ నడుస్తున్నారు. ముక్తకేశి అయి, పతులవెనుక మెల్లిగా సాగుతున్న ద్రుపద పుత్రిని చూసి కౌరవేంద్రుని అంతఃపుర స్త్రీలందరూ భయపడి తలలు వంచుకొన్నారు.[1] ద్రౌపదిపాతివ్రత్యమూ, మహిమా వారికి సభలో ఇంతకుముందు నిరూపితమైనతీరు గుర్తుంది. అలాంటి ఆమె ఇప్పుడింత దైన్యంగా వెడుతూంటే తమకు ఏమి కీడు మూడుతుందో అని వారి భయం. భీమార్జున నకుల సహదేవులు సభలోని వారందరూ వినేటట్లుగా భీకరమైన ప్రతిజ్ఞలు చేస్తూ ముందుకు సాగారు.

> " సాహసమున మద్బాహు గ
> దాహతి దుర్యోధనాదు లగురిపుల జగద్
> ద్రోహులఁ జంపుదు నత్యు
> గ్రాహవమున హరిహరాదు లడ్డంబైనన్"[2]

ఇది మహాబలశాలి అయిన భీమసేనుని ప్రతిజ్ఞ. దుర్యోధనాదులను అతడు 'జగద్ద్రోహులైన రిపులు' అనడం గమనించదగి ఉంది.

---

1. పతులపిఱుఁద మందగతి ముక్తకేశియై
పోవుదాని ద్రుపదపుత్త్రిఁ జూచి
యంతఁ గౌరవేంద్రునంతిపురంబున
వారలెల్లఁ దలలు వాంచి రడలి. సభా - 2 - 293
2. సభా - 2 - 295

ధర్మజుని రాజ్యభ్రష్టుని చేయడం, ద్రౌపదిని అవమానించడం వ్యక్తి గతంగా కాక జగత్తున కంతటికీ ద్రోహంగా భీముడు భావించాడు.

మేటి విలుకాడైన గాండీవి,

"కనకోర్వీధర సానుసార రుచి మద్గాండీవ నిర్ముక్తప
త్త్రినిపీతారుణవారి శేషముఁ బతత్త్రి వ్రాతముల్ ద్రావున
య్యని నాతోడఁ జతుర్దశాబ్దమున మాత్సైపోరుకర్ణాదిదు
ర్జన సంఘంబుల మాత్తురం దునుముదున్ సంగ్రామరంగంబునన్"[1]

అంటూ శత్రుపక్షంలోని కర్ణాది దుర్జనులను యుద్ధంలో చీల్చి చెండాడుతానని పలికాడు.

" మాయా ద్యూతంబున ని
ర్జేయులఁగా మమ్ము నిట్లు సేసినఖలు న
న్యాయపరు శకుని నస్మ
త్సాయక జితహస్తుఁ జేసి చంపుదు మాజిన్

అనేది నకుల సహదేవుల ప్రతిజ్ఞ. తమ కష్టాలకు మూలమైనది జూదం. ఆ జూదకల్పన కారకుడు శకుని. కనుక అతనిని జయించడం తమవంతుగా వారు చాటుకున్నారు.

ఆ సందర్భంగా ధృతరాష్ట్రుని మందిరంలో నక్కలు అరుస్తూ పరుగులు పెట్టాయి. పట్టపగలు అప్రదక్షిణంగా ఉల్కలు పడ్డాయి. మబ్బులు లేకుండానే ఆకాశంలో మెరుపులు మెరిశాయి. అకాలంగా సూర్యగ్రహణం కలిగింది. భూమి కంపించింది. అందరూ వింటూఉండగా నారదుడు "పధ్నాలుగేళ్లకు భారతయుద్ధం జరుగుతుంది. భీమార్జునుల పరాక్రమం వల్ల పాండవులు జయిస్తారు" అని చాటిచెప్పాడు.

---

1. సభా - 2 - 297
2. సభా - 2 - 298

దుర్యోధనుడు చేసిన మోసానికి ధర్మజుడు తీవ్రమైన కోపాన్ని పొందాడు. తన రూక్షమైన చూపులకు జనం దహించుకు పోకుండా ఉండాలని అతడు బట్టతో మొహం కప్పుకొని వెళ్లాడు ముందుకు.

యుద్ధంలో బాహుబలం ప్రదర్శించే అవకాశం వచ్చిందని సూచిస్తూ భీముడు బాహులు రెండూ పెద్దగా చాస్తూ వెళ్ళాడు.

అర్జునుడు రాబోయే యుద్ధంలో తాను ఎంతదట్టంగా బాణాలు వేసి శత్రువులను జయిస్తాడో తెలియజెబుతున్నట్లుగా ఇసుకజల్లుతూ సాగిపోయాడు.

నకులుడు తన సుందరమైన ఆకారం అంతటి దుఃఖానుభవానికి తగినదికాదని జనులు బాధపడకుండా ఒంటికి దుమ్ము పులుము కొంటూ వెళ్లాడు.

దీనమైన తనముఖాన్ని చూస్తే జనాలకు కీడు మూడుతుందని సహదేవుడు తలవంచుకొని వెళ్లాడు. ఇంక,

"తడిసిన యేకవస్త్ర పరిధానముతోడ విముక్తకేశియై  
తొడరుచు దుఃఖభావమున ద్రోవదివోయె మహాహవంబునం  
బడిన నిజేశమిత్ర సుత బంధుజనంబుల శోకవేదనం  
గడుకొని యట్ల యేఁగుదురు కౌరవ భామినుల వ్విధంబునన్"1

ద్రౌపది తమకు జరిగిన అన్యాయానికి ప్రత్యేకించి ఎవరినీ ఏమీ అనక పోయినా, ఆమె హృదయంలోని ఆవేదన ఆమెరూపంలో స్పష్టంగా వ్యక్తమై చూసేవారికి అమె కౌరవులను శపిస్తున్నదా అన్నట్లుగా ఉన్నదనిపించింది. తను ఇప్పుడు శోకభావంలో, భర్తలు ఉండీ, దిక్కు లేనిదానివలె ఎలావెళుతోందో, కౌరవస్త్రీలుకూడా అనతికాలంలో,

1. సభా - 2 - 308

యుద్ధంలో భర్తలను కోల్పోయి, ఇలాగే వెడతారని ఆమె సూచిస్తున్నట్లుగా ఉందట! సూచిస్తున్నట్లుగా ఉండటంయేమిటి? సరిగ్గా అలానే జరిగింది కూడాను.[1]

ధౌమ్యుడు యుద్ధంలో చావనున్న వీరులకు చేయబోయే పరలోక విధులను సూచిస్తూ రౌద్రయామ్య సామగానం చేస్తూ పాండవులవెంట తరలి వెళ్లాడు.

ఈ వృత్తాంతం అంతా విన్న ధృతరాష్ట్రుడు పాండవులతో వైరం ధర్మపరంగా అయుక్తమనీ, ప్రజాక్షయ కారణమనీ అప్పుడే గ్రహించాడు.[2] కానీ విదురుడు "ఇప్పటికీ మించిపోయిందిలేదు, వారిని వెనుకకి పిలుపించి యథాస్థితిని నిలుపు" అంటేమాత్రం అతనికి రుచించలేదు. వినీవిననట్లుండి పోయాడు.

ధృతరాష్ట్రుడూ, అతని కొడుకులూ తాత్కాలికమైన రాజ్యలాభమే చూసుకొన్నారుగానీ స్వయంచాలకమైన ధర్మాన్నీ, దీర్ఘకాలికమైన పరిణామాలనూ గ్రహించలేక పోయారన్న విషయం ఇక్కడ స్పష్టమవుతోంది.

అరణ్యవాసం పదమూడుమాసాలు నడచిన తర్వాత ఒకనాడు ధర్మరాజుతో తమ పాట్లు అర్థంలేనివని వాదించింది ద్రౌపది.

---

1. "చెలులైనఁ జూడఁ బయ్యెద
దొలఁగుటకును సిగ్గుపడు వధూజనత తియ
త్తల యెదురనేక వస్త్రం
బులతో నంగమును వికృతిఁ బొందఁగ నడచెన్
మున్నెన్నఁడు నెవ్వరికిం
గన్నులెదురఁబడనియట్టి కాంతలు జనులె
ల్లన్నిలిచి చూడ వెడలిరి
కన్నులు గమరన్ సుహృన్నికాయంబులకున్" -స్త్రీ- 1 - 99, 103.

2. సభా - 2 - 311

"ఆది నపరాధమొక్కటి యైన నదియు
నల్పమైనను క్షమియించునదియుఁగాక
చెనసి యపరాధములు పెక్కు సేయుచున్న
పాప కౌరవ్యులకు సహింపంగ నేల?"[1]

అంటూ అది విజృంభించ వలసిన తరుణంగాని ఉపేక్షింపదగిన సమయం కాదని ఉద్బోధించింది. ధర్మాన్ని పాటిస్తూ, అధర్మమే మనలను రక్షిస్తుంది లెమ్మని శత్రువులను క్షమించి వదలివెయ్యడం మంచిదికాదనీ, ధర్మదూరులైన కౌరవులను అధర్మం ఏమీ చెయ్యలేదనీ, మోసాన్ని మోసంతో జయించక పోతే బ్రతకడం కష్టమనీ ఆమె వాదించింది. "... దైవ మానుషంబులు గర్మఫలప్రాప్తికి నిమిత్తంబులు; పురుషుండు మనంబున నర్థసిద్ధి నిశ్చయించి కర్మంబునందుఁ గృతోత్సాహుండు గావలయు; నట్టివానికి దైవంబు సహాయంబయి కర్మసిద్ధి గావించు"[2] అని తనకు తెలిసిన మేరకు వివరించి, "ఉత్సాహవంతుండవయి నీయనుజుల పరాక్రమంబునం బగల జయించి మనయందలి యర్థకృశత్వంబపనయింపు" మని కోరింది.[3]

ఆమె మాటలకు అనుగుణంగా భీముడుకూడా అన్నగారిని

"దుర్మతులను దుర్జనులను
ధర్మస్థితి నోర్వఁదగునె ధరణీశ్వర! దు
ష్కర్ములగు ధార్తరాష్ట్రుల
పేర్మి యడంగింపఁ గడఁగు పృథుభుజ శక్తిన్"[4]

అని ప్రార్థించాడు. 'ధర్మం ధర్మం' అంటూ అడవులలో పడి ఉండటం క్షత్రియుడైన వానికి తగదని చెప్పి, "... మనమిప్పుడివ్వనమునఁబదుమూఁడు మాసంబులు సలిపితిమి; సంవత్సర ప్రతినిధిగా మాసంబులు

---

1. ఆరణ్య - 1 - 219
2. ఆరణ్య - 1 - 233
3. ఆరణ్య - 1 - 236
4. ఆరణ్య - 1 - 239

సేసికొనుట యెందునుం గలయదియు; దీన ధర్మ విరోధంబు లేదు; విజయారంభమునకిది యవసరంబు..." అంటూ తొందర పెట్టాడు.

అప్పటికి ధర్మరాజు దిగివచ్చాడు. కౌరవులను జయించడ మన్నది అల్పియమైన కార్యం కాదనీ, మహాకార్యమనీ, కనుక సాహసం పనికిరాదనీ, బాగాఆలోచించిగానీ ఏనిర్ణయమూ చేయరా దనీ తేల్చి చెప్పాడు. దుర్యోధనాదులందరూ శూరులూ, దురాధర్షులూ ననీ, కర్ణుడు, భూరిశ్రవుడు, శల్యుడు మొదలైన వీరులందరూ అజేయు లనీ, రాజసూయానికి పూర్వం తమచే జయింపబడిన రాజులందరూ ప్రస్తుతం దుర్యోధనుని చే సత్కరింపబడి వానికోసం ప్రాణాల నివ్వడానికి సిద్ధంగా ఉన్నారనీ, వారంతా శస్త్రాస్త్ర విద్యల్లో ఆరితేరిన వారనీ వివరించాడు. అన్నిటినీమించి అభేద్యకవచుడైన కర్ణుని బాహువిక్రమం ఉపేక్షింప దగినది కాదని నొక్కి చెప్పాడు. భీష్మద్రోణ కృపాచా ర్యులు అపార దివ్యాశాస్త్ర విశారదులనీ, వారు కౌరవ పక్షాన ఉన్నా రని మరువరాదనీ కూడా ధర్మజుడు హెచ్చరించాడు.

పరిస్థితులు అనుకూలించనిదే ఆవేశపడి ప్రయోజనం ఉండ దనే విషయాన్ని ధర్మజుని మాటలవల్ల గ్రహింపగలిగారు ద్రౌపదీ, భీముడూ, తక్కిన వారూనూ.

పరమ పురుషుణ్ణి శరణాగతి చెంది, ధర్మమనిపించినదానిని ఆచరించడం ధర్మజుని జీవిత సాధన. ఇతరులు ధర్మాన్ని పాటిస్తున్నారా! అధర్మంగా ఉంటున్నారా? అనే దానితో అతనికి ప్రమేయంలేదు. అతనికి రాజ్యమూ, సంపదలూ ముఖ్యంకాదు, ప్రతీకారం అన్న తలంపే లేదు. ద్రౌపది మాటలూ, భీముని మాటలూ హేతుబద్ధమైనవే. సందేహం లేదు. కానీ, హేతువనేది బుద్ధికి సంబంధించినది. ఒకోబుద్ధికి ఒకో

విధమైన హేతువు సమంజస మనిపిస్తుంది. కనుక అంతకు మించినదీ, ప్రమాణతరమైనదీ ధర్మం. ధర్మం హృదయ సంబంధి. దానికి బద్ధుడైన వానిని అదే నడిపిస్తుంది. ఇందుకు నిదర్శనమే 'ధర్మశరీరుడైన' పారాశర్యుని సాక్షాత్కారం.

"వీరు లగు భీష్మకుంభజ
శారద్వతకర్ణు లమితసత్త్వులు వారిం
బోర వధియించు టెంతయు
భారం బనియున్న నీదు భరమెఱిగి మదిన్

"దాని నపనయింపఁగా నిప్డువచ్చితి..."[1] నంటూ ధర్మజునికి ప్రతిస్మృతిని ఉపదేశించి, వెళ్ళిపోయాడు వ్యాసభగవానుడు.

ఈ విధంగా పాలకడలివంటి ధర్మజుని హృదయాన్ని చిలికి, ప్రతిస్మృతీ, తద్వారా పాశుపతమూ సిద్ధించడానికి కారణభూతు లయ్యారు ద్రౌపదీ, భీమసేనుడూను.

అధికార బలంతో అటు కౌరవులూ, ధర్మబలంతో ఇటు పాండవులూ ఎవరిసన్నాహాలు వారు చేసుకొంటూ కదనకుతూహల రాగం ఆలపించసాగారు.



1. ఆరణ్య - 1 - 274, 275

# 7. అడవుల్లో ఇడుములు

ద్రౌపదీసహితంగా పాండవులను అడవులపాలుచేసి దుర్యోధనుడు సఫలీకృతమనోరథుడై తాత్కాలికంగా లబ్ధి పొందినమాట వాస్తవమే కానీ, తనకు తెలియకుండానే తాను పాండవులకు పదమూడేళ్ళ గడువుపెట్టి తనపతనానికి ముహూర్తం పెట్టుకొన్నాడు. పాండవులు వనవాసాన్ని ఒక చక్కని అవకాశంగా గ్రహించి, మహర్షులనుసేవిస్తూ, పుణ్యతీర్థాలను దర్శిస్తూ సత్కాలక్షేపం చేయసాగారు. అర్జునునికి అనేకమైన దివ్యాస్త్రాలూ, పాశుపతమూ సిద్ధించాయి. ధృతరాష్ట్రుడు, పాండవులు అడవుల్లో ఉండికూడా అత్యంత వైభవంతో కీర్తిప్రతిష్ఠలను పొందటం తెలుసుకొని దుఃఖపడసాగాడు. అంతకుముందు దుర్యోధనుడు కర్ణ శకుని దుశ్శాసనులతో మంతనాలాడి, పాండవులను మట్టుబెట్టాలని చూశాడు. కాని ఆ ప్రయత్నం వ్యాసమహర్షి పూనుకోవడంతో విరమించబడింది.[1] ఇప్పుడు తండ్రి దుఃఖానికీ, భయానికీ కారణాలేమిటో తెలుసుకోడానికి శకుని, కర్ణులతో దుర్యోధనుడు మళ్ళీ మంతనాలు సాగించాడు. ఆ సందర్భంగా కర్ణుడు దుర్యోధనునితో

"పాండవులిప్పుడు పరమదుఃఖార్తులగుచు ద్వైతవనసరోవర సమీపంబున నున్నవారని వింటిమి. నీవు సకలసామ్రాజ్యవిభవంబు మెఱసి చని యందు నీ తేజంబు ఘర్మసమయంబునాఁటి తపనుతేజంబై పగతుర కన్నులు గమర నతిదుస్సహం బగునట్లుగాఁ జేయుము... నిన్నుం జూచి పాండవులు హృదయఖేదంబుగా వగచెదరు మిత్రజన మోదంబును శత్రుజనఖేదంబునుంగదా సంపదలకుం దగియెడుఫలంబు" అంటూ తాను సుఖంగా ఉంటూ శత్రువుల ఘనతరదుఃఖాన్ని చూసి ఆనందించడంతో లోకంలో ఏవీ సరికావని పలికాడు. దీనావస్థలోఉన్న

1. ఆరణ్య - 1 - 73 నుంచి 80 వరకు

అర్జునుని రాజ్యవైభవోద్ధారులైన కనుగొనడం కంటె కృతార్థత వేరు లేదని అతడు భావించాడు.

"అతులసౌభాగ్య భోగ సమగ్రమహిమ
నొప్పుచున్న నీదేవుల యొప్ప నూచి
ధృతి దఱిఁగి తన్నుఁదాన నిందించుకొనుచు
హృదయమునఁ బాండవాంగన యెరియ వలదె!"

అని ద్రౌపదిపట్ల తన ద్వేషభావాన్ని మరొకసారి వెల్లడించుకొన్నాడు.[1] దుర్యోధనుడు సంప్రీతుడై తనతలంపుకూడా అదేనని ప్రకటించాడు.

ఘోషయాత్రకు ప్రయత్నాలు సాగిపోయాయి.

సోదరులూ, బంధువులూ, మిత్రులూ సేవిస్తూ ఉంటే, వైభవంతో ప్రియసతులు వేలకొలదిగా వెంటరాగా ఘోషయాత్ర సాగించాడు దుర్యోధనుడు.

---

1. ఆరణ్య - 5 - 347 నుంచి 352 వరకు
ఈ మిత్రద్వయానిది ఎంతదారుణమైన మనస్తత్వం!
కీ.శే. విశ్వనాథవారు ద్రౌపది లావణ్యాన్ని చూసి గాంధారి కోడళ్ళు సామర్షలైరి అన్న నన్నయ మాటకు చేసిన వ్యాఖ్యానంపై "ఆంధ్రమహాభారతములో ద్రౌపదిపాత్ర - సమగ్రపరిశీలనము" కర్త ఇలా విమర్శచేసారు : "సృష్టికర్త యొక్క పక్షపాతమును గురించి లోకమును తిట్టుకొనుట సహజము. అట్లని ఎదుటవారిని మట్టుబెట్టు నంతటి పశుప్రవృత్తి మానవునకుండదు. తీవ్రవాదులకు, మానసికమగు వ్యాధులున్న వారికి తప్ప ఒకరి వైభవమును, సంపదను చూచి వారినంత మొందించు తత్త్వము సాధారణ మైన మానవున కుండదు." (పుట - 254) గాంధారి కోడళ్ళు అందరూ మంచివారే అనుకొందాం. ఇప్పుడీ మిత్రుల ఆలోచన ధోరణిని ఏమనాలి? వారిది పశుప్రవృత్తా? తీవ్రవాదమా? మానసిక వ్యాధా?- ఇవేవీ కావు. వారిని సాధారణ మానవులనుకోవడమే తప్పు. వారంతా అమరాసురాంశ సంభూతులని స్పష్టంగా భారతంలోనే ఉంది. దానిని కల్పన అనుకొంటే దుర్యోధనాదుల ప్రవర్తనకు పైవే కారణాలని చెప్పుకోవలసివస్తుంది. మరి.

కానీ, తానొకటి తలిస్తే, దైవం మరొకటి తలచినట్లుగా వారందరూ ప్రారంభంలోనే గంధర్వులతో గొడవపెట్టుకొని, యుద్ధం చేసి ఓడిపోయారు. చిత్రసేనుడు అనుజ వధూ సహాయాన్వితంగా దుర్యోధనుణ్ణి బంధించి తీసుకొని పోసాగాడు. ధర్మజుని అనుజ్ఞ మేరకు భీమార్జున నకుల సహదేవులు చిత్రసేనుని జయించి దుర్యోధనుణ్ణి విడిపించారు. అప్పుడు ధర్మజుడు వానికట్లు విప్పించి,

"ఎన్నఁడు నిట్టిసాహసము లింక నొనర్పకుమయ్య దుర్జనుం
డన్నన సాహసక్రియల యందుఁ గడంగి నశించుఁ గావునం
గ్రన్నన తమ్ములన్ దొరలఁ గైకొని యిమ్ములఁబొమ్ము వీటికిన్
సన్నుత! దీని కొండొక విషాదముఁ బొందకుమీ మనంబునన్"[1]

అని బుద్ధి చెప్పి పంపించాడు. దుర్యోధనుడు

"ఒవ్వనివారల యెదురన
యివ్విధమున భంగపడితి నేనింక జనుల్
నవ్వఁగనే ట్రిబదుకు గా
నివ్వసుమతి యేలువాఁడ నెట్లు చరింతున్."[2]

అంటూ ప్రాయోపవేశానికి పూనుకొన్నాడు. ఎవరు ఎంతగా చెప్పినా అతడు సమాధానపడలేదు.

బాహ్యేంద్రియ కర్మల్ని వదలి సమాధిస్థితిని పొందిన అతనిని పాతాళలోకవాసులు పిలిపించుకొని, 'నీవు మనుష్యమాత్రుడవు కావు' అని వివరించి, అతని పూర్వజన్మ ప్రకారాన్ని తెలియ జేశారు. యుద్ధంలో పాండవులను తప్పక జయిస్తావని ధైరం చెప్పి ఆశ్వాసించి పంపివేశారు.

---

1. ఆరణ్య - 5 - 434
2. ఆరణ్య - 6 - 16

పాతాళ లోకవాసులు తాము తపస్సు చేసి ఈశ్వరుని వర ప్రసాదంగా అతనిని పొందినట్లూ, అతని పూర్వదేహం అస్త్రశస్త్రాలకు దుర్భేద్యమైన వజ్రశిలాసదృశమనీ, అతనికి సహాయంగా నానావిధ దైత్యదానవ గణాలు భూలోకంలో జన్మించాయనీ తెలిపి, అతని ప్రాయోపవేశ దీక్షను విరమింపజేశారు.

ఈ రీతిని ద్రౌపదీ పాండవుల పట్ల దుర్యోధనునకు గల అసహన భావం వారిని ఏమీ చేయలేకపోయినా దుర్యోధనునికి అతని వంతు పాత్రను అతడు పోషించడానికి తగిన ఆత్మవిశ్వాసాన్ని, ఉత్సాహాన్ని కలిగించ గలిగింది.

ద్రౌపది పంచభర్తృత్వాన్ని తప్పుగా అర్థంచేసుకొని భంగపడినవారిలో సింధుదేశాధీశుడైన జయద్రథుడు ఒకడు. ఈతడు కౌరవుల చెల్లెలైన దుస్సలకు భర్త. కురుసభలో ద్రౌపదీ పరాభవ సందర్భాన దుర్యోధనాదులకు అండగా ఉండి ఆనాటి సంఘటనకు మహదానంద పడ్డాడు. ఘోషయాత్రకనివెళ్ళి దుర్యోధనుడు ఘోరంగా భంగపడి తిరిగిరావడం బహుశః సైంధవునివరకూ వచ్చిఉండదు. కనుకనే ఆతడు ఒకనాడు సాల్వకన్యను చేపట్టటానికి పెండ్లికొడుకై తరలిపోతూ మార్గమధ్యంలో పాండవుల నివాసంలో ఒంటరిగా ఉన్న ద్రౌపదిని చూసి మోహపడ్డాడు. మొదట దూరం నుంచి చూసి, పోల్చుకోలేక ఆమె 'సురోత్తమకన్యయో, యక్షకాంతయో, పన్నగభామయో' అనుకొన్నాడు. ఆమె సౌందర్యం పావక జ్వాలవలె అతని చిత్తాన్ని మండించింది. కోటికాస్యుడనే మిత్రునితో ఆమెకూ తనకూ పొందు కుదర్చవలసిందిగా మొరపెట్టుకున్నాడు. కోటికాస్యుడు ద్రౌపది దగ్గరకు వెళ్ళి ఆమెను గూర్చిన వివరాలు అడిగాడు. తనను పరిచయం చేసుకొని, వచ్చినపని చెప్పాడు.

ద్రౌపది మృదు సంభ్రమంతో ఉత్తరీయాన్ని సంగతం చేసుకొని,

"అన్న! యిచ్చట నేనొంటి యున్నదాన
నీవిచట కేగుదెంచుట నీతియగునె?
సుతవతిని ధర్మవతి నన్ను నితర కాంతఁ
గాఁ దలంచి పెక్కులు వల్కఁగాదు నీకు"[1]

అంటూ తనను గూర్చి చెప్పింది. ధర్మజాదులు వేటకు వెళ్లారనీ, వారు వచ్చేవరకూ ఉండి వారు చేసే సత్కారాలను పొంది వెళ్లవలసిందనీ చెప్పింది.

కోటికాస్యుడు జయద్రథునికి ఆమె పాంచాలకన్య, పాండవ ధర్మపత్ని అని తెలియజేశాడు. అప్పుడు జయద్రథుడు కామాతురుడై ఆమెను అపహరించడానికని కొద్ది మందితో కూడి ఆశ్రమానికి వచ్చాడు. ద్రౌపదిని చూసి,

"వామాక్షి! నీకుఁ గుశలమె?
నీమన సెవ్వారియందు నిత్యప్రేమం
బై మెఱయు నట్టి సొబగులు
నీమగ లేవురకు నిపుడు నెమ్మదియె మదిన్?"[2]

అని ప్రశ్నించాడు.

పాండవులను 'సొబగులు' (=విటులు) అనడం ద్రౌపది గమనించింది. సమాధానంగా,

"స్థిరమతులైన పార్థులకు సేమమ నీకు ననామయంబె? భూ
వర! తగు విందవై తి కురుముఖ్యుల యింటికి నట్లు గావునం
బరువడి నాసనక్రియయుఁ బాద్యముఁ గైకొను మాదరంబుతో
సరసకురంగ మాంసములఁజల్పుము భోజనకృత్య మిత్తఱిన్.

1. ఆరణ్య - 6 - 156
2. ఆరణ్య - 6 - 160

"వేట వోయినారు విభు లిప్డువత్తురు
వారు వచ్చునీకు వలయునట్టి
ప్రియము లాచరింపఁ బ్రీతుండ వై మఱి
యిష్టజనులు నీవు నేఁగు మనఘ!"[1]

అని గృహిణీధర్మాన్ని చక్కగా పాటిస్తూ, ఎంతో ధీరంగాను, గంభీరంగాను పలికింది.

పాండవులను "స్థిర మతులు", అనడం "నీకు ననామయంబె?" (ఏరోగమూ శోక లేదుగదా?) అని అడగడం పట్టించుకొనే స్థితిలోనే లేడు సైంధవుడు. వివేక హీనుడై, తనడెందం మన్మథాస్త్రలతో బాధపడి ఉన్నదనీ, తనను కృతార్థుణ్ణి చేస్తూ రథమెక్కి తనతో రావలసిందనీ ఆమెను కోరాడు. రాజ్యం కోల్పోయి, సాటివారందరూ నవ్వేటట్లుగా అడవుల్లో అనేక కష్టాలు అనుభవిస్తూన్న పాండవులను సేవించడంలో సుఖంలేదనీ, ఆమె బేల కనుక వారితో ఉంటున్నదనీ, కాముకులైనవారు శ్రీ విహీనులను ఎంతమాత్రమూ ఇష్టపడరని చెప్పాడు. తనను చేరి భోగాలు అనుభవించవలసిందని కోరాడు.

ద్రౌపది అతని మాటలకు కలతపడింది. భర్తల రాకను నిరీక్షిస్తూ అతనితో సంభాషించింది. బంధుత్వాన్ని గుర్తుచేసి, 'నీవు నాకు తోబుట్టువవు. నీతిమాలిన ఇలాంటి మాటలు మాట్లాడకు,' అని వారించింది.

సైంధవుడు రాజధర్మం ప్రకారం రాజులకు స్త్రీల పట్ల వావి వరుసలతో పనిలేదనీ, స్త్రీలు భోగవిషయంలో అందరికీ చెందుతారనీ నోటికి వచ్చినట్లుగా ప్రేలాడు.

---

1. ఆరణ్య - 6 - 162, 163

ప్రియ వచనాలతో ఇంక లాభంలేదనీ, పరుషంగా మంద లిస్తేగానీ వాడుదారికి రాడనీ తెలుసుకొని ఆ ప్రకారంగా అతనిని హెచ్చరించింది. ' చేటుకాలం రాబట్టే నీకిలాంటి బుద్ధి పుట్టినట్లున్నది' అని బెదిరించింది.

ఆమెమాటలను సైంధవుడు లక్ష్యపెట్టలేదు. నవ్వుతూ, "పాండవులు నేనెరుగనివారా? పిరికి వారినివలె నన్ను ఎందుకు భయ పెడదామని చూస్తావు? నన్ను ఇతరరాజులవంటి వాణ్ణిగా తలంచకు. వెంటనేవచ్చి ఆ కనకరథాన్నో, మహాగజాన్నో అధిరోహించు, పోదాం" అంటూ తొందర చేశాడు.

అప్పుడు ద్రౌపది "వీరపత్నిని, వీరసహోదరిని అయిననేను నీకు దిక్కులేనిదానిలా కనిపిస్తున్నాను కాబోలు" అంటూ, కృష్ణుని అండను, భీమార్జునుల పరాక్రమాలను వర్ణించి, "వారు నీవు చేసిన దానికి దారుణమైన ప్రతీకారం చేస్తూంటే నాకు దిక్కు ఉన్నదో, లేదో అప్పుడు నీకు బోధపడుతుందిలే. నీవు ఇతర స్త్రీలను వలె నన్ను అవమానించలేవు. నా పావన పాతివ్రత్య మహిమవల్ల ఎప్పుడూ ఎక్కడా నన్ను ఏకీడూ పొందదు." అని పలికింది.

ఆ దురాత్ముడు ఆమెను పట్టబోయాడు. ఆమె తమ పురో హితుడైన ధౌమ్యులవారిని ఉద్దేశించి ఆక్రోశించింది. ధౌమ్యుడు వచ్చి వారిస్తున్నా వినక, జయద్రథుడు ఒకసారి ద్రౌపదిదెబ్బకు గాలికి నేల కూలే చెట్టులా క్రిందపడి, పైకి లేచి, ఆమెను ఎత్తి రథంపై పెట్టుకొని పోసాగాడు.

పాండవులు వేటనుంచి తిరిగివస్తూ, పరిచారికవల్ల విషయం తెలుసుకొని సైంధవుణ్ణి వెంబడించారు. పాండవులకూ, సైంధవునితో ఉన్న సేనలకూ పెద్దయుద్ధం జరిగింది. సైంధవుడు ఓడిపోయి ద్రౌపదిని వదిలిపెట్టి పారిపోయాడు. భీమార్జునులు వానివెంట వెడుతూ ఉండగా

ధర్మరాజు తమకు చెల్లెలైన దుస్సలను తలచి ఆ సైంధవుణ్ణి చంపవద్దని చెప్పాడు. ద్రౌపదిమాత్రం వానిపట్ల దయ చూపించవద్దని, వానిని చంపి, తనకు ఆనందం కలిగించమనీ కోరింది.

భీమార్జునులు సైంధవుణ్ణి పట్టుకొని చావగొట్టారు. భీముడు చంపబోతూండగా అర్జునుడు వారించాడు. వాని శిరస్సును వికృతంగాచేసి, వానిచే 'పాండవదాసుడను' అనిపించి, తీసుకువచ్చి ధర్మజుని పాదాలపై పడవేశారు.

ద్రౌపది వానివేషం చూసి నవ్వి "ఈ పాపాత్ముడు మీదాసుడయ్యాడు కనుక మరింక వదిలివేయండి" అనిచెప్పి విడిపించింది.

వాడు ధర్మరాజుకూ, చేరవచ్చిన మునులకూ నమస్కరించాడు. అప్పుడు ధర్మరాజు

"ఎట్టికష్టుం డైననిట్టి పాపము సేయ
నెత్తికొనునె ధరణినీవు దక్క?
నరుగు మింక నేమియందుము నిన్ను నిం
ద్రియవిలోలు నల్ప ధృతివిహీను

"ఇంక నెవ్వారికి నిట్టి కొఱగాములు సేయక బుద్ధిమంతుండ వయి యుండుము"[1] అని బుద్ధిచెప్పి పంపించి వేశాడు.

ధర్మరాజు దుర్యోధనుని మందలించినట్లుగానే సైంధవుణ్ణీ మందలించాడు. ఇలాంటిసాహసాలు మళ్లీ చేయవద్దని సలహాలు ఇచ్చాడుకూడా.

కాని అప్పుడు దుర్యోధనుడూ వినిపించుకోలేదు. ఇప్పుడు సైంధవుడూ వినిపించుకోలేదు. గంగాతీరానికి పోయి, శివునిగురించి ఉగ్రమైన తపస్సుచేసి, అర్జునుడు మినహాగా తక్కిన పాండవులను

1. ఆరణ్య - 6 - 252, 253

ఒకనాటి యుద్ధంలో జయించగలిగే వరాన్ని పొందాడు. ఈ వరప్రభావాన యుద్ధంలో పద్మవ్యూహంలో ప్రవేశించి, ఒంటరిగా పోరుతున్న అభిమన్యుణ్ణి ఆదుకోబోయిన ధర్మజాదులను అతడు అడ్డుకొని ఆపగలిగాడు. అది అభిమన్యువధకూ, తద్వారా అర్జునునిచే సైంధవుడు చంపబడటానికీ దారితీసింది.

వెనుకాముందూ చూసుకోకుండా కేవలం కామంతో కళ్లు మూసుకుపోయి ప్రవర్తించిన జయద్రథుని ప్రయత్నంవల్ల ఫల్గునుడు సర్వజగదజయ్యవిక్రముడనీ, అఖిలేశ్వరుడైన విష్ణువతనికి ప్రియసఖుడై ఉండగా శివునికికూడా అతనినిజయించడంసాధ్యపడదనీలోకానికి తెలిసింది.

ద్రౌపదికిమాత్రం అడవుల్లోఉన్నా ఆపదలు తప్పలేదు. ఇందుకు ధర్మరాజుకూడా ఎంతగానో బాధపడ్డాడు. మార్కండేయమహర్షిని

"ద్రుపదనందనక్రియఁ గడు దుఃఖపడిన
నృపవధూటియు నాయట్ల నియతశోక
వనధి నిర్మగ్నఁ డైన భూవరసుతుండుఁ
గలఁడె వినఁ జూడ ననఘ యెక్కాలమునను"[1]

అని అడిగాడు.

"రఘురామునితో పోలిస్తే నీవు అనుభవించింది ఎంత?" అంటూ ఆమహర్షి సీతారాములకథను వినిపించి, ఓదార్చాడు.

మహత్తరమైన సీతాచరితం వినడంతోనే ధర్మజునికి పతిభక్తితత్పరురాలైన పుణ్యసతి చరిత్ర వినాలనిపించింది. మార్కండేయుడు అతనికి సావిత్రి చరిత్రను వివరించి,

"ఆపతివ్రతయట్ల యీయాజ్ఞసేని
పరమకల్యాణి ధర్మసంభావనీయ
యధిప! మిమ్మును వీరాయఖిలాన్వయంబు
నుద్ధరించు మహాభాగ్యయుక్తిఁ జేసి"[2]

అంటూ ద్రౌపదీమాహాత్మ్యాన్ని శ్లాఘించి, సెలవు తీసుకొన్నాడు.

1. అరణ్య - 6 - 263 2. అరణ్య - 7 - 279

## 8. అజ్ఞాతంలో అవస్థలు

అరణ్యవాసం పూర్తి కావస్తూండగా యక్షరూపాన యము డడిగిన ప్రశ్నలకు అన్నింటికీ తగినట్లుగా సమాధానం చెప్పి, మెప్పించి, ధర్మరాజు వరం పొందాడు. ఆ వరప్రభావాన పాండవులూ, ద్రౌపదీ ఎవరెవరు ఎక్కడ ఏయేరూపాలతో ఉండాలనుకొంటే వారివారికి ఆయా రూపాలు సిద్ధిస్తాయి. వాళ్ళు ఎలా ఉన్నప్పటికీ ఎవ్వరూ వారిని గుర్తించలేరు.

ఆ తరువాత ధర్మజుడు తనవద్దగల పరిజనాన్ని, బ్రాహ్మణులను పంపివేసి, ధౌమ్యుడూ, ద్రౌపదీ, తమ్ములతో కలిసి ముందుకు సాగిపోయాడు. ఒకచోట ఆగి ఆ రాత్రిగడిపి, ఉదయాన్నే అర్జునునితో ఇలా అన్నాడు :

"మన మొకయేవురము మీాయం
గనయుం దో నరుగుదేరఁగా నెయ్యెడఁబో
యిన నెఱుఁగ కుండుదు రె యి
ద్దినములు గడపంగ నెద్ది దెఱుఁగయ్యెడినో"1

ఈ మాటల్లో ద్రౌపదితో కూడి పాండవులయిదుగురూ అజ్ఞాతవాసం చేయడంలోని జటిలత వ్యక్తమవుతోంది. వారందరూ 'మహితసముజ్జ్వలాకృతులు, మానధనులు.' వారికి అంగనతోడు!

అర్జునుడు "ధర్మదేవత ఇచ్చినవరం ఉండగా మనం ఎక్కడ ఎలావర్తించినా ఎవ్వరూ కనిపెట్టలేరు. పాంచాల, చేది, మత్స్య, సాల్వ, విదేహ, బాహ్లీక, దశార్ణ, శూరసేన, కళింగ, మగధదేశాల్లో ఎక్కడైనా మనం ఉండవచ్చు." అన్నాడు.

మత్స్యదేశం అన్నివిధాలుగా తగినదిగా నిర్ణయించి,

2. విరాట - 1 - 59

పాండవులు ఒక్కొక్కరొక్కరే ఎవరెవరు ఎలా గడుపుదా మనుకొంటు న్నారో చెప్పకున్నారు. ద్రౌపదివంతు వచ్చింది. ఆమె ఎంతటి సుకుమారో, ఎంత సున్నిత మనస్కురాలో, ఎంతటి ఉదాత్తచిత్తం కలదో ఎరిగిన ధర్మజుడు ఆమె పరులను సేవించి సంవత్సరంపాటు గడప గలదా? అని ఆందోళన చెందాడు. సేవలుగొనుటయే గాని సేవించడం తెలియని ఔన్నత్యం ఆమెది.

అయితే, ద్రౌపది ధర్మజుని కలతను తొలగిస్తూ ఇలా అంది:

"సైరంధ్రీ వేషంబునఁ
జేరుదు నంతఃపురంబు చెంతకు నన్నా
భూరమణుదేవి యెంతయు
గారవమునఁ బిలువనంపఁగా వినయమునన్"

"కని కొలువుసేసికొని మా
లిని నాఁజని సాధ్వియిది మలీమసవృత్తం
బున పొంతఁ బోవ దెన్నఁడు
నను బ్రేకఁదనంబు దోఁచునట్లు చరింతున్"1

భర్తలు ఎవరికివారుగా ఎంతసులభంగా తమతమ పాత్రలను, కర్తవ్యాలను నిర్ణయించుకొన్నారో అంతసులువుగానూ ద్రౌపది తన పాత్రను, కర్తవ్యాన్ని నిర్ణయించుకొంది. ఆమెకు బృహదశ్వమహర్షి వినిపించిన దమయంతి వృత్తాంతం ఈ సందర్భంగా కొంతవరకూ మార్గ దర్శకమై ఉంటుంది. దమయంతి కూడా భర్తను ఎడబాసి సుబాహు పురం చేరి, రాజమాతచే ఆదరించబడి సైరంధ్రిగానే కాలంగడిపింది.

ఆమె మాటలకు హెచ్చరిస్తున్నట్లుగా ధర్మజుడు ఇలా అన్నాడు :

---

1. విరాట - 1 - 105, 106

"మనవంశంబునవృత్తం
బును బెంపును గానఁజాలుపుణ్యసతివి దు
ర్జను లగుతులువలతలఁపులు
గనుఁగొని యేమఱక మెలఁగఁగా వలయుఁజూమీ."[1]

సైంధవుని దురాగతాన్ని, అజ్ఞాతవాసంలోని క్లిష్టతను, సేవావృత్తిలోని లఘుత్వాన్నీ దృష్టిలో పెట్టుకొని ఎంతో దూరదృష్టితో ధర్మరాజు ఈమాటలు చెప్పాడు.

కానీ, ద్రౌపది 'అనాదమందస్మితసుందరవదనారవిందం'తో ఇలాబదులు చెప్పింది:

"ఆరయ నెందును గౌరవ
భారం బెడలంగ నీక పాతివ్రత్యా
చారముమై వర్తింతురు
సైరంధ్రీజాతివారు సౌజన్యమునన్"

"కావున నుచితము లగు నా
కావెంటం గొలిచి తిరుగునప్పుడు మితభా
షావిరచనమును వ్రతసం
భావనమును గౌరవంబుఁ బాపభయంబున్"[2]

ఆమె అనాదరమందస్మితానికి కారణం ఆమె పాతివ్రత్యముపై ఆమెకుగల ప్రత్యయం. నీచమైన సేవావృత్తివల్ల తాత్కాలికంగానైనా నీచప్రవృత్తి కలిగే అవకాశంఉన్నది. సైరంధ్రీజాతివారు అందరిసేవకుల వంటివారు కారు. మితభాషణమూ, వ్రతదీక్షా. గౌరవమూ, పాపభీతీ కలిగి, వ్యక్తిత్వానికి భంగంకలగని విధంగా పాతివ్రత్యంతో మెలగటం సైరంధ్రుల లక్షణం. వారు అంతఃపురాల్లోనే పరపురుషులకంట పడ

1. విరాట - 1 - 110 2. విరాట - 1 - 112, 113

కుండా ఉంటారు. కనుక ఏ విధమైన ప్రమాదమూ ఎదురయ్యే అవ కాశం లేదని ద్రౌపది ఉద్దేశం.

పాండవులు తమ ఆయుధాలను శమీవృక్షంపై భద్రపరచి, ఒకరి తరువాత ఒకరుగా విరటుని కొలువులో ప్రవేశించారు.

ద్రౌపది సైరంధ్రీ వేషంతో, పరిచారికననే భావాన్ని ప్రకటితం చేస్తూ విరాటనగరం ప్రవేశించింది. ఆమె రాచవీథిలో వెడు తూఉంటే పురజనులందరూ ఆమె అపురూప సౌందర్యానికి ఆశ్చర్య పడుతూ, ఆమె చుట్టూ చేరి, ,,నీవెవరివి? ఏపనికై ఎక్కడికి పోతున్నా వు?'' అంటూ అడుగసాగారు. ఆమె తాను గట్టువాలుదాననని, ఎవరు తనకు తిండీ, బట్టా ఇచ్చి పోషిస్తే వారికి సేవలు చేస్తాననీ చెప్పింది. ఆమె మాటలకు ఆశ్చర్యం, సదేహం పొందినవారై జనులంతా "ఇంతటి ఆమె కడుపుకూటికి ఎక్కడైనా ఉంటానంటోంది, ఇదెక్కడి మాట?" అనుకొంటూ ఆమెతో పాటు సాగుతున్నారు. ఆసన్నివేశాన్ని విరాటరాజపత్ని అయిన సుదేష్ణ క్రీడామందిరంనుంచి చూసింది. ద్రౌపది రూపానికీ, చెబుతున్న మాటలకూ ఎంతో కుతూహలపడి, ప్రౌఢాంగనలను పంపి, ఆమెను అంతఃపురానికి పిలిపించింది.

ద్రౌపది 'వినయ వైభవము సతీతను వొందిన చందంబున' అంతఃపురాన్ని చేరింది. ఆమె ఆ ఇంట అడుగుపెడుతూ ఉంటే ఆ ఇంటికే ఒక నూతనమైనశోభ కలిగి నట్లయింది.

సుదేష్ణ ఎంతో ఆదరంతో దగ్గరకు పిలిచి వివరాలడిగింది.

''నేను సైరంధ్రీజాతి దానను. నాపేరు మాలిని. నాకు అయిదుగురు భర్తలు. ఒక కారణాన శత్రువులచే పతులసన్నిధినే తల పట్టి ఈడ్వబడి, అడవులకువెళ్ళి, భర్తలతో కందమూలాలు తింటూ, బ్రహ్మచర్య వ్రతాన్ని పాటిస్తూ గడిపాను. ఇంకొక్క సంవత్సరం

నియమాచరణం చేయవలసి ఉంది. నీవు ధర్మవర్తివని విని, నిన్ను సేవిస్తూ, నీదగ్గర ఉందామని వచ్చాను." అని ద్రౌపది ఎంతో వినయంగా తననుగూర్చి చెప్పుకొంది. తాను మొదట కొంతకాలం సత్యభామ దగ్గరా, తరువాత పాంచాలి దగ్గరా పనిచేశానని చెప్పింది. ద్రౌపది తనకు ప్రాణానికి ప్రాణమై తనను ఆమెగానే భావించి, గౌరవించేదని పలికింది. ఇంకా,

"నీచము లయ్యెడు పనులకు
నాచాలమి యెఱిఁగి మన్ననకుఁ బాత్రముగా
నీ చిత్తంబునఁ గైకొని
యాచారము దప్పకుండ నరయుము నన్నన్"[1]

అని కోరింది. తాను కలపములు కూర్చడంలోను, తిలకాలు దిద్దటంలోను, వింతవింతలుగా పూలమాలలు కట్టడంలోను, కురులు దిద్దడంలోను, దండలు గుచ్చడంలోను నేర్పరినని చెప్పుకొంది.

ద్రౌపది రూపానికీ, మాటలకూ పొంతన లేకపోవటానికి సుదేష్ణ ఎంతగానో ఆశ్చర్యపడింది. అసాధారణమైన సౌందర్యంగల ఆమెను సైరంధ్రిగా అంగీకరించడానికి తటపటాయించింది. "నీ రూపం చూసి మారాజు ఉవ్విళ్ళూరుతాడు. ఇలాంటి నిన్ను నేనెలా పనిగొంటాను? ఆడవాళ్ళే నిన్నుచూసి దృష్టిమరల్చుకోలేక పోతున్నారు కదా, కర్కటి గర్భం ధరించినట్లుగా దుర్భరమైన నిన్ను స్వీకరించి, నా వినాశనాన్ని నన్నే కొనితెచ్చుకోమంటావా?" అని అడిగింది. సుదేష్ణ మనసులోని మాటను మరుగు లేకుండా అడిగింది.

ద్రౌపది ఆమె మాటలకు అంగీకరించలేదు. 'నీవు అనుకొంటున్నది సరికాదు, నే చెబుతాను విను' అంటూ 'నాభర్తలు వేరవు,

1. విరాట - 1 - 318

లావు, విక్రమమూగల గంధర్వులు; నన్నెప్పుడూ ఏమరచి ఉండరు; నన్ను నీచబుద్ధితో చూసేవాడు ఎంతటి బలవంతుడైనా సరే, హరిహరాదులు వచ్చి అడ్డుకొన్నా సరే, లెక్కచేయక రాత్రికి రాత్రే మట్టుపెడతార"ని చెప్పింది. అనుమానం మాని, తనను సైరంధ్రిగా స్వీకరించి, తనసేవలు పొందవలసిందని చెప్పింది. తనను కుత్సితమైన పనులకు నియోగింపక, ఎంగిలికి లోనుచేయక తగిన మన్ననతో సంరక్షించే వారిపట్ల తన పతులు అనురాగాన్ని కలిగిఉంటారని చెప్పింది.

సుదేష్ణ సమాధానపడి సైరంధ్రిని అంతఃపురంలో చేర్చుకొంది.

ద్రౌపదికీ సుదేష్ణకూ శీలసంపద (Stature) లో ఎంతో అంతరం ఉంది. సుదేష్ణ మాటలనుబట్టి ఆమె హృదయ సంస్కారాన్ని, పరిమిత బుద్ధిని క్షణాల్లో ఆకళించుకో గలిగింది ద్రౌపది. కనుకనే

"నాచిత్తము తాదృశులకు
గోచరమే యస్మదీయకులజన సంశీ
లాచారమహిమ యట్టిది
యే చెప్పకు తద్విధాతిహీనవచనముల్."

"మనమున నూఅడిల్లు మనుమానము మానుము నన్ను నేలుము..."[1] అంటూ సుదేష్ణకు బదులు చెప్పే అవకాశంకూడా ఇవ్వకుండా తానే నిర్ణయంచేసి ఆమెను అంగీకరింపజేసింది. వాస్తవానికి ద్రౌపదివంటి ఉన్నతమైన వ్యక్తిత్వంగల స్త్రీని పరిచారికగా భరించడమనేది సుదేష్ణవంటి ప్రకృతి మానవభామినులకు కష్టసాధ్యమైన విషయం. అవసరంకొద్దీ ద్రౌపది తానుగా ఆశ్రయాన్ని కోరివచ్చి సైరంధ్రిగా ఉండటానికి అంగీకరించింది కనుక సరిపోయింది.

మాలినిగా అంతఃపురంలో మసులుతూ, సుదేష్ణ పనులను

1. విరాట - 1 - 59

ఆమె కనుసన్నలలోనే గ్రహించి నెరవేరుస్తూ, ఎంతో ప్రయాసతో ద్రౌపది కాలం గడుపసాగింది. ఆమె ఎంతటి ప్రయాసలకు లోనైనదో భీమునితో ఆమె చెప్పుకున్న ఈ క్రింది మాటలనుబట్టి గ్రహించవచ్చు.

"ఒల్లరు రాజుదేవ్రులును నొడ్డులు రాచిన చందనంబు మే
నెల్లఁ జెమర్పఁగా నలయకేను శ్రమంపడి నిల్చినిల్చి య
ల్లల్లన మార్దవం బొనరునట్లుగ నెట్టకునేని రాచి మీ
తల్లికి భక్తిఁబెట్టెడు విధంబునఁ బెట్టుదు బ్రహ్మఁ దిట్టుదున్."

"నున్నఁదనంబుగా నలుఁగు నూరియుఁ జందనమట్లు రాచియుం
బన్నుగఁ గ్రొత్తలైన కలపంబులు గూర్చియు నాసుదేష్ణకుం
గన్నుల సన్నలం బనులు గైకొని వారక చేయుచుండుటన్
మున్నటు లున్నపాణితలముల్ బలుగాయలు గాచెఁజూచితే"[1]

"పని పంపఁగాని యొకతకుఁ బనిసేయ నెఱుంగ"ని[2] ఆ సుకుమారి పాపం ఉదరపోషణకై ఎంతటి నికృష్టమైన అవస్థను పొందవలసి వచ్చిందోగదా!

ఇవిఅన్నీ ఒక ఎత్తు, ద్రౌపదికి కీచకుని వల్ల కలిగిన భంగపాటు ఒక్కటీ ఒక ఎత్తు.

ద్రౌపదీరూపమనే ఉరి తగిలి హృదయ మనేమృగం పరితాపం చెందగా, కాము డనే వేటగాని బారిపడి కీచకుడు 'రాగసాగర పూరనిర్మగ్నుఁ' డయ్యాడు. సుదేష్ణ ఎంతగా వారించినా వాడు లెక్క చేయలేదు. తమకంతో ద్రౌపది వెంటపడి, తన అభిలాషను తెలియజేశాడు. "నీవు ఒక్కక్షణం అనాదరం చేశావో మన్మథుడు మరినన్ను బ్రతుక నివ్వడు" అని మొరపెట్టుకున్నాడు.

ద్రౌపది కోపాన్ని దిగమ్రింగుకొని, ఉపాయంతో తప్పించుకోవాలిగాని, తొందరపాటు పనికిరాదని గ్రహించి, ఇలా అంది:

---

1. విరాట - 2 - 220, 221 2. విరాట - 2 - 219

" నాయున్నకోమదలంపవ
యీ యెడ లీ చీర యిట్టి యేవపుఁజందం
బోయన్న మదనవికృతిం
జేయు ననుట యెంతయును నిషిద్ధము గాదే.

" చనునె యిమ్మాటలాడ సజ్జనులకాఁడుఁ
బుట్టువులతోడ నీవును బుట్టినాఁడ
వట్లుఁగాకయు హీనవంశాభిజాత
నైన పతిపత్ని నగునన్ను నడుగఁ దగునె?"1

తనస్థితి ఏమాత్రమూ మదనవికారం కలిగించేది కాదనీ, సైరంధ్రి జాతికి చెందిన, భర్తలుకలిగిన దనను ఆదృష్టితో చూడడం తగదనీ ఆమెమాటల సారాంశం.

కామశాస్త్రపారంగతుడైన ఆ నీచకీచకుడు ఆమె మాటలతో ఏకీభవించలేదు. ఆమె రుచిరమూర్తిని వర్ణించి,

"నీవు దుర్జాతి గామికి నీవ సాక్షి
పరసతిసంగమున వచ్చుపాపమునకు
నోరుతునుగాని సైరింపనోపఁబచ్చ
విలుతు తూపుల తాఁకున కలరుఁబోఁడి"2

అని ఆమెకు తనమదన తాపాన్ని విన్నవించుకొన్నాడు. పరసతీసంగమ పాపాన్నయినా సహిస్తాడటగాని మన్మథబాణాల తాకిడినిమాత్రం తట్టుకోలేడట పాపం!

ద్రౌపది కోపంతో తనగంధర్వ పతుల పరాక్రమాన్ని వర్ణించి, వారు నీమానప్రాణాలు తీయడం తథ్యం అని జంకించింది.

1. విరాట - 2 - 49, 50 2. విరాట - 2 - 53

ఆమె ఆశించినట్లుగా వాడు మెత్తబడలేదు. "నీభర్తలేకాదు ముల్లోకాల్లో ఎవ్వడూ నాబాహుబలానికి నిలబడలేడు" అనిగర్వంగా పలికాడు.

ద్రౌపది అందనిమ్రానిపండ్లకు ఆశించడం మంచిదికాదనీ, రావణాదుల్లా చెడిపోతావనీ ధిక్కరించి పలికింది.

కీచకుడు తిన్నగా అప్పగారిదగ్గరకు పోయాడు. తనమనస్సు సైరంధ్రివలన ఆరాటపడుతోందని చెప్పాడు. సుదేష్ణ "నిన్ను ఆసక్తితో కొలిచేస్త్రీ లెందరో ఉండగా 'నీరసాకార సైరంధ్రిఁగోరదగునె?" అని నచ్చచెప్పబోయింది. కీచకుడు ఆమె మాటలను అనాదరించి, సైరంధ్రి వంటిసౌందర్యవతి స్వర్గంలో కూడా ఉండదని వర్ణిస్తూ, ఆమెను ఏ ఉపాయంతో అయినా సరే తనవద్దకు చేర్చకపోతే తాను మన్మథతాపానికి నశించి పోతానని చెప్పాడు.

సుదేష్ణ పరసతీసంగం ప్రాణాంతకమనీ, సైరంధ్రికి బలవిక్రమసంపన్నులైనపతులు అయిదుగురు ఉన్నారనీ, కనుక ఆమె జోలికి పోవద్దనీచెప్పింది.

కీచకుడు తాను తనభుజబలముతో సైరంధ్రిభర్తలను చంపగలననీ, కనుక తనకు బుద్ధులు చెప్పడంమాని ఎలాగైనా సరే ఆమెను తన దగ్గరకు పంపవలసిందనీకోరాడు.

సుదేష్ణ మాటలవల్ల మరింక ప్రయోజనం ఉండదని గ్రహించింది. 'సైరంధ్రిని పంపకపోతే విరహంతోను, పంపితే గంధర్వులవల్లనూ ఏదోవిధంగా వీడికి చావు తప్పదు' అని నిర్ణయించుకొంది. గత్యంతరం లేక ద్రౌపదిని వాడు కోరిన ప్రకారం పంపటానికి నిశ్చయించుకొంది. "మదిరకని ఆమెను ఏదో సమయంలో నీ నివాసానికి పంపుతాను, నీ ఆసక్తి తీరేలా ఆమెతో సుఖించు" అని చెప్పి వానిని పంపివేసింది.

వాడు తన నివాసానికిపోయి, ఆనందంతో ద్రౌపదిని గూర్చి ఊహించుకొంటూ, ఆమె రాకకై ఎదురుచూడసాగాడు.

సుదేష్ణ మాలినిని రావించి, తనకు ఎంతో దాహంగా ఉన్నదనీ, కీచకుని భవనానికి వెళ్ళి రుచికరమైన వారుణిని వెంటనే తీసుకొని రావలసిందిదనీ చెప్పింది.

ద్రౌపది లోలోపల ఎంతగానో తల్లడిల్లిపోయింది. వెళ్ళనూ అనడానికి లేదు — వెళ్ళటానికీ లేదు — ఎలాగబయటపడటమా అని ఆమె కొట్టుమిట్టాడింది. ఆఖరికి,

"ఉత్పలగంధి! నన్నుఁ దగు మొప్లను బంపుము కల్లుదేర నే
సత్పథవృత్తి నీకడన సంతతమున్ బహుమానపాత్రనై
తత్పరతం జరించి యుచితంపుఁ బనుల్ దగఁ జేయఁగాక దు
ష్కృత్పరివార యోగ్యపరిచారము మైఁ జనునట్టిదాననే?"[1]

అని బ్రతిమలాడింది. "నేను నా భర్తలు ఎదుట లేకుండాకూడా ఓదార్పుతో ఇక్కడ ఉండగలుగుతున్నానంటే నీ గృహం అతి నిర్మలమైన చరిత్రతో కూడినదనే కదా! సాధువులు దుష్టుల బారిపడి బాధ పడకుండా పెద్దలైనవారు కాపాడాలి. నమ్ముకొన్న వారిని అపాయానికి లోనుచేస్తే అప్రతిష్ఠ రాదా? ఎవరింటికో ఏదో తెమ్మని నన్ను పంపడం భావ్యం కాదు. నీచములైన పనులు నాకు చెప్పవద్దని నీకు ఆనాడే చెప్పాను కదా!" అంటూ తప్పించుకోవాలని చూసింది.

సుదేష్ణకు తనది తప్పని తెలుసు. కాని తమ్ముని తలుచుకొంటే మార్గాంతరం కనపడటం లేదు. అందువల్ల "నేను ఎంతో వేడుకపడి చిన్న పనిచెబితే దానికి ఇంతగా నీవు 'రొష్టు' పడుతున్నావు. అది మా తమ్ముని ఇల్లు కాని పైవారిదా? నీ గురించి అందరికీ ఎంతో గొప్పగా చెబుతూ ఉంటాను, అక్కడ నిన్ను ఎరుగని వారెవరు?" అంటూ నిష్ఠూరాలాడింది.

---

1. విరాట - 2 - 93

ఆమెతో వాదించి లాభం లేదని నిశ్చయించుకొని, ద్రౌపది ఆమె చెప్పిన పనికి అంగీకరించి బయలుదేరింది. కీచకుడు తనతో పలికిన మాటలు, సుదేష్ణ తనను ఈ పనికి నియోగించిన తీరూ తలచుకొని బాధపడుతూ పరిపరి విధాల భావించి, చివరికి హృదయాన్ని కూడదీసుకొని, 'నన్ను స్పృశించడం ఎవరితరం?' అని ధైర్యం వహించింది. ఆపదలకు అన్నింటికీ హరిస్మరణమే పరిహారణమని తన హృదయంలో పుండరీకాక్షుని నిక్షేపించుకొని బయలుదేరింది. సూర్యభగవానునికి వినయంగా ప్రణమిల్లి తనలో

"పాండుపుత్త్రులకేను దప్పని మనంబు
గలుగుదాననయేని నో కమలమిత్త్ర!
కీచకునిదెస న న్నొక కీడు తెరువు
వొరయకుండంగ రక్షింపు కరుణతోడ"[1]

అని ప్రార్థించింది. సూర్యుడు ఆమె రక్షణకు అదృశ్యాకారుడై ఉండే ఒక రాక్షసుణ్ణి పంపాడు.

ద్రౌపది బెబ్బులి ఉన్న పొదలోనికి లేడి ప్రవేశించినట్లుగా కీచకుని మందిరం ప్రవేశించింది. ఆమెనుచూసి కీచకుడు మదనాతురుడై ఏమేమో మాట్లాడాడు. ద్రౌపది తాను వచ్చిన పని చెప్పింది. వాడు "దేవి దాహాన్ని తీర్చబూనావు, ఆమె తమ్ముడనయిన నా దాహాన్ని కూడా తీర్చడం నీకు ధర్మం కాదా!" అంటూ, అంతకంతకూ అధికమయిన తమకంతో ఒళ్ళుమరచిపోయి, పైబడి ఆమెను పట్టుకున్నాడు. ద్రౌపది రాక్షస బలంతో విదిల్చి వానిని పడవేసి, అక్కడనుంచి బయటపడింది. కీచకుడు ఆమె వెంటపడ్డాడు. భయభ్రాంతురాలై ఎటుపోవడమా? అని తటపటాయించి, దైవవశాన విరాటుడు కొలువు తీరి ఉండటంతో సభలోనికి ప్రవేశించింది. కామాయత్తచిత్తుడూ,

1. విరాట - 2 - 108

గర్వోన్నతుడూ అయిన కీచకుడు జనసమూహాన్ని లక్ష్యపెట్టక, కోపంతో ఆమె తలపట్టుకొని లాగి, జంకూ, గొంకూ లేకుండా అందరిఎదుటా ఆమెను ఒక్కతాపు తన్నాడు. అదృశ్యరూపుడుగా ఉన్న రాక్షసుడు అతనిని పడగొట్టాడు. కీచకుడు లేచి, ఆమెను చేరబోయి, చేరలేక, కోపంతో నిట్టూరుస్తూ ఉండిపోయాడు.

సహింపశక్యంకాని మనోవల్లభ అవమానమూ, సింహబలుని మదవిజృంభణమూ చూసి భీముడు కోపంతో ఊగిపోయాడు. ఒక్క పెట్టున కీచకుణ్ణీ, అతనికి లోబడిఉండే విరాటునీ మట్టుపెట్టడానికి సన్నద్ధుడు అయి, ధర్మజుని మొహంకేసి చూశాడు. ధర్మరాజు ఆతనిని తనచూపులతోను, గూఢభాషణంతోను వారించాడు. దానిని గమనించిన ద్రౌపది నిదానంగా లేచి, విరాటునితో చెబుతున్నట్లుగా ఇలా చెప్పింది:

"ధర్మజ్ఞులూ, శిష్టరక్షకులూ, అయిన నా గంధర్వపతులు నన్నిలా ఒక అనామకుడు అవమానపరుస్తూండగా చూస్తూఊరుకొన్నారంటే ఆశ్చర్యంగా ఉంది. వారే ఇలాఊరుకొంటే ఇంక ఎవరిభార్యలకుమాత్రం రక్షణ ఉంటుంది? ఇంతటిసభలో ధర్మలోపానికి భయపడే వారెవ్వరూ ఒక్క చిన్నమాట కూడా పలుకలేకపోయారుకదా! ఇంతమందీ చూస్తూఉంటే పతివ్రతనైన నన్ను కీచకుడు ఎక్కడా ఏస్త్రీనీ ఎవ్వరూ అవమానించని విధంగా అవమానిస్తే ఏకొందరికైనా దయతో నన్నాదుకోవటానికి సమయం కాకుండా పోయిందా? ఏమిచెప్పను? ధర్మాన్ని కాపాడవలసింది రాజు; కనుక ఈ ప్రభువు, కీచకుడు నన్నిలా అవమానిస్తే చూస్తూ ఊరుకోవడం ధర్మమా? అని అడుగుతున్నాను"

విరాటుడు ఆమెపట్ల ఎంతో జాలిపొంది, కీచకుణ్ణి ఏమనడానికీ సమర్థుడు కాకపోవడంతో బ్రతిమాలి, అతనిని శాంతపరిచి పంపివేశాడు.

ఆ సందర్భంలో సభలోని వారంతా ద్రౌపది సౌందర్యాన్ని గురించీ, ఆమెకు కీచకునివల్ల కలిగిన అవమానం గురించీ పలురీతులుగా గుసగుసలాడసాగారు. ధర్మజుడు అది గమనించి తగినవిధంగా ద్రౌపదికి సమాధానంచెప్పి అంతఃపురానికి వెళ్ళిపోయేలా చేశాడు.

ద్రౌపది తీరు గమనించిన సుదేష్ణ ఏదో అల్లరిజరిగిందని తెలుసుకొంది. కానీ ఏమీ తెలియనిదానిలా అభినయించి, ద్రౌపదిని అనునయించబోయింది. ద్రౌపదికి ఒళ్ళు మండింది. "నీ వెఱింగియు నెఱుంగమి భావించిన నింక నేమని పలుకం గలదానను?" అంటూ జరిగినది సూటిగా, తీవ్రవచనాలతో వివరించింది. సుదేష్ణ చిన్నపిల్లను లాలిస్తున్నట్లుగా కీచకుని తాను దండిస్తాననీ, దుఃఖపడవద్దనీ పలికింది. 'అసత్య సంవాదిని' అయిన ఆమె మాటలను ద్రౌపది నిర్లక్ష్యంచేసి,

"నీ వింత యలుగ నేటికి
నావంతయుఁ బౌరజన మనఃఖేదము నో
క్కావంత ద్రిక్క కుండఁగ
లావంతులు మత్పతులు గలరు పగదీర్పన్"[1]

అని చెప్పగా సుదేష్ణా, పరిజనమూ 'వెఱగు' పడ్డారు. ఎవరు ఎంతగా ఓదార్చినా సమాధానపడక స్నానభోజనాదులు మాని, పరిభవానల సంతప్త అయి ద్రౌపది శయ్యాతలంపై మేనువాల్చింది. కొంతసేపటికి అందరూ నిద్రపోయాక, బలవంతుడైన కీచకుణ్ణి చంపటానికి భీముడే అన్ని విధాలా తగినవాడని నిశ్చయించి, అతణ్ణి ప్రబోధించటానికి మహానసగృహానికి వెళ్ళింది. అక్కడ భీముడు నిద్రిస్తూ ఉన్నాడు.

"నన్నుఁ బరాభవించి సదనంబునకుం జని కీచకుండు ము
న్నున్న తెఱంగు దప్పక సుఖోచిత శయ్యను నిద్రసేయ నీ
కన్ను మొగుడ్చు నూఱటకుఁ గారణ మెయ్యది భీమసేన మీ
యన్న పరాక్రమంబు వలదన్ననొకో దయుమాలి తక్కటా!"[2]

1. విరాట - 2 - 161    2. విరాట - 2 - 166

అంటూ మొదలుపెట్టి, జరిగినదంతా వివరించి, ఎలాగైనాసరే కీచకుణ్ణి హతమార్చాలి అంటూ,

"వానిఁదెగఁజూడ వైతేని వాయుపుత్ర
నీవుగనుగొన నురి నైన నీరనైన
నగ్నినైన విషంబున నైన నేను
మేను దొఱఁగుదు నెట్టునీయాన సుమ్ము"1

అని ప్రతిజ్ఞకూడా పట్టింది.

భీముడు అనునయించి, "ఎల్లియెల్లవిధంబుల నెందుఁజొచ్చె నేని ......నాచేఁబడుఁగీ చకుండు" అనిప్రమాణపూర్వకంగా పలికి ఆమెకు ఆనందం కలిగించాడు.

ఇద్దరూ ఆలోచించి నర్తనశాలలోకీచకుణ్ణి రహస్యంగా చంపటానికి పథకం వేశారు.

ఆ పథకం ప్రకారం భీముడు కీచకుణ్ణి దారుణంగా వధించి ద్రౌపది చింతాశల్యమును పోగొట్టాడు. కానీ అది అంతటితో పోలేదు. ఉపకీచకులు అన్నగారి మరణానికి చోద్యపడి కొంతసేపటికి దుఃఖంనుంచి తేరుకొని, అతని మరణానికి కారణమైన సైరంధ్రిని కూడా అతని శవంతో దహనం చేయాలని నిశ్చయించుకున్నారు. ఆ విషయం విరాటునికి చెప్పగా, వారిని వారించే శక్తిలేక అతడు అందుకు సరేనన్నాడు. ఉపకీచకులు నూటఅయిదుగురూ విజృంభించి ద్రౌపదిని పట్టుకొని నిర్దాక్షిణ్యంగా సూతుని శవంతో కలిపికట్టి పితృవనంకేసి తీసుకుపోసాగారు.

ద్రౌపది భర్తలను పేర్కొంటూ ఆక్రందించింది. ఆమె గొంతును గుర్తుపట్టి భీముడు కోపంతోను, సంభ్రమంతోను పరుగెత్తుకొంటూ వెళ్ళి అంతమందినీ ఒక్కపెట్టున చంపి, ఆమెను ఆ ప్రమాదం నుంచి రక్షించాడు.

1. విరాట - 2 - 229

కీచకుల మరణానికి విరాటుడూ, సుదేష్ణా భయభ్రాంతులయ్యారు. విరాటుడు సుదేష్ణను ఓదార్చి, ఏదోవిధంగా సైరంధ్రిని అంతఃపురం నుంచి పంపివేయవలసిందిగా చెప్పాడు. సుదేష్ణ అనుజ వియోగతాపంతో విరాటుని మాటగా

"బిరుదుగల మగలు గలరని
తరమిడి చంపింపఁ జూచెదవు జనములు నీ
పొరువునఁ బోవెఱతురు మా
పురమును రాష్ట్రంబు వెడలి పొమ్మిందైనన్"[1]

అని సైరంధ్రిని కోరింది. ఇంకొక్క పదమూడు దినాలు మాత్రమే అక్కడ ఉండటానికి అంగీకరించవలసిందనీ, తనభర్తలు రాజుకు మేలు చేస్తారనీ చెప్పింది ద్రౌపది. సుదేష్ణ సమ్మతించి బేలగా " ... నాదు నందనుల మదీయవల్లభు నుదాత్తమతిం బతికించి కొమ్మ ... "[2] అంటూ ప్రాధేయపడింది.

కీచకాగ్రజుడైన సింహబలుడు మహాపరాక్రమవంతుడు. బలరాముడూ, భీముడూ, శల్యుడూ, కీచకుడూ, సమాన బలం కలవారు. బాహుయుద్ధంలో వారు ఒకరిచే ఒకరు చంపబడాలేకాని ఇతరులకు అసాధ్యులు.[3] సింహబలుడు తనపరాక్రమంతో మత్స్యదేశాన్నీ, రాజునూ గుప్పిట పెట్టుకొన్నాడు. "రాజనఁగా నెపంబిడి విరాటునకున్ దగఁగూడు పెట్టుదున్"[4] అని చాటుకున్న గర్వోన్మత్తుడు వాడు. తాను వలచిన స్త్రీని పట్టబోయినప్పుడు అడ్డుపడే వీరుడే లేడని పలికాడంటే వాడు ఎంతటి అత్యాచారపరుడో, వాని బారినుండి రాజూ, ప్రజలూ ఎన్ని బాధలు పడుతూ ఉండేవారో ఊహించవచ్చు.

పాండవులు విరటునివద్ద విజయవంతంగా తమ అజ్ఞాతవాస దీక్షను చెల్లించుకొన్నందుకు ప్రతిగా కీచకోపకీచకుల పీడను ఆ రాజ్యా

1. విరాట - 3 - 60
2. విరాట - 3 - 67
3. విరాట - 3 - 113
4. విరాట - 2 - 254

నికి విరగడ చేశారనిచెప్పవచ్చు. ద్రౌపది అంతఃపురంలో చేరేముందు సుదేష్ణతో తెలియకనే పలికిన

"నీచమతి నన్ను నెవ్వఁడు
సూచిన నారాత్రిలోనఁ జూతురు దెగఁడా
రాచపలు హరిహరాదుల
గాచిన బలవిక్రమము లఖర్వము లైనన్."

"బంధుశతంబులు శౌర్యమ
దాంధము లై శక్తి సంపదాభీలతమై
సింధురసదృశత నున్నను
సంధులసంధు లెడలించి చంపుదు రతనిన్"[1]

అదే మాటలు అక్షరాలా నెరవేరాయి.

ఈ కీచకవధవల్లే పాండవులకు తమనుతాము బయల్పరచు కొనే చక్కనిఅవకాశం కలిగింది. దుర్యోధన నియోజితులైన చారులు పాండవులకోసం వెదకి వెదకి విఫలులై కీచకవృత్తాంతాన్ని తమరాజుకు విన్నవించారు. కీచకుణ్ణి చంపగలిగిన సామర్థ్యమూ, అవకాశమూ భీమునికి ఒక్కడికే ఉండటాన్నిబట్టి, అయిదుగురు గంధర్వపతులు గల స్త్రీ కారణంగా కీచకులు మరణించారనడాన్నిబట్టి పాండవులు విరటుని కొలువులో ఉన్నారని దుర్యోధనాదులు నిశ్చయించారు. పర్యవసానం గా గోగ్రహణం కల్పించబడి, పాండవులు దైన్యులుగా కాక, ధీరులు గా బయటపడ్డారు.

---

1. విరాట - 1 - 324, 325

మరొకరకంగా చూస్తే, ఉత్తరాభిమన్యుల కల్యాణానికి వీలుకల్పించింది కూడా కీచకసంహారమే. స్వభావాన్ని బట్టి సింహబలుడూ, అతని సోదరులూ పాండవులపట్ల సానుభూతి కలిగిఉంటారనడానికి వీలులేదు. వారే కనుక జీవించిఉంటే విరాటునికి పాండవులతో వియ్యమందే స్వేచ్ఛ ఉండేదికాదు. తనను తగుమన్ననతో చూసేవారిని తనభర్తలు ఎంతో ప్రేమతో ఆదరిస్తారని ద్రౌపది సుదేష్ణతో చెప్పిన మాటలు[1] కూడా ఉత్తరాభిమన్యుల వివాహంతో నెరవేరినట్లే అయింది.

ఈ విధంగా ద్రౌపదీ పాండవుల అజ్ఞాతవాస దీక్ష కల్యాణప్రదంగా ముగిసి, కౌరవులతో రాయబారానికి దారితీసింది.



1. విరాట - 1 - 329

## 9. * రాయబారంలో "రమణీయత"

ఉత్తరాభిమన్యుల వివాహానంతరం చేరవచ్చినరాజ లోకానికి శ్రీకృష్ణుడు కర్తవ్యాన్ని గుర్తుచేశాడు. అందరూ ధర్మజుని ధర్మపరతను, ఉపశమన బుద్ధిని ప్రశంసించారు. యుధిష్ఠిరుడు ధర్మం తప్పి ఇంద్రపదవి వచ్చినా ఇష్టపడడనీ, ఉచితగతిని ఎంతవస్తే దానితో తృప్తిపడతాడనీ కృష్ణుడు సభాముఖంగా ప్రకటించాడు. చివరికి కౌరవుల కడకు రాయబారం పంపాలని తీర్మానించబడింది. ఆ బాధ్యత ద్రుపదునిపై పెట్టి బంధువులంతా ఎక్కడివారు అక్కడకు వెళ్ళిపోయారు. ద్రుపదుడు వయోజ్ఞానవృద్ధుడైన తన పురోహితుణ్ణి దూతగా కురుసభకు పంపాడు.

కౌరవసభలో ద్రుపదపురోహితుడు స్వాభావిక మైన పద్ధతిలో కుండబద్దలు కొట్టినట్లుగా విషయాన్ని వివరించి, అదనుతప్పకుండా మహాత్ములైన పాండవులను పిలిపించి వారిరాజ్యం వారికి ఇచ్చి సంధి చేసుకోవడం ఇరుపక్షాలవారికీ శ్రేయస్కరం అని చెప్పాడు. ఆ సందర్భంగా అతడు,

"నారీరత్నము నట్లు దెచ్చి సభలోనన్వారలుం జూడఁగాఁ
జీరల్ ప్రోవులు గాఁగ నొల్చుటయు..............."[1]

అంటూ ద్రౌపదికిజరిగిన అవమానాన్ని, పాండవులకు జరిగిన ద్రోహాన్ని ప్రస్తావించి, అంతటికీ బాధ్యుడైన ధృతరాష్ట్రునికి బుద్ధిచెప్పవలసిందిగా సభలోని పెద్దలకు విన్నవించాడు. భీష్ముడు పెద్దరికాన్ని వహించి సమాధానం చెబుతూ ఉండగా, కర్ణుడు కల్పించుకోవడంతో తరాల మధ్యగల అంతరాలు బయటపడసాగాయి. ధృతరాష్ట్రుడు తెలివిగా

---

* "స్వామిప్రణాళికలో ముఖ్యపాత్ర ద్రౌపది ఆమె శోకము చల్లారెనా తనకార్యముసరి."
- ఆంధ్రవాఙ్మయము - కృష్ణకథ - Vol I Page 279

1. ఉద్యోగ - 1 - 232 - డా. ధారా రామనాథశాస్త్రి

ఇద్దరినీ శాంతింపజేసి, ఆ విషయమై పాండవుల వద్దకు సంజయుణ్ణి రాయబారిగా పంపనున్నట్లు ప్రకటించి బ్రాహ్మణుణ్ణి పంపివేశాడు.

సంజయుడు ఉపప్లావ్యానికి వచ్చి, ఎంతో నేర్పుగా ధృతరాష్ట్రుని ఆంతర్యాన్ని పాండవులకు బోధపరిచాడు. 'ఏ ఓర్పుతో ఇన్ని పడ్డారో, అదే ఓర్పుతో కౌరవులు దుశ్శీలురై రాజ్యభాగం ఇవ్వకపోయినా సహించవలసిందనీ, రక్తాభిలాష్ానికి సిద్ధపడవద్దనీ, వారి నడవడికి భిక్షాన్నమైనా తగినదేననీ చెప్పాడు. అప్పుడు కృష్ణుడు కల్పించుకొని, ద్రౌపదికి జరిగిన అవమానాన్ని గుర్తుచేస్తూ,

"నెట్టన సభలో వేపుర
కట్టెదుర నరాతితనముగా కెంతయు వా
రెట్టి తులువలో ద్రౌపది
నట్టెల పటిచెడిదె జూదమాడరె యెందున్."[1]

అని, మరి, దానిమాటేమిటన్నట్లుగా సంజయుణ్ణి నిలదీశాడు.

సంజయుడు బిత్తరపోయి, "దేవా! నీచిత్తంబున నిడి దీని నింత గొనియాడినఁ గర్జంబోడఁ గూడునే?" అని అడిగాడు.

కృష్ణుడు సంజయుని మాటలద్వారా ధృతరాష్ట్రునికి రాజ్యంపాలు పాండవులకు ఇచ్చే ఉద్దేశమే లేదని గ్రహించాడు. కనుక, ద్రౌపదికి జరిగిన అవమానానికి పాండవులు ప్రతీకారం తీర్చుకోవడానికి సిద్ధంగా ఉన్నారనీ, వారిబారినుంచి ప్రాణాలు దక్కించుకోవాలంటే కౌరవులకు పాండవులపాలు మర్యాదగా పాండవులకు ఇవ్వడం ఒక్కటే మార్గమనీ హెచ్చరించాడు. తాను పాండవులను ప్రార్థించి, వారిపక్షాన కురుసభకు వచ్చి, కౌరవులకు బుద్ధి చెప్పి చూస్తానన్నాడు. సంజయుడు కృతార్థుడై తిరిగివెళ్లాడు.

1. ఉద్యోగ - 1 - 344

ఆతరువాత పాండవులు శ్రీకృష్ణుని ప్రార్థించి 'పెనకువకాని యుపాయమున' పనిసాధించుకొనిరమ్మని, తమ తమ అభిప్రాయాలను వివరించారు. ద్రౌపదివంతు వచ్చింది. ధర్మజుని మాటలు ఆమెకు ఎంతో కోపాన్ని కలిగించాయి. ముఖం వైవర్ణ్య మయింది. గద్గదకంఠం తో కృష్ణునితో ఇలా పలికింది:

"అంతటి అవమానాలపాలు చేసి, ఆప్రసక్తే రాకుండా సంజయునికి చెప్పి సందేశం పంపారు ఆకౌరవులు. అంతమాత్రానికే ధర్మరాజు సంతోషించి, అయిదూళ్లు ఇచ్చినా చాలునంటున్నాడు. అయిదూళ్ళు మాత్రం ఇస్తాడా ఆ సుయోధనుడు? ఏమో, ఈ అన్నా తమ్ముళ్లమీదగల ప్రేమతో దయతలచి ఇస్తే ఇవ్వనూవచ్చు."

"తాను పడిన అవమానాలన్నింటినీ ఈ మహారాజు ఆ తమ్ముడంటే ఉండే ప్రేమాతిశయంవల్ల సహిస్తాడు కాబోలు! కానీ, రాజ్యభాగం ప్రసక్తిలేకుండా సంధిపొసగితే, వీళ్లు అసమర్థులనీ, సిగ్గులేని వారనీ జనం వీళ్లను ఆడిపోసుకోరా?"

"వీళ్లకు ఎందుకు ఇంతటి తక్కువ తనం? సంధికోసం వీళ్లు ప్రాకులాడటమేమిటి? అది వాళ్లకీమేలు. వీరికెందుకు? వారిని చూసి వీరు యుద్ధం చెయ్యలేమనుకొంటున్నారో, చెయ్యగలిగీ తటపటాయిస్తున్నారో? వీరేమైనా బ్రాహ్మణులా పడిన అవమానాలన్నీ దిగ మ్రింగుకొని ఊరుకోవడానికి?"

"సుయోధనుడు ఈ మాటలకు ఏమాత్రమన్నా మెత్తబడతాడనా? మరింత బిగిసిపోడూ? పోనీ, అక్కడ సభలోని పరిస్థితులు దారి తీసినప్పుడైనా వీరు వారితో తలపడతారంటావా? ఎందుకులే అని మళ్లీ అడవులకు పోతారంటావా?"

"నేనిలా అంటున్నాననికాదు, మీరంతా ఆలోచించి, మీ మంచితనం చెడకుండా, తగినట్లుగా, మీ ఇష్టానుసారం కౌరవులతో

సంధే చేసుకోండి. కానీ - మీ ప్రయత్నం నెరవేరుతుందో నెరవేరదో- అంతవరకూ ఆగలేక, ఈలోపే, నాకు తోచినమాటలు కొన్ని, ఇష్టం వచ్చినట్లుగా వాగేస్తున్నాను. మీ అంతవివేకం నాకెక్కడిది? వెఱ్ఱి దాన్ని, వెఱ్ఱివాగుడనుకొంటే అనుకొని, వినండి.

"నేను వరప్రభావంతో జన్మించాను. ప్రసిద్ధమైన భరత వంశానికి చెందిన పాండురాజుకు కోడలి నయ్యాను. జనవంద్యులైన భర్తలను పొంది, నీతివిక్రమ స్థిరులైన బిడ్డలకు తల్లినయ్యాను. తోబుట్టువుల ఆదరానికి నోచుకున్నాను. కృష్ణా! ఇన్ని విధాలుగా ప్రశస్తి కెక్కిన నన్నునీవు సుభద్రకంటె ఎక్కువగా మన్నిస్తావు. రాజసూయం నాడు మహాసామ్రాజ్ఞిగా అభిషిక్తురాలినైన ఇలాంటి నన్ను నాభర్తలైన ఈ అయిదుగురూ చూస్తూ ఉండగా 'ఒకానొకడు' కొప్పుపట్టి సభలోకి ఈడ్చుకు వచ్చాడు. కులసతిని ఇలా అవమానించడం ఎక్కడైనా ఉందా?

"ఆసభలో ఏకవస్త్రను అనికూడా విచారించక దుశ్శాసనుడు నన్ను అవమానిస్తూ ఉంటే వీళ్ళు బొమ్మల్లా చూస్తూ ఉండిపోయారే కానీ ప్రతిక్రియ ఏమీ చేయలేదు. నాథులుండీ అనాథనయ్యాను. అప్పుడు నీవుకదా నాకు దిక్కయ్యావు. అది గుర్తుంచుకో, చాలు.

"ఇంటికోడలనికూడా సందేహించకుండా అప్పుడు నన్ను వారు దాసిగా చేశారు. ఆ మహారాజు మాత్రం ఏమీ ఎరుగడట! అలాంటి 'మహానుభావుణ్ణి' నాభర్తలుపోయి సేవిస్తారట! వీరితోపాటుగా వెళ్ళి నేనాయనకు కోడరికమే చేయాలో, దాసీత్వమే చేయాలో? నువ్వే నిశ్చయించి చెప్పు.

"ఇదుగో, ఇవిచూడు, దుశ్శాసనుని చేతుల్లో చిక్కి తెగిపోగా మిగిలిన వెంట్రుకలివి. కురుసభలో సంధిప్రసంగం చేస్తావే,

అప్పుడు ఒక్కసారి వీనినిస్మరించు. దీనికి సమాధానం కావాలినాకు. నా గుండెల్లో రగిలేమంట, ఈ జుట్టుపట్టుకులాగిన ఆ దుష్టుని చేతినీ, తనువునూ ముక్కలు ముక్కలుగా చేసి చూపిస్తేగానీ, చల్లారదు. ఇన్ని అవమానాలు, కష్టాలూపడీ, నేనూ, ధర్మరాజూ ఇంకా ఆ రాజరాజు పీనుగును కళ్ళారా చూడలేకపోతున్నామంటే భీముని బాహుబలం, కత్తివిక్రమం ఎందుకు? తగులబెట్టనా? రక్కెస తాల్మితో చిచ్చు ఒడిలో కట్టుకున్నట్లుగా ఇంతకాలం ఇంతటి కోపాగ్ని ఎలాగో భరించాను మనస్సులో. ఒకటా? రెండా-? పదమూడేళ్ళు! దుష్టశిక్షణే దీక్షగా పూని లోకాలను కాపాడేనీవు తోబుట్టువునీ, మహాపరాక్రమవంతులైన వీరు భర్తలూను. అయినా నాబాధకుఎన్నటికీ ఉపశమనం కలగడంలేదు."1

శోకభారంతో గొంతుక పూడి పోయేలా ఏడ్చింది యాజ్ఞసేని. కృష్ణుడు ఆమెపట్ల ఎంతగానో జాలిపడ్డాడు.

ఆమెను ఓదార్చి, కూర్చో బెట్టి, కన్నీరు తుడిపించి, కురులు ముడిపించి, స్థిమితపడ్డాక, ఆమెకు ఇలా చెప్పాడు:

"నే ఉండగా నీకు ఇంతదుఃఖం దేనికి? కౌరవులు రాజ్యం ఇచ్చేస్తారనేనా? ఎంత అమాయకురాలివి!

"ధర్మజుని అనుజ్ఞతో భీమార్జునులను తోడు చేసుకొని నువ్వు మెచ్చుకునేలా శత్రుసంక్షయం చేస్తాను. చూస్తూఉండు. ఇంక నువ్వు ఏడవవలసిన పనిలేదు. కౌరవాంగనలు గోలుగోలున ఏడుస్తూ ఉంటే విని నీవు ఆనందించేకాలం ఆసన్నమైంది. యమమహిష ఘటికానాదం వినాలనికుతూహలపడే ఆ కౌరవుల మనస్సులకు నా సంధివచనాలు రుచిస్తాయా? విధినిర్ణయంకూడా యుద్ధమేనని పెద్దలు చెబుతూ ఉంటారు. అదింక తప్పదు.

---

1. ఉద్యోగ - 3 - 101 నుంచి 118 వరకు గల పద్యాలభావాలు

"పూని పలికెద వినుము రిపుక్షయంబుఁ
జేసి యుజ్జ్వల పుణ్యలక్ష్మీసమేతు
లైన పాండుకుమారుల యధిక విభవ
మీవు సూచెదు తథ్యమిదే దిది నిజంబు"[1]

కృష్ణుడు ఇంతలా నొక్కి చెప్పడంతో మనస్సు తేటపడి ద్రౌపది ఏడుపు మానింది.

ద్రౌపది మాటల ప్రభావం పాండవులందరిపైనా పడింది. ధర్మజుడు తల్లికి సందేశం పంపుతూ '...దుఃఖములైనవి దెగుసమయ మయ్యెనని చెప్పుము...' అని కృష్ణుని కోరాడు. అర్జునుడుకూడా, దుర్యోధనాదులు ధర్మజుడు చెప్పినట్లుగా సగముపాలు ఇవ్వడానికి అంగీకరించక "...ఒండనిన సపుత్రమిత్రముగ నద్దెస నందరఁ గొచ్చి పాఁతుదున్'[2] అనిచాటి చెప్పాడు. దానికి భీముడెంతగానో పొంగి పోయాడు. నకుల, సహదేవులు సంతోషించారు. నెయ్యమో, కయ్యమో-ఏదో ఒకటి వెంటనే తేల్చుకొని రమ్మని పలికారు. అంటే, ద్రౌపదిది వృథాకంఠశోష కాలేదు. గాండీవం వేడెక్కింది. గదా దండం ఉత్సాహంతో ఊగిపోయింది. కృష్ణునికి కావలసింది యిదే!

కౌరవసభలో శ్రీకృష్ణుడు ధృతరాష్ట్రునితో

"వారితండ్రిపాలు వారికి నిచ్చినీ
పాలు నీవుఁబుత్ర పౌత్రచయము
ననుభవించి సుఖులరై యుండుఁడిది బంధు
మిత్రసుజనకోటి మెచ్చు తెఱుఁగు"[1]

అంటూ మొదలుపెట్టి ధర్మరాజు మంచితనాన్ని గుర్తుచేసి, "నీసుతుఁడు మంత్రులు సౌబలు జూదమార్చి సంపదగొని యంతఁబోవక సభన్ ద్రుపదాత్మజ భంగపెట్టరే"[2] దానికి నీవు అంగీకరించావుగదా! వారు

1. ఉద్యోగ 3 - 124    2. ఉద్యోగ - 3 - 142

పాపం నానా బాధలూ పడ్డారు అడవుల్లో. శాంతశూరులైనవారు నీ పాదాలు సేవించడానికి సిద్ధంగా ఉన్నారు ఇప్పటికీ. అదినీకు ఇష్టం కాకపోతే యుద్ధానికీ సిద్ధంగానే ఉన్నారు. ఈ రెంటిలో నీకేది పథ్యమో నీవే నిర్ణయించుకో" అని చెప్పాడు.

ధృతరాష్ట్రుడు చెప్పిన దంతా విని చివరికి, "...నాకుంజనవు ననువు లేదు దీని సమ్మతినపపన్"[1] అనిపలికి, దుర్యోధనునకు నచ్చ చెప్పే బాధ్యతను కూడా కృష్ణుని పైనే ఉంచాడు. అప్పుడు కృష్ణుడూ, భీష్మద్రోణులూ దుర్యోధనునకు హితవు చెప్పారు. అంతా విని చివరికి అతడు కృష్ణునితో "ఈ ఆచార్యుడూ, పితామహుడూ, సార్వభౌముడూ ఎప్పుడూనన్నే నిందిస్తూ ఉంటారు, నీవూ అదే పనిచేస్తున్నావు. న్యాయం ఆలోచించాలిగదా? ఆడదానికి అన్యాయం చేశామనీ, వారిని అడవుల పాలు చేశామనీ పాండవులు మా మీాదకోపగించి, మమ్ము చంపాలనీ, నాశనం చేయాలనీ అకారణంగా చూస్తున్నారు. పరిశీలించి చూస్తే మాతప్పేమీా లేదు. ఆ ధర్మరాజు జూదరి. ఉత్సాహపడి, ఆడి,శకుని చేతిలో ఓడిపోయాడు. ఆటచేతకాక అతడోడిపోతే అందుకు నేనుబాధ్యుడను ఎలా అవుతాను? మాత్స్య పాంచాల పాండ్యాది రాజులను కూడగట్టుకొని వారే మామీాదకు కయ్యానికి కాలుదువ్వుతున్నారు. మేము యింద్రుడంతటి వానికైనా తలవంచము. ఇదివరకు చిన్నతనంకనుక తాతా, తండ్రీ రాజ్యంపంచి యిస్తే తెలియక సాగనిచ్చాం, ఇప్పుడలా కుదరదు.

"ఏమును వారుఁ బంచికొని యేలుట గల్గదు పల్కు-కుండు మిం
కేమియు వాఁడిసూదిమొన యించుక మోపినయంతమాత్రయున్
భూమి యొనర్చి పాండునృపపుత్త్రుల కిత్తునె? యెవ్వరైన సం
గ్రామమునన్ జయంబుగొని రాజ్యము సేయుట నిశ్చయించితిన్"[2]

అని పలికాడు.

---

1. ఉద్యోగ - 3 - 328, 329 2. ఉద్యోగ - 3 - 363

అప్పుడు కృష్ణుడు చిన్నప్పటినుంచీ దుర్యోధనుడు పాండవులకు చేసిన అపకారాలను పేర్కొని, ద్రౌపదిని సభలో అవమానించడం మాటేమిటి? అని అడిగాడు.[1]

'' ...... కులము, శీలముఁ గల్గిన పుణ్యకాంత కట్లొప్పమిసేసి....''
'' ఎత్తివిడిసినవారని యెల్లతప్పుఁ బాంధవులమీఁదఁబెట్టిన బ్రదుకు గలదె...?'' అని అడిగాడు.

దుర్యోధనుడు మూర్ఖతతో కృష్ణుణ్ణి బంధించడానికి ప్రయత్నించడంతో, ద్రౌపది కోరినట్లే, సభలో 'సంగరంబులగు చొప్పులు' పుట్టినాయి.

కృష్ణుడు యుద్ధానికి ముహూర్తం పెట్టి మరీతిరిగివచ్చాడు. పాండవులు తాముగా యుద్ధాన్ని కోరలేదు. ధర్మానుసారం తమకు రావలసిన రాజ్యాన్ని తమకిమ్మని వారుకోరారు. అధమపక్షం అయిదూళ్లు ఇచ్చినా చాలనిప్రకటించారు. ఆసందర్భంలో తమకుగాని, ద్రౌపదికిగాని కౌరవులు చేసిన అవమానాలను వారు స్మరించలేదు. సంజయుడు శ్రుతిమించిపోతుంటేను, దుర్యోధనుడు తనతప్పులేదని పేట్రేగిపోతుంటేను మాత్రమే కృష్ణుడు ద్రౌపదికి జరిగిన అవమానాన్ని ప్రస్తావించి, ఆతప్పునుంచి తప్పించుకొని బ్రతకాలనుకుంటే పాండవుల రాజ్యం పాండవులకు ఇవ్వడంతప్ప వేరుమార్గంలేదని హెచ్చరించాడు.

ద్రౌపది, తనభర్తలు క్షత్రియ ధర్మానికి విరుద్ధంగా దీనస్థితికి దిగజారిపోవడం సహించలేక, వారి పౌరుషాగ్నిని ప్రజ్వలింపజేయటానికి కృష్ణుణ్ణి అడ్డుపెట్టుకొని అన్నిమాటలు చెప్పవలసి వచ్చింది. సంధికి ప్రయత్నించడం తప్పని ఆమె ఉద్దేశంకాదు. ధర్మం తనపక్షాన ఉండగా, తప్పుచేసిన కౌరవులను దేవిరించడం ఏమిటని ఆమె భావించింది.

1, ఉద్యోగ - 3 - 367 '' అన్నదమ్ముల నెత్తంబులాడి...''

రావలసిన రాజ్యం న్యాయంగా ఇస్తారా ఇవ్వండి, లేకపోతే మీరు చేసిన దానికి ప్రతిఫలం అనుభవించి తీరుతారని గట్టిగా చెప్పాలని ఆమె ఆంతర్యం. కురుసభలో చివరికి జరిగిందీ అదే! కృష్ణుడు, పాండవుల మంచితనానికి భంగం రాకుండానూ, ద్రౌపది ఆశించినట్లుగా వారికి చిన్నతనం కలుగకుండానూ రాయబారం నిర్వహించి, జగన్నాటక సూత్రధారిత్వాన్ని నిజం చేసుకొన్నాడు.

దుష్టులైన కౌరవులను సంస్కరించాలని శ్రీకృష్ణుడు చేసిన ప్రయత్నంలో ద్రౌపదీ పరాభవ సన్నివేశం ఈ తీరుగా ఉపకరించింది. ఆయన జగద్గురువుగా ఆ మహాపరాధాన్ని గుర్తుచేసి, భయాన అయినా కౌరవులను సంధికి ఒప్పించి జననష్టాన్ని వారిద్దామని చూశాడు.

ధర్మరాజు అరణ్యాజ్ఞాతవాసాలకు అంగీకరించడంలో జాతి మొత్తానికి దుర్యోధనాదులు తమపట్ల చేసిన దుర్మార్గానికి అంగీకారమో, అనంగీకారమో తెలిపే అవకాశాన్ని ఒకటి కాదు, రెండు కాదు, పదమూడేళ్ళు ఇచ్చాడు. ఆ పదమూడేళ్ళలో ప్రజలలోను, పాలకులలోను చాలామంది దుర్యోధనుని అధికారానికి లొంగిపోవడమో, అతనిఐశ్వర్యానికి అమ్ముడుపోవడమో మాత్రమే జరిగింది. దానిని అంగీకరించని కొద్దిమంది మాత్రం ధర్మానికి కట్టుబడి నిస్సహాయులుగా ఉండిపోయారు. వారే ఆ తరువాత పాండవపక్షాన కౌరవులను ఎదిరించారు. పాండవుల ఏడక్షౌహిణుల సైన్యం ఆ 'బాపతు' వారిదే.[1]

---

" వీరెల్లఁ బాండురాజను
మారులపాటునకుఁ గుందుమనములతోడన్
వారిపగదీర్పఁగడఁగెడు
వారల కాకందు లాఁతివారుంగలరే?" - ఉద్యోగ - 2 - 180

## 10. సంస్కరణయత్నం.

శ్రీకృష్ణుడు కౌరవసభలో పాండవసందేశాన్ని వినిపించడానికి ముందూ, వినిపించినతరువాతా కుంతీదేవిని సందర్శించాడు. ఈ రెండు సందర్భాలలోను కుంతి ద్రౌపది పడిన బన్నములు స్మరించి, కొడుకులను "చేతులలావునం గస్సిన జీవనంబున బ్రతుకుండ"ని కృష్ణునిద్వారా ఉద్బోధించింది. ఆమెకోడలి అవమానాన్ని గురించి "సకలంబుఁజూడ సభఁదైన్యముఁబొందుట సూచి పొక్కితి" నని చెపింది. సంధి విఫలమైందని తెలుసుకొని, 'అదికూడా మేలే' అనిపలికి

"మఱచిరె కొలువున ద్రౌపదిఁ
బఱచిన బన్నంబు ధర్మపథము దొఱంగన్
వెఱచుట కప్పటికది దగుఁ
జెఱచినచో వెదకవలదె చిరతరకీర్తిన్"1

అన్నది. అప్పుడంటే ధర్మానికి కట్టుపడి అవమానాన్ని సహిస్తే సహించి ఉండవచ్చు. ఇప్పుడు ఈ కౌరవులు ధర్మాన్ని తప్పినప్పుడు ఉపేక్షిస్తే అపఖ్యాతి కలుగుతుంది. అందువల్ల శాశ్వతమైన కీర్తి సిద్ధించేలా కొడుకులు యుద్ధానికి ఉన్ముఖులు కావాలని ఆమె ఆకాంక్షించింది.

రాయబారసందర్భంగా కృష్ణుడు ప్రదర్శించిన లీలల్లో చెప్పదగినవి రెండుఉన్నాయి. అవి (1) తనను కట్టనుంకించిన దుర్యోధనాదులకు తనవిశ్వరూపాన్ని ప్రదర్శించడం, (2) కర్ణునికి తనసాన్నిధ్యాన్ని ప్రసాదించి పాండవపక్షాన చేరవలసిందిగా ఉపదేశించడం.

విశ్వరూప ప్రదర్శనద్వారా తనపరమేశ్వరత్వాన్ని ప్రత్యక్షంగా నిరూపించి మూర్ఖులైన దుర్యోధనాదులు అప్పటికైనా దారికి వస్తారేమోనని ప్రయత్నించినట్లయింది. ధర్మజాదులు దైవ మానుషా

1. ఉద్యోగ - 4 - 18

లభియిన శక్తియుక్తులను ఉపయోగించి సంధిసాధించుటకు రమ్మని చేసిన ప్రార్థనను అక్షరతః మన్నించాడు కృష్ణుడు.

కర్ణుణ్ణి రథంలో తన ప్రక్కన కూర్చుండబెట్టుకొని, అతని జన్మరహస్యాన్ని తెలిపి, 'నీవు పాండవ పక్షానికి వస్తే మహేంద్ర వైభవంతో మహీచక్రాన్ని ఏలగలుగుతావు, ధర్మరాజాదులు నిన్ను అగ్రజునిగా అంగీకరిస్తారు! అంతేకాదు,

"పాంచాల రాజపుత్త్రియు
నంచితముగ నిన్నుఁబొందు నార్వురవరుసన్
సంచితపుణ్యుఁడ వీవొక
యించుకయును వేఱుసేయ కే తెమ్మెలమిన్.

"ఇట్లైన గుంతికి సమస్త బంధుమిత్రులకుఁ బ్రియంబగు"[1] నని చెప్పాడు. కృష్ణుడు చెప్పినది విని, తనకీవిషయం ఇదివరకే తెలుసుననీ, తనను పెంచినవారితో బంధాలు తెంచుకొని రాలేననీ చెప్పాడు. "నన్ను తనంతటివానిగా జేసిన కురుకులేశ్వరుని వదలిరావడం ధర్మంకాదు. నేనూ, అర్జునుడూ ఎదురెదురుగా యుద్ధంచేస్తామని చూస్తున్న జనులంతా నవ్వుతారు. దీనివల్ల అతనికీ, నాకూ అపకీర్తి వస్తుంది. నీవు నిర్మల బుద్ధితో హితవునే బోధించావు. కానీ, అది నా మనసుకెక్కడంలేదు. ఈ రహస్యాన్ని నీలోనే ఉంచుకో. ధర్మరాజుకి తెలిస్తే యుద్ధం మానేస్తాడు. రాజ్యం వద్దంటాడు. ఈ భూమిని శాశ్వతంగా పాలించవలసింది అతనివంటి ధార్మికుడే గదా! నీవు ఉపద్రష్టవుగా, తమ్ములు ఋత్విజులుగా, కురుకుమారులు యజ్ఞపశువులుగా రణయజ్ఞాన్ని ఆ ధర్మరాజు నిర్వహించాలి. దానివల్ల కురుక్షేత్రంలో మావంటివాళ్ళం సద్గతిని పొందుతాం." అనిపలికాడు. కృష్ణుడు అర్జునుని పరాక్రమాన్ని ప్రశంసించి, తాను అతనికి సారథయి రథం

1. ఉద్యోగ - 4 - 31,32

నడుపుతూ ఉండగా అతనిని జయించడం సాధ్యపడదుసుమా! అని హెచ్చరించాడు. కర్ణుడు చలించక, "కురు పాండవులకు యుద్ధంవస్తుందనీ ధర్మజుడు జయిస్తాడనీ నాకు అనేక దృష్టాంతాలు, స్వప్నాలవల్ల తెలుస్తోంది. నీవు ఇంతగా చెప్పనక్కరలేదు. అందుకే నేను పాండవ పక్షానికి రానంటున్నాను" అని,

'దీనికి మూలము శకునియు,
నేనును, దుశ్శాసనుండు నింతియ కుంతీ
సూనుల వారలు గలసిన
రానేరఁగవచ్చు నాకు రాజీవాక్షా!" 1

అన్నాడు. శకునీ, దుశ్శాసనుడూ పాండవపక్షానికి రావడం దుర్ఘటమైనట్లే తానురావడమూ కుదరనిదని స్పష్టంచేశాడు కర్ణుడు. యుద్ధంలో జయిస్తే మళ్లీ కలుద్దాం! ఓడిపోతే పైలోకాల్లో కలుసుకొందాం' అంటూ సెలవు తీసుకొన్నాడు.

స్థూల దృష్టికి ఈఘట్టంలో కృష్ణుడు భేదోపాయాన్ని పన్ని కర్ణుణ్ణి పాండవపక్షానికి లాగటానికి యత్నించాడనిపిస్తుంది. కానీ, అంతకు ముందే కృష్ణుడు సభలో దుర్యోధనుణ్ణి "కులము, శీలము గలిగిన పుణ్యకాంతను అంతటి అవమానంపాలుచేశావు, అది తప్పు కాదా?" అని అడిగాడు. "అప్పుడు నీవూ, కర్ణుడూ ఆడినమాటలు చెప్పటానికికూడా వీలుకానివికదా!" అన్నాడు. ఆ కృష్ణుడే ఇప్పుడు కర్ణునితో ఆ పుణ్యకాంతను గురించి "నిన్నామె ఆరవ భర్తగా పొందుతుంది" అనడంలో గల ఔచిత్యాన్ని గురించి ఆలోచించవలసిఉంది.

ద్రౌపదిపట్ల కర్ణునికి ఒకవిధమైన చులకనభావం ఉందనీ, నిండుసభలో ఆమె పాతివ్రత్యం నిరూపించబడినా అతనిలో ఆ భావం పోలేదనీచూశాం. కృష్ణుని విశ్వరూపప్రదర్శనానంతరంకూడా కర్ణునిలో

1. ఉద్యోగ - 4 - 52

ద్రౌపదిపట్ల అలాటి చులకన భావమే మిగిలిఉన్నదో, లేక, అతడు తనదోషాన్ని తెలుసుకొని పశ్చాత్తప్తుడవుతాన్నాడో తెలుసుకోవడానికి కృష్ణుడు ఈప్రకారంగా అతనితో మాట్లాడాడు. కర్ణుడు తనతప్పును తాను తెలుసుకొని తగినవిధంగా శిక్షింపబడాలనే నిర్ణయానికి వచ్చి నట్లుగా అతని సమాధానాన్ని బట్టి తెలుస్తోంది. ప్రత్యేకించి అతడు ద్రౌపదీ భర్తృత్వాన్ని గురించి పేర్కొనక పోయినా,

"హితముపదేశించితిని పతి నిర్మల బుద్ధి వగుట నైనను నిది నా
మతిసారదు రహస్యము రక్షితముగఁ బాటింపుమయ్య చిత్తములోనన్"[1]

అనడంలో కృష్ణుడు తనపట్ల లౌక్యాన్ని ప్రయోగించడం లేదని, హృదయంతోనే మాట్లాడుతున్నాడని కర్ణుడు గ్రహించాడని తెలుస్తోంది. జరిగినదానికి శకుని, తాను, దుశ్శాసనుడు కారణమని అంగీకరించాడు. జరిగినది జూదమూ, ద్రౌపదీ పరాభవమే గదా! కృష్ణుని మాటల్లో కర్ణునికి ద్రౌపదిపట్ల తనప్రవర్తనను గూర్చి దోషారోపణం చేసినట్లుగా అనిపించబట్టే తనకు ధర్మబలం కొరవడిందనీ, ఓడిపోక తప్పదనీ గ్రహించినట్లు స్పష్టమవుతోంది. ఇది ఒక విధంగా అతడు పశ్చాత్తాపాన్ని ప్రకటించడమే.[2]

---

1. ఉద్యోగ - 4 - 42
2. ఈసదర్భంగా మూలంలో

"యద్బ్రువ మహంకృష్ణ కటుకానిస్మ పాండవాన్,
ప్రియార్థం ధార్తరాష్ట్రస్య తేన తప్యేహ్యకర్మణా,

(కృష్ణా! నేను దుర్యోధన ప్రీతికై పలికిన దురుక్తులకు పరితపిస్తున్నాను.)

"యదా ద్రక్ష్యసి మాం కృష్ణ నిహతం సవ్యసాచినా,
పునశ్చితిస్తదాచాస్య యజ్ఞస్యాథ భవిష్యతి!"

(అర్జునునిచే నిహతుడనైన నన్ను నీవెప్పుడుచూస్తావో అప్పుడు రణయజ్ఞంలో చయనమయినట్లే) అని కర్ణుడు చెప్పినట్లుగా ఉంది కనుక అతడు ద్రౌపదిని అవమానించినందుకు పశ్చాత్తాపపడి, అర్జునుని చేతిలో ఓడిపోవడానికి సంకల్పించు కొన్నాడని స్పష్టమవుతోంది.

ద్రౌపది వంటి మహా పతివ్రతను గూర్చి శ్రీకృష్ణుని వంటి మహానుభావుడు కర్ణునితో ఇలాచెప్పడం ఎంతవరకూ సమంజసం? అనేవిషయానికి వస్తే, అర్జునుడు చెప్పినట్లుగా "అచ్యుతుఁడు సమస్త ధర్మ పరిశోధకుఁడు",[1] అతనిమాటలను లోకరీతిలోకాక పరమ ధర్మం ప్రకారం మాత్రమే విచారణచేయవలసిఉంటుంది.

నిజంగా ద్రౌపదిపట్ల కర్ణునికే గనుక వ్యామోహం ఉండి, ఆ కారణంగా యుద్ధం ఉపశమించే అవకాశమే ఉంటే, ఆ అవకాశాన్ని కూడా వినియోగించి, అశేషజనక్షయాన్ని ఆపటానికి చిత్తశుద్ధితో చిట్టచివరిగా కృష్ణుడు చేసిన ప్రయత్నం ఇది.[2] కృష్ణునికి లోకసామాన్యమైన

1. ఉద్యోగ - 4 - 92

2. "...కౌరవపక్షము కర్ణుని యందాధారపడి యున్నందున, నేయుపాయముచేనైనను కురుపక్షము నుండి కర్ణుని విడదీసినచో దుర్యోధనుడు యుద్ధమును విరమించుకొనుననియు, నంతటితో లోకోపద్రవమణఁగిపోవుననియు, లేక దుర్యోధనుడు కర్ణవిహీనముగానైనను యుద్ధసన్నద్ధుడైనచో నపుడతనిని సునాయాసముగా జయింపవచ్చుననియు, నందుచే విశేషమైన జననష్టము తొలఁగిపోవుననియు, నటుపిమ్మట కార్యవిధానమును తత్కాలోచితముగా నాలోచించుకొనవచ్చుననియు తలంచి శ్రీకృష్ణుడు భేదోపాయమవలంబించెననుట మాత్రము నిశ్చయము. ఈభేదోపాయము సఫలమైనచో లోకోపద్రవము తొలఁగిపోయినను ద్రౌపది మాత్రము కర్ణునిం గైకొనుననుమాట యసత్యము ద్రుపదమహారాజు కొమార్తయై, పంచపాండవులకు భార్యయై, వీరశ్రేష్ఠులయిన కుమారులంగని తిరిగి యిపుడామె కర్ణునిం గైకొనుననుట తలంపఁ గూడని వాక్యము. ఏది యెట్లున్నను శ్రీ కృష్ణుడు మాత్రము జగత్కల్యాణార్థ మెంతవరకు ప్రయత్నింప వలయునో యంతవరకు ప్రయత్నించెననుట నిశ్చయము. శ్రీకృష్ణుడు గూడ ద్రౌపది కర్ణునిం గైకొనునని తలంచి యుండడు." శ్రీ మహాభారత రహస్యము, 1938. శిష్టా సూర్యనారాయణశాస్త్రిగారు, వావిళ్ళ వారి ప్రచురణ.

"ఇవన్నీ ఆతడి హృదయపులోతులు కనుగొనేందుకు కృష్ణుడు పలికిన పలుకులు. అప్పుడు కర్ణుడు స్నేహానికే ప్రాధాన్యమిస్తాడు. ...కర్ణుడి హృదయంలోని ఈస్నేహశీలతను లోకానికి తెలియజెప్పటానికే కృష్ణుడు ఆ సన్నివేశాన్ని కల్పించాడు..."

భారతం - ధర్మాద్వైతం, పుట - 121

రీతులూ, నీతులూ, మొహమాటాలూ ఈ మహా ప్రయత్నంలో గుర్తు లేవని, జగత్కల్యాణాన్ని మాత్రమే అతను దృష్టిలో ఉంచుకున్నాడనీ దీనినిబట్టి గమనించవలసి ఉంది. కృష్ణుడు ఇలా మాట్లాడటంవల్ల ద్రౌపదీ పాతివ్రత్యానికి భంగం కలిగినట్లు ఎంతమాత్రమూ కాదు. కర్ణుడు ఆమెను 'బంధకి' అన్నంత మాత్రంచేత ఆమె బంధకి కానట్లు గానే, కృష్ణుడు కర్ణుని ఆమె ఆరవభర్తగా పొందుతుందన్నంతమాత్రం చేత కర్ణుడు ఆమెకి ఆరవభర్త అయిపోలేదని గమనించవలసి ఉంది.



## 11. బెడిసిన తంత్రం

లోకంలో ఏకార్యమయినా సాధించబడేది ముఖ్యంగా సంకల్పబలంవల్ల. పాండవులకు సంఖ్యాబలం తక్కువే అయినా సంకల్ప బలం చాలాఎక్కువ. కౌరవులపక్షాన పదకొండు అక్షౌహిణుల సైన్యం ఉన్నప్పటికీ వారు ఓడిపోయారంటే వారికి సంకల్పబలం కొరవడిందని చెప్పక తప్పదు. పాండవుల వైపున యుద్ధంలో పోరాడినవారందరూ ధర్మపక్షాన నిలిచి, అధర్మాన్ని ఎదిరిస్తున్నాం అనే దీక్షతోను, ఉత్సాహంతోను పోరాడారు. కౌరవుల పక్షాన భీష్మ, ద్రోణ, అశ్వత్థామల వంటి మేటివీరులు ఉన్నారు. వారంతా శస్త్రాస్త్రవిద్యల్లో సాటిలేని వారు. మామూలుపరిస్థితుల్లో వారిని ఎదిరించి జయించడమన్నది ఎంతటి వారికీ సాధ్యంకాని విషయం. ద్రౌపదీపరాభవవేదిక వారిపాలిట సర్వోన్నతన్యాయపీఠిక అయింది. ధర్మంచెప్పమని ద్రౌపది సభను నిలదీసి ప్రశ్నించడం, వారంతా కళ్లెదుట జరుగుతున్న అన్యాయానికి సాక్షిమాత్రులుగా ఉండిపోవడం వారిలో ఒకవిధమైన పరితాపం (guilty conscience) కలగడానికి దారితీశాయి. వారంతా తప్పనిసరి పరిస్థితుల్లో యుద్ధానికి తలపడ్డవారే కానీ వారికంటూ పాండవులపై ఏవిధమైన ద్వేషమూ లేదు. అపైన, పాండవులంటే అన్యాయం చేయబడి, కష్టాల పాలైనవారూ, ధర్మానికి నిలబడగలిగినవారూ అనే ఒకవిధమైన సానుభూతికూడా వారికి ఉంది. పాండవులతో వైరం వద్దు వద్దంటూనే వారు యుద్ధంలో పాల్గొన్నారు. ఆఖరికి, ఆశీర్వదించమని వెళ్ళినప్పుడు దుర్యోధనుణ్ణి అతనితల్లి గాంధారికూడా ఎటు ధర్మముంటే అటు జయం కలుగుతుందని అన్నదేకాని 'జయోస్తు' అని మనసారా దీవించలేకపోయింది.[1] ఈపరిస్థితి కంతటికీ మూలకారణమన

---

1. "ఈతఁడు రణంబునకు నెత్తి చనుచుండియును నెంతయును భక్తిఁగని నాకుం
ప్రీతియెసఁగంబలికి ప్రేమమొలయంబొగిడి పెద్దయు వినీతి నిరతుండై
చేతులుమొగిడ్చి జయ సిద్ధియుఁగ దీవన విశిష్టదయ నిమ్మనిన ధర్మం
బేతల ననూనమగు నద్ధజయమాతలకు నెట్లయిన సిద్ధమగు నంటిన్." స్త్రీ-2-29

దగినది ద్రౌపదికి కురుసభలో జరిగిన పరాభవం.

జూదమూ, ద్రౌపదీపరాభవమూ పాండవుల సిరిని అపహరించటానికీ, పాండవుల్లో అతఃకలహాన్ని కల్పించటానికీ ఉద్దేశింప బడ్డాయని చెప్పవచ్చు. పాండవులు, కౌరవులు ఆశించినట్లుగా తమ సంపదలు పోయినందుకు విచార పడకపోగా, ద్రౌపది విషయమై ఏవిధమైన తొందరపాటుకూ లోనుకాక ఎంతో నిగ్రహంతో ప్రవర్తించారు. భీముడు ద్రౌపది అవమానానికి ఓర్చుకోలేక ఆవేశంలో ధర్మజుని "భవద్బాహు దాహంబుసేయవలయు" నని నిందించినా, అర్జునుడు వారించడంతో తగ్గిపోయాడు. ఆతరువాత, లోకుల దృష్టిలో పాండవులు ఎన్నోకష్టాలకులోనయినప్పటికీ తమకు తాముగా ఏలోటూ లేకుండా మహేంద్ర వైభవంతో గడిపారు.[1] కౌరవులు తాము ఆశించిన ప్రయోజనాలను పొందలేకపోగా తామే ఎన్నోకష్టనష్టాలకు లోనయ్యారు. ద్రౌపదీ పరాభవ పర్యవసానంగా కురుప్రముఖుల్లో అభిప్రాయ భేదాలు తలెత్తాయి. ఆ తీరును పరిశీలిద్దాం.

విదురుడు మొదటి నుంచీ కౌరవుల ప్రయత్నాలను వ్యతిరేకిస్తూ వచ్చాడు. పాండవులు అడవులకు వెళ్ళి ఆతరువాత ఏమి చేస్తారు? అని ధృతరాష్ట్రుడు అడిగినప్పుడు, విదురుడు ధర్మోన్మహా మాటంగా, పాండవుల ప్రభావాన్ని వర్ణించి చెప్పి, దుర్యోధనుణ్ణి వదలివేసి ధర్మజుని పిలిపించి, రాజ్యం అంతా అతనికి అప్పగించవలసిందని చెప్పాడు. ధృతరాష్ట్రునికి కోపంవచ్చి విదురుని పాండవపక్షపాతివని నిందించి, 'నావద్దవద్దు, వారిదగ్గరకే వెళ్లు' అని పంపివేశాడు. ఈ

1. వనవాసము సేసియు(ద్రి)భు
వనరాజ్యముసేయునట్టి వడువున సంతో
షనిబద్ధబుద్ధి యగు యమ
తనూజునకు ... ... ... " అరణ్య - 1 - 66.

విధంగా ఆ అపూర్వసోదరుల మధ్యనే వైమనస్యం కలిగిందంటే తక్కిన వారిసంగతి చెప్పేదేముంది? ధృతరాష్ట్రుడు ఆతరువాత బాధపడి సంజయుని పంపి విదురుణ్ణి వెనక్కి రప్పించుకొన్నాడు, అది వేరు విషయం.

అజ్ఞాతవాసంలో ఉన్న పాండవులను బయల్పరచడానికి విరటుని గోవులను ఉత్తర దిక్కున గ్రహించబోయిన కౌరవులు, "వచ్చినవాడు ఫల్గుణుడ"ని తెలుసుకొని తమలోతాము కలహించుకొన్నారు. ఆసందర్భంలో ద్రోణుని నిందించిన దుర్యోధనుణ్ణి ఉద్దేశించి అశ్వత్థామ,

"సమరమున గెల్చి యొరురా
జ్యముగొనియును సుజనుఁడిట్టులాడఁడు సిరిజూ
దమునఁగొని రజ్జులేటికి
సమయంబరుదెంచెఁదాంటి చందము గలదే?

"పాండవ వీరులం గలన బాహుబలంబున నోర్చియే సము
ద్దండత నీవు దొల్లి ద్రుపదక్షితిపాత్మజఁగొల్వులోనికిం
దెంపని పుచ్చి తద్దెసకుఁ దెచ్చుట పౌబలునీతిఁ గాదె యా
తండ మరల్చుఁగాక సముద్రగత వచ్చు విరోధి నిప్పుడున్"[1]

అంటూ ద్రౌపదీ పరాభవ ఘట్టాన్ని గుర్తుచేసి, 'అప్పుడు ప్రముఖ పాత్ర వహించిన శకుని ఇప్పుడుకూడా ప్రముఖపాత్ర వహిస్తే బాగుంటుంది' అంటూ,

"కుటిలబుద్ధు లిచటఁ గొనవు నెట్టనఘున
దోర్బలంబు మెఱసి తొడరవలయు
నతఁడు గాండివమున నడ్డసాళులు నైవఁ
డురుల నంపవాన గురియుఁ గాని"[2]

అని హెచ్చరించాడు. దంభాలు పలికిన కర్ణునితో

1. విరాట - 4 - 193, 194 2. విరాట - 4 - 197

"తలఁకు గలదేని శకునిం
బిలిచి విచారింపఁ బొమ్ము పృథివీ పతినీ
తలన తనకార్యఖడ్గం
బుల మోపెక్కించె రిత్తవోవునె నీకున్"[1]

అని అవమానకరంగా పలికి, అతనికి కోపం వచ్చేలా చేశాడు. కర్ణుడు ఓడిపోతూండగా కూడా అశ్వత్థామ వేళాకోళంచేశాడు.

పాండవుల తరపున ముందుగా రాయబారానికి వచ్చిన ద్రుపద పురోహితుడు కురుసభలోని పెద్దలను ఉద్దేశించి,

"నారీరత్నము నట్లుదెచ్చి సభలో నన్వారలుం జూడఁగాఁ
జీరల్ ప్రోవులుగాఁగ నొల్చుటయు లచ్చిం బుచ్చికోలున్ మహా
ఘోరణ్యస్థలి నిల్వఁ బంచుటయు దైన్యవ్యక్తిమై పల్కులున్
సైరింపం జనుపాండవేయులకు నీసంధిక్రమం బొప్పదే!"[2]

అంటూ పలికేసరికి, కర్ణునికిపౌరుషం పొడుచుకు వచ్చి "...... దుర్యోధనున కయి శకుని జూదంబున మేదిని గెలిచె ధర్మపుత్రుండోడెన్, దీననేమి తప్పు? ..."[3] అనిప్రశ్నించాడు. కర్ణుని మాటలకు భీష్మునికి బాధ కలిగింది. వెంటనే కర్ణుని నిందించి, పాండవులు గడువు పూర్తి చేయడాన్ని వివరించాడు. దూత సమక్షంలో వీరిద్దరూ దెబ్బలాడు కోవడం ఇష్టపడని ధృతరాష్ట్రుడు ఇద్దరికీ సర్ది చెప్పి శాంతపరిచాడు.

సంజయుడు పాండవుల సందేశాలను, శ్రీకృష్ణుని హిత వచనాలను కౌరవసభలో వినిపించగానే భీష్ముడు నరనారాయణు లైన పార్థకృష్ణుల ప్రభావాన్ని వివరించి, దుర్యోధనుణ్ణీ, అతని మిత్రబృందాన్ని నిందించాడు. కర్ణుడు తాను దుర్యోధనునకు హితం చేస్తున్నాననీ, అందువల్లనే తనకు అతనివద్ద అంతటి మాన్యతకలిగిందనీ

1. విరాట - 5 - 23
2. ఉద్యోగ - 1 - 232
3. ఉద్యోగ - 1 - 249, 250

చెప్పాడు. అప్పుడు భీష్ముడు ధృతరాష్ట్రునితో కర్ణునిపరాక్రమాన్ని, దానిని నమ్మిన కౌరవుల అవివేకాన్ని తూలనాడాడు.

"మగఁటిమి వారికి వీఁడెదు
రుగనమ్మి సుయోధనుఁడు విరోధము గొని స
ర్వగుణాఢ్యులు బలవంతులు
నగుపాండునృపాలసుతుల నవమానించెన్"

"ఈ దుర్జాతుండు కర్జం బెఱుంగక నీతిబాహ్యుండై వలసినట్లు ప్రేలరి మాటలాడు చుండు నీవునుం గైకొని వినుచుండుదువు మేలు కాక... "[1] అని ఖండితంగా కర్ణునినోటిదురుసుతనాన్ని, అతనిమాట లకు విలువనిచ్చే కౌరవుల అవివేకాన్ని విమర్శించాడు.

ద్రోణాచార్యుడు ఆవెంటనే అర్జునునికి సాటి అనదగినవీరుడు లోకంలోనే లేడని చెప్పాడు.

వాగ్వాదం మరికొంతముదిరి ధృతరాష్ట్రుడు కూడా కర్ణుణ్ణి నిందించేసరికి కర్ణుడు సంక్షుభితమానసుడై భీష్మునితో,

"నీకు నాలావు తోడ్పాటు లేకయుండ
వలయు నీ తెగునంతకుఁగలన నిలువ
నాయుధంబులు విడిచితి నంతమీఁద
మెఱసి బలవిక్రమంబులు నెఱపువాఁడ"[2]

అంటూ ప్రతిజ్ఞచేసి, శస్త్రసన్న్యాసం చేసి, కొలువునుంచి వెళ్ళి పోయాడు. భీష్ముడంతటి మహానుభావుడు తనపాపకృత్యాలకు తనను నిందించాడని గ్రహించలేక భీష్మపతనాన్ని ఆకాంక్షిస్తూ, ఈ విధ మైనదారుణప్రతిజ్ఞ చేసి, కర్ణుడు స్వామిద్రోహం చేశాడనే చెప్పాలి. భీష్ముడూ, కర్ణుడూ ఏకకాలంలో పాండవబలాలతో పోరిఉంటే యుద్ధపు తీరు మరోవిధంగా ఉండేదికదా!

1. ఉద్యోగ - 2 - 161, 163 2. ఉద్యోగ - 2 - 289

శల్యుడు కౌరవపక్షాన చేరికూడా ధర్మరాజునికోరిక మేరకు
"కర్ణునిసారథినైనను
నిర్ణయమునకేను బార్థునిం గాచెదనా
దుర్ణయవిచారు నెమ్మెయిc
గర్ణ కఠోరంబు లాడి కలcతుంబోరన్"[1]

అంటూ 'హామీ' ఇవ్వడమేగాక, 'శల్యసారథ్యాన్ని' నిర్వహించాడు కూడా. ఇక్కడ కర్ణుని దుర్ణయవిచారుడనటం ద్రౌపదిని ఆతడాడిన మాటల కారణంగానే నని గమనించ వలసిఉంది.

కృష్ణుడు వచ్చి సంధికి ప్రయత్నించి, తిరిగివెళ్లిపోయాక దుర్యోధనుడు తండ్రికి తెలియకుండా ఉలూకుణ్ణి పాండవులవద్దకు పంపాడు. వాడుపోయి దుర్యోధనుడు చెప్పమన్నమాటలన్నీ చెబుతూ

"పవనజు గదయును నీగాం
డివమును నెటపోయె నంగడికిcబాంచాలిం
దివిచికొని వచ్చునెడcబరి
భవమెఱుcగవె? బీరమేల పలుకుదు తోడ్తోన్"[2]

అని అర్జునుణ్ణి అడిగినట్లుగా చెప్పాడు. తండ్రికికూడా తెలియకుండా దుర్యోధనుడు ఈవిధంగా రాయబారం పంపడం వారిమధ్యగల విభేదాలను సూచిస్తుంది. పాండవులు చేతకానివారుగనుక ద్రౌపదీ పరాభవాన్ని సహించి ఊరకున్నారని దుర్యోధనుడు భావించినట్లుగా దీనినిబట్టి తెలుస్తోంది.

ఈ ప్రకారంగా శకుని దుర్యోధనులు పాండవులమధ్య పరస్పర ద్వేషం కల్పించడానికి ప్రయత్నించి, భంగపడి, ఆ తంత్రం (జూదమూ, ద్రౌపదీపరాభవమూ) బెడిసికొట్టినట్లయ్యి తమలో తామే కలహించుకొని, తమపతనాన్ని తాము వేగిర పరచుకొన్నారు.

1. ఉద్యోగ - 1 - 112 2. ఉద్యోగ - 4 - 199

## 12. సమరాంగణ " సౌందర్యం "

ధర్మానికి తమనుతాము సమర్పించుకొన్న పాండవులు రాజ్యం పోయినందుకు బాధపడలేదు. తమ భార్య అవమానాల పాలయినందుకూ అంతగా బాధపడలేదు. అంగీకరించిన ప్రకారం అరణ్య, అజ్ఞాతవాసాలు నిర్వహించి, తాము ఏధర్మాన్ని పాటించారో దుర్యోధనాదులూ అదే ధర్మాన్ని పాటించాలని మాత్రం పట్టుపట్టారు. వారలా పాటించనందుకు ఎంతగానో బాధపడ్డారు. (లేకుంటే, అంతటి పాండవులు ' మీచేతులమీదుగా అయిదూళ్లు ఇవ్వండిమాకు, చాలు ' అని కౌరవులను దేవిరించ వలసిన పనేమిటి?)

కృష్ణుడు తన రాయబారం నెరవేరుతుందని పాండవులు ఎక్కడ ఆశపెట్టుకొంటారోనని ముందుగనే

"... సంధికిం బురుషకార మొనర్చెద నోపినంతయున్
దైవముచేత యెట్లగునొ దాని నెఱుంగ ... ..."[1]

నని స్పష్టం చేశాడు. అప్పుడు ద్రౌపది పాండవుల 'తీవ్రత గుందిన చందా'న్ని[2] గమనించి వారి పౌరుషాగ్నిని ప్రజ్వలింప చేయటానికి అన్నట్లుగా కృష్ణునికి 'తనమున్నుపడిన భంగపాట్లు' విన్నవించుకొంది.

కృష్ణుడు "... నీమెచ్చుగ శత్రుసంక్షయము మేకొని చేసెద..." నని ఆమెను అనునయించాడు.

పాండవులను యుద్ధోన్ముఖులను చేయడంలో ద్రౌపది సందర్భోచితంగా ప్రవర్తించి కృష్ణునికి ఎంతగానో సహాకరించింది.

పాండవులకు ఈ విధమైన దీనస్థితి రాయబారసందర్భంలో కలిగినట్లుగా అంతకు ముందుగానీ, యుద్ధ సందర్భంలోగానీ కలుగలేదు. కురుక్షేత్రయుద్ధానికి పూర్వం కౌరవులతో తలపడవలసి వచ్చినప్పుడు

1. ఉద్యోగ - 3 - 83 2. ఉద్యోగ - 3 - 90

పాండవులు, కౌరవులు బాల్యమాదిగా తమకు చేస్తూ వచ్చిన అప కారాలను, ద్రౌపదికి చేసిన అవమానాన్ని స్మరిస్తూనే యుద్ధం చేశారు.

పాండవులు అరణ్యంలో ఉండగా ఘోషయాత్రకని వచ్చి గంధర్వులకు చిక్కిన దుర్యోధనుణ్ణి విడిపించవలసిందిగా ధర్మరాజు ఆదేశించినప్పుడు భీముడు చిన్ననాటినుంచీ దుర్యోధనుడు చేస్తూ వచ్చిన ఎగ్గులను పేర్కొంటూ, "...జనులెల్లఁజూడంగ వనజాక్షిఁ బాంచాలిఁ దలవట్టి వలువలొలువఁ బనిచెఁ బుట్టినకోలె మనకు నక్కట సుయోధనుఁడెగ్గుసేయని దినము గలదె?..." అని అడిగాడు.[1]

అజ్ఞాతవాసావసానాన జరిగిన ఉత్తర గోగ్రహణ సందర్భంలో అర్జునుడు కర్ణుడితో తలపడినప్పుడు

"పలుకవచ్చుగాక పలికిన యట్టుల
చేయువచ్చునెట్లు దాయ యెందుఁ
బోయెదట్లు ద్రుపదపుత్త్రికఁ బరుపంగఁ
గాంచినగినఫలముఁ గందుగాక!"[2]

అని కోపంతో పలికి అప్పుడు తాను ధర్మపాశానికి భయపడి మిన్నకున్నా ననీ, ఇప్పుడు దానిఫలాన్ని అందజేసిగాని విడువననీ పలికాడు.

ఆ సందర్భంలోనే "దుష్పథద్యూత జయోద్ధతుడై"న దుర్యోధనుణ్ణి ఓడించి, అతడు పారిపోతూ ఉండగా

"... ... ... ... ... ...
కయ్యమున నోడిపోయినఁ గౌరవేంద్ర!
వినుము నాబుద్ధి మరలి యీ తనువు విడిచి
సుగతి వడయుము తొల్లింటి చూఅగలదె?
జూదమిచ్చట నాడంగరాదు సుమ్ము!"[3]

1. అరణ్య - 5 - 410 2. విరాట - 5 - 90 3. విరాట - 5 - 204

అని ఉపాలంభించాడు.

యుద్ధ సందర్భంలో సైంధవ వధకు ఉన్ముఖుడైన అర్జునునకు దుర్యోధనుడు అడ్డుపడినప్పుడు కృష్ణుడు 'ఇతడే మీ ఆపదలకెల్ల మూలం, ఇతణ్ణి జయించు' అంటూ ఉత్సాహ పరచగా అర్జునుడు

"ద్రౌపది వడ్డబన్నము లుదగ్రత మేదినిఁ బెద్దకాల మి
చ్చా పరతంత్రుఁడై తన వశంబుగఁ జేసిన వీనిగర్వముం
గోపము వెంపదే మనము గుందఁగఁ జేయదె యింత సెప్పనే
లా పొరిగొందు నీతనిఁ జలంబు బలంబును నీవు మెచ్చగాన్"[1]

అంటూ విజృంభించాడు.

అస్త్రసన్యాసంచేసి యోగమార్గాన సమాధిస్థితిని పొందిన ద్రోణుని కంఠాన్ని ధృష్టద్యుమ్నుడు తెగనరికినందుకు అర్జునునికి కోపంవచ్చింది. అతడు ధర్మజునితో "వద్దంటున్నా వినకుండా ఈ ధృష్టద్యుమ్నుడు అధర్మానికి ఒడికట్టాడు. కోపంతో ఎత్తివచ్చే గురుపుత్రుని ఎదిరించి ఇతనిని రక్షించడం ఎవరితరం? అన్నాడు నిష్ఠూరంగా. ఆ మాటలకు భీమునికి కోపంవచ్చింది.

"నీవు అడవుల్లో ముక్కుమూసుకొని తపస్సుచేసే తాపసుల మాదిరి మాట్లాడుతున్నావు. రాజనీతిని పూని వచ్చినవాడు ఇలాంటి చావులకు ఒప్పుకోవలసిందే. ధర్మనిష్ఠ ఎక్కడ ఉంది అసలు? ఆనాటి సభలో ద్రౌపదికి జరిగిన అన్యాయానికి మనం ఇలాంటివి ఎన్ని చేసినా మనకి పాపం అంటదు." అని ద్రోణవధను సమర్థించాడు.[2]

---

1. ద్రోణ - 3 - 188
2. "అడవుల నుండు తాపసుల యట్టులు వల్కెదు రాజనీతి యి
ట్లాడఁబడి చేయవచ్చి వధ కొల్లమి యొప్పునె ధర్మనిష్ఠ యె
క్కడఁ గల దాసభన్ ద్రుపదకన్యక పాటున కిట్టి వెన్నియుం
గడుకొని చేసినన్ మనలఁ గల్మష మొందఁగ నేర దర్జునా!" ద్రోణ-5-357

అశ్వత్థామ నారాయణాస్త్రాన్ని ప్రయోగించినప్పుడు అర్జునుడు ప్రత్యస్త్రప్రయోగం చేయలేదు. సైన్యం అంతా కలతపడి పోతోంది. అప్పుడు ధర్మరాజు కృష్ణార్జునులు వినేటట్లుగా సాత్యకి, ధృష్టద్యుమ్నులను చూస్తూ,:

" ఆసభఁ బాంచాలి గాసిసేయఁగ నుపే
క్షకుఁడయి చూచెఁబెక్కండ్రఁగూర్చి
కొని బాలు నభిమన్యుఁ గూల్చె నించుకవడి
యాఁగిన నర్జునుఁ డగ్నిఁ జొచ్చు
ననువగ మనల నాతనికిఁ దోడ్పడఁబోవ
నీకాఁగె నమ్మెయి నిట్టిధర్మ
పరుఁడైన కలశసంభవుతోడ సరివచ్చు
టుచితంబె యీవచ్చు నుజ్జ్వలాగ్ని
వలని కరిగెద వీరు వీవాహినులును
బాతి పొం డెక్కుడేని నప్పార్థుకోర్కి
యంత సఫలతఁ బొందెడు నచ్యుతుండు
నెల్లు దనకు రుచించెఁదా నట్లుసేయు"[1] నన్నాడు.

పాంచాలీ పరాభవాన్ని ఉపేక్షించడం వంటివి ద్రోణునిపట్ల దోషాలనీ, అవి కారణంగా అతడు వధ్యుడనీ ధర్మరాజుకూడా తలచినట్లుగా ఈ మాటలవల్ల తెలుస్తోంది.

భీముడు కర్ణుణ్ణి మూర్ఛితునిచేసి కోపంతో అతని నాలుకను కోయబోయాడు. "అలాచేస్తే చచ్చిపోతాడు, ఇతణ్ణి చంపడానికి ప్రతిన పట్టిన అర్జునునిపంతం నెరవేరదు. కనుక వదలివెయ్యి" అని శల్యుడు వారించాడు. అప్పుడు భీముడు, " ఈకర్ణుడు ధర్మజుణ్ణి బాధించడంవల్ల

1. ద్రోణ - 5 - 379

ఇలా చేయబోయాను. నీవు చెప్పినట్లే నాలుక కోస్తే చస్తాడని తెలుసు. కానీ, వీడు సభలో ద్రౌపదిని ఉద్దేశించి ఆడిన అసభ్య వచనాలకు కలిగిన కోపాన్ని ధర్మజుని నిమిత్తంగా ఇన్నాళ్లూ అణచుకొని ఉండి అవకాశం వచ్చిందికనుక నేడు ప్రతీకారం చేద్దామనుకున్నాను. నేనలా చేస్తే అర్జునుడు బాధపడతాడు. ఆసంగతి గుర్తుచేసి నీవునాకు మేలు చేశావు" అనిపలికి కర్ణుణ్ణి వదలి వెళ్లిపోయాడు.[1]

కర్ణునిచే అవమానించబడి శిబిరానికి తిరిగివచ్చిన ధర్మజుని దగ్గరకు అతనిక్షేమాన్ని తెలుసుకోవడానికై కృష్ణార్జునులు వచ్చారు. వారు కర్ణుని చంపి తనకు ఆవార్తను తెలిపి ఆనందింపచేయటానికి వచ్చారనుకొని ధర్మరాజు వారిని అభినందిస్తూ మాట్లాడాడు.

ఆసందర్భంలో

" పలికిన నేమి బీరములు పల్కుట సేవకనీతి యాసభం
బలుకునె యట్లు జూదపునెపంబున ద్రౌపది నింతకాల మ
ప్పలుకు లలంచు చుండె మదిఁ బాయవు గీతినయమ్ములట్లదో
ర్బల దృఢలీల నిప్పుడవి వాపితి తీర్చితలంత యంతయున్"[2]

కర్ణునిమాటలు ధర్మజుని మనస్సును ఎంతగా బాధించాయో ఈ సందర్భంగా తెలిసింది. కర్ణుడంటే ధర్మజునికి చాలాభయం. అరణ్యవాసంలో భీమునితో

" వినవయ్య కర్ణు గర్వం
బనినాతఁడభేద్య కవచుఁ డగుటయు విలునే
ర్పును నతని బాహువిక్రమ
మును దలఁచిననాఁడు గన్నుమూయదు నాకున్"[3]

అని అతడు చెప్పాడు. అలాంటి కర్ణుణ్ణి అర్జునుడుయుద్ధంలో తప్పక జయి

1. కర్ణ - 2 - 214 2. కర్ణ - 3 - 36 3. ఆరణ్య - 1 - 270

స్తాడని ఎంతగానో ఆశ పెట్టుకున్న ధర్మరాజుకి అర్జునుడు కర్ణుణ్ణి చంపకుండా తిరిగివచ్చేసరికి ఎక్కడలేనికోపమూ వచ్చింది. అర్జునుణ్ణి నానామాటలూ అన్నాడు. అర్జునుడు "ఎల్ల భంగుల నేఁడు రాధం బుత్త్ర రహితం జేసెదఁ గాదేని గొంతియైన నట్టిదయగుంగాక!"[1] అని ప్రతిజ్ఞ చేశాడు. అతనిపూనిక నెరవేరేలా కృష్ణుడతణ్ణి ఉత్సాహ పరుస్తూ మాట్లాడాడు. ఆసందర్భంలో దుర్యోధనుని దుర్నయాలన్నింటికీ కర్ణుడే మూలం అనిచెప్పి "... అట్లుగాక జూదంబునప్పుడా సభలోన ద్రౌపది నుద్దేశించి యప్పాపాత్ముండు

"లేరిచట మగలు నీకును
వీరలు జూదమున నోడి విడిచిరి నిన్నున్
వారిజలోచన నీపైఁ
గూరిమిగల మగని వెదకికొను మొరుననఁడే"[2]

అని ఆనాటి అల్పుమాటలను గుర్తుచేశాడు. తాను సంధికి వెళ్ళినప్పుడు తనను పట్టించబోయింది కూడా ఇతడే అని చెప్పాడు. సభలో ఆతడు చేసిన దుర్నయాలను చూసి బాధపడిన బంధువులు అతణ్ణి గ్రద్దలు తోలుచుకు తింటూ ఉండగా చూడాలి గదా, కనుకనీవు శోకాన్ని వీడి లోకాలు పొగడేలా పూనిక నెరవేర్చుకో" అని ప్రబోధించాడు.

భీముడు దుశ్శాసనునితో తలపడినప్పుడు 'ప్రమోదభరిత చిత్తుండయి' ఇలా చెప్పాడు:

"ఆసభలోనఁ గొన్నబుణ మంతయు నీఁగఁగఁ గంటి వడ్డితో
బాసకొకింతయుం దొలఁగఁబాటుకు తీర్చెదఁబ్లు నేఁడు నా
చేసినపుణ్య మెవరును జేయరు నిన్నిటు సేఁదెమ్చుటం
జేసి విధాత నాకుఁగృపసేయుటగానఁగ వచ్చెఁ దమ్ముఁడా!"[3]

1. కర్ణ - 3 - 96  2. కర్ణ - 3 - 122, 123  3. కర్ణ - 3 - 195

బెబ్బులి లేడికొదమను పొద్దివేటట్లుగా ఆదుశ్శాసనుణ్ణి పొదివి మెడ త్రొక్కి గర్వంగా

"మును సభఁ బలికినదానం
దనివోవక యిచ్చటికి వెదకి వచ్చితి వే
మనియెదవను నీమాటలు
వినుటకు నాకినుక సాల వేడ్కపడియెడున్"[1]

అంటూ, దుర్నిరీక్ష్యంగా విజృంభించి, 'ప్రతిజ్ఞాకరణ పూరణంబాచరిం'చాడు. కోపం చల్లారక మృతుడైన దుశ్శాసనుణ్ణి చూసి,

"పై పడిపోయెఁగాన ధృతరాష్ట్రుఁడు గన్నది యేమి యాసభం
దావల దన్నఁగీడుడుగదా? పతిలేఁడనఁ బద్దకాంతనేఁ
డీవు గనుంగొనంగఁ బతియేడ్చె అ నొప్పె 'బతుల్ విజృంభిత
శ్రీ విలసిల్లు కామినులు సేడ్పడిరిట్లుపతిత్వ దీనతన్'"[2]

అని పలికి, తనప్రతిజ్ఞల్లో ఒకటి నెరవేరిందనీ, రెండోదికూడా తీర్చుకొంటాననీ చాటాడు. కౌరవస్త్రీలను 'కామినులు' అనడం ద్రౌపదిని 'బంధకి' అని వారనడానికి బదులు అన్నమాట!

కర్ణార్జునులు ద్వంద్వయుద్ధానికి తలపడుతున్నప్పుడు కర్ణుడు శల్యుణ్ణిఅడిగినట్లుగానే అర్జునుడు కృష్ణుణ్ణి అడిగాడు-'ఒకవేళ కర్ణుడు నన్ను ఓడించాడే అనుకో, నీవేంచేస్తావు?' అని. కృష్ణుడు నవ్వుతూ 'అలాజరగడం అసంభవం, ఒకవేళజరిగితే, కర్ణశల్యులనే కీటకాలను నేల కూల్చి, కౌరవులను పీనుగుపెంటలుగా చేసి, ధర్మజునికి పట్టంకడతాను' అని చెప్పాడు. అర్జునుడు ఎంతగానో సంతోషించి, 'నవ్వులాటకు అలా అడిగాను, కర్ణశల్యుల క్రొవ్వణచడం నాకుఅశక్య

1. కర్ణ - 3 - 206 2. కర్ణ - 3 - 224

మేమిటి? కొలువులో ద్రౌపది పొందిన అవమానంవల్ల కలిగినతీవ్ర దుఃఖాన్ని సమయనిష్ఠతో ఇంతకాలమూ ఎలాగో భరించాను. ఇప్పుడింక సాక్షాత్తూ ఆ త్రిమూర్తులే దిగివచ్చి అడ్డుపడితే మాత్రంఈకర్ణుణ్ణి మట్టుపెట్టక మానుతానా?' అంటూ విజృంభించాడు.[1]

బ్రాహ్మణశాపంవల్ల యుద్ధంలో రథచక్రం భూమిలో దిగబడిపోయినప్పుడు కర్ణుడు దానిని పైకి తీసుకొనేవరకూ యుద్ధం ఆపుచేయవలసిందిగా అర్జునుణ్ణి అడిగాడు. అప్పుడు కృష్ణుడు కల్పించుకొని, 'న్యాయం, ధర్మం నీకు ఇప్పుడు కావలసివచ్చాయా? దుర్యోధనుడు పాండవులకు చేసిన అపచారాలన్నింటికీ నీవుకదా మూలం! ఈ ధర్మం అప్పుడేమయింది?' అని అడుగుతూ, వరుసగా కౌరవుల దుశ్చేష్టలను పేర్కొన్నాడు. వానిలో 'ద్రుపదాత్మజం దెచ్చి సభాస్థలి నమ్మొయి భంగపఱచ' డం కూడాగుర్తుచేశాడు. కృష్ణుని మాటలతో అర్జునునిమనస్సునగలరోషానలం అంతకంతకీ అధికమయ్యింది.[2] అప్పుడు అతడు కృష్ణుడు చెప్పినప్రకారం బాణప్రయోగం చేసి కర్ణుని శిరస్సును ఖండించాడ.

దుర్యోధనునితో గదాయుద్ధానికి తలపడనున్న భీముని ఉత్సాహపరుస్తూ శ్రీకృష్ణుడు "ఒకవిధ్వంసనమా చరించితివి..." ఇత్యాదిగా పొగిడి,

"తులువతనంబునన్ సభకు ద్రోవది ముందల పట్టి యీడ్చియ
ట్లలరఁగఁజూచి నీవు దగ నాడిన రెండుఁదెఱంగులందుఁబెం
పొలయఁగ దుస్ససేనుపనియొక్కటి దీర్చితి తీర్పుమింక బా
హులకసి వోవ వీనిపనియుం త్వరితక్రమ విక్రమంబునన్"[3]

అంటూ రెండో ప్రతిజ్ఞను కూడా తీర్చుకో అని తొందరపెట్టాడు.

1. కర్ణ - 3 - 259 నుంచి 262 వరకు . కర్ణ - 3 - 353 నుంచి 357 వరకు .
3. శల్య - 2 - 126

భీముడు దుర్యోధనునితో తలపడి యుద్ధం చేస్తూ ఉండగా శ్రీకృష్ణుడు అర్జునునితో భీమదుర్యోధనుల తారతమ్యాన్ని నిరూపించి, "మాయలుగలపగఱ మాయాప్రకారంబులం బరిమార్చుటయ తగున'ని చెప్పగా అర్జునుడు తొడలపై కొట్టవలసిందిగా సంజ్ఞ చేశాడు. భీముడు దానిని గ్రహించి దుర్యోధనునితొడలు విరగ్గొట్టాడు. నేల కూలినదుర్యోధనుణ్ణి సమీపించి భీముడు

"ఏకవస్త్రఁ బాంచాలి నట్లీడ్చి తేరఁ
బనిచి సభలోనఁ బలికిన పాపఫలము
ననుభవింపుము దుష్టాత్మ యనుచు వామ
చరణమున బెట్టిదముగాఁగ శిరము దన్నె"[1]

అప్పటికీ కోపం తీరక, వానిని తీవ్రంగా నిందించి, తనవారిని చూస్తూ,

"శంక లేక కడఁగి సభకట్టు పాంచాలి
నంటరానిదాని నొంటిచీర
తోన యున్నసాధ్వి వేనలివట్టియీ
డ్పించినతనిఁ జూడుఁ డుంచుఁ బొదలి

"పాంచాలి సేసినతపంబు పెంపున నీ శోభనంబు సమకూరెను"[2] అని పలికాడు.

అప్పుడు శ్రీకృష్ణుడు; అక్కడివారికి భీముడు గదాయుద్ధ ధర్మానికి భిన్నంగా దుర్యోధనుణ్ణి కూల్చాడనేశంక కలుగకుండా,

" చక్కటి లేనియాలమునఁ జంపె ననన్ వల దీదురాత్మకుం
డక్కటికంబు లేక సతి నంతలు సేసినను గృపారతిం
దక్కక తండ్రిపాలడిగె ధర్మజుఁ డన్నెతి సేయఁడయ్యె వీఁ
డుక్కివుఁ డిట్టిచావునకు యుక్తుఁ డగుం దలపోసిచూడఁగన్"[3]

అని ప్రకటించాడు.

1. శల్య - 2 - 278  2. శల్య - 2 - 283, 284  3. శల్య - 2 - 321

దుర్యోధనుడు కృష్ణుని మాటలకు ఎంతో బాధపడి నిందిస్తూ పాండవులజయం సక్రమమైనదికాదు అన్నాడు. అప్పుడు కృష్ణుడు చిన్నప్పటి నుంచీ పాండవులకు అతడు చేసిన అపకారాలను ఏకరవుపెట్టి, "...ధర్మేతరచరిత్రుం డగునజాతశత్రుసంపదలఁ గపట ద్యూతంబున నపహరించి తంతఁ దనివింబోక యాజ్ఞసేని నేకవస్త్ర రజస్వలం గొలువు లోపల భంగపెట్టి తాఁప్రొద్ద నిన్ను నిట్టి దురవస్థకుఁ చేరందగి యుండె..." నని అతని దుష్కృత్యాలే అతని దురవస్థకు కారణమని స్పష్టంచేశాడు.

ఈవిధంగా ద్రౌపదీపరాభవస్మరణం యుద్ధం అనివార్యం అయినప్పుడు పాండవపక్షవీరులలో సమరోత్సాహాన్ని కలిగించడానికీ, అజేయులైన కురుపక్షవీరులను వారివారికి తగినట్లుగా సంహరించడానికీ ఎంతగానో దోహదంచేసింది.

కౌరవపక్షంవారు కూడా యుద్ధం చేస్తూ ద్రౌపదీ పరాభవాన్ని స్మరించుకొని, నిరుత్సాహులయ్యారు. వారందరి హృదయాల్లో తామంతా దోషులమనేభావం (Guilty Conscience), పశ్చాత్తాపం కలిగి, వారు దుర్యోధనపతనాన్ని, పాండవ విజయాన్ని ఆకాంక్షిస్తూ యుద్ధంచేశారు. ఆప్రకారాన్ని ఇప్పుడు సమీక్షించుకొందాం.

అర్జునుడు భీష్మునితో తలపడి కౌరవసైన్యాలను చీకాకు పరుస్తూండగా, భీష్ముడు ద్రోణునితో అర్జునుని పరాక్రమాన్ని ప్రశంసిస్తూ, 'ఇతడు మూడవకన్ను తెరిచిన త్రిపురవైరిలా ఉన్నాడు. మనసైన్యాన్ని నిర్వహించడం కష్టంగాఉంది, వెనుకకు మరలిద్దాం' అంటూ

"కృష్ణసారథ్యముననొప్పు క్రీడి యిపుడు కౌరవానీకముల కెల్లఁగసిమసంగి
కృష్టసారథ్యమున నొప్పు క్రీడియైన నెట్లు సేయంగవలయుఁదానట్లుసేసె"[1]

---

1. భీష్మ - 2 - 92

నన్నాడు. పరాభవించబడిన ద్రౌపది సారథ్యంలో అర్జునుడుంటే ఎలాచేసేవాడో శ్రీకృష్ణుని సారథ్యంలో ఇప్పుడు అలావిజృంభిస్తున్నా డని భీష్ముడు చెప్పడం విశేషం.

భీముడు సునాభుడు మొదలైన కురుకుమారులను సంహరించి నప్పుడు ఆ సమీపానగల రాజులందరూ

"నాఁడు సభ నాడినంతయు నేఁడ చేయు
నట్టు లున్నాఁడు మొనతల ననిలసుతుఁడు
... ... ... ... ... ..."[1]

అనుకొంటూ, విదురుడు చెప్పినకురుకుల నాశనం కళ్లముందు జరుగు తోందని ఆశ్చర్యంగా చూస్తూఉండిపోయారు. ఇక్కడ 'నాఁడు' అని రాజులు అనుకోవడం ద్రౌపదిని కౌరవులు అవమానించిననాఁడు అనే అర్థంలోనే.

జూదంనాడు కర్ణుడు బింకంగా అన్నిమాటలాడి ద్రౌపదిని అవమానించినా చివరిదశలో అతడు దోషభావనతో పశ్చాత్తాపానికి లోనయ్యాడు. శరతల్పగతుడైన భీష్ముని సందర్శించి యుద్ధానికి అను జ్ఞను ఇమ్మని కోరినప్పుడు భీష్ముడు కర్ణుణ్ణి ఎంతో ప్రేమతో చేరదీసి, 'పాండవులతో వైరంమాని కలసిఉండు' అని ప్రబోధించాడు. అప్పుడు కర్ణుడు ఎంతో వివేకంతో పాండవులు ధర్మపరులు అని అంగీకరిస్తూ,

"మాటలు పెక్కులాడి యనుమానములేక సభం గడంగి ప
ల్మాటుఁ బరాభవించితిఁ జలంబునఁ బాండవకోటి కెప్పుడుం
జేటు దలంచి యే బలువు సేసితి వైరము నాకునింక నీ
వీటికి వారి వీటికిని వెక్కస మయ్యెడు కయ్య మొప్పగున్"[2]

అనిచెప్పి పాండవులు జయిస్తారని కూడా సూచించాడు.

ద్రోణుని నాల్గవనాటి యుద్ధంలో దుశ్శాసనుడు సాత్యకిని

1. భీష్మ 3 - 74 2. భీష్మ - 3 - 448

అడ్డగించి, అతని చేతుల్లో ఓడిపోయి, ద్రోణుని వద్దకు పారిపోయిరాగా, ద్రోణుడు వ్యంగ్యంగా "ఏమి యువరాజ విభునకు సేమమె..."[1] అంటూ ఆక్షేపించాడు. అక్కడితో వదలక, "భీమార్జునుల బారింబడి యేమి గాఁగల వాఁడవు?" అంటూ,

"మఱచితె యాసభన్ భువనమాన్య గుణోత్తర యాజ్ఞసేని నీ
పఱచినపాటుఁ బాండవులఁ బల్కిన పల్కులు నాఁటి క్రొవ్వనే
డ్రై అయును నెందుఁబోయె రణధీరుల వారల నల్గఁజేసి సి
గ్గఱి తుదినిట్టులెటి తగునక్కట తియ్యన గావె ప్రాణముల్"[2]

అని పలికి అధిక్షేపించాడు.

సైంధవుని వద్దకు అర్జునుని, సాత్యకిని, భీముని చేరనిచ్చినందుకు దుర్యోధనుడు ద్రోణుని నిందించి పలికాడు. అప్పుడు ద్రోణుడు తను చేయగలిగిందంతా చేస్తానని చెబుతూ,

"... ... ... ... ... ... ... ... ... ...
... ... ... ... ... ... ... ... ... ...
వినుము విశిష్ట కార్యమవనీవర! సైంధవుఁగాచికోల యు
జ్ఞనునకు నీకునుం గలిగె జూదము నాఁడధికంపుటొడ్డుగన్.

"మును శకునిబుద్ధిమై గెలి
చినయది యస్థిరపు గెలుపు సెడ కీజూదం
బున వెడలుపాటు నూవే
మనవెరవును లావుకలిమి మనుజాధీశా."[3]

అన్నాడు. 'శకునిది మామూలుజూదం. అప్పటిపణం ద్రౌపది. ఆమెను అధర్మంగా కౌరవులు గెలిచారు. కృష్ణునివల్ల ఆమెకు అప్పుడు 'కాచికోలు' వీలయింది, ఇప్పటిది యుద్ధమనే జూదం. పణం సైంధవుడు.

1. ద్రోణ - 4 - 88 2. ద్రోణ - 4 - 91 3. ద్రోణ - 4 - 166, 167

ఇతనిని మనం రక్షించుకోవలసిన అవసరం కలిగింది' అనిద్రోణుని మాటల ఆంతర్యం.

కృష్ణుడు చక్రం అడ్డువేసి , అర్జునునిచే సైంధవుని చంపించాడు. ద్రోణునిఉపేక్ష వల్లనేఅదిసాధ్యమయిందనీ, ద్రోణుడుఅర్జునపక్షపాతి అనీ దుర్యోధనుడు నిందించాడు. ఆమాటలకు ఆచార్యుని మనస్సునొచ్చుకుంది.తాను అర్జునుని జయించడం కష్టమనే విషయం పలుతావుల్లో చెప్పాననీ, భీష్ముడు పడటంతోనే కౌరవులు జయించలేరనే విషయం స్పష్టమయిందనీ ద్రోణుడు చెప్పాడు.

" శకునిచేతి యుద్ధసాళ్లులు నేఁడు గాం
డీవముక్త బహుపటిష్ఠ బాణ
మూర్తిఁ గవిసి నీకు నార్తి యొనర్పంగ
మాన్పనెట్టులగు కుమారనాకు!

" భూరమణ! విదురుఁ డమ్మెయి
వారింపఁగ నతుల పుణ్యవతిఁ గృష్ణను మీ
వారెల్ల జూడఁ బలిచిన
క్రూరపుఁ బాపపు ఫలంబు గుడుపక యున్నే!

" ఆసభ నీవును మీ దు
శ్శాసనుఁడును కర్ణుడును ప్రశస్తచరిత్రో
ద్భాసితులగు పాండవులకుఁ
జేసిన కీడెల్ల భంగిఁ జెరుపదె మిమ్మున్"[1]

అనిపలికి, దయమాలి పాండవులకు వ్యతిరేకంగా యుద్ధం చేయటానికి సిద్ధపడ్డాను, "నేనొక బ్రాహ్మణుండనే!" అని తననుతాను నిందించుకున్నాడు.[2]

---

1. ద్రోణ - 5 - 29, 30, 31 2. ద్రోణ - 5 - 32

భీష్మద్రోణులు ఒళ్ళు దాచుకోకుండా ఆఖరిక్షణం వరకూ ఎంతగాయుద్ధం చేసినా దుర్యోధనునికి తృప్తి కలుగలేదు. వారు, పాండవ పక్షపాతంతో, తనవైపునఉండి సరిగా యుద్ధం చేయడంలేదనుకొని వారిని అనుమానిస్తూ, ఎంతగానో అవమానించాడు. అశ్వత్థామ అంతటివాడు అతనితో విసిగిపోయి,

"నమ్మకాదు నీవెవ్వరి నమ్మవెల్లు
నమ్మ కున్నను నేమగు నరవరేణ్య?
... ... ... ... ... ... ..."[1]

అనిగర్జిస్తూ యుద్ధం చేశాడు. భీష్మద్రోణాదులు మహానుభావులు. ఆవిషయం దుర్యోధనునికి తెలుసు. తాను పాండవులపట్ల అధర్మంగా ప్రవర్తిస్తున్నాననీ అతనికి తెలుసు. ఆకారణంగా ఆమహానుభావులు తనతో పూర్తిగా సహకరించడంలేదని అతడు అనుమానించాడు. ఆ అనుమానమూ, అవమానమూ, భీష్మద్రోణులు తమజీవితాలపట్ల తమ కేరోత కలిగి స్వచ్ఛందంగా మరణాన్ని ఆహ్వానించేంతవరకూ సాగాయి. ఈ విధంగా దుర్యోధనునిలో తలెత్తిన దోషభావన అతనిపతనానికి అతడే కారకుడయ్యేలా చేసిందని చెప్పవచ్చు.



1. ద్రోణ - 5 - 126

# 13. సమాధాన పర్వం

భీముడు దుర్యోధనుని 'ధర్మగతి గాని తెఱంగున' కూల్చి నందుకు మహాపతివ్రత అయిన గాంధారి కోపించి తమను శపిస్తుందేమో నని ధర్మరాజు లోలోపల ఎంతగానో భయపడిపోయాడు. కృష్ణుని మొహంలోకి చూస్తూ, "కరిపురమునకుంబోవలయు నీకుఁబురుషార్థనిధీ!" అని ప్రార్థించాడు.[1] కృష్ణుడు బయల్దేరి వెళ్ళేసరికి అప్పటికే అక్కడికి కరుణాసాగరుడైన వ్యాసభగవానుడు వచ్చి ఉన్నాడు. కృష్ణుడు అందరికీ తగినవిధంగా నమస్కరించి, ధృతరాష్ట్రుని సమీపంలో కూర్చొని, కొంతసేపు అతనితో పాటు తానూ దుఃఖించి, తరువాత అతణ్ణి సముదాయిస్తూ, "అయ్యో! కులం అంతా నాశనమైపోయింది గదా! పాపం ఆపాండవులు ఇలా జరుగుతుందనే పట్టుదలలకుపోకుండా నన్ను సంధి ప్రయత్నం చేసిరమ్మని అప్పుడు పంపించారు. వారు ఎంతగా శమించి ఉన్నారో ఆలోచించి చూస్తే నీకే తెలుస్తుంది" అనిపలికి, కౌరవుల దురాగతాన్ని, పాండవులసహనాన్ని, గుర్తు చేశాడు.

"గెలువరె జూదము లెదును
గలదే తలఁబట్టి పుణ్యకాంతఁ గొలువులో
పలి కీడ్చి తెచ్చి వలువల
నొలుచుట యే మనఁగవచ్చు నుర్వీనాథా!
"దానికి నొచ్చినమనముల
తో నడవికిఁబోయి బహుళదుఃఖంబులన
ట్లూని విరాటుపురిం బడఁ
గాని యిడుమ వడియు వారు గనలర కంటే!"[2]

"ఉండటానికి అయిదుగురికీ కనీసం అయిదూళ్ళు ఇచ్చి ఉంటే ఇంత ఘోరం జరిగిపోయేది కాదు. మహనీయులైన విదురాదిబంధువులు

1. శల్య - 2 - 355 2. శల్య - 2 - 365, 366

చెబుతున్నా కూడా వినకుండా నీవు కొడుకుమాటలు చెల్లనిచ్చావు. దైవనిర్ణయాన్ని తప్పించడం ఎవరితరమవుతుంది? పాండవులపట్ల ఏదోషమూ లేదని గుర్తించు. వారి యెడ కోపించవద్దని నిన్ను నేను మ్రొక్కి వేడుకొంటున్నాను. ఇప్పుడు నీకూ, గాంధారికీ వారే దిక్కు. మీకు పరలోకక్రియాకలాపాలు చేయటానికి మిగిలిందీ వారే. కనుక శుభాన్ని ఆకాంక్షించు. మీమనస్సును బాధపెట్టినందుకు ధర్మజుడు ఎంతగా పరితపిస్తున్నాడో నువ్వే తెలుసుకొంటావు తర్వాత. "అని సమాశ్వాసించాడు.

పిదప గాంధారిని ఉద్దేశించి కూడా కృష్ణుడు కొన్నిమాటలు చెప్పి, పాండవుల పట్ల కోపించవద్దని ప్రార్థించి వెళ్ళిపోయాడు.

సౌప్తికవధానంతరం ధృతరాష్ట్రుడు సపరివారంగా యుద్ధభూమికి వస్తున్నాడని విని ధర్మరాజు అతనికి ఎదురువెళ్ళాడు. అతని వెంట కృష్ణుడూ, సాత్యకీ, భీమార్జున నకుల సహదేవులూ బయలు దేరారు. సంబంధులగుస్త్రీలు వెంటరాగా శోకమూర్తియై ద్రౌపది కూడా వారితో వచ్చింది. ముందుగా ధర్మరాజు ధృతరాష్ట్రునిసమీపించి నమస్కరించాడు. ధృతరాష్ట్రుడు మనస్సును సమాధానపరచుకొని, ఓదార్చాడు. తరువాత భీముడు సమీపిస్తూండగా పరిచారకులు ధృతరాష్ట్రునికి భీమునిపరిచయం చేశారు. భీముడనేమాట వినేసరికి ధృతరాష్ట్రునికి సహింలేనంతటి కోపంవచ్చింది. అధర్మానికి ఆయత్తమయ్యాడు. కృష్ణుడు అతనిమనస్సునెరిగి, భీముని ప్రక్కకు తప్పించి, ఇనుముతో చేసిన భీముని ప్రతిరూపాన్ని ధృతరాష్ట్రుని ముందు పెట్టించాడు. అధికమైన కోపంతో ఆ ప్రతిరూపాన్ని రెండు చేతుల తోను గట్టిగా పెనవేసి, బలమంతా ఉపయోగించి తుత్తునియలు చేశాడు. భీముడు చనిపోయాడనుకొని లోపల సంతోషిస్తూ, పైకిమాత్రం హాహా కారాలతో రోదించాడు. అప్పుడు అతణ్ణి మెత్తగా మందలిస్తూ,

"ద్యూతమున గెల్చు నెపమున నుఱికి పుణ్య
కాంతఁ దల పట్టికొని సభాభ్యంతరమున
కీడ్చి వలువ లొలుచుటయు నెఱింగి సుతులఁ
జంపె నని భీముఁజంపఁ దలంప నగునె.

"నీయవినీతియుం గొడుకులదుశ్చరిత్రంబునుం దలంచి శోక రోషంబులు విడిచి శాంతుండ వై యుండుమ"ని[1] ప్రబోధించాడు. ధృతరాష్ట్రుడు పశ్చాత్తాప పడ్డాడు.

గాంధారి దుఃఖ తాపానికి తట్టుకోలేక ధర్మరాజును శపించ బోయింది. వ్యాసుడు ఆమెను వారించి, ఆప్రయత్నం నుంచి విరమింప జేశాడు. అప్పుడామె" ... అచ్యుతుఁడు సూడఁగురుపతి ననిలసుతుఁడు దగునె గదవోర నాభికి దిగువ నొంచి చంప? నత్తెఱఁగుల్లంబు నొంపకున్నె?"[2] అని భీముణ్ణి నిలదీసింది. అప్పుడు భీముడు భయంతో కంపించిపోతూ, నమస్కరించి, వినయంగా ఇలాఅన్నాడు:

"ప్రాణభయంతో ఉన్ననాకు ధర్మమేదో, అధర్మమేదో అప్పుడు ఏం తెలుస్తుంది? దుర్యోధనుణ్ణి అలా చంపినందుకు నన్ను మన్నించు. నీకొడుకు నాకంటె బలమూ, నేర్పూకలవాడు. ఆ విధంగా కొడితేగాని అతన్ని జయించడం సాధ్యం కాదు. అదలాఉంచు. ధర్మం గురించి అడుగుతున్నావు గదా? ధర్మరాజు పొందిన అవమానా లన్నీ ధర్మంప్రకారమే పొందాడా? ఏకవస్త్ర, రజస్వల అయిన ద్రౌపదిని దయమాలి కొలువులోకి ఈడ్పించి. నీకొడుకు ఏమన్నాడో నువ్వువినలేదా? ఆపుణ్యకాంతకి అతడు తొడలు చూపించడం నీవుఎరుగవా? అప్పుడునాకు కలిగినకోపంలో నాగదాదండంతోవాని తొడలు విరగ్గొడతానని ప్రతిజ్ఞ చేశాను. ఆపని అప్పుడేచేసిఉండవలసింది. కాని ధర్మజుని ఆజ్ఞకు లోబడి అప్పటికి ఊరుకొని అరణ్యంలో అనేక కష్టాలు

1. స్త్రీ - 1 - 146, 147 2. స్త్రీ - 1 - 154

పడి, సంధికోసం ప్రయత్నం చేసి అది నెరవేరకపోబట్టి గదా ఇలా చేయ వలసివచ్చింది? సువిచారవు, నీకు మాత్రం ఇదంతా తెలియనిదా?" అని అడిగాడు.[1]

ద్రౌపదికి తనవాళ్ళు చేసినద్రోహం కట్టికుడుపుతుందేమో నన్నభయం అంతకు ముందునుంచీ గాంధారికి ఉండడంతో భీముని మాటలకు ఆమె కోపం చల్లారిపోయింది. ఏమనలేక,

"ఆచావు సావఁదగు న
న్నీచునకున్ వానివలన నిక్కం బరయన్
నీ చెప్పినయన్నియుఁగల
వా చెయ్దియుఁ దగవనీకు ......"[2]

అంటూ, దుశ్శాసనుని గుండెలు చీల్చి రక్తం త్రాగడాన్ని గురించి ప్రశ్నించింది. అందుకు భీముడు,

"ఆ సభలోని కట్లు ద్రుపదాత్మజఁదాఁ
బై సిగనీడ్చి వల్వలోలువం గినుకం
జేసినబాసకై పెదవిఁజేర్చితి దు
శ్శాసను శోణితం బిది నిజం బరయన్."[3]

అని తాను రక్తాన్ని త్రాగినట్లుగా నటించాననీ, సోదరుని రక్తం త్రాగేటంతటి పాపకర్ముణ్ణి కాననీ పలికాడు. గాంధారి సమాధాన పడింది. అంధులైన తమకు ఊఁతకోలగా ఒక్కణ్ణైనా చంపకుండా వదల నందుకు ఆమె ఎంతగానో బాధపడింది.

యుద్ధరంగంలో పడిఉన్న తనయుల తనువులను చూసి విల పించే సందర్భంలో గాంధారి దుశ్శాసనుని కళేబరాన్ని చూసి విలపిస్తూ కృష్ణునితో ఇలా అన్నది:

1. స్త్రీ - 1 - 157 నుంచి 160 2. స్త్రీ - 1 - 161 3. స్త్రీ - 1 - 164.

"అచ్యుత! వీఁడె మహాభీలభుజుఁడగు
భీముగదాహతి భూమిఁగూలి
యాతనిచేత సర్వాంగంబులందును
గలుగు క్రొన్నెత్తురు కాంక్షఁద్రావఁ
బడి మఱి తెగటార్పఁ బడియున్నవాఁడు దు
శ్శాసనుఁడీతండు సభకు ద్రుపద
పుత్రి నీడిచి తెచ్చి పొలువతనమ్మనఁ
బతులసన్నిధిఁ గురుక్షితివిభునకుఁ
గర్ణునకుఁ జిత్తసంప్రీతి గాఁగఁదూల
పుచ్చెఁబెక్కువిధంబుల నొచ్చి యామ్మ
గాక్షి యప్పుడు మారుతి యంతరంగ
మేర్పడఁదలఁపించుదానన యింత వుట్టె.

"ఆసభ నమ్మెయి నీదు
శ్శాసనుఁ డప్పాండు పుత్రసతిఁ గ్రూరాత్మం
బై సంకలేక పెద్దయుఁ
గాసిం బెట్టంగ నెఱిఁగి కలఁగినమదితోన్

"ఏను దుర్యోధనునితో నిట్లంటి.

"హరిచేత రక్షిత మైనపాంచాలి కగునయ్య యిమ్మెయి నత్యంతనీచ పరిభవదుఃఖంబుపాల్ సేత మీఁదు పరికింపకున్నఁగీడ్పాటిల్ల కున్నె యరికంజకుంజరుఁడగుభీముఁబల్కు లనుబరిగోలల నలఁచుట మే చెరవిడి వేవేగ విడువుము గారవింపుము వంశపవిత్ర యోపుత్త్ర!

" ... ... ... ... ... "

"అని యెన్ని భంగులను జె
ప్పినఁ దా నప్పలుకు లెల్ల బెడ చెవులం బె
ట్టెనుదగ్రుఁడు దగుకార్యము
గ నునె వశంబగునె దైవగతిఁదప్పింపన్.

"నాఁటిమాట లుల్లంబున నాటియుండ
నొవ్వుతోఁ దఱివేచి నేఁడివ్విధమునఁ
బఱిచె భీముండు నొప్పింపఁబడినక్రోఁచు
పాముపగసాటి తెగటార్చు భంగిఁగృష్ణ!"[1]

గాంధారి వివేకవంతురాలు కనుక నాడే కొడుకును భంగించింది. వాడు వినలేదు. వానికి చేటుకాలం దాపురించిందనీ, భీముని చేతుల్లో వాని చావుతప్పదనీ గ్రహించింది. ద్రౌపది హరిచేత రక్షిత అనీ, కులపవిత్ర అనీ మహానుభావురాలైన ఆమె గ్రహించింది. కానీ, ఏం ప్రయోజనం? ఆమె మాటలను పెడచెవిని పెట్టి కొడుకులు దుర్మరణం పాలయ్యారు. 'ఇందులో భీముని తప్పులేదు. ఆనాటిమాటలన్నీ అతనిహృదయంలో నాటుకొని ఉండిపోబట్టి అతడింత తీవ్రంగా ప్రతీకారం తీర్చుకొన్నాడు' అని ఆమె సమాధానపడింది.

ఈవిధంగా ద్రౌపదికి కురుసభలో తమసమక్షంలో నాడుజరిగిన ఘోరావమానానికి బాధ్యతపడి ధృతరాష్ట్రుడూ, బాధపడి గాంధారీ తమ నూరుగురుకొడుకులూ పాండవులచే చంపబడినా లోలోపలే కుమిలిపోయారు గానీ నోరెత్తి నిందించలేకపోయారు. అంతేకాక, గాంధారీశోకవహ్ని నుంచి భీమసేనుని రక్షించిందికూడా ఈద్రౌపదీ పరాభవసన్నివేశమే అని గమనించినప్పుడు ఆశ్చర్యంకలుగుతుంది.



1, స్త్రీ - 2 - 55. 56, 57, 58, 60, 61

## 14. యుద్ధంవల్ల సిద్ధి - గర్భశోకం!?

యుద్ధం అయిపోయింది, విజయంసాధించాం, అని పాండవులు అనుకొంటూ ఉండగా, ఊహించనివిధంగా అశ్వత్థామ అర్ధరాత్రివేళ పాండవశిబిరాలపై దాడిచేసి నిద్రిస్తూన్న పాంచాలురను, ఉపపాండవులను మహాదారుణంగా చంపివేశాడు. ధర్మరాజు వార్తవిని, శోకవేగ సంతప్తుడై, మూర్ఛపోయాడు. కొంతసేపటికి తేరుకొన్న అతనికి ద్రౌపది గుర్తుకు వచ్చింది. ఆమె అప్పటికే తండ్రిపోయాడన్న దుఃఖంతో కుమిలిపోతోంది. తల్లిని, విరాటపత్నులను ఓదార్చటానికై ఆమె విరాటనగరానికి వెళ్ళింది. సుభద్ర, ఉత్తరకూడా ఆమెతో వెళ్ళారు. ఆమెకు ఇప్పుడీవర్తమానం — కొడుకులూ, సోదరులూ కూడా చనిపోయారని — తెలిస్తే ఆమె ఏమయిపోతుంది? ఎలాతట్టుకోగలుగుతుంది?

"జనకుఁడు లేమికిం గడువిపాదము నొందెడికృష్ణ యిమ్మెయిం
దనయులు భ్రాతలుం దెగుట దా విని మూర్ఛమునుంగునెమ్మనం
బును నవశంపు మేను నయి భూస్థలిఁ ద్రెళ్ళకయున్నె? తేజనే
నిని బటుశోకవేగమున నిర్భరవేదనఁ జెందకుండునే?

"మున్నిట్టి తెఱఁగుశోకం
బెన్నఁడు దా ననుభవించి యెఱుఁగ దకటనేఁ
డన్నెలఁత యలతఁ బెల్లున
నెన్నియవస్థలకు వచ్చి యెట్లయ్యెడినో?"[1]

అని అతను దుఃఖంతో పొగిలిపోయాడు. ఆమెను, తక్కినస్త్రీలతో సహా తోడ్కొనిరమ్మని నకులుని పంపాడు.

సుత సోదర మరణప్రకారాన్ని నకులునిద్వారా తెలుసుకొని ఆమె శోకభారంతో విలవిల్లాడిపోయింది. నకులుడు ఆమెను ఎలాగో రథంలో వేసుకొనివచ్చాడు. కొడుకులను పలవిస్తూ, విల

1. సౌప్తిక 2 - 18, 19

విస్తూ, ఆమె నేలకూలిపోయింది. భీముడు ఆమెను ధర్మజునివద్దకు ఎత్తి తీసుకొనివెళ్ళాడు. ధర్మజునితో ఆమె తనదుఃఖాతిశయాన్ని పంచుకొంది. కొంతసేపటికి అశ్వత్థామపట్ల కోపం అధికమై,

"భూరమణ! గాఢ నిద్రం
గూరిన సమయమున ముట్టికొని నాసుతులం
గ్రూరత(దెగటార్చెను బా
పారంభు(డు గురుతనూజు(డక్రమలీలన్.

"అది యాఅని పెను(జిచ్చై
మది(గాల్ప(దొడంగె దీప్యమానప్ప నుపాయం
బుదలంప నొండు లేద
య్యదయుని ముట్టికొని నామ మడ(చుట దక్కన్.

"వాయుసుతు( బనిచి నే(డటు
సేయింపక తక్కితేని( జెప్పెద విను మే(
బ్రాయోపవేశమున నీ
కాయ ముపేక్షింతు( జుమ్ము కౌరవనాథా!"[1]

అని కోరింది. ధర్మజుడు ఆమెను ఉపశమించి, శోకాన్ని పోగొట్టుకొమ్మన్నాడు. ఆమె పవమానతనయుణ్ణి పాణితలంతో సంస్పర్శిస్తూ,

"క్షత్రధర్మ మాత్మ(గైకొని రయమున
వరిగి పాపకర్ము(డైన కుంభ
జన్మతనయు ముట్టి చంపుము నామది
కనలు నవలు నుడిపి కావు నన్ను"[2]

అని కోరింది.

---

1. సౌప్తిక - 2 - 31, 32, 33 2. సౌప్తిక - 2 - 37

భీముడు అశ్వత్థామ శిరోరత్నాన్ని తెచ్చి ద్రౌపదికి ఇచ్చి ఇలా చెప్పాడు:

"పగతుపన్ని సక్కనయ్యెన్
వగమానుము రాజధర్మవైశిష్ట్యము పెం
పుగ నాదరింపు నీతా
ల్మిగదా భూపాలునమ్మలికముం బాచున్!

"జనపతి పంపఁ గేశవుఁడు సంధికిఁబోయెడునప్డు నీవు సె
ప్పినగరువంపు రాజసపు బెట్టిదపుందగుమాట లెల్ల నె
మ్మనమున నెక్కొనన్ నిలుపుమా వగవం బని యేమి సంగరం
బునఁబగవారు పేర్చి పొరివుచ్చక పువ్వులకోల సాఁతురే?

"వినుము ధృతరాష్ట్రవంశం
బున మగపేఁచంబు నెల్లఁబొలియించితిఁగృ
ష్ణునికారుణ్యము జిష్ణుని
పెనుఁబ్రాపును గలుగ నేను విగతభయుఁడనై.

"త్రావితి దుస్ససేను రుధిరం బుర ముగ్రగతఁజీతి వచ్చిక్రీ
డావిధి వాని యగ్రజుతొడల్ వడి నుగ్గుగఁజేసి యార్చియా
భూవరుపాళిఁ దన్నితి నృపుల్ గని సంతసమంది రింత హ
ర్షావసరంబు శోకసమయంబుగఁ జేయుట నీకు నర్హమే!

"గురు తనయుఁడగుటఁ బ్రాణము
హరియింపఁగఁజొరక విజయుఁడశ్వత్థామం
బరిభూతుఁ జేసి యాయుధ
పరిగ్రహము తోడ లజ్జఁబాయంజేసెన్."1

భీముడు ఈవిధంగా ఎంతో ఆర్జవంతో ద్రౌపదిదుఃఖాన్ని

1. సౌప్తిక - 2 - 91 నుంచి 95 వరకు

ఉపశమింప చేయటానికి ప్రయత్నించడం లోకరీతినిబట్టి సమంజసమే. కాని, ఏ రాజధర్మం ప్రకారం శత్రుసంహారం చేయవలసిందిగా ఆమె కోరిందో ఆ రాజధర్మం ప్రకారమే ఆమెను శోకించవద్దనడం చాలాదయనీయమైనవిషయం. మాతృత్వమనేది సర్వజీవసమానమైనధర్మం. రాచపుట్టుక పుట్టినంతమాత్రన హృదయం రాయి అయిపోతుందా స్త్రీకి? ద్రౌపది యుద్ధాన్నికోరింది భర్తలపరువుప్రతిష్ఠల కోసంగానీ వ్యక్తిగతమైన ప్రతీకారవాంఛతో కాదు. భీముడు అకరుణంగా ఆమెను సంధిప్రయత్నంనాటి మాటలను గుర్తుచేసుకోమనడం, శత్రువులు యుద్ధంలో చంపక పూలకట్టతో కొడతారా? అని అడగటం, ఆమెకు 'ఉద్ధరింపు' గా తను చేసినప్రతిజ్ఞలను నెరవేర్చుకొన్నానని చెప్పడం, మాతృమూర్తిగా పుత్రమరణానికి హృదయం తేలికయ్యేలావిలపించే అవకాశమన్నా ఆమెకు లేకుండా పోవడాన్ని తెలియజేస్తున్నాయి. ఆ 'మహాఇల్లాలు' ఆమాటలకు ఏమనిసమాధానం చెప్పగలదు? రాచబిడ్డగా అవమానాలకు ప్రతీకారంవాంఛించిందే అనుకొన్నా, దానిఫలితం ఇంతదారుణంగా ఉంటుందని ఆమెమాత్రం ఎలాఊహించగలదు? నిస్సహాయమైన అప్పటి ఆమెస్థితి అత్యంతదయనీయం. ఆమెభంగపాటు ఆమె పట్ల ఈవిధంగా ఉపయోగపడటం సహృదయులకు మనస్తాపాన్ని కలిగిస్తుంది.

భీముడిచ్చిన చూడామణిని అందుకొని, మనస్సును సమాధానపరచుకొని, లేచి, ధర్మజుని చూస్తూ, భీముణ్ణి ఉద్దేశించి,

"నా మన మారదీన్నిఁగని నందముఁ బొందితి నింతసాలునా
కీ మహనీయరత్నము వహింపఁగ నర్హుఁడితండ ..."1

అంటూ ఆరత్నాన్ని ధర్మజుని చేతబెట్టింది. దాన్ని ధరించి అతడు 'ఉదయరాగ నితాంతసముజ్జ్వలేందుబింబమునఁ బొల్చుపూర్వశైలంబు వోలె ''ఒప్పాడు.

1. శాంతి - 1 - 90 నుంచి 106 పద్యాలు.

పెద్ద రేఖా — చిన్న రేఖా

యుద్ధానంతరం కర్ణుడు తన అగ్రజుడని తెలుసుకొని ధర్మరాజు ఎంతగానో విలపించాడు. జ్ఞాతివధ ఆత్మవధేనంటూ తీవ్రమన స్తాపానికి లోనయ్యాడు. రాజ్యాన్ని వదలి, అడవులకుపోయి, మునివృత్తిని ప్రశాంతంగా ఉంటానని పట్టుపట్టాడు. అర్జునుడు, నకులుడు తగిన విధంగా మాట్లాడి, అతని దుఃఖాన్ని తొలగించడానికి ప్రయత్నించారు. ధర్మజున్ని స్థితిలో ఏమార్చ్పారాలేదు. యుద్ధానికిపూర్వం అర్జునుడు విషాదయోగంలో మునిగి అస్త్రసన్యాసం చేసినట్లుగా యుద్ధానంతరం ధర్మరాజు తీవ్రమనస్తాపానికి లోనయి రాజ్యసన్యాసం చేయటానికి నిశ్చయించడం అందరినీ కలత పెట్టింది. అప్పుడు ధర్మజుని యెడ ఎంతో గౌరవంగలదీ, అతనిచేత ఎల్లప్పుడూలాలింపబడేదీ, ధర్మాధర్మనిదర్శన శీలము గలిగినదీ అయినద్రౌపది మెల్లగా అక్కడకు చేరి, "ఏనును నాయెఱింగినంత సెప్పెద" నంటూ, అనుమతిపొంది, అతనిముఖంలోకి చూస్తూ ఇలా చెప్పింది:

"దుఃఖంతో బాధపడుతున్న నీతమ్ములను నీవాక్యామృతంతో తేర్చవలసి ఉంది. అరణ్యవాసమప్పుడు వారు శ్రమపడుతూండగా చూసి నీవు వారిని అనునయించేవాడివి గదా! నీవు అప్పుడు చెప్పినట్లుగానే నియమాన్ని పాటించి, శత్రువును సంహరించి, రాజ్యాన్ని, సంపదలను పొంది, తీరా యిప్పుడు అన్నింటినీ వదలి అడవులకు పోతానంటున్నావు. ఇదినీకు న్యాయమా? ధర్మమూ, సత్యమూ, ఔచిత్యమూ నీకంటె బాగా తెలిసినవా రెవరున్నారు? రాజైనవానికి ఇలా కృంగిపోవడం ఎంతమాత్రమూ తగదు. లోకాన్ని రక్షిస్తాడని గదా బ్రహ్మ రాజును లోకపాలుర అంశలతో పుట్టిస్తాడు! రాజు అంటే నరరూపంలో ఉండేపరదేవతే! తెలియక తాకితే తాకినవానిని ఒక్కడినే కాల్చేది అగ్ని. వంశాన్ని అంతనీ దహించిగాని వదలనిది క్షత్రియాగ్ని.

గర్వంతో నిన్ను పరాభవించి నీకోపాగ్నికి ఆహుతయ్యారు కౌరవులు. దానికి నువ్వింతగా దుఃఖించడం దేనికి? దండనీతి రాజధర్మం. దోషాన్ని సక్రమంగా విచారించి శిక్షించే రాజుకు ఇహమూ, పరమూ సిద్ధిస్తాయి. తప్పు చేసినవాడు బ్రాహ్మణుడైనా సరే ముఖాన అచ్చు గుద్దించి, బహిష్కరించడం రాజుకు ధర్మమే అవుతుంది. ఏకవస్త్ర నైన నన్ను సభలోనికి తలపట్టి ఈడ్చిన దోషం, చేరరమ్మని తొడలు చూపినతప్పు, అనరానిమాట లని నన్ను అవమానించినతప్పు, ఆదుర్యోధనుని పట్ల ఉన్నాయి. తమ్ముడని చూడక రాజుగా నీవు వానిని శిక్షించావు. ఇది దోషమెలా అవుతుంది? ...... "[1] అని పలికి ఆమె ఇంకా ఇలా చెప్పింది:

"నా యట్లు వడినయంగన లేయెడలం గలరె? యిట్టియేనును ధర్మా
పాయము నీకగు ననువెఱం బాయన గృహధర్మవృత్తిం బౌరవముఖ్యా!"[2]

"నీ అంతకష్టాలూ నేనూ పడ్డాను, ఒకవిధంగా నీకంటె ఎక్కువగా నేనే అవమానాల పాలయ్యాను. నాకెంతనైరాశ్యం కలగాలి? నీకు ధర్మహాని కలుగుతుంది గదాని కదా నేను ఇల్లాలిగా నాబాధ్యతను నేను నిర్వర్తిస్తూ ఉండిపోయాను! కౌరవులు వారిపాపానవారు పోయారు,నీకు పాపం కలిగేందుకు ఏముంది దీనిలో? భూభారం వహించి, యజ్ఞాదులు నిర్వహించు".

కొడుకులుపోయి, తండ్రి, సోదరులూపోయి, ద్రౌపది తన దుఃఖంలో తాను ఉంది. పులిమీదపుట్రలా ఇప్పుడు ధర్మజునికి విరక్తి కలిగి అడవులకు పోతాననడంతో ఆమెమరింతఇరకాటంలోపడి ఉంటుంది. క్రొత్తగా కలిగిన ఈమనస్తాపంముందు ఆశోకం, ఉన్న ప్రక్కనమరొక పెద్దరేఖగీస్తే చిన్నదయి నట్లుగా, మరుగున పడిపోయి ఉంటుంది.

క్షత్రియకాంతగా ద్రౌపది ప్రతీకారాన్ని కోరడమే కాదు, కర్తవ్యాన్నిసక్రమంగా నెరవేర్చిందని చెప్పటానికిఈ ఘట్టంఒక నిదర్శనం.

1. శాంతి - 1 - 90 నుంచి 106 పద్యాలు. 2. శాంతి - 1 - 103

## 15. జనవాణి

కృష్ణ, కృష్ణద్వైపాయన, నారద, దేవల, దేవస్థాణు, విష్ణులాదిగా గల మహానుభావులచే ప్రబోధితుడై, ధర్మరాజు రాజ్యభారనిర్వహణోత్సాహుడై, కరిపురానికి ప్రయాణమయ్యాడు. భీముడు సారథ్యం వహించాడు. గాండీవి గొడుగుపట్టాడు. నకులసహదేవులు వింజామరలు వీచారు. సముద్రపు ఘోషవలె తూర్యనాదాలు మ్రోగాయి. ముందు గాంధారీధృతరాష్ట్రులు ఉన్నపల్లకీ, వెనుక కృష్ణసాత్యకులతో ప్రకాశించే రథమూ, వస్తున్నాయి. యుయుత్సుడు ప్రక్కన వేరొకరథంలో వస్తున్నాడు. కుంతీ మొదలైనస్త్రీలందరూ పల్లకీల్లో వస్తూంటే, వారిని అనుసరిస్తూ విదురుడు నడిచివస్తున్నాడు. వెనుక వివిధదేశాల రాజులూ తమతమ సైన్యాలతో వస్తున్నారు. మహావైభవంగాఅందరూ హస్తినలో ప్రవేశిస్తూ ఉంటే, పౌరజానపదజనాలు తమకన్నులు సార్థకమయేలా చూస్తూ,ధర్మజుని కీర్తించారు. భీమార్జున నకుల సహదేవుల గుణవిశేషాలను కూడా పెద్దపెట్టున శ్లాఘించారు. ఆసందర్భంగా "వ్రతచర్యయు భాగ్యంబును ధృతియు మతియు నరయ ద్రౌపదికినెనయగుభూపతివల్లభాజనము లీ క్షితిఁగలరే యనురవంబు సెలఁగెం గలయన్"[1]
'వ్రతాచరణమూ, భాగ్యమూ, ధృతీ, మతీ – అనేవానివిషయంలో ద్రౌపదితో సాటి రాగల క్షత్రియకాంతలే లేరీభూమండలంలో' అని ద్రౌపదిని చూసి వారు అందరూ మెచ్చుకొన్నారని చెప్పబడింది.

కౌరవులచే దారుణంగా అవమానించబడి "తడిసిన యేకవస్త్ర పరిధానముతోడ విముక్తకేశియై తొడరుచు దుఃఖభావమున ..."[2] ద్రౌపది, అడవులకు వెళ్ళే భర్తలను అనుసరించి వెడుతూ ఉంటే చూస్తూఊరకుండిపోయిన పౌరజానపదులే, ఇప్పటికి ఆమె మాహాత్మ్యం బోధపడి ఆమెవంటి రాజకాంతలు లోకంలోనే లేరంటూ జోహార్లు చెప్పారు. ఆలస్యంగానైనాఅసలువిషయాన్ని తెలుసుకోగలిగిన ఆమహాజనం ధన్యులు. భీష్ముడు ధర్మజునికి బోధించినట్లుగా,
"పాతివ్రత్యము గలిగిన నాతియనఁగ దైవమన జనస్మృత! వేత్రే?
యాతతధర్మార్థసుఖఖ్యాతులు సద్భార్యవలనఁ గాదే కలుగున్!"[3]

1. శాంతి - 1 - 359. 1. సభా 2 - 307. 3. అనుశాసనిక - 2 - 219

## 16. అశ్వమేధంనాటి ఆర్భాటం

అమరనదీనందనుని అస్తమయంతో ధర్మజునిలో శోకం సెల వేసింది. పితామహాకర్ణులం జంపించిన క్రూరకర్మనకు శాంతి యెట్లుకలుగు నమ్మహాకల్మషం బేమిటం బాయు నయ్యనుష్ఠానంబు విధియింపుం" డని అతడు వ్యాసమహర్షిని అర్థించాడు. తాను నారదాదిమునులూ చేసినబోధ అంతా అతనిపట్ల పనికి రాకుండాపోయిందని గ్రహించి,

"... ... ... ... ... ... ... ... ... ... ... నీమదిఁబాపకర్మ శంక కలిగెనేనియును యాగముల దానంబుల నది పాపికొనరాదె యశ్వమేధ మధిక దక్షిణాన్వితముగ ననఘ చేయు మంతతో భవదీయ చిత్తానుతాప మంతయును బాయు రఘురామునట్లు పూరు భరతులునుబోలె దానతత్ప రుఁడ వగుము."[1] అనీ పారాశర్యుడు కర్తవ్యాన్ని ఉపదేశించాడు. యాగనిర్వహణకు కావలసిన అపారధనసంపదను కూడా ఆమహర్షే సమకూర్చిపెట్టాడు. యాగాశ్వాన్ని అర్జునుడు అనుసరించివెళ్ళాడు. అతడు విజయుడై తిరిగి రాగానే యాగవిధిని సంపూర్తి చేశాడు ధర్మ రాజు. ఆ సందర్భంగా ఋత్వికులు ద్రౌపదిని పిలిపించి, అశ్వముయొక్క మాంసఖండాలను ఆమెచేత ఆయాదేవతలకు ఆహుతులుగా ఇప్పించారు.[2]

అనంతరం ధర్మజుడు కోటివేల నిష్కములను సదస్యులకు, భూమండలాన్నంతటినీ వేదవ్యాసమునివరునకు దానంచేశాడు. వ్యాసు డు ఇలకు వెలగా హిరణ్యం ఇచ్చి, భూమినిగ్రహించవలసిందని ధర్మజుని తో చెప్పాడు. ధర్మజుడు బ్రహ్మధనాన్ని స్వీకరించననీ, అడవులకు వెళ్ళి సుఖంగా ఉంటాననీ పలికాడు. అతని మాటలకు భీమార్జున నకుల సహ దేవులూ, ద్రౌపదీ వెంటనే అంగీకరించి, "అట్టిద యాపని, యొండు చెప్పకుండ"ని వ్యాసునిప్రార్థించారు.[3] వారిత్యాగబుద్ధికి అందరూ ఎంతె గానో సంతోషించారు. కృష్ణుడు "ఇమ్మునినాయకుపనుపు చేయుము నరేశ్వర! "అని ఆదేశించడంతో "కోటికోటులు మాడలుకుప్పవోసి, ధరణివెలయనిచెప్పి ..."ధర్మజుడు ఆమహర్షికి సమర్పించాడు.[4]

ఈవిధంగా అశ్వమేధయాగం పరిసమాప్తమైంది.

---

1. అశ్వమేధ - 1 - 11, 12
2. అశ్వమేధ - 4 - 184 వచనం
3. అశ్వమేధ - 4 - 192
4. అశ్వమేధ - 4 - 197

# 17. మహాప్రస్థానం

అశ్వమేధయాగానంతరం కొంతకాలానికి ద్వారకనుంచి కృష్ణుడు పంపగా దారుకుడు వచ్చి సర్వయాదవవినాశనాన్ని తెలిపాడు. పాండవులందరూ ఎంతో దుఃఖించారు. అప్పుడు ద్రౌపదీ, తక్కిన అంతఃపుర స్త్రీలూ కూడా అతికరుణంగా ఆక్రందనలు చేశారు.[1] వారి శోకానికి పురజనులు ఆర్తినిపొందారు. అర్జునుడు దారుకునితో పాటు ద్వారకకు వెళ్ళి, రామకృష్ణుల నిర్యాణం తెలుసుకొని, వారికి అగ్ని సంస్కారంచేశాడు. ద్వారకలోని స్త్రీ బాల వృద్ధులను తోడ్కొని అతడు ఇవతలకు రాగానే ద్వారక సముద్రగర్భంలో కలిసిపోయింది. మార్గమధ్యంలో కిరాతబలం యాదవాంగనలసొమ్ములను అపహరించగా అర్జునుడు తనమహాస్త్రప్రాబల్యం వ్యర్థం కావటాన్ని తెలుసుకొని బాధపడ్డాడు. ఎలాగో కొందరినిమాత్రం అతడు రక్షించగలిగాడు. వ్యాస మహర్షి

"కాలమూలంబు సర్వంబుఁగాన దీని
కొండు తలఁపులు తక్కుమీ రుత్తమంపు
గతికిఁజనుఁడు నిశ్చింత వికారతనులు
విడిచి యార్యజనంబులు వినుతిచేయ[2]

అనిప్రబోధించడంతో పాండవులు పరీక్షిత్తుకు పట్టంకటి, మహాప్రస్థానానికి సిద్ధమయ్యారు. వారు సర్వాభరణాలనూ తీసి, వల్కలాజినాలు ధరించారు. ద్రౌపదికూడా ఆప్రకారంగా చేసింది. అగ్నులను జలమగ్నం చేసి, ముఖాల్లో ఒకవిధమైన తెలివి (దివ్యజ్ఞానం) అతిశయించగా వారు ఇంటినుంచి బయలు దేరారు. అయిదుగురు సోదరులూ ముందు నడుస్తూంటే ఆరవదిగా ద్రౌపది వారిని అనుసరించింది. ఏడవదిగా వారిని వెన్నంటి ఒకసారమేయం రాసాగింది. అనుసరించివస్తూన్న ఆత్మీయులను

1. "సర్వయాదవసంఘంబు చావువిన్న ద్రౌపదీ ప్రముఖాఖిలాంతఃపురాంగ
నలును శోకించి యాక్రందనములుసేసి రతికరుణముగఁ బురజనులార్తిఁ బొంద"
[ —మౌసల - 96.

2. మౌసల - 222

పట్టించుకోకుండా వారుముందుకు సాగుతుంటే జూదమునాడు వారు హస్తినాపురాన్ని వదలివెడుతున్నవిధం గుర్తుకు వచ్చింది పురజనులకు.

ముందు ధర్మజుడు నడుస్తూంటే, అతనివెనుక క్రమంగా భీముడు, అర్జునుడు, నకులుడు, సహదేవుడు, ద్రౌపది, ఆ వెనుక శునకమూ అనుసరించారు. వారు ఉపవాసవ్రతదీక్షతో గంగా తీరానికి చేరి, అటనుండి తూర్పుముఖంగా కొండలు, నదులు, అడవులూ తమ యోగబలంతో దాటుకుంటూ వారుపూర్వసముద్రతీరంచేరారు. అక్కడ వారిముందు అగ్నిదేవుడు ప్రత్యక్షమై గాండీవాన్ని వరుణునికిసమర్పించవలసిందిగా అర్జునుని ఆదేశించాడు. అతడు ఆవిధంగా చేయగానే అగ్నిదేవుడుమాయమయ్యాడు. ఆపిదపవారు దక్షిణాభిముఖంగాసాగి,భూమికి ప్రదక్షిణం అయ్యేలా వెడుతూ ఉంటే వారొక సముద్ర తీరానికి చేరుకొన్నారు. అచ్చటినుంచి పడమటిముఖంగాసాగి పశ్చిమసముద్రతీరాన్ని చేరారు. తర్వాత ఉత్తరంగా నడచి సముద్రంలో కలిసిన ద్వారకకు దగ్గరగా పోయి, క్రమంగా హిమాచలాన్నిదాటి, అతిస్థిర యోగసాధనపరులయి మేరుపర్వతాన్ని సమీపించారు. అలా వెడుతూఉండగా యోగస్థితిచెదరి ద్రౌపది నేలకూలింది. భీముడది గమనించి ముందున్న అన్నకుచెప్పి "...అత్యుతివవలనఁగానమెన్నఁడు ధర్మహానియిల్లగుటకు నరయంగఁగతమేమి? ' అని విన్నుడై అడిగాడు.[1]

"ఈమె అర్జునునిపట్ల పక్షపాతిని. అందువల్ల ఆమె చేసినపుణ్యాలు ఫలించక, ఆమె ఈవిధంగా పడిపోయింది" అని ధర్మరాజుచెప్పాడు. అలా చెప్పినమాటలను బుద్ధియందు స్థిరపచుకొన్నాడు. ధైర్యమూ, స్థైర్యమూ వహించి, వికృతినిపొందక, ఆమె శవాన్ని అక్కడే వదలి వారుముందుకు సాగిపోయారు.

ఆ తరువాత సహదేవుడూ, నకులుడూ, అర్జునుడూ, భీముడూ క్రమంగా ఒకొరొకరుగా నేలకూలారు. చివరికి ధర్మజుడూ, అతనివె

1. మహాప్రస్థాన - 34

నుక సారమేయమూ మాత్రమే మిగిలారు. దివ్యరథంలో ఇంద్రుడు ఎదురుగావచ్చి తనతో రథం ఎక్కి రమ్మని కోరాడు. సోదరులూ, ద్రౌపదీ తోడుగావచ్చి,ఇప్పుడు వారు లేకుండా తాను రాలేననీ, వారు కూడా తనతో వచ్చేలా చేయవలసిందనీ ధర్మరాజు ఇంద్రుని ప్రార్థించాడు. వారినిగురించిశోకించవలసినపని లేదనీ, వారు తమశరీరాలువదలి స్వర్గాన్ని చేరుకున్నారనీ, వారిని అక్కడ చూడవచ్చుననీ, వారికోసం శరీరాన్నివిడవవద్దనీ, తనతో రావలసిందనీ ఇంద్రుడు ధర్మజునికి చెప్పాడు. అప్పుడు ధర్మజుడు తనతోపాటు కుక్కకూడావస్తుందని చెప్పాడు. ఇంద్రుడు నవ్వుతూ "అమర్త్యభావము కుక్క కేమా డ్కఁగలుగు?" నన్నాడు. ధర్మజుడు తాను ఆకుక్కనువిడిచి రావడం కుదరదన్నిచెప్పాడు. అప్పుడు ఇంద్రుడు "నీవు ద్రౌపదిని భీమసేనుని, అర్జునుని, కవలలను త్యజించగలిగావు గానీ ఈకుక్కను విడువ లేవా?" అని అడిగాడు.

"... ... ... ... ... ... ... ...
...భీమ ముఖ్యులును ద్రౌపదియుఁజచ్చి
రేనువారలవిడువక యేడ్చుచున్న
వత్తురేతోడ? వచ్చి చావనిశునకము
విడువకుండుట తప్పుగా నుడువ 'దగునె"[1]

అనిధర్మజుడుతనకు స్వర్గం అవసరం లేదనీ, ఆ అడవిలోనే ఇంద్రునిసేవిస్తూ ఉంటాననీ, కనుక మరలిపోవలసిందనీ, చెప్పాడు.

అతని ధర్మదీక్షకు మెచ్చి సారమేయ రూపంలో ఉన్న ధర్ముడు ప్రత్యక్షమయ్యాడు. నీకు సాటిరాగలవారు స్వర్గంలోకూడా లేరనిచెప్పి, "నిశ్చింతత మేనితోఁజనుము సిద్ధపథంబునఁ బుణ్యలోకముల్ వింతలు కాక యుండ ... "నని పలికాడు. గంధర్వులూ, దేవమునులూ, మరుత్తులూ, అశ్వినులూ, వసువులూ కూడా సాక్షాత్కరించారు. అంతా కలిసి ధర్మజుని ఎత్తి రథారూఢుని చేసి స్వర్గానికి తీసుకువెళ్ళారు.

1. మహాప్రస్థాన - 57

# 18. స్వర్గారోహణం

స్వర్గంలో ధర్మరాజు బంధుదర్శనాన్ని అపేక్షించాడు. ఇంద్రుడు అందుకు ఏర్పాటు చేశాడు. ఎదురుగా ఉన్నతాసనంమీద, ఉదయిస్తున్న సూర్యునిలా, దేవకాంతలచే సేవించబడుతూ, నిరంతర సుఖాల్లో మునిగితేలుతున్న దుర్యోధనుడు ముందుగా దర్శనమిచ్చాడు ధర్మజునికి. దేవమునుల ముఖాల్లోకి చూస్తూ "ఇతడు అతిలోభి, ఇతని కారణంగానే మహాయుద్ధం జరిగింది — ఎందరో రాజులు చనిపోయారు. పరమసాధ్వి అయిన పాంచాలిని పూజ్యులైనవారి ఎదుట అవమానపరిచిన దుష్టుడు ఇతడు. ఇలాంటివానితో కలిసి నేనిక్కడ ఉండను. నా తమ్ములూ, ద్రౌపదీ ఎక్కడ ఉన్నారో నన్నూ అక్కడికి పంపండి" అంటూ వెనుదిరిగాడు. అప్పుడతణ్ణిచూసి నవ్వుతూ, నారదుడు, "ఇతడు క్షత్రధర్మాన్ని పాటించాడు. అది పాపం ఎలా అవుతుంది? ద్రౌపది అవమానించబడటం మొదలైనవన్నీ ఇక్కడకువచ్చి స్మరించడం దేనికి? ఇది పుణ్యలోకం. మనస్సుకు సంబంధించిన ఈర్ష్య, రోషం అనేవికారాలను విడిచి, సమత్వాన్ని పొందాలి. జూదంలోను, యుద్ధంలోను ఏపాపాలు నీహృదయాన్ని ఎక్కువగా బాధించాయో వాటిని అన్నింటినీ వదిలివెయ్యి" అనిచెప్పి, అతనిని అతడుకోరినప్రకారం అన్నదమ్ములూ, ద్రౌపదీ, ఇతరబంధువులూ గల నరకానికి వారుతీసుకువెళ్ళారు. ఏపుణ్యమూ చేయని దుర్యోధనుడు స్వర్గంలో సుఖపడటం, ఈగకాలంత పాపమైనా చేసి ఎరుగని తనవారు నరకంలో బాధపడటం ధర్మజునికి ఎంతో బాధకలిగించింది. ఇంద్రునిమీద కోపించాడు. ఇంద్రుడుఅప్పుడు అతనిని స్వర్గంగలో స్నానంచేయించాడు. మానుషతనువుపోయి దివ్యమైన మహిత దేహాన్ని పొందాడు ధర్మరాజు. అలాదేవత్వాన్ని పొందిన అతనికి ఇంద్రుడు స్వజనాన్ని చూపించాడు.

ఉదయించిన సూర్యునికాంతితో, ఉత్పల గంధంతో, ఉదాత్తమూర్తితో, తనచుట్టూగల ప్రదేశాన్ని తనకాంతితో వెలుగొంద జేస్తున్న ఒక స్త్రీమూర్తిని చూసి ఆశ్చర్యపడి, ధర్మరాజు, ఆమె ఎవరిని ఇంద్రుని అడిగాడు.

"............ ఈభామ మ
హాలక్ష్మి ద్రౌపది యనఁగ ద్రుపదు
నికిఁ గూతురై యయోని ప్రభవంబగు
మానుషరూపంబు మహితలీల
ముగఁదాల్చి భవదనుభూతి చెల్లించె గా
రీశ్వరు నాజ్ఞ వహించి వచ్చె
నని ... ... ... ... ..."[1]

ఇంద్రుడు వివరించాడు.

ఈవిధంగా ద్రౌపది ఈశ్వరనిర్దేశానుసారం జగన్నాటకంలో తనవంతు పాత్రను తానునిర్వహించి, స్వర్గాన్ని చేరి, యథాపూర్వంగా స్వర్గ లక్ష్మి పదవిని అలంకరించింది.



1. స్వర్గారోహణ - 58

# అధ్యాయం నాలుగు - సంభావనం

1. ద్రౌపది దివ్యత్వం

2. ద్రౌపది సౌందర్యం

3. శక్తిసామర్థ్యాలూ – ప్రజ్ఞాపాటవం

4. పాతివ్రత్యమహిమ

5. అనన్యభక్తి

# ఆంధ్ర మహాభారతము - ద్రౌపది

## —ఒక ఐతిహాసిక విశ్లేషణ

### -: 1. ద్రౌపది దివ్యత్వం :-

భారతంలో వర్ణించబడిన సన్నివేశాలనుబట్టి ద్రౌపది మానవమాత్రురాలు కాదనీ, దివ్యవనిత అనీ స్పష్టపడుతుంది. ఆమె జన్మమూ, ఆ వెనుకటికథా, ఆమె సౌందర్యం, వివాహం, దాంపత్యం మొదలైనవన్నీ అసాధారణమైనవిషయాలూ, లోకాతీతమైనవీ కూడా.

ద్రుపదునియజ్ఞవేదిక నుంచి ఆమె ఆవిర్భవించినట్లుగా చెప్పబడటంలోని సంభావ్యతా, అసంభావ్యతలను ప్రక్కను పెట్టిచూస్తే (అవిలోకానికిసంబంధించినవికనుక), ఆవిధమైన జన్మకలదిగా చెప్పడంలో వ్యాసుని ఆంతర్యం ఆమె లోకాతీతమైన దివ్యవ్యక్తి అనే.

సర్వసమర్థులైన పంచపాండవులకు ధర్మవిరోధంలేనివిధంగా భార్యఅయిసేవించడంకూడా ఆమెదివ్యత్వాన్నే నిరూపిస్తోంది. ఆమె వివాహం పురుషార్థాన్నికూడా ఉద్దేశించి జరిగిందనేవిషయం సావధానంగాపరిశీలిస్తే స్పష్టమవుతుంది.

పరమార్థంతోకూడిన ఆమెవివాహాన్ని లోకరీత్యా విమర్శించినవారికి ఆమె ప్రకృతిమానవభామిని కాదు — అన్న ధృతరాష్ట్రుని అనుభవపూర్వకమైన ప్రతిపాదనే సమాధానం. కురుసభలో ఆమె పాతివ్రత్యమూ, దివ్యత్వమూ ప్రత్యక్షంగా నిరూపితమయ్యాయి.

బహుభర్తృత్వం (polyandry) అనేది దేశంలోని కొన్ని ప్రాంతాల్లోఇప్పటికీ ఉన్నదికనుక ద్రౌపదివివాహంకూడా అటువంటిదే అనుకోవడం అర్థంలేనివిషయం. ఆ బహుభర్తృత్వానికి పవిత్రతను చేకూర్చడం కోసం ద్రౌపదికి దివ్యత్వం, పూర్వజన్మగాథలు మొదలైనవి ఆపాదించబడినాయనడం అంతకంటే అర్థంలేనివిషయం. ద్రౌపదిని

పాండవులకు అయిదుగురికీ ఇచ్చి వివాహం చేయడానికి ద్రుపదుడు సందేహించడం, కురుసభలో ద్రౌపదిపంచభర్తృక గనుక బంధకి అని ఆరోపించబడటం మొదలైనఅంశాలు భారతకథాకాలం నాటికి, ఆసమాజంలో, ముఖ్యంగా, కౌరవవంశంలో, బహుభర్తృత్వం ప్రచారంలో లేదని నిరూపిస్తున్నాయి. అయితే పాండవులు బాల్యంలో శతశృంగ ప్రాంతంలో నివసించివచ్చారు కనుక అక్కడ ప్రచారంలో ఉన్నసంప్రదాయాన్ని వారు పాటించారని సరిపెట్టుకోవాలని చూసినా, భీముడు అర్జునునికంటేముందు కమలపాలిక (హిడింబ) ను వివాహమాడినప్పుడుగాని, ధర్మజాదులు దేవిక మొదలైన ఇతరకన్యలను పరిగ్రహించేటప్పుడుగాని ఈసంప్రదాయాన్ని ఎందుకు పాటించలేదు? అనే ప్రశ్నకి సరైన సమాధానం దొరకదు. తమ కుటుంబాల్లోగాని, తాముమసలే సమాజంలోగాని ఎక్కడా ప్రచారంలో లేని, పైపెచ్చు, తప్పుగా పరిగణించబడే పద్ధతిని పాండవులు ఎందుకు అనుసరించవలసివచ్చింది? అన్నప్రశ్నకి కూడా సమాధానంరాదు.

అన్నిటినీమించి, ఎవరో ఏదో ఆచారాన్ని అనుసరిస్తూంటే దానిపట్ల వ్యామోహితులై గుడ్డిగా అనుసరించే సామాన్యులవంటి వారే పాండవులూనని వాదించదలిస్తే, మొత్తం భారతాన్నే కల్పిత గాథ అనవలసి వస్తుంది. భారతం కల్పితగాథగా ఒప్పుకోగలిగితే, ద్రౌపది దివ్యత్వమూ కల్పితమే అవుతుంది కనుక దానినిగురించి పశ్నించలసిన అవసరమే మరిఉండదు.

అలాకాక భారతకథ జరిగినదే (historical) అనీ, దానిలోని దివ్యత్వం (divinity) మాత్రమే కల్పితమనీ చెప్పదలిస్తే అది ఆత్మవంచన, లోక ద్రోహమూ అవుతుంది. ఎందువల్లనంటే, భారతగాథను గూర్చి మనకు తెలిపే ఏకైక ఆధారం వ్యాసవిరచిత మహాభారతం.

వ్యాసుడు ఇప్పటిచరిత్ర కారులవంటివాడు కాడు. వేదదర్శనం పొందిన మహానుభావుడు. అతనికి లేనివి కల్పించి వ్రాయవలసిన అవసరం లేదు. అతడు అలాంటివాడే గనుక అయితే ద్రౌపది పంచభర్తృత్వాన్ని గూర్చి చెప్పడం దేనికి ? దానికి మళ్లీ పవిత్రతను ఆపాదించాలని తాపత్రయపడటం దేనికి ? ద్రౌపది ధర్మజుణ్ణో, అర్జునుణ్ణో ఒక్కణ్ణే చేపట్టిందని కథను కల్పిస్తే సరిపోయేదికదా! కనుక ఈవాదనలన్నీ అర్థంలేనివి. వాటికి చాలావరకు "ద్రౌపదీనిందా నిరాకారణము" లో కీ.శే. వారణాసివారు తగిన విధంగా సమాధానాలు చెప్పే ఉన్నారు.

మార్కండేయ మహర్షి వినిపించిన పతివ్రతఅయిన బ్రాహ్మణస్త్రీ వృత్తాంతాన్ని విని ధర్మరాజు,

"సమధికదర్ప దుర్జయములై విగడెడు
నింద్రియంబులఁ గుదియించి తెచ్చి
మనసుపొందునఁడి మన సహంకారంబు
పజ్జకుఁ బాపి సద్భక్తియుక్తి
నెరయంగ ననిశంబు నిజభర్తృ శుశ్రూష
యందు సమాహితయైన వనిత
యఖిల లోకోత్కృష్టయని యెప్డు నూహింతు
నరయఁ బతివ్రతలైనవారి
చరితమత్యంత ధర్మసూక్ష్మంబుఁ గరము
దుష్కరంబునుగాదె! ..............."[1]

అని పలికినమాటలు పరమసత్యాలు.

ద్రౌపదివంటి కారణజన్మురాలైన పతివ్రతయొక్క చరిత్ర మరింత ధర్మసూక్ష్మమై, దుష్కరతమంగా ఉంటుందనడంలో అతిశయోక్తి ఎంతమాత్రమూ లేదు.

---

1. అరణ్య - 5 - 3

ద్రౌపది దివ్యురాలయితే ఆమెను కౌరవులు అవమానించబోవడం, సైంధవకీచకులు ఆమెపై అత్యాచారం చేయబోవడం ఎలా సాధ్యపడింది? అనే ప్రశ్నకు అవకాశం ఉంది. సీతామహాసాధ్విని రావణుడు అపహరించడం ఎలాసాధ్యమయిందో ఇదీ అలాగే నని గ్రహించవలసిఉంది. మరొక్క విశేషంకూడా ఉంది. కౌరవసభలో ఆమెకు జరిగిన అవమానం ఎంతవ్యక్తిగతమో అంతజాతీయం అని చెప్పుకొన్నాం. దానిదుష్పరిణామం కూడా అంతటి జాతీయస్థాయిలోనూ మహాయుద్ధంగా ఉంది. సైంధవకీచకులు చేసిన అవమానాలు వ్యక్తిగతమైన పరిధికి చెందినవి కనుక వాటిపరిణామాలుకూడా వ్యక్తిగతమైనపరిధికి లోబడి ఉన్నాయి.

దివ్యత్వమనేది విద్యుచ్ఛక్తి లాంటిది. అదిపైకి కనబడదు. సక్రమంగా వినియోగించుకో గలిగితే ఎన్ని విధాలుగా నయినా వినియోగ పడుతుంది. చేతకాక దాన్నిలో చేయి పెడితే విద్యుద్ఘాతానికి (shock) గురయి, దుర్మరణం పాలవుతాం. విద్యుద్ఘాతం తగిలినప్పుడు లోపం మనదవుతుందిగాని, విద్యుచ్ఛక్తిని తప్పు పట్టలేం. అలాగే కౌరవులూ, వారిని చేరినవారూ నాశనమవ్వడానికి కారణం ద్రౌపది దివ్యత్వంతో కౌరవులు చెలగాటమాడటమే కాని అందుకు ద్రౌపది ఎంతమాత్రమూ బాధ్యురాలుకాదు.

అజ్ఞాతవాససమయంలో ద్రౌపదీపాండవుల దివ్యత్వం కొంతవరకూ తగ్గినట్లుగా కనబడుతుంది. అప్పటివారిరూపాలు వారు తమంత తాముగా కృతకంగా కల్పించుకొన్నవికావు. ధర్మదేవుడు ధర్మజునిపట్ల ప్రీతచిత్తుడై, "ఇదె పదమూఁడవయేఁడు సనుదెంచె నింక మీరు నజ్ఞాతవాసంబు సలుపవలయు నందు మీ రెవ్వరెక్కడ నేరూపంబునం జరియింపం గోరిన నయ్యైరూపంబు లలవడియెడు నెట్లున్నను మిమ్ము నెవ్వరు నెఱుంగకుండునట్లుగా వరం బిచ్చితి"[1] నని దయతో అనుగ్ర

1. అరణ్య - 7 - 465

హించగా కలిగినవి.

ఒకవిధంగా శాపం ఎటువంటిదో వరమూ అటువంటిదే నని చెప్పవచ్చు. ప్రసన్న చేతసంలో కలిగే ఒకవికారం (క్రోధం) వల్ల శాపం వెలువడితే, మరొకవికారం (అనుగ్రహం) వల్ల వరం వెలువడుతుంది. రెండూ అవతలివారిఅర్హతనుబట్టి అప్రయత్నంగా వ్యక్తమయ్యేవే కాని తత్కారకులు కావాలని ఇచ్చేవికావు. అందువల్ల అవిపని చేసేతీరు కూడా ఒక్కవిధంగానే ఉంటుందనుకోవడంలో తప్పులేదు.

ద్రౌపది సైరంధ్రిగా మారినవిధాన్ని వర్ణించి,

"పరిచారికాత్వరేఖా
పరిణతి దనమేన నచ్చువడు భావనకుం
దిరమై తలకొనునంతః
కరణముతోఁ బురము ద్రుపదకన్యక సొచ్చెన్."[1]

అని తిక్కనమహాకవి చెప్పడాన్నిబట్టి ద్రౌపది మనస్సూ, అంతఃకరణమూకూడా పరిచారికాత్వాన్ని పొందాయని గ్రహించవలసిఉంది.[2] ద్రౌపది ఆకారంలో ప్రధానమైన అంశ ఆమె ఉజ్జ్వలత్వం. ఇదిపూర్తిగా ఆత్మసంబంధమైనది. (ఆత్మవంతులైన యోగుల శరీరాలు దివ్య తేజస్సుతో ప్రకాశిస్తూఉంటాయి. ఈ తేజస్సును ఆధుని శాస్త్రవేత్తలు గుర్తించ గలిగారు.)[3] వరప్రభావంవల్ల గంధకారికా వేషాన్ని పొంద

---

1. విరాట - 1 - 292

2. "ద్రౌపది సైరంధ్రీ జాతికుచితమైన వేషమును ధరించినదని మూలమున కలదు. వేషమునేగాదు, అందుకు తగిన అంతఃకరణమునుగూడ కలిగినది ద్రౌపది అని తిక్కన కల్పన." "తిక్కనచేసిన మార్పులు - ఔచిత్యపు తీర్పులు" పుట 326.

3. "మానవుడి శరీరంలోపల కేవలం రసాయనద్రవ్యాలేకాకుండా, స్థూల శరీరానికి అంతర్లీనమైన ఒకానొక "సూక్ష్మశరీరం" ( subtle body ) తేజోమయశరీరం (astral body) ఉన్నట్లుగా (తరువాయి భాగం 282 పేజీలో)

షంలో ఆమె మూర్తి ఉజ్జ్వలత్వం మరుగు పడింది.[1] అలా మరుగుపడిన రూపాన్నే విరాటనగర పౌరులు "కడున్ వెక్కసమంది" చూశారు. సుదేష్ణ ఆమెమాటలు నమ్మలేకపోయింది.

"సురగరుడఖచరవిద్యా
ధరకిన్నరయక్ష సిద్ధ తరుణులలో నీ
వరయఁగ నొక్కతవగుదు
ప్పురికిం జనుదేరఁ గతము బొంకక చెపుమా!"[2]

---

ఋజువుచేసే రూఢి అయిన పరిశోధనే కిర్లియన్‌ఫొటోగ్రఫీ." పుట - 27

...... "జోసెఫ్‌కిర్లియన్" కనిపెట్టిన కొత్తరకం ఫొటోగ్రఫితో మనిషి స్థూలశరీరం లోపలఉండే ఇంకొక చైతన్య వంతమైన ఒకానొక "తేజస్సు" వంటి రెండవశరీరాన్ని ఫొటోగ్రాఫ్ చేయడంలో అపూర్వ విజయాన్ని సాధించారు సోవియట్ శాస్త్రజ్ఞులు. ఈలోపలఉండే రెండవశరీరాన్ని ఆధ్యాత్మిక పరిభాషలో "జీవాత్మ" లేక "సూక్ష్మశరీరం" లేక "యోగమయ శరీరం" అంటారు... "పుట - 30

"... దీనికి సైన్సులో ఒకక్రొత్త పేరు పెట్టారు "ప్లాస్మా"(plasma)అని. భౌతిక శాస్త్రంలో (physics) లో పదార్థం యొక్క నాల్గవదశ, ఈ మధ్యనే క్రొత్తగా అణు శాస్త్రజ్ఞులచేత కనిపెట్టబడింది. అంటే పదార్థం అణువులుగా, పరమాణువులుగా , ఎలక్ట్రానులుగానే కాకుండా "ప్లాస్మ" రూపంలోకూడా (అణువులుక్రింద కాకుండా) ఉంటుందని కనుగొన్నారు." - పుట 37

- సోవియట్‌రష్యాలో ఆధ్యాత్మికపరిశోధనలు - 1979

రచన: ఇ. వేదవ్యాస, యుస్కోఫ్ప్రచురణ.

1. విరాట - 1 - 294. " ... గంధకారికా వేషంబు కతనమూర్తి
యుజ్జ్వలత్వంబు మఱుపడియుండ ... "

భీముడు ద్రౌపదికి జరిగిన అవమానంచూసీ, సుఖంగా నిద్రించడం, కీచకుణ్ణి అమానుషంగా చంపడం, అర్జునుడు తాను కీచక సంహారానికి సరిపోనని చెప్పడం మొదలైన అంశాలను బట్టి పాండవుల దివ్యత్వంకూడా (యమునివరంవల్ల) మరుగుపడిందని గ్రహించవలసి ఉంది.

2. విరాట - 1 - 314

అని ఆమె ద్రౌపదిని అడిగింది.

అజ్ఞాతవాసమప్పటి ద్రౌపదిప్రవర్తనా, మాటలూ భారతంలోని ఇతరసన్నివేశాల్లోని ఆమెప్రవర్తనా, మాటలకంటే ఎంతో విలక్షణంగా కనిపిస్తాయి. అరణ్యవాసంలో ద్రౌపది ఒంటరిగా ఉండీ, పరివారంతో వచ్చినసైంధవునికి ఎంతో ధైర్యంగా,

"ననుఁ బెఱవనితల చందం
బున నవమానింప నీకుఁబోలదు మత్పా
వనపాతివ్రత్యమహిమ
ననిశము నేకీడు నెందునందదు నన్నున్"[1]

అని చెప్పగలిగింది. కాని కీచకుడు వెంటపడినప్పుడు ఆమె ధైర్యాన్ని కోల్పోయి 'దురవస్థ' పాలయింది.

"అలమటఁబొందు మాయవిధియా యనిదైవముదూఱు నిత్తతం
గలరొకొ నాకు దిక్కను మొగంబున నశ్రులు వెల్లిగొల్పుఁదా
ట్రెలఁబడు జల్లనం బెదరుడెందము గూడఁగఁదెచ్చి నన్నుఁగే
వలమునమున్న నెవ్వరికి వచ్చునెనుం గలఁగున్ వెనుంబడున్."[2]

వివిధ అవస్థలనుపొంది చివరికి హృదయ పుండరీకంలో పుండరీకాక్షుని ప్రయత్నపూర్వకంగా నిలుపుకోగలిగింది. మందిరం నుంచి వెలుపలికి వచ్చిసూర్యభగవానునికి నమస్కరించి, మనస్సులో

"పాండుపుత్త్రులకేనుదప్పని మనంబు
గలుగుదాననయేని యోకమలమిత్త్ర
కీచకునిదెస నన్నొకకీడు తెరువు
వొరయ కుండఁగ రక్షింపు కరుణతోడ"[3]

అనిప్రార్థించింది. కురుసభలో దుష్టులైన దుశ్శాసనాదులను ధైర్యంతో

1. అరణ్య - 6 - 188  2. విరాట - 2 - 104  3. విరాట - 2 - 108.

ఎదుర్కొని, తనవివేకంతో సభలోనివారినందరినీ నిరుత్తరులనుచేసిన ద్రౌపదికీ, ఈ ద్రౌపదికీ ఎంతతేడా!

అరణ్యంలో పాపవినిశ్చయుడై కొంగుపట్టుకొన్న సైంధవుని, ఆమె 'ఉదల్చికొని' త్రేయగా, వాడుగాలికి నేలకూలిన మహీరుహంలా, చిత్రంగా, క్రిందపడిపోయాడు.[1] అలాంటి ద్రౌపదికి ఇప్పుడు అదృశ్యా కారుడైన ఒకరాక్షసుని రక్షకావలసివచ్చింది. కీచకుడు తమకంతో పయిబడి పట్టుకొంటే,

"తనుఁగాచి వెనుకవచ్చిన
దనుజుమహాబలము తనదుతనువొందిన నా
తని చే విదిల్చి రభసం
బునఁదన్మందిరము ద్రుపదపుత్త్రిక వెడలెన్"[2]

ఆమె అలాత్రోసిపోతే కీచకునికి ఏమీకాలేదు! ఆమెవెంటపడ్డాడు! అన్నింటికంటే ఆశ్చర్యం, కీచకుడు కేవలంపశుబలంగలమానవమాత్రుడు; వాడు "అత్యుదగ్రుడై" ఆ చిగురుఁబోఁడి" ని "ఒడిచి తలపట్టి తిగిచిమహోగ్రవృత్తిఁగొంకు కొసరించుకయులేక కూలఁదాఁచా''డు.[3] ఆసందర్భంగా భీమునికి కలిగిన ఆవేశమూ మానవీయమైనదే, ద్రౌపదికి కలిగిన ఆవేశమూ మానవీయమైనదే. ద్రౌపది సభలోనిలబడిపోయి తనపరాభవాన్ని గూర్చి విరాటునికి చెప్పుకొంటూఉంటే, సభవారంతా ఆమెనుచూస్తూ తలొకరకంగానూ వ్యాఖ్యానించసాగారు. ధర్మరాజు మనస్సును కూడగట్టుకొని ఆమెనుఅక్కడినుంచి వెళ్ళిపొమ్మనిఎంతగానో చెప్పాడు. ఆమె వినలేదు. ఆమెను ఎలాగైనాసరే అక్కడినుంచి పంపించివేయవలసిన పరిస్థితివచ్చింది ధర్మజునికి. అందువల్ల అతడుకులసతులగౌరవం పోయేలా, విచ్చలవిడి నాట్యం ప్రదర్శిస్తున్నట్లుగా ఆసభలో నిలబడటం తగదని చెప్పాడు. అందుకు ఆమెకుకోపంవచ్చింది.

1. ఆరణ్య - 6 - 190   2. విరాట - 2 - 126   3. విరాట - 2 - 128

"నాదువల్లభుండు నటుఁడింత నిక్కంబు
వెద్దవారియట్ల పిన్నవారు
గానఁబతులవిధమకాక యేశైలూషిఁ
గాననంగ రాదు కంకభట్ట!

"అట్లగుటం జేసి నాకు నాట్యంబును బరిచితంబ మత్పతిశైలూషుండ కాఁడు కితవుండునుంగావున జూదరియాలికి గఱువతనం బెక్కడియది?"[1] అంటూ అక్కడనుంచి కదిలింది.

ధర్మరాజు నిజంగా జూదమాడి, ఆమెను పణంగా పెట్టి ఓడిపోయి, ఆమెకుదాసీత్వం కలిగేలా చేసినప్పుడు ఆమె అతణ్ణి పల్లెత్తుమాట అనలేదు.

"అనుపమదైవయోగహతుఁడయ్యునవశ్యము ధర్మసంపదం
దనరునకాని ధర్మజుఁడు ధన్యుఁడు ధర్మపథంబు తప్పఁడో - క్కునె"[2]

అని సభవారికి చాటిచెప్పింది. ఇప్పుడు ధర్మరాజు చేసిందిఏమీలేదు. ఆమెను లోపలికివెళ్ళిపొమ్మన్నాడు, ఆమె మొండి కెత్తింది. అతడు మందలించవలసివచ్చింది, మందలించాడు. అంతమాత్రానికే ఆమె "సాభిప్రాయంగా" అలాసమాధానం చెప్పడం విడ్డూరమే! ఇందుకామె ఆతర్వాత పశ్చాత్తాపపడింది.

"... ... ... ... ... ... ... ... ... ... ... ... ...
... ... ... ... ... ... ... ... ... ... ... ...
... ... ... ... వగపునేత్తెఱ డెందము గొందలంబుఁబొం
దిన ధృతిమాలి యేఁబలికితింపగ వెల్ల నెఱింగి యుండియున్.

"ఇట్టిద కాని సమస్తజనస్తవనీయుం డగుపాండవాగ్రజునిక్కంబ నిందించినదానంగాన" ని పలికింది భీమునితో.[3] అలానిందించినందుకు పరిహా

1. విరాట - 2 - 152, 153  2. సభా - 2 - 218  3. విరాట - 2 - 186,187

రంగా ధర్మజుని మహిమను నోరారా కీర్తించిందికూడా. అంటేఆమె తాత్కాలికంగా దివ్యత్వపుస్థితినుంచిక్రిందికిజారిందన్నమాట! ఆతరువాత తన్నుతాను సరిదిద్దుకోవటానికి ఆమహానుభావుని గుణాలు స్మరించింది.

"...భర్తలయెడల ఆ క్షణాల్లో మెదలిన చులకన భావం పతివ్రతయైన ఆమెమనస్సుకు చెప్పలేనంతవేదన కలిగించింది. ఆచులకనభావం తనమనస్సులో మెదిలింది కొద్దిక్షణాలే అయినప్పటికీ, వెనుకటి పవిత్రస్థితి తన మనస్సుకు కలిగేటందుకై ఆమె తనభర్తల గుణగణాలను భీమునిసమక్షంలో నోరారాకీర్తించుకొంది. తానున్నస్థితినుంచి నిజస్థితిలోనికి తనను తాను ఉద్ధరించుకోవడానికి చేసినప్రయుత్నమే ఇది."[1]

ద్రౌపది దివ్యత్వాన్ని నిండుసభలో ధృతరాష్ట్రుడు అంగీకరించాడు.[2] మార్కండేయమహర్షి ఆమెను సావిత్రి అంతటిమహానుభావురాలుగా సంభావించాడు.[3] విరాటనగరంలోని పౌరజనం ఆమెను చూసి "రోహిణియొండె నొండెను నరుంధతిగాక మనుష్యజాతియేయీ హరిణాక్షి ... " అని ఆశ్చర్యపోయారు. సుదేష్ణ ఆమె "సురగరుడఖచరవిద్యాధరకిన్నరయక్ష సిద్ధతరుణుల"లో ఒకతె అయి ఉంటుందని భావించింది. కురుసభలో శ్రీకృష్ణుడు ఆమెను "కులము శీలముఁగల్గిన పుణ్యకాంత" అని ప్రశంసించాడు.[4] కృష్ణుడు ద్రౌపదిని సుభద్రకంటె ఎక్కువగా ఆదరంతోను, గౌరవంతోను సంభావించేవాడని "నీవుసుభద్రకంటెఁగడునెయ్యము గారవముందలిర్ప సంభావనసేయుదు ... "[5] అనే ఆమె మాటలనుబట్టి తెలుస్తోంది. 'గోవిందు చెలియలి' నని ఆమె అనేకపర్యాయాలు చాటుకున్నది. ఈబంధుత్వం ప్రధానంగా ఆమెదివ్యత్వానికి సంబంధించినదే. కురుసభలో కృష్ణుడు ఆమెకు అఖండవస్త్రప్రాప్తిని కలిగించినదాదిగా ఆ అధ్యాత్మికబంధుత్వం దృఢతరమయింది.

1. భారతం - ధర్మాద్వైతం - వ్యాసుని దర్శనం - తిక్కన సందర్శనం, పుట - 223
2. సభా - 2 - 255   3. ఆరణ్య - 7 - 279   4. ఉద్యోగ - 3 - 368
5. ఉద్యోగ - 3 - 110

"ఇభజిద్వీర్య ముఖాభిషిక్తమగు నీయిల్లాలి ధమ్మిల్లమున్
సభలో శాత్రవులీడ్చినన్ముసువకా చంద్రాస్య దుఃఖింపఁగా
నభయంబిచ్చి ప్రతిజ్ఞఁజేసి భవదీయారాతి కాంతాశిరో
జభరశ్రీలహరింపఁడే విధవలై సౌభాగ్యముల్ వీడఁగన్.

"నైరుల్ గట్టినపుట్టముల్ దివియఁగా "వారింపనావల్లభుల్
రాకేవేళ, నుపేక్షసేయఁదగవే? రావేనివారింపవే,
లేరే తాతలు?కృష్ణ!" యంచు సభలోలీనాంగియై కుయ్యిడం
గారుణ్యంబున భూరివస్త్రకలితంగాఁజేయఁడే ద్రౌపదిన్.

"దుర్వాసుఁడొకనాఁడు దుర్యోధనుఁడు వంపఁ
బదివేల శిష్యులు భక్తిఁగొలువఁ
జనుదెంచి మనముఁబాంచాలియుఁగుడిచిన
వెనుక నాహారంబు వేఁడికొనినఁ
బెట్టెదననపుడుఁబెట్టకున్న శపింతు
ననుచుఁదోయావగాహమున కేఁగఁ
గడవలనన్న శాకములు దీఱుటఁజూచి
పాంచాలపుత్త్రిక పర్ణశాల
లోనఁదలచిన విచ్చేసి లోవిలోని
శిష్టశాకాన్నలవము ప్రాశించి తపసి
కోపముడిగించి పరిపూర్ణకుక్షిఁజేసె
నిట్టి త్రైలోక్యసంతర్పి యెందుఁగలఁడు?"[1]

అని అర్జునుడు ధర్మజునితో చెప్పిన భాగవతంలోని మాటలు ఈసందర్భంగా స్మరించదగినవి. సాక్షాన్నారాయణుని అవతారమైన శ్రీకృష్ణుడు ఆమెపిలిస్తే చాలు, పరుగెత్తుకుంటూవచ్చాడంటే, ఆమెదివ్యత్వానికి అంతకంటె నిదర్శనం వేరేమి కావాలి?

1. ఆంధ్రమహాభాగవతం - 1 - 362, 363, 364

## 2. ద్రౌపది సౌందర్యం

ద్రౌపది అతిలోకసౌందర్యవతి. ఆమె సౌందర్యం దివ్యమైనది. పరమేశ్వరునివరప్రభావంవల్ల జన్మించి, జగద్గురుని వ్యూహానికి తననితాను సమర్పించుకోవడంవల్ల ఆమె సౌందర్యం గ్రీకుపురాణనాయిక హెలెన్ సౌందర్యంవలె వినాశకారికాక, ధర్మసంస్థాపనకు దోహదం చేసింది.

సౌందర్యం అనేది పరమేశ్వరానుగ్రహంవల్ల సిద్ధించేదే కాని కోరి తెచ్చుకోగలిగిందికాదు. కనుక లోకంలో సౌందర్యం అనేది ఎక్కడ ఉన్నా అది దివ్యమే అవుతుంది.

వ్యక్తులకు సంబంధించిన అందచందాలు వ్యక్తియొక్క ప్రజ్ఞనుబట్టి ఉంటాయి. నత్తగుల్లను నిర్మించుకున్నట్లుగా ప్రజ్ఞ శరీరాన్ని నిర్మించుకుంటుంది. ప్రజ్ఞతాలూకు సంస్కారాలు దివ్యమైనవి అయితే శరీరంయొక్క తీరుతెన్నులు సక్రమంగాఉంటాయి. ప్రజ్ఞయొక్క దివ్యత్వం శరీరం అంతటా ప్రకాశిస్తూ ఉంటుంది.

లోకసామాన్యమైన అందచందాలను మించిన సౌందర్యం ఎక్కడేనా తారసపడితే దానినివర్ణించడానికి లౌకికమైనభాషా, అలంకారసామగ్రీసరిపోవు. కనుక, అటువంటిసౌందర్యాన్ని దివ్యసౌందర్యం అని చెప్పడం జరుగుతూఉంటుంది. అంతేకాక అటువంటి అసామాన్యమైన సౌందర్యాన్ని సామాన్యదృష్టితో చూడకూడదు. కావ్యాల్లో వర్ణించేటప్పుడు

“మానవాఃమాళితో వర్ణ్యాత్
దేవాః చరణతః పునః”

అనేసాంప్రదాయం అందుకేవచ్చిఉంటుంది. దేవతలు ప్రజ్ఞలేకదా, వారికి రూపం ఏమిటి? రూపం లేనిది సౌందర్యం ఎక్కడిది? అనిఆలో

చిస్తే, సౌందర్యంగా వ్యక్తమయ్యేదీ, గ్రహించబడేదీ ప్రజ్ఞే, కనుక, దేవతాప్రజ్ఞలకు కూడా రూపం ఆపాదించబడి, ఆరూపాల తాలూకు సౌందర్యం దివ్యసౌందర్యంగా పరిగణించబడుతోంది. దానిని పూజ్యభావంతో పాదాలనుంచి మొదలుపెట్టి వర్ణించాలనేది కవుల సంప్రదాయంగావస్తోంది.

ద్రౌపదీసౌందర్యవర్ణన సందర్భంగా కవిత్రయంవారు ఒకనియమాన్ని పాటించినట్లుగా కనిపిస్తుంది. వారు ఆమెను తాముగా ఏసందర్భంలోనూ అంగాంగవర్ణనంచేసి, రూపసాక్షాత్కారాన్ని కలిగించలేదు.[1] ఆయాసందర్భాల్లో ఆయాపాత్రలకు ఆమె దర్శనం ఇచ్చినతీరును మాత్రంవారు వర్ణించారు. గంధికారికావేషంలో మూర్తి ఉజ్జ్వలత్వం మరువడినప్పటి ఆమె రూపవిశేషాన్ని మాత్రం తిక్కనగారు కొంతవరకూ స్వయంగాను, కొంతవరకూ పాత్రలముఖంగాను వర్ణించి, దుర్నిరీక్ష్యమైన ఆమె రూపాన్ని సామాన్యులుకూడా దర్శించేవీలును కలిగించారు.

స్వయంవరసమాచారంతోపాటుగా ద్రౌపది "అగ్నికుండసముద్భవ", "అయోనిజ", అగణ్యపుణ్యలావణ్య గుణసమన్విత" అనే విశేషాంశాలు ప్రచారం చేయబడినాయి.[2] అడిగినవారికి ఆమె పుట్టుక, సౌందర్యాలనుగూర్చి

---

1. "తిక్కన తీర్చినద్రౌపది భీరువు, ముగ్ధమనోహర యగు కావ్యనాయిక కాదు. ధీర, నిశిత బుద్ధి కలిగిన ప్రౌఢనాయిక. ఎచ్చటను ఆమెను వర్ణించినపుడు అంగాంగ వర్ణన చేయలేదు తిక్కన. ఆపని ఉత్తరవిషయమునఁ జేసినాఁడు. ద్రౌపదిని అలౌకిక సౌందర్యప్రతీకగా, ఉదాత్తంగా వర్ణింపఁ దలఁచి కీచకునివంటి దుర్విదగ్ధునిచే సైతము ఉచిత రీతిని వర్ణనఁ జేయించినాఁడు."

"తిక్కన చేసిన మార్పులు - ఔచిత్యపు తీర్పులు" పుట - 323

2. ఆది - 7 - 4 వచనం

"కులపవిత్ర సితేతరోత్పలకోమలామలవర్ణ యు
త్పలసుగంధి లసన్మహోత్పలపత్త్రనేత్ర యరాళకుం
తలవిభాసిని దివ్యతేజముఁదాల్చి యొక్క కుమారి త
జ్జ్వలన కుండమునందుఁబుట్టెఁ బ్రసన్నమూర్తి ముదంబుతోన్!"[1]

అని చెప్పవలసిందిగా వార్తాహరులైన బ్రాహ్మణులకు ఆదేశం. ఆమె నల్లకలువలవంటి కోమలమైన, అమలమైనవర్ణం కలదనీ, ఉత్పలగంధం వంటి పరిమళంకలదనీ, ప్రకాశించే కలువరేకులవంటి నేత్రాలుకలదనీ, కుటిలాలకలతో ప్రకాశించేదనీ, దివ్యమైన తేజస్సుకలదనీ ఇక్కడవర్ణించబడింది. ఇది ఏకచక్రపురానికి వచ్చిన ద్రుపదపురబ్రాహ్మణుని వర్ణన.
" ... ... ... ... ... ... కృష్ణ, నసితోత్పలశ్యామలామలాంగి మెఱుపునుంబోలెను వఱలునుత్పలగంధి, బంధురతనుసౌరభంబు గలుగుదాని ద్రుపదరాజతనయ ... ... ... ... ... ... ... ... ..."[2]
ద్రౌపదీస్వయంవరోత్సవాన్ని చూడటానికి వెడుతున్న బ్రాహ్మణుల మాటలివి.

స్వయంవరసందర్భంగా ఆమె 'ధవళభూషణదామానులేపనామలినాంగి' అయి, సితపుష్పమాలను చేతబట్టి రంగమధ్యంలో నిలబడినప్పుడు చూపరులకు ఆమె "పుష్పసాయకు కుసుమేతరంబైన యాఱగు సాయకంబు" మాదిరిగా పొడకట్టింది.[3] ఇది ఆసందర్భానికి తగినసాక్షాత్కారమే!

అర్జునుడు స్వయంవరంలో ద్రౌపదిని జయించి, తెచ్చి, తల్లికి సమర్పించినప్పుడు ఆమెకు ద్రౌపది "భువనత్రయరాజ్యలక్ష్మి" లాదర్శనమిచ్చింది.[4]

1. ఆది - 7 - 19
2. ఆది - 7 - 159
3. ఆది - 7 - 167
4. ఆది - 7 - 210

పంచపాండవులు "ఆలలితాంగి" యందు హృదయాలూ, చూపులూ నిలిపి పంచశరాహతి పొందారు.[1] ఇది ఆమె సౌందర్యాన్ని విస్తరించి వర్ణించదగినసన్నివేశమే. కానీ 'సత్ప్రతిభాభియోగ్యుడైన' నన్నయమహాకవి సంయమనం ప్రదర్శించడం గమనార్హం.

ద్యూతాహూతుడైన ధర్మరాజు హస్తినకు తరలివచ్చినప్పుడు ద్రౌపది కూడావచ్చింది. ఆమె, తారకలుపరివేష్టించి ఉన్నరోహిణిలా కోడళ్ళచేపరివృత అయి ఉన్నగాంధారికి నమస్కరించింది. అప్పుడు ఆ గాంధారి కోడళ్ళందరూ విస్మితలై ఇలా అనుకొన్నారు:

"అఖిలలావణ్యపుంజంబు నబ్జభవుఁడు
మెలఁతగాదీనియందు నిర్మించెనొక్కొ-
కానినాఁడిట్టికాంతి యేకాంతలందు
నేలలేదని సామర్ష హృదయ లయిరి."[2]

రూపుకట్టినవెలుగులముద్దలా ఉన్నద్రౌపదిని చూసి వారంతాఅసూయ పడ్డారు. గాంధారికోడళ్ళుకూడా అందమైనవారే అయి ఉంటారు. ద్రౌపదిముందు వారిఅందం పగటిపూటచుక్కల చందంఅయింది. అంద గత్తెలమనుకొంటున్న వారిఅహంకారం ద్రౌపదీదర్శనంతో దెబ్బతిని ఉంటుంది. ద్రౌపదికంటె భౌతికంగా వారు అందంగా ఉండి ఉండవచ్చు. కానీ ద్రౌపదికున్న దేహకాంతి వారికి ఉండేఅవకాశంలేదు. వారిప్రవృత్తులు అలాంటివిమరి! వారికేకాదు, ఏకాంతలందూఉండదని వారు గ్రహించారు. అంతటిమహాత్త్వరమైనది ఆమె లావణ్యం.[3] (ద్రౌపది

1. ఆది - 7 - 211
2. సభా - 2 - 160
3. "స్త్రీయొక్క శరీరచ్ఛాయయు, స్నిగ్ధత్వమును, పోషణచేతవచ్చినసౌకుమార్యమును, నైగనిగ్యమును - నివియన్నియులావణ్య మనిపించుకొనును. ... దీనిచేత ద్రౌపదీదేవియొక్క భోగలక్షణాధిక్యము వ్యంజ్యమానమగుచున్నది. అందుచేత వారు మత్సరపడిరి...."

నన్నయగారి భారతాంధ్రీకరణము - శ్రీ విశ్వనాథ
ఆంధ్రమహాభారతోపన్యాసములు, 1969. పుట - 13

శ్రీమాతయొక్క అవతారం. (శ్రీదేవి 'మహాలావణ్య శేవధి' అని "లలితాసహస్రనామస్తోత్రము". శ్లోకం – 20)

అక్షరతుడైన ధర్మజుడు "... మహోత్పలదళచారు నేత్రంగులభామ..." అయిన ద్రౌపదిని పణంగా ఒడ్డి ఓడాడు. ప్రాతికామి వెళ్ళి "వనజాక్షి" నిన్నుతోడ్కొనిపోడానికి వచ్చానని చెప్పాడు. అప్పుడు "ఆ జలజాయతాక్షి" ధర్మజుడు అలా చేస్తాడా? అని అడిగింది. నిర్దయుడైన దుశ్శాసనుడు మీదికివస్తున్నప్పుడు "పంకజాక్షి – కృష్ణ" భయంతో గాంధారిదగ్గరకు వెళ్ళింది. "ఆ వనజాననను" జుట్టుపట్టుకొని ఈడ్చుకు వచ్చాడు దుశ్శాసనుడు. అప్పుడామె "వికీర్ణ కేశి, వివర్ణవదన" అయింది. "విభీతహరిణాక్షి, కలాపవిభాసి కేశభారముకలది" అయిన

---

291 వ పేజీ తరువాయి

"లావణ్యమనగా సౌందర్యము గాదు. శరీరకాంతి. ఆపిడ శరీరకాంతికి వారు మత్సరపడిరి. ఈ శరీరకాంతి కొంత సహజమైనను నెక్కువ భాగము పోషణచేతను, భోగము లనుభవించుట చేతను వచ్చెడిది. ఆమె లావణ్యము పాండవుల సంపత్సమృద్ధిని చెప్పుచున్నది. ఆమెయందు పాండవులకు గల ప్రేమ చెప్పుచున్నది. ఆమె భోగ పరాయణత్వమును చెప్పుచున్నది. అట్టిభోగము మనకు లేదేయని గాంధారి కోడండ్రు మత్సరపడిరి. ..." కీ॥ శే॥ విశ్వనాథ సత్యనారాయణగారు.

నన్నయగారి ప్రసన్నకథా కలితార్థయుక్తి పుట - 128 (1962)

లావణ్యం అంటే శరీరకాంతి అనడంవరకు బాగానే ఉంది, కాని ఆ కాంతి ఆమె భోగలాలసకు నిదర్శనం అనడం సరికాదు దుర్యోధనాదుల భార్యలకు సంపత్సమృద్ధికి గాని, భోగములకుగాని లోటేమిటి? పోషణవల్ల స్నిగ్ధత (fat) కలుగుతుందేగాని వర్చస్సు రాదు. దుర్యోధనుడు "... అందఱుఁ గుడిచినఁ దనుమధ్య యర్ధరాత్రంబునపుడుగాని కుడుపదట్టె ..." అని చెప్పటాన్నిబట్టి, ద్రౌపది స్వయంగా "స్నాన భోజన శయనాది సంప్రయోగ మర్థిఁబతులకు మున్నెందునాచరింప . . ." న నిచెప్పటాన్నిబట్టి ఆమెకు వేళకు తిండీ తిప్పలూ ఉండేవికాదని తెలుస్తోంది. ఇంకెక్కడిపోషణ? కనుక, ఆమె దేహకాంతి ఆత్మసంబంధమైనదే.

ఆమెను చేరరమ్మని పిలిచాడుదుర్యోధనుడు. దుర్నిమిత్తాలకు భయపడి ధృతరాష్ట్రుడు ద్రౌపదిని "పరమపతివ్రత, తపస్విని" అనీ, 'పాండవధర్మ పత్ని, ధర్మరత" అనిప్రశంసించాడు. అతనిని రెండువరాలుకోరి "తరుణి ద్రౌపది" పాండవ ధార్తరాష్ట్రుల కోపాలు పోగొట్టింది.

రెండవసారి జూదంలో ఓడిపోయిన భర్తలను అనుగమిస్తున్న కోడలితో కుంతి "ధవళాక్షి! నీకతంబునపవిత్రమై ద్రుపదుకులముఁ బాండుకులంబున్ భువనముల వెలిఁగె..." నని ప్రశంసించింది. పతుల వెంట ద్రౌపది "ముక్తకేశియై" "మందగతి" తో వెళ్ళింది.

పరామర్శించడానికివచ్చిన కృష్ణునికి ఆమె తనపరాభవాన్ని విన్నవించి, "బాష్పధారాస్నపిత పయోధరయయి పాణిపల్లవంబుల నయనసమ్మార్జనంబు" చేస్తూండగా కృష్ణుడు ఆమెను ఓదార్చాడు.

అర్జునుడు పాశుపతసంపాదనకు బయలుదేరగా "తరుణిపాంచాలి" "కమలనేత్ర" అతనినిఉత్సాహపరుస్తూ, "తనస్నేహాలాలసవిలోలాపాంగవిలోకనంబుల" తో పరిగృహీతపాథేయుణ్ణి చేసింది.

ద్రౌపదీపాండవులు ప్రభాసతీర్థానికి వచ్చినప్పుడు బలరామ కృష్ణులుపోయి, "వారిజదళాక్షి ద్రౌపదిని" ఉదారమృదూక్తులతో ఊరడించారు.

గంధమాదనపర్వతారోహణం చేస్తున్నప్పుడు "అరుణసరోరుహదళమృదులంబులైనయుత్తరుణి చరణతలంబులు" గొడిగరాళ్ళపై నడవడం చేతవ్రణబద్ధాయి, "పద్మాయతాక్షి" నాకారణంగా ఎంతో దుఃఖపడుతోంది. అని ధర్మరాజు బాధపడ్డాడు.

సైంధవుడుఆశ్రమద్వారం దగ్గరనిలబడి ఉన్న ద్రౌపదినిచూసి,

"నీలపయోదమండలి వినిశ్చలలీల వెలుంగఁజేయుచుం
గ్రాలెడువాలుఁగ్రొమ్మెఱుఁగు కైవడిఁదద్వనభూమి నెంతయున్
లాలితదేహకాంతి పటలంబునఁజేసి వెలుగఁజేయున
బ్బాలవినీలకుంతలవిభాసినిఁజూచి సవిస్మయాత్ముఁడై"[1]

---

1. ఆరణ్య - 6 - 145

కోటికాస్యునితో ఆమె సురోత్తమకన్యో, యక్షకాంతో, పన్నగభామో అయిఉంటుందని పలికాడు. ఆమె లేఁజిగురాకువంటి తన చేతిని కదంబ శాఖపై ఉంచి, వసంతవిభ్రమంతో కూడినబాలవల్లిలా, మేలైన చూపులతో తనచిత్తాన్ని మండిస్తోందని చెప్పాడు. "ఆ కమలాస్య" తనకు హృదయేశ్వరి అయితే త్రిలోకాధిపత్యం చేకూరినంతగా సంతోషిస్తానని పలికాడు.

కోటికాస్యుడు ఆమెవద్దకు వెళ్ళి 'మృగనేత్ర! నీవు వనదేవతవా? శచివా? లక్ష్మీదేవివా?' అని ప్రశ్నించి, ఆమెను కరిరాజగమన," "ఉత్పలాక్షి", అని సంబోధించి, తమ వివరాలు చెప్పి, ఆమె ద్రౌపది అని తెలియగానే, 'వామాక్షి! నీకు కుశలమే?' అని పరామర్శించాడు. ఆమెను 'చిగురుఁబోఁడి', 'వనజాక్షి', 'వారిజనేత్ర' అని కూడా అతను సంబోధించాడు.

సైరంధ్రిగా సుదేష్ణను సేవించ బోయినప్పుడు ద్రౌపది జడను విచ్చి, వలపలిదిక్కుకు కొద్దిగా మలిచి తురిమింది. 'కుఱుమాపుడు బట్టలు' ధరించింది. జరఠవల్కలంతో స్తనములను కప్పుకొంది. ఆమె శరీరంలో పరిచారికాత్వరేఖాపరిణతి అచ్చుపడుతోంది. అప్పటి ఆమెతీరు ఈ విధంగా వర్ణించబడింది:

" పఱిమొయిల్ గప్పినఁబాడఱినునుఁ గాంతి
గదలిన యమృతాంశుకళయుఁ బోలెఁ
బెనుమంచు మీఁదఁ బర్వీన వికాసము దప్పి
చెలువు గుందిన సరోజిని విధమున
ధూమంబు వొదివినఁ దుఱఁగలిమెఱుగులు
నలగిఁ మాసిన దీపకళిక పగిది
ధూళిపైఁబొరసినఁ దొంగలించుట మాని
లావణ్య మెడలిన లతికభంగి

గంధకారికావేషంబుకతన మూర్తి
యుజ్జ్వలత్వంబు మఱుపడియుండఁ బాండు
తనయమహిషియంచితగతిఁ జనఁగ రాజ
వీధిఁ బౌరజనంబు లవ్వేళఁ జూచి."1

రోహిణిగాని, అరుంధతి గాని ఆకాశంనుంచి దిగివచ్చిందేమో అను కొన్నారు. 'తైజసాత్మిక' అయిన ఆమె,వర ప్రభావాన గంధకారికా వేషాన్ని పొందింది. అందువల్ల దుర్నిరీక్ష్యమైన ఆమెరూపం సామాన్యులకు దర్శనీయ మైంది. అప్పటికీ ఆమె సౌందర్యం లోకాతీతమైనదే! అందు వల్ల ఆమె మనుష్యజాతి స్త్రీ అయి ఉండదని ఆ పురజనులు భావించారు.

---

1 విరాట - 1 - 294, 295.

"మూలమునందు ఈ సందర్భములో ద్రౌపది వర్ణన లేదు. పురజనులామె సౌందర్యమున కబ్బురపడిరని కలదు. అద్దానిని తిక్కన పైరీతిగాఁ బెంచెను. ఆమె మూర్తిని సమగ్రసౌందర్యము రూపుదాల్చినట్లు వర్ణించెనుగాని అంగాంగవర్ణన లేదు. మబ్బుగ్రమ్మిన చంద్రకళ, మంచుగప్పిన పద్మిని, పొగబట్టిన దీపకళిక, దుమ్మునిండిన తీగవలె సైరంధ్రి వేషమువలన 'ఉజ్జ్వలత్వము' మఱుగుపడిన ద్రౌపది ఉన్నదట. ద్రౌపది ఉదాత్తచిత్త. ఆమెలో ప్రధాన సౌందర్య హేతువు ఔజ్జ్వల్యము. అవయవ ముల పొందిక వలన కలుగునది సామాన్య సౌందర్యము. అంతకుమించి ఉజ్జ్వలముగ భాసించునదిఁ ద్రౌపది సౌందర్యము. ఔజ్జల్యము - హృదయనైర్మల్యము, బుద్ధివివేకముల వలన ఏర్పడునది. అట్టికాంతి, తేజస్సు ద్రౌపదియందు తిక్కన వర్ణించెను.

అల్లంతదూరమున ఆమె కనఁబడినంతనే ఆశ్చర్యపడి ఆమెను రోహిణ్యరుంధ తులతోఁ బోల్చి మనుష్యజాతి వనితగాదని అనుమానించిరని తిక్కన వర్ణించెను. చూచుటతోడనే ఆమె తేజస్సు వారిని ప్రభావితము చేసినదని కవి ఉద్దేశము.

"రోహిణి యొండె నొండెను ......" 4 - 1 - 295

"ఇందు ద్రౌపది సౌందర్యము గాదువారికి సందేహము కలిగించినది. ఆమె 'ఈ భాంగముఁ దేజము.' అంతటి తేజస్విని ఏజగములోను లేదని వారు, తదుపరి కీచకుడును భావించిరనఁగా అది ఊహాతీతమైనట్టిదే.'
'తిక్కన చేసిన మార్పులు-ఔచిత్యపు తీర్పులు' పుట 329 (విరాటోద్యోగపర్వములు)

మెల్లిమెల్లిగా ఆమెను చేరి వారు వివరాలు అడిగారు. ఆమె "సౌముఖ్యము, సభావనముందోఁప" తగిన విధంగా "ఏను గట్టువాలుదాన..." నని చెప్పింది. ప్రజలు ఆశ్చర్యపడి, సందేహించారు. "ఇంతటి రూపవతి కడుపుకూటికి ఎవరినన్నా సేవిస్తుందట! ఇదెక్కడిమాట?" అనుకొన్నారు.

సుదేష్ణ మేడపైగల కిటికీలోంచి చూసి ద్రౌపదిని గూర్చి కుతూహలపడింది. వెంటనే ఆమెను తోడ్కొని రమ్మని ప్రౌఢాంగనలను పంపింది. వారు ఆమెతో "విరాటు మహిషినినుఁ దనపాలికిఁ బిలువఁబంపె దయపెంపెసఁగన్" అని చెప్పారు. అప్పుడు ద్రౌపది 'వినయవైభవము సతితను వొందిన చందంబున' వారివెంట వెళ్లింది. ఆమె మేడపైభాగానికి, సుదేష్ణ ఉన్నచోటికి వెడుతూ ఉంటే, ఆమె పాదాల ఎర్రదనంసోకి పరిసరాలు కుంకుమపూత పెట్టినట్లుగా అయ్యాయి. (అంటే, ఆమె "పదద్వయప్రభాజాల సరాకృత సరోరుహా" అన్నమాట!) ఆమె శరీరపుకాంతివల్ల గోడలూ, వేదులూ మణిమయంగా భాసించాయి. (ఆమెఅంతటి 'ప్రభావతి, ప్రభారూప' అని గ్రహించవలసి ఉంది.) ఆమె కంటి మెరుగులు వ్యాపించిన భాగాలు పుష్పహారాలతో అలంకరించబడినట్లయ్యాయి. (ఆమె "కటాక్ష కింకరీభూత కమలాకోటి సేవిత" "లోలాక్షి," 'విశాలాక్షి' కనుక!) ఆమె శిరోజాలకాంతికి పైభాగమంతా నల్లటిబట్ట పరచినట్లు అయిపోయింది. (ఆమె "అష్టమీచంద్ర విభ్రాజదళిక స్థల శోభిత.") ఆమె ప్రవేశించడంతో రాజభవనంలో క్రొత్త అందాలు అతిశయించాయి.[1] ("నిజారుణ ప్రభాపూర మజ్జద్బ్రహ్మాండమండల" అయిన ఆమె గంధకారికా వేషంలో ప్రవే

1. విరాట - 1 - 308.
"కించిద్వ్యవధానము గానున్న యీ రెండు పద్యము ('పఱమొయిల్...', 'పదతలంబుల...' 294 - 308) లలోఁ గొంచెముగాఁ బరస్పర వైరుధ్యము గానవచ్చు

శిస్తారంటే భవనంతో 'క్రొత్త యొప్పెసక మెసఁగ' టంలో ఆశ్చర్య మేముంది?). ముందు పాదముల కెంపును; తరువాత వరుసగా, శరీర కాంతిని, కనుఁగవ మెఱుఁగులను, వేనలికప్పును - అంటే, ఆపాద మస్తకం, వర్ణించడాన్ని బట్టి ద్రౌపది సౌందర్యం దివ్య సౌందర్యమని తిక్కనగారు సంభావించినట్లుగా స్పష్టమవుతోంది.

సుదేష్ణ "భూరితరాదర రేఖ"ను దగ్గరకు రమ్మని, ఆపాద మస్తకం వీక్షించి, "మెఱుఁగుబోఁడి" అని సంబోధిస్తూ, ఆమెను వివరాలు అడిగింది. ద్రౌపది తాను సైరంధ్రీజాతి సంభూతననీ, పేరు మాలిని అనీ, అయిదుగురుభర్తలు కలిగి, ఒక కారణంగా విరోధులచేత పతుల సమక్షంలో తలబట్టి ఈడ్వబడి, భర్తలతో అడవులలో ఉండి, ఇంకొక్క సంవత్సరం నియమాచరణం నిమిత్తం అక్కడికి వచ్చాననీ చెప్పింది. సుదేష్ణ ఆమె మాటలను నమ్మలేక పోయింది.

" సురగరుడ ఖచర విద్యాధరకిన్నర యక్ష సిద్ధ తరుణులలో నీ

---

(296 వ పేజీ తరువాయి)

చున్నది. మొదటి పద్యమున నామె సౌందర్య ముజ్జ్వలత్వము మఱువడీ యుండఁగా రెండవపద్యమున నామె మేనిధాళధళ్యము సోకిన భవన భాగములు గూడఁ దళతళ లాడుచున్నట్లు వర్ణింపఁబడుచున్నది. ఇంతలో నింతమారెవ్వక్కడనుంచి వచ్చెను?... ద్రౌపది పురవీధినుండి సుదేష్ణయున్నచోటికి వచ్చులోపలఁ, దన మాసినతనమును గొంత మాపుకొని యుండవలయును...

- భారత ధ్వని దర్శనము, 1979, పుట - 263 - 264

ఈ అభిప్రాయం సరికాదు. ఆమె ఉజ్జ్వలత్వం మఱువడినతీరు మొదటి పద్యంలోను, మఱువడినప్పటి దేహకాంతి రెండవ పద్యంలోను వర్ణించబడినాయి. కనుక ఇక్కడ వైరుధ్యంలేదు. మాననీయులకడకు స్వతహాగా సంస్కారంలేనివారు వెళ్ళేటప్పుడు సంస్కారంచేసుకు వెడతారు. ద్రౌపదివంటి బాగా సంస్కారం కలవారు పరిచారికగా చేరబోతూ, ఉన్న సంస్కారాన్ని మరింతగా తగ్గించుకొని వెళ్ళాలిగాని సంస్కరించుకొని కాదు.

వరయఁగ నొక్క_తవగు దివ్వరికిం జనుదేరఁగతము బొంకక చెపుమా''[1]

అని అడిగింది. ద్రౌపది తాను దేవజాతిననే సందేహాన్ని పోగొట్టి, సుదేష్ణ అంతగా యిష్టపడకపోయినాసరే, ఆమెను అంగీకరింపజేసి, ఆమెవద్ద చేరింది.

సుదేష్ణ తమ్ముడు సింహబలుడు దుర్విదగ్ధుడూ, బలగర్వితుడూను. ద్రౌపదినిచూసి, ఆమె అందానికి తట్టుకోలేక పోయాడు. కాముడనే వేటగాడు తరుమగా వాని హృదయమనే జింక ద్రౌపదీరూపమనే ఉరిలో తగులుకొంది. వాడు ఆమెనుగూర్చి

"... ... ... ... ... ... ... ...

కుసుమబాణుని బాణముల్ గూడనైదు
గరఁగి నేరిమివాటించి కరువుగట్టి
పోసిచేసి చైతన్య సంపుటముదగ ఘ
టించిరో కాక యిట్టి చేడియలు గలరె?''[2]

అనుకొన్నాడు. పార్వతీశుడైననాసరే, శచీప్రియుడైనాసరే ఈమెను చూస్తే తప్పక ప్రేమిస్తారని వాడు భావించాడు. అంతటి అందగత్తెకు సాటిఎక్కడా ఉండదని బ్రహ్మతో అయినాసరే పందెం వేయవచ్చునట. ఆమెకు భర్త అయినవాడు విష్ణువుని మించినవాడై ఉంటాడని చెప్పవచ్చునట. మన్మథునికే మన్మథతాపం కలిగించగలంతటి సౌందర్యం ఆమెదని కీచకుడు భావించాడు. వానికి ఆమె శరీరపుకాంతి, మెరుపు ముద్దలైన వాసిని చూసేసరికి బెగ్గలం అధికమైంది. "అనంగుపట్టి మాడెడు జంత్రంబు పసిడి" తమకంతో కొట్టుమిట్టాడిపోయాడు. ఆమెదుర్జాతి కాదని చెబుతూ,

1. విరాట 1 - 314
2. విరాట - 2 - 27

నెత్తమ్మిరేకుల మెత్తఁదనము దెచ్చి
యచ్చున ( బెట్టినట్లంద మొంది
చక్రవాకంబుల చందంబు గొనివచ్చి
కుప్పలు సేసినట్లొప్పు మెఱసి
చందురునునుఁగాంతి కందేర్చి కూర్చిబా
గునకు (దెచ్చినయట్లు గొమరుమిగిలి
యళికులంబుల కప్పుగలయంతయును బుచ్చి
నారు వోసినభంగి నవకమెక్కి
యంఘ్రితలములు ( గుచములు నాననంబుఁ
గచభరంబును నిట్లున్న రుచిరమూర్తి
యనుపమాన భోగములకు నాస్పదంబు
కాదె యీ ప్రిప్పు లేటికిఁ గమలవదన![1]

కీచకుడు కాముడే అయినప్పటికీ ఆమెను ఆపాదమస్తకం వర్ణించడం విశేషం. "ద్రౌపది 'రుచిరమూర్తి'ని కీచకునిచే ఇట్లు వర్ణింపఁజేయు నపుడు ఒకపరిధిని దాటలేదు తిక్కన. 'అనుపమాన భోగములకు నాస్పదంబు' అనినాడేగాని తనతో భోగింపుమని అనలేదు. అనగా ద్రౌపది తేజము కీచకునిగూడ ప్రభావితున్ని గావించినది."[2]

అప్పగారు 'నీరనాకార సైరంధ్రిని' కోరదగదని చెప్పగా కీచకుడు సైరంధ్రివంటి అందగత్తెలు స్వర్గంలోకూడా ఉండరని చెప్పాడు. సైరంధ్రికి గల ఆకారం, ఠీవి, కలికితనం, శోభ మరేస్త్రీలకూ లేవని చెబుతూ, ఆమె విశిష్టతను ఈవిధంగా వర్ణించాడు:

---

1. విరాట - 2 - 52

2 "తిక్కన చేసిన మార్పులు - ఔచిత్యపు తీర్పులు.
(విరాటోద్యోగపర్వములు) పుట - 332

"గండుమీలకుఁ బుట్టి కాముబాణములతోఁ
గలసి యాడెడు నట్టికన్నుఁ గవయు
బిసకాండముల శిక్షఁ బెఱిగి లేదీఁగల
మెచ్చక యున్నట్టి మృదుకరములుఁ
జిగురులతో సంధిచేసి యంబుజముల
పై నెత్తి చనునట్టి పదతలములుఁ
గలకంఠములచేతఁ గఱచిన విద్య వీ
ణల కిచ్చునట్టి తిన్నని యెలుంగు
నత్తైరంగున రేఖయు నవ్విధంబు
గఱువచందంబు నమ్మోయి కలికితనము
నట్టిచెన్నును సైరంధ్రియందకాక
కలవె యొరులకు నెఱుఁగకపలికి తబల."[1]

సుదేష్ణను కాళ్లు పట్టుగొని, సైరంధ్రిని ఎలాగైనా సరే తనవద్దకు పంప వలసిందిగా బ్రతిమాలికొన్నాడు. 'అనేకభంగుల ననంగ విభ్రమంబుల కనురూపంబు లైన బహువిధప్రలాపంబులం బ్రొద్దు' పుచ్చినాడు. 'బెబ్బులియున్న పొదరు సొచ్చు లేడి చందంబున' తనమందిరానికి వచ్చిన సైరంధ్రి దీనావస్థను మన్మథావస్థగా భ్రమించిన ఉన్మాదుడు వాడు. ఆమె వెంటపడి ఒడిసిపట్టినప్పుడు జంగమ లతను మదపుటేనుగు వెంట పడి పట్టుకున్నట్లుగాను, భూలోకానికి వచ్చిన దేవతాస్త్రీని క్రూర దానవుడు బంధించినట్లుగాను, సుకుమారమైన నాగాంగనను ఘోరాకారంగల గ్రద్ద ఒడిసిపట్టినట్లుగాను, గోరువంక కూనను పెద్దపిల్లి పట్టినట్లుగాను ఉన్నదని[2] తిక్కన చక్కనివర్ణన చేశాడు. ఈవర్ణనలో ద్రౌపదియొక్క అప్పటిరూపాన్ని: దివ్యత్వాన్ని, సౌకుమార్యాన్ని,

1. విరాట - 2 - 67
2. విరాట - 2 - 128

నిస్పృహాయతను కన్నులకు కట్టించడమేకాక, కీచకుని భయంకరమైన రూపాన్ని, దారుణమైన ప్రయత్నాన్నికూడా ప్రత్యక్షం కావించాడు.

విరటునికొలువులోనిలబడిపోయినసైరంధ్రిని చూసి సభలోని వారంతా గుజగుజలుపోయారట. వారంతా బాధపడింది దుష్టుడైనకీచకుడు స్త్రీగా ఆమెను కష్టపెట్టినందుకు కాదు—అలాంటి శుభలక్షణాంగి సైరంధ్రి ఎలాగయిందీ అనికొందరూ, ఇంతటి సుకుమారమైనశరీరానికి మాయ దైవం అంతటి కష్టాన్ని పెట్టాడు గదానికొందరూ, బాధపడ్డారట. కొద్ది మందిమాత్రమే కీచకునిదుష్టత్వానికీ, దేవిఉపేక్షకీ చింతించారు.[1]

కీచకవధానంతరం ద్రౌపది అంటేనే భయంపుట్టి, విరాటుడు భార్యతో "పురుషులాలలితాంగి పౌరువునఁ బోయినఁ జేటువచ్చు" ననీ, "ఆకమలాక్షి రూపమహిమాతిశయంబు మనోహరంబ" నీ పలికాడు.[2] సుదేష్ణ భయశోకాలు నిండిన హృదయంతో

"నీవు చక్కనిదానవు నెలఁత ధైర్య
రహితచిత్తులు మగవారు రాజుదీనిఁ
దలఁచి భయ మంది నిన్ను నీవలచునెడకు
నరుగునట్లుగఁ బ్రార్థించి యనుపుమనియె"[3]

అని చెప్పింది. "మాపురమును రాష్ట్రంబు వెడలి పొమ్మొండైనన్" అన్నది.[4] ఆమె సౌందర్యం సామాన్యులకు అంతదుస్సహామన్నమాట!

పాత్రలను కళ్లకుకట్టేటట్లుగా వర్ణించడంలో నేర్పరి అయిన తిక్కనగారు రాయబారఘట్టంలో కృష్ణునికి "గోడువెళ్లబోసుకొంటు"న్న ద్రౌపదిరూపాన్ని మహాద్భుతంగా ప్రత్యక్షంకావించారు.

"ద్రోవది బంధురం బయినక్రొమ్ముడి గ్రమ్మన విడ్చి వెండ్రుకల్
దావలచేతఁబూని యసితచ్ఛవిఁ గొల్చుమహాభుజంగమో
నావిలసిల్లి క్రేలఁగ మనంబునఁ బొంగువిషాదరోషముల్

1. విరాట - 2 - 146
2. విరాట - 3 - 31, 32
3. విరాట - 3 - 58
4. విరాట - 3 - 60

గావఁగ లేక బాష్పములు గ్రమ్మఁగ దిగ్గన లేచియార్తయై.
"గోవిందుముందటంబెట్టె ... ..." సంభాషించింది.[1]

ఆశ్రమవాసపర్వంలో పాండవులు సపరివారంగా కుంతి, గాంధారి, ధృతరాష్ట్రులను దర్శించటానికి కురుక్షేత్రానికి వెళ్ళినప్పుడు అక్కడి తాపసులు ధృతరాష్ట్రుని బంధువర్గాన్ని తెలియజేయుమని సంజయుణ్ణి కోరారు. సంజయుడు ఒక్కొక్కరినీ వర్ణిస్తూ, ద్రౌపదినిగురించి

" నీలోత్పలచ్ఛాయఁ బోలు మైచాయయు
నవపద్మదళములఁ దెవడుమెఱుఁగుఁ
గనుదోయి మధ్యాత్వమునకుఁ బ్రవేశించు
ప్రాయంబు నత్యభిరామమూర్తి
యలవడఁ గైకొన్న యతులితసంపద
చందంబుతోఁపించు చారుగౌర
వ-బును గలుగు నివ్వనిత పాంచాలి యి
య్యింతి పార్శ్వమునఁ ........"[2]

అని పరిచయం చేశాడు. సంజయుడు విశ్వాత్ముని విశ్వరూపాన్ని పట్టి శబ్దచిత్రంగా ఇచ్చినవాడు. అతడు ద్రౌపది రూపాన్ని వర్ణించడం ఆమె నిజరూపాన్ని మనముందు ఉంచడమే అవుతుంది.

పైన పేర్కొనబడిన సన్నివేశాల్లోని వర్ణనలనుబట్టి ద్రౌపది నల్లకలువలవంటి మైచాయ, మెఱుగులీనుకన్నులు, నల్లని మెరిసే జుట్టూ కలిగి, కాంతులీనే శరీరావయవాలతో, పద్మగంధాన్ని వెద జల్లుతూ ఉండేదని తెలుస్తోంది. ఆమె "తరుణి", "నిత్యయౌవన." లావణ్యం ఆమె మూర్తిలోని ప్రధానాంశం. కవిత్రయంవారు ఆమెను

1. ఉద్యోగ - 3 - 114, 115.    2. ఆశ్రమవాస - 2 - 42

పద్మంతో ఎక్కువగా పోల్చి వర్ణించారు. పద్మం అనేది మానవునిలో అంతర్లీనంగా ఉండే ప్రజ్ఞల, శక్తుల క్రమోన్మీలనకు సంకేతం.

"మనలోని జీవప్రజ్ఞ కరిగి దైవ ప్రజ్ఞగా రూపొందినపుడు యోగులమవుతాము. 'సమత్వం యోగ ఉచ్యతే' అన్నది యోగలక్షణము. తాను పుట్టినది బురదలోనైనా సూర్యాభిముఖమయ్యేది, సూర్య ప్రజ్ఞకు ప్రభావితమయ్యేది పద్మమే! సూర్యాంతర్యామియైన పురుషునిలో నున్నది నాలోనున్నదీ ఒకటే (సయశ్చాయం పురుషే యశ్చా సావాదిత్యే సఏకః సయఏవం విత్) అనెడి ఉపనిషత్ సత్యమును సూటిగా బోధించేది పద్మము. భౌమాభ్యాకర్షణకు లోనైన మానవులలో మానవులమధ్య పుట్టినా అంటీఅంటనట్లుగా ఉంటూ అందరినీ ఏకంగా చూస్తూ, అందరికంటే మిన్నగా విన్నాణంగా జీవించగలవాడు యోగి ఒక్కడే. అందుకనే వానిని పద్మముగా సరిపోల్చారు పెద్దలు."1

ద్రౌపది కారణజన్మురాలైన ప్రజ్ఞామూర్తి అనే విషయాన్ని సూచించడానికే 'వేదకవుల'నదగిన కవిత్రయంవారు ఆమెను ఆవిధంగా వర్ణించారు.

1. "నావాణి" దర్శన మాసపత్రిక, 22 జనవరి, 1978 సంచికలో "పద్మము" ను గూర్చి శ్రీ ఎ. ఎల్. ఎన్. రావుగారి వ్యాసంనుంచి

## 3. శక్తిసామర్థ్యాలు - ప్రజ్ఞాపాటవం

లోకంలోను, పురాణేతిహాస కావ్యాల్లోను సమర్థతతో భర్తను సేవించి, పతివ్రతగా ప్రసిద్ధికెక్కిన స్త్రీ మూర్తులను చూస్తూ ఉంటాం. అసాధారణమైన శక్తియుక్తులూ, మహత్తరమైన ప్రజ్ఞా పాటవం కలిగి, ఒక్కతే పెక్కుమందికి భార్యగా ఉండి పాతివ్రత్యాన్ని నిరూపించుకొన్న స్త్రీని గూర్చి మాత్రం భారతంలో తప్ప ఎక్కడా విని ఉండం.

వేరు వేరు వ్యక్తిత్వాలు గల అయిదుగురు మహాపురుషులకు భార్యగా ద్రౌపది సమర్థతతో తనపాత్రను తాను పోషించుకొంటూ, ధర్మ నిర్వహణంలో భర్తలకు సహకరిస్తూ, జగద్గురుని విశ్వప్రణాళికకు అంకితమై, పతివ్రతలలో తలమానికంగా ప్రపంచ వాఙ్మయంలోనే విశిష్టమైన స్థానాన్ని పొందింది.

పవిత్రమైన ద్రుపదుని వంశంలో పుట్టి, ప్రఖ్యాతమైన భరత వంశాన్ని మెట్టి, సర్వ సమర్థులైన పాండవుల ధర్మపత్ని అయి, ధర్మనిర్వహణంలో - మహాసామ్రాజ్ఞిగాను, వ్యక్తిగతంగాను - ఆమె పొందిన సన్మానాలు, అవమానాలు ఏయుగంలోను ఏ స్త్రీకీ సంభవించి ఉండవు. బహుభార్యాత్వమూ, ఏకపత్నీ వ్రతమూ ప్రధానంగా గల సమాజంలో పంచభర్తృకగా ద్రౌపది ఏవిధమైన పరిగణనం పొంది ఉంటుందో ఊహించుకొంటేనే ఒళ్లు జలదరిస్తుంది. ఈ విలక్షణతతో, మానావమానాలకు అతీతంగా, ఒకానొక యోగస్థితిలో నిలిచి, ఆమె తనపాత్రను తాను నిర్వహించిన తీరు అద్భుతావహం.

ఆదిగర్భేశ్వరి అయిన ద్రౌపది అర్జునునితో తరలివచ్చి, దర్భపూరి పరుపులుగా, భిక్షాన్నం అశనంగా, కుంతిని, పాండవులను



అత్యాదరంతో సేవిస్తూ, సంతోషంగా గడపగలిగింది. తండ్రిచే అర్జును నకు భార్యగా నిర్ణయించబడి, కుంతీ, వ్యాసుల అభిమతం మేరకు ధర్మ జాదులయిదుగురికీ భార్యగా నిర్దేశించబడినప్పుడు, ఆమె దానిని భగవ న్నిర్దేశంగా భావించి, సమాధానపడిందే కానీ కలవరపడినట్లుగాని సాధ్యాసాధ్యాలగురించి తర్కించినట్లుగాని ఎక్కడా కనిపించదు. సన్ని వేశానికి అనుగుణంగా సర్దుకుపోయి, వివేకంతో మెలగడం ఆమెలోని ప్రత్యేకత.

ద్రౌపది చాలాసూక్ష్మగ్రాహి. ఆమె చదువుసంధ్యలను గూర్చి మనకుఅంతగా తెలియదుగాని, నీతిమంతులైనబ్రాహ్మణులు తండ్రికిధర్మసూక్ష్మాలను వివరించిచెబుతూఉంటే విని ఆమె మనస్సుకు పట్టించుకొనేది. అరణ్యవాసంలో ధర్మజునితో వాదించేటప్పుడు ఆమె ప్రదర్శించిన వివేకం, పాండిత్యం ఆమె బుద్ధిసూక్ష్మతకు నిదర్శనాలు.

కుంతీదేవి నిరంతరసాన్నిధ్యం ఆమెబుద్ధిని మరింతగా పదును పెట్టింది. బ్రాహ్మణభక్తి, అతిథిపూజ, ఆశ్రితవాత్సల్యం, గృహనిర్వహ ణంలో అప్రమత్తంగాఉండటం, బంధువులనుసేవించడం, అన్నిటినీమించి, కృష్ణుని జగన్నాయకత్వానికి శరణాగతిచెందడం – కుంతిశిక్షణలో ద్రౌపది పొందినవిద్యలు ఇవి!

ధర్మజునినగరిలో నూరువేలమంది పరిచారకులూ, అభ్యాగ తపూజలు చేసేవారు మరినూరువేలమందీ ఉండేవారు. వారందరూ విధి నిర్వహణంలో ఏమరుపాటు చెందకుండా 'తత్కృతములు' ద్రౌపది స్వయంగా పర్యవేక్షించేది. శతసహస్రభద్రగజాలు, శతసహస్ర ఉత్త మాశ్వాలు, నగరిలోఉండగా వాటికి నిత్యోచితమైనకృత్యాలు నెర వేర్చడానికి తగినవారిని నియమించడంకూడా ఆమె తనబాధ్యతగా తీసు కొంది. భాండాగారంలోని మణి, కనకాదివస్తువులూ, ప్రతిదిన విహితా

లైనఆయవ్యయాలూ ఆమే సమీక్షించేది. "గోపాలజనంబులు తుది గాఁగల సకలభృత్యజనంబుల జీవితంబులు" పరిశీలించి నడుపుతూ ఉండేది. ఇంతటి అప్రమత్తురాలు, సమర్థురాలు కనుకనే "యశోధనులగు పాండునందనులు నిజకుటుంబభారంబు సర్వంబు ఆమెయందు సమర్పించి, తారునిర్భరులై యిష్టవిహారంబులనుండె"డివారు. ఆమె నిరంతరకర్తవ్య దీక్షాపరురాలై ఉండేది.

"వేగ జాము గలుగ పెడనిద్రఁ బొందుదుఁ
గాని రాజ్యభారకార్యయుక్తి
నబ్జనయన! నాకు నాహార నిద్రల
కెడయు లేదు సువ్వె యెల్లప్రొద్దు"[1]

అని ఆమె సత్యభామతో చెప్పినమాటలు ఆమె కార్యభారాన్ని నిరూపిస్తున్నాయి.

ద్యూతానంతర పరాభవసన్నివేశంలో ద్రౌపది ప్రదర్శించిన వివేకం మహాద్భుతమైనది. కౌరవులు ఎంతటిపాపకార్యాన్నికైనా ఒడిగడతారనిముందే ఊహించిఉంటుంది. ఎలాంటి సన్నివేశాన్నైనా ఎదుర్కోవడానికే సిద్ధపడివచ్చినట్లుగా, కలతపడకుండా ధైర్యంతో నిలబడింది. ప్రాతికామిన్ని ఆమె

"ఏయుగంబునందు నెట్టిదుష్కృతవుండు
భార్యనొడ్డి యోటువడినభర్త
గలఁడె యిదివినంగఁ గడునపూర్వంబయ్యె
నిట్లు సేయనొక్కొయిందుకులుఁడు

" మున్ను దనోడ్డిటువడిముఖ్యనన్ను నోటు
వడియెనో నన్ను మునోడ్డిటువడి విభుండు
గ్రన్నఁ దనోడ్డిటువడియెనో యన్ననాకు
నెఱుఁగఁ జెప్పుము దనినీ వెఱుఁగు దేని

1. ఆరణ్య - 5 - 308

"ఎఱుంగవేని నక్కితవు నడిగి వచ్చి మఱి నన్నుందోడ్కొని పోవనగునేనిఁ దోడ్కొని పొమ్ము..."[1] అని కోరింది. వాస్తవానికి ఆమె ఈప్రశ్నకు సమాధానం ధర్మజుణ్ణి చెప్పమని కాదు అడిగింది, ధర్మజుడు తానుగా జూదంలోకి దిగలేదనీ, ఎలాంటి కష్టసమయంలోనూ అతడు ధర్మంతప్పడనీ ఆమెకు బాగా తెలుసు. "అక్కితవునడిగివచ్చి" అంటే శకునినని ఆమె ఉద్దేశం. ధర్మజుణ్ణి ఆమె ఎలా అడగమంటుంది? అతడూ తనను తాను ఓడిపోయాడని ఆమెకు తెలుసుకదా! ఆతడు ఎంతటినిస్సహాయ స్థితిలో ఉంటే ఈ కబురు తనదాకా వస్తుందో ఆమె ఊహించుకోలేదా? అయినా "కౌరవవరుపని నిన్నువడిఁ దోడ్కొని పోవచ్చితి నిపుడ చనుదెమ్ము కౌరవేశ్వరుని కడకు'' అని ఒకప్రక్క ప్రాతికామి చెబుతూఉంటే, ధర్మజుని 'పెత్తనానికి' అవకాశం ఏముందని అతన్ని నడిగి రమ్మంటుంది ఆమె? ప్రాతికామి - అర్థంకాకనో, దుర్యోధనుని సేవకుడు గనుక భయపడో - తిన్నగావచ్చి ఆమాటలు ధర్మజునికి చెప్పాడు. ధర్మరాజు దుఃఖంతో క్రుంగిపోతూ సమాధానం చెప్పలేక పోయాడు. దుర్యోధనునికి మంచి అవకాశమే అది. అందువల్ల అతడు కల్పించుకొని, 'సందిగ్ధమైన విషయాన్ని ఇందరిలో అడిగితే అతడేంచెబుతాడు? ఆమెనే తీసుకురా, ఇక్కడే సమాధానం తెలుసుకొంటుంది' అని ప్రాతికామిని మళ్లీ పంపాడు. ఏకవస్త్ర, అధోనీవి అయినఆమె ప్రాతికామి వెంట సభకువచ్చింది.

విషయనిర్ణయం జరుగకుండానే దుర్యోధనుడు దుందుడుకుగా ఆమెను తోడ్కొనిరమ్మని దుశ్శాసనుణ్ణి ఆదేశించాడు. ఆమె భయంతో గాంధారివద్దకు పరుగెత్తింది. 'నేను రజస్వలను — నన్నుముట్టకు; ఏకవస్త్రనైననేను అంతమందిపెద్దలు ఉన్నసభకు రాలేను' అని చెప్పినా వినకుండా పాపనిరతుడైన దుశ్శాసనుడు నిర్దయాత్ముడై "నీవేకవస్త్ర

1. సభా - 2 - 208, 209, 210

నైననేమి విగతవస్త్రనైననేమి" అంటూ జుట్టుపట్టుకొని ఈడ్చుకు వచ్చాడు. అప్పుడామె "...... కురువృద్ధులార! భృశకోపనుఁడీతఁడు నన్ను నేల దుర్జనుఁడిట యీడ్చి తెచ్చె నవిచారపరుండయి దుర్మదంబు నన్" అని అడిగింది. అప్పటికీసమాధానం రాలేదు. అప్పుడామె "సర్వ ధర్మసంవిదులననున్న యీభరతవీరులవంశము నేఁడధర్మసంపద నతి నింద్యమయ్యె" నని చాటిచెప్పింది. ఇదిఒకవిధంగా శ్రీకృష్ణుని ప్రతి నిధిగా ఆమహాపతివ్రత ఇచ్చినతీర్పు. కృష్ణుడు ఈ తీర్పును స్థిరపరిచి, పాండవులచే యుద్ధభూమిలో, దీనిఫలితాన్ని కౌరవులు అనుభవించే టట్లుచేశాడు. ఎవరూమాట్లాడకపోవడంతో వికర్ణుడులేచి, "జూదమూ, వేటా, పానమూ అనేవ్యసనాల్లో చిక్కినవ్యక్తి ధర్మంతప్పి నడుస్తాడు. అట్టివానిచేతలు చెల్లవు. జూదానికిపిలవబడి, వ్యసనానికిలోబడి, పరాజి తుడైనధర్మరాజు పాండవులందరికీ సాధారణధనమైనపాంచాలిని పణంగా పెట్టడంవల్ల ఆమె అధర్మవిజిత. ఆమెను ఏకవస్త్రఅయిఉండగా ఇలా ఇక్కడికి తీసుకొనిరావడం అన్యాయం" అని తననిర్ణయాన్ని చెప్పాడు.

పిన్నవాడైనా వికర్ణుడు పెద్దబుద్ధితో తోచిన ధర్మాన్ని సమయోచితంగా చెప్పడం ప్రశంసింపదగిందే. అయితే, ద్రౌపది అడిగిందివేరు, అతడుచెప్పిందివేరు. ద్రౌపది ప్రశ్నించింది ధర్మజుని అధి కారాన్ని కాదు. శకుని గెలుపును. శకుని జూదంలో ద్రౌపదిని గెలిచాడు. అది వినగానే ఆమె 'ఏవిధంగా?' అని అడిగింది. శకుని గెలవాలంటే ధర్మరాజు పణంగా ఒడ్డాలి. అలా ఒడ్డటంలో ముందు తనొడ్డుకున్నాడా? ఆమెను ఒడ్డాడా? అన్నది ద్రౌపది ప్రశ్న. ధర్మ రాజు తనకంటే ముందుగా ఆమెను పణంగా పెట్టడని ఆమెకు తెలుసు. తన్నుతాను ఓడిపోయి, నిస్సహాయస్థితిలో మాత్రమే ఆమెను ఒడ్డి ఉంటాడనీ 'కనుక' ఆగెలుపు చెల్లదనీ ఆమె భావం. ఈవిషయాన్ని సభవారిచే అంగీకరింపచేయటానికే ఆమె అలాప్రశ్నించింది.

పెద్దలెవ్వరూ మాట్లాడక చిన్నవాడు నోరు చేసుకోవడం ఒకవిధంగా ప్రమాదానికే దారి తీసిందని చెప్పవచ్చు. కర్ణుడు అతన్ని నిరసిస్తూ, సమాధానం చెబుతున్నట్లుగా, "ధర్మజుడు సర్వస్వాన్నీ ఒడ్డి ఓడిపోయినప్పుడు ఈమె ఆసర్వస్వంలో ఒకటికాదా?" అని అడిగాడు. 'ధర్మవిజిత కాకపోతే పాండవులెందుకు ఊరుకుంటారు?' అని కూడా అడిగి, 'ఆమె ధర్మవిజితే' అని తేల్చిచెప్పి, 'ఈమె అనేక భర్తృక కనుక 'బంధకి' అవుతుంది. ఇలాంటిదాన్ని విగత వస్త్రను చేసి తెచ్చినా తప్పులేదు." అన్నాడు.

కర్ణుడుచెప్పినదానిలో చిన్నమెలిక ఉంది. ధర్మరాజు అన్నిటినీ ఒడ్డి ఓడినమాట నిజమే. ఆ అన్నిటిలో ద్రౌపది అంతర్భవిస్తుందనటంలో కూడా తప్పులేదు. ఆప్రకారంగా ఆమె ధర్మజునిచే ఒడ్డబడకుండానే జయించబడినదవుతుంది. కానీ శకుని ప్రత్యేకించి, 'ఇట్లల నిన్నొడ్డి తధిప? నీకునొండు ధనము గలదు, మఱచితెట్లు? కమలాక్షి పాంచాలకన్య నీకు ధనముగాదె?'[1] అని గుర్తుచేసి ఆమెను పణంగా పెట్టించాడు. అంటే, శకుని ప్రకారం ద్రౌపది ప్రత్యేకంగా పణంగా పెట్టదగిందేకదా! కనుక కర్ణునిమాట సరికాదు. (కర్ణునిమాట సరయినదే అనుకొందామంటే వికర్ణుడు లేవనెత్తిన అంశం ఉండనే ఉంది.)

కర్ణునిమాట పట్టుకొని దుర్యోధనుడు ద్రౌపదీ పాండవుల వస్త్రాలను అపహరించ వలసిందని దుశ్శాసనునికి చెప్పాడు. పాండవులుగానీ, సభవారుగానీ అప్పుడుకూడా మాట్లాడలేదు. కర్ణుడు చెప్పినట్లుగా ద్రౌపదిని విగతవస్త్రను చేయడానికి ప్రయత్నించి, విఫలులై భంగపడ్డారు కౌరవులు. విదురుడు ధర్మంచెప్పవలసిందని సభవారిని మరొక్కసారి ప్రార్థించాడు. ప్రయోజనం శూన్యమే. అప్పుడు, ద్రౌపది తాను అదాసినో, దాసినో తేల్చి చెప్పండని సభలోనివారిని అడిగింది. అయినా జవాబు రాలేదు. కర్ణుడు నోటికి వచ్చినట్లువాగడం

దుర్యోధనుడు తనను చేరరమ్మని ఆమెకు తొడను చూపడం జరిగాయి. భీముడు కోపంతో ఊగిపోగా పెద్దలు శాంతపరిచారు.

ఈఘట్టంలో ద్రౌపది ఉద్విగ్నురాలు కాలేదు. వివేకంతో పరిస్థితిని అర్థంచేసుకోగలిగింది. సన్నివేశం తమచేతుల్లోలేదనీ 'కనుక, తాను చేయగలిగింది ధైర్యం వహించి దైవాన్ని శరణువేడటంద్వారా బయటపడటం ఒక్కటేననీ గ్రహించింది. విశ్వాసంతో అంతటి విపత్సమయంలోనూ కృష్ణుణ్ణి స్మరించగలిగిందంటే ఆమెబుద్ధి ఎంతస్థిర మైనదో, మనస్సు ఎంతనిర్మలమో ఊహించుకోవచ్చు. ఆమె సభ వారిని ధర్మనిర్ణయం చేయండని మాత్రమేకోరిందిగానీ బెంబేలు పడి పోయి, 'కాపాడండి' అంటూ మొరపెట్టుకోలేదన్నది ప్రత్యేకంగా గమనించవలసిఉంది. సభవారు ఆమెపాతివ్రత్యానికి పరీక్షపెడితే, ఆమె సభలోనివారి ధర్మపరతకు పరీక్షపెట్టింది. ఆమె నెగ్గింది. వారు ఓడిపోయారు. కనుకనే పాండవులది ధర్మపక్షం అయింది.

ద్రౌపదీ పాతివ్రత్యం నిరూపిత మయిన తరువాత ధృత రాష్ట్రుడు, వరాలనెపంగా, ద్రౌపదిని అనుగ్రహిస్తున్నట్లుగా రాబోయే ఆపదనుంచి బయటపడ్డాడు. ఆసందర్భంగా గ్రుడ్డిరాజు మహాలౌక్యాన్ని ప్రదర్శించబోయి, ద్రౌపదిముందు బోర్లగిలబడిన విధానం ద్రౌపది అసాధారణమైన ప్రజ్ఞాపాటవానికి నిదర్శనం. ప్రతివింధ్యుని కురుకుమా రులు దాసపుత్త్రుడు అనకుండా ఉండటానికని ధర్మతనయుని దాస్యాన్ని పోగొట్టాలని మొదటివరంగా ఆమె కోరింది. ధర్మజుడు జూదంలో కొడుకులను పణంగా పెట్టలేదు. శకుని పెట్టమనీ అడుగలేదు. కర్ణుని ప్రకారం ధర్మజుని సర్వస్వంలో బిడ్డలూచేరాలి. శకునిప్రకారం వారిని పణంగా పెట్టించి గెలుచుకోవాలి. రెండూజరుగలేదు. వారు స్వతంత్రులేగదా! ఈవిషయాన్ని గుర్తుచేయడానికే ఆమె ప్రతివింధ్యుని ప్రసక్తిని తీసుకువచ్చింది. కర్ణుడుగాని, శకునిగాని నోరెత్తలేదు.

ప్రతివింధ్యుని కురుకుమారులు 'దాసపుత్రుడు' అంటేఏమవు తుంది? వాడు ఊరుకోడు. బాలుడైనా మహాపరాక్రమంతో తిరుగబడ తాడు. తాను దాసపుత్రుణ్ణి కానంటాడు. అందుమీద పెద్దగొడవై, అదియుద్ధానికి దారితీస్తుంది. భీష్మద్రోణాదులు అప్పుడు ఏపక్షంవహిస్తారు? చెప్పలేం. ప్రతివింధ్యాదులు చిన్నవారుగనుక, వారిపక్షంవహిస్తే – ? కౌరవులపని అంతటితో సరికదా! ఈపరిస్థితి రాకుండా ఉండాలంటే కురు కుమారులు ప్రతివింధ్యుని దాసపుత్రుడనకూడదు. వారు అనకుండాఉండా లంటే, ధర్మజుని స్వతంత్రుని చేయాలి.

ఇప్పుడు, వరమిచ్చి ధృతరాష్ట్రుడు ద్రౌపదిని అనుగ్రహించి నట్లా? వరంకోరి ద్రౌపదే ధృతరాష్ట్రుని అనుగ్రహించినట్లా? అనిఆలో చిస్తే, ద్రౌపది అనుగ్రహించడమే యథార్థమనిపిస్తుంది.

రెండవవరంగా ధర్మజునితమ్ములు నలుగురూ తమ తమ ఆయుధాలు, కవచాలు, సేనలతో సహా దాస్యంనుంచి బయటపడాలని ఆమె కోరింది. వారిధర్మదీక్షను ఆసరాగా చేసుకొని దుర్యోధనాదులు వారిని అధర్మపాశబద్ధులుగా, నిస్సహాయులుగా చేశారు. వారిని ఆనిస్స హాయస్థితినుంచి తప్పించి, వారిచేతికి ఆయుధాలు ఇస్తేచాలు, వారు విజృంభించి అధర్మాన్ని చీల్చిచెండాడుతారు. కురుక్షేత్రంతో పని లేకుండా కౌరవుల పని చక్కనయిఉండేది.

అతిసామాన్యమైనవిగా, సౌమ్యమైనవిగా సహజమైనవిగా కన్పించేవి అయినప్పటికీ ఈరెండువరాలూ ధార్తరాష్ట్రులందర్నీ తక్షణం దహించివేసేటంతటి ప్రభావం కలవి. ప్రజ్ఞాచక్షుడు ఆమెఆంతర్యాన్ని గ్రహించిమాడలిపోయాడు. పనిలోపనిగా 'మరొకవరంకోరుకో' అన్నాడు. ద్రౌపది వివేకంతో సత్‌క్షత్రియసతికి రెండువరాలకంటె ఎక్కువ కోరదంతగదనీ, కనుక ఇంకొకవరం కోరననీ స్పష్టంగా చెప్పింది. వైశ్యసతి

ఒక్కటికే, క్షత్త్రియసతి రెండూ, శూద్రస్త్రీ మూడూ, బ్రాహ్మణస్త్రీ నూరు వరాలుకోరుకోవడం ధర్మం అనిచెప్పింది. ఆమె తాను ఉత్తమ క్షత్త్రియ కాంతనని సభాముఖంగా నిరూపించుకొంది. మూడవవరాన్ని కోరుకొనేటట్లుగా చేసి, ఆమెను శూద్ర(దాసి) జాతిగా అంగీకరింపజేద్దామని చూసినధృతరాష్ట్రుడు ఘోరంగా భంగపడ్డాడు. క్షత్త్రియకాంత అవమానించబడి ఎలాంటి ప్రతీకారం కోరుతుందో అతనికి తెలుసు. దిగ్విజయం చేసిన పాండవుల పరాక్రమమూ అతనికి తెలుసు. అందునా, ఆమెకోరింది ధర్మజుని తమ్ములు నలుగురూ తమ ఆయుధాలు, వర్మ వరూథములతో దాస్యవిముక్తులు కావాలని. అంతటి అపకారం చేసి, వారిని ఆయుధాలతోను, సేనలతోను వదలివేస్తే ఇంకేమన్నా ఉందా? కనుకనే, తేలుకుట్టిన దొంగలా మారుమాట్లాడక తానుగా సర్వ సంపదలూ, రాజ్యమూ ధర్మజునికి సమర్పించి జూదాన్ని ఉపేక్షించటం తప్పేననీ, తననూ, గాంధారినీ తలచి, దుర్యోధనాదుల దుర్నయాలను క్షమించవలసిందనీ బ్రతిమాలుకున్నాడు. అయితే భీముడు "రాజ్య సంప్రాప్తి పాండవ సత్తములకు సతికారణంబున ధృతమయ్యె నను నింతకంటెను గష్టంబు గలదె?"[1] అని వాపోయాడుగానీ, అంతకంటే అవమానం కౌరవులకే. పాండవులకు గౌరవంగా వారి రాజ్యం వారికి వచ్చింది. ధృతరాష్ట్రుడు కాళ్లు పట్టుకొన్నంత పనీ చేశాడు. ధర్మరాజు మెదలకుండా ఊరుకోవడంవల్ల అతని ఉదారత (magnanimity) అందరికీ తెలియవచ్చింది. అవమానపడవలసినంతటి కారణం ఏమీలేదు అందులో. కౌరవుల విషయానికి వస్తే, వారు ద్రౌపది కారణంగా లబ్ధజీవనులయ్యారు. ధృతరాష్ట్రుడు సంపదలనూ రాజ్యాన్నీ ధర్మజునికి, పాండవులూ ద్రౌపదీపట్లతనకుగల ఆదర భావంతో ఇవ్వలేదు. కొడుకులను వారిబారినుండి రక్షించుకోవటానికిమాత్రమే

1. సభా - 2 - 269

ఇచ్చాడు. "కడంగి నీకెగ్గుసేసె నాకొడుకు దీనిమఱచునది నీకు నే నొండ్లు గఱపనేల!"[1] అని ధృతరాష్ట్రుడు ధర్మజుని దీనంగా బ్రతిమలాడుకోవడం ఇందుకు నిదర్శనం.

ఈవిధంగా "పద్మనాభ సహోదరి" తన ప్రజ్ఞాచక్రాన్ని అడ్డువేసి వాటిల్లబోయిన మహాపదను వారించింది కనుకనే

"తరుణి ద్రౌపది యిట్లు పాండవధార్తరాష్ట్రుల దైవభీ
కరపరస్పరకోపవేగము గ్రన్నఁబాచి విపత్తిసా
గరనిమగ్నుల నుద్ధరించెఁ బ్రకాశకీర్తుల ధీరులం
బురుషసింహములన్ నిజేశులఁబూని తద్దయుఁ బ్రీతితోన్."[2]

అని సారమతి అయిన నన్నయ ఆమెకు కైమోడ్చాడు.

ఈసందర్భంలో ద్రౌపది ప్రదర్శించినవివేకంవల్ల తక్షణమే జరుగవలసిన 'దాయాదులకలహం' వారించబడి, పదమూడేళ్ళ అనంతరం జగద్వ్యూహానికి తగినట్లుగా మహాసంగ్రామంగా రూపొందింది. అంటే రాజ్యంకోసమనో, భార్యకారణంగానో పాండవులు నిర్దయులై పెదతండ్రిబిడ్డలను చంపారన్నఅపఖ్యాతి తనభర్తలకు కలుగకుండా ద్రౌపది వారించగలిగిందన్న మాట!

వ్యక్తులయొక్క మాటలనుబట్టి మనస్సును, చేతలనుబట్టి అంతర్యాన్ని గ్రహించగల సామర్థ్యం ద్రౌపదికి పుష్కలంగా ఉంది. ధృతరాష్ట్రుడు 'బుద్ధిలేక జూదంబు పెట్టించితి' నని ఇలాపలికి, ఆవెంటనే అనుద్యూతంలో రాజ్యాన్ని అలా అపహరించడంతో ద్రౌపది అతని తత్త్వాన్ని పూర్తిగా అవగాహన చేసుకొంది. అరణ్యవాసంలో, కృష్ణుడు వచ్చి పరామర్శించి, వెళ్ళిపోయాక, ధర్మజుని ఉద్దేశమేమిటో రాబట్టదామని ఆమె అతనితో కొంత సంభాషణ నడిపింది.

---

1. సభా - 2 - 265

2. సభా - 2 - 268

"ఆముసలివాడు కొడుకు మాటలు విని క్రూరుడై పాప బుద్ధితో మీరాజ్యం లాక్కొని, కోపంచల్లారి, ఇప్పటికి 'సుచిత్తుండు' అయి ఉంటాడు. ఆదురాత్ముని హృదయం ఇనుము కంటేను, బండ రాయి కంటేను కఠినాతికఠినం. ధర్మగాథుడైన మిమ్మల్ని కొడుకులు ఆతీరుగా బాధలు పెడుతూఉంటే వారించలేదంటే, మీతో కలహాన్ని కోరుతున్నాడనేగదా! మీ ప్రస్తుతపు అవస్థను చూసి నా చిత్తం తల్లడిల్లిపోతోంది. ఉపశాంతి కలగడంలేదు. సమస్త భోగాలనూ అపహరించి, ధృతరాష్ట్రునివలె విధికూడా మీకు అహితుడయినట్లున్నాడు. నీ ఆజ్ఞకులోబడి, పరాక్రమాన్ని విడిచి, చెరబడిన సింహ శిశువుల్లా, నీతమ్ములు కష్టాలపాలయి. చిక్కిపోయారు. శత్రురాజుల కిరీటాల్లోని పద్మరాగాల కాంతులతో అరుణిమదాల్చిఉండే నీపాదాలు ఇప్పుడు కఠిన శిలలపై నడవటంచేత ఉపర్యంత భాగాలన్నీ ఎరుపెక్కిపోతున్నాయి. నిరంతర సౌఖ్య సంపదలతో తులతూగే మీకు ఎలాంటి కష్టాలు వచ్చిపడ్డాయి! ......"[1] అంటూ మొదలుపెట్టి కౌరవులను క్షమించనవసరం లేదని తేల్చి చెప్పింది.

అప్పటి ఆమె మాటల్లో హృదయావేదనతోపాటుగా ధర్మజుడంతటివానిని ఒప్పించడానికి పడే తాపత్రయమూ ఎంతగానో వ్యక్తమవుతుంది. ధర్మజునితో సంభాషించడం సామాన్య విషయంకాదు. అతడు వశీకృతచిత్తుడు. ఎవరెంతగా గీ పెట్టినా మనసులోని మాట పైకితేలడు. కనుక, ఆమె చాలాజాగ్రత్తగా, ఎంతోనేర్పుతో సంభాషణకు ఉపక్రమించింది. ముందుగా ఆమె ధృతరాష్ట్రుని దుష్టబుద్ధిని కలహవాంఛను బయల్పరిచింది. ఆతరువాత, వారిపూర్వ వైభవాన్ని, ప్రస్తుతపు అవస్థను గుర్తుచేసి, వారిదురవస్థకు తానెంతగా దురపిల్లుతున్నదో తెలుపుకొంది. ఆపిమ్మట, 'నీతమ్ములు సామాన్యమైనవారు

1. అరణ్య - 1 - 208 నుంచి 220 వరకు

కాదుసుమా' అని గుర్తుచేసింది. 'వారి బాహుబలంతో రాజులందరినీ జయించి మొక్కులు పొందావు' అనికూడా సూచించింది. ధర్మజుడు నిర్వహిస్తూఉండే నిరంతర బ్రాహ్మణ సమారాధనను పేర్కొని, "అలాంటినీవే అడవుల్లో దుంపలూ, పళ్లూ తింటూ గడపవలసి వచ్చింది గదా!" అంటూ బాధపడింది. తుదిమాటగా, "క్షమాగుణం మంచిదే గానీ అన్నివేళలా అదిపనికిరాదు, సందర్భాన్నిబట్టి పరాక్రమాన్ని ప్రదర్శించవలసి ఉంటుంది. ఒకటో రెండో అపరాధాలయితే క్షమించినా అర్థంఉంది, కావాలని ఎప్పుడూ అపరాధాలే చేస్తూఉండే పాప కౌరవ్యులను క్షమించడం ఏమిటి?

" ఇది తేజంబున కవసర
ముదితక్రోధుండ వగుము యొక్కించుక దు
ర్మదులగు సుయోధనాదుల
నదయుల వధియింతు రుగ్రులై నీ తమ్ముల్."[1]

అంటూ ఎంతో వినయంగా, తాను కర్తవ్యమనుకొన్నదాన్ని బోధించింది.

అయితే, ధర్మజునికి ప్రమాణం ద్రౌపదికాదు. 'కృష్ణద్వైపాయన, భీష్మ, విదుర, కృప, ద్రోణ, సంజయ ప్రభృతులు నాఉపశమనాన్ని కీర్తిస్తున్నారు. కనుక నేను క్షమ కలిగి ఉపటం సరయినదే. నాకారణంగా ధార్తరాష్ట్రులకు హాని కలగకూడదు.' "ఉపశమహీనుండయిన దుర్యోధను కారణంబున ధార్తరాష్ట్రుల కెల్లం బ్రళయంబగు" నని చెప్పాడు.[2]

ద్రౌపది ఈమాటలను సరిగా అర్థంచేసుకోలేకపోయింది. 'వారి పాపానవారే పోతారులే' అని చెప్పినట్లుగా మాత్రమే అర్థం

1. అరణ్య - 1 - 220 2. అరణ్య - 1 - 224

చేసుకొని, మళ్లీ అతనితో వాదానికి దిగింది. 'నీక్షమాబుద్ధి ప్రశంశించ దగిందే- నీవు సిష్కల్మషబుద్ధితో ధర్మమునందే వర్తించే కరుణాత్ము డివీ, అజాతశత్రుడవూను. కానీ,

"ధర్మదూరు లైనధార్తరాష్ట్రులయందు
ధర్మ మేమిసేయు ధరణినాథ!
నికృతి పరులయందు నికృతిసేయనివారు
వారినికృతిఁజేసి వధ్యులండ్రు.

"ఆర్యులకు విహీనతయు న
నార్యుల కున్నతియుఁ జేసి యవినీతుఁడవై
కార్యము దప్పితి నీకు న
నార్యులు చుట్టములె యార్యులరులె విధాతా"[1]

అంటూ దైవాన్ని, ధర్మాన్ని ఆక్షేపించబోయింది. ధర్మజుడు ఆమెను 'నాస్తికురాలిలా మాట్లాడకు' అని మందలించాడు. 'ధర్మనిత్యులై జీవించే మైత్రేయ, మార్కండేయ, వ్యాస, వశిష్ఠ, నారదాదులు తనను ధర్మపరుడని మన్నిస్తారనీ, కనుక, తనమార్గం తప్పుకాదనీ పలికి, 'అన్యుల న్యాయంబు సేసిరనియు నేనేల ధర్మువు దప్పుదు?' అని ప్రశ్నించి, "నీవూ, ధృష్టద్యుమ్నుడూ పుణ్యకర్మల ఫలితంగా కదా జన్మించారు. పుణ్యఫలాలున్నట్లే, పాపఫలాలూ ఉంటాయి. దైవాను సారం ఆయాఫలాలు అనుభవంలోకి వస్తాయి" అని ఆమెను ప్రబోధించాడు. కౌరవులు చేసింది పాపమే, అయితే, అందుకు వారిని శిక్షించవలసింది మనంకాదు. దైవవశాన పుణ్యఫలాలు తమంత తాముగా ఎలా అనుభవంలోకివస్తాయో, అలాగే పాపఫలాలూ దైవవశానే అనుభవంలోకి రావలసింది ఉంది. మధ్యలో మనం తొందరపడి

1. ఆరణ్య - 1 - 226, 227

కల్పించుకో కూడదు-అని ధర్మజుని మాటల సారాంశం. ద్రౌపది మారు పలకలేకపోయింది.

'ఆర్తనై విధిచెర్గు కలసి పలికితిం బ్రియంబు దప్పి' అని అంటూనే, కర్మఫలప్రాప్తికి దైవమానుషాలు రెండూనిమిత్తాలనీ, మానవప్రయత్నం లేకుండా దైవం అనుకూలించదనీ ఉదాహరణ పూర్వకంగా వివరించింది. పుణ్యఫలప్రాప్తికి పురుషప్రయత్నం ఎలా అవసరమో పాపఫలం పొందించడానికీ పురుషప్రయత్నం అలానే అవసరం-అని ఆమె అభిప్రాయం. కడమాటగా, 'కర్మఫలసిద్ధి నిశ్చయించి యుత్సాహవంతుండవయి నీయనుజుల పరాక్రమంబునం బరుల జయించి మన యందలి యర్థకృశత్వం బపనయింపు' మని విన్నవించింది.[1]

భీముడు ద్రౌపదికి వంత పాడాడు. కేవల ధర్మాచరణం శత్రువునుజయించటానికి సాధనం కాదనీ, దేవతలంతటివారే రాక్షసులను మోసంతో జయించారు కనుక తాముకూడా మోసంచేసిన శత్రువులను మోసంతో జయించడం తప్పుకాదనీ వాదించాడు. ధర్మజుడు అరణ్యాజ్ఞాతవాసాలు నిర్వహిస్తానని పెద్దల సమక్షంలో తాను చేసిన ప్రతిజ్ఞను ఎట్టిపరిస్థితిల్లోను తప్పను అనీ స్పష్టంచేశాడు. దుర్యోధనాదులు ఆతతాయులే కానీ వారిని జయించడం అంతసులభంకాదన్ని చెప్పి, కర్ణుని గురించి తనకున్నభయాన్ని వివరించాడు. భీష్మద్రోణాది దివ్యాస్త్రవిశారదులైన మహావీరులను తక్కువగా పరిగణించ కూడదని పలికి, కౌరవులను జయించడం విషయంలో తొందరపడి చేయగలిగింది లేదని తేల్చి చెప్పాడు.

ధర్మరాజు ఇలా చెబుతూ ఉండగానే వారి అదృష్టంకొద్దీ వ్యాసుడు రావడం, ప్రతిస్మృతిని ఉపదేశించడం, అస్త్రలాభాన్ని పొందండని చెప్పడం జరిగాయి.

---

1. అరణ్య - 1 - 236

ధర్మజుడు తనమనోభావాలను సాధారణంగా నోరువిప్పి చెప్పడు. అతనినోటినుంచి ఈమాత్రపుమాటలు వెలువడినాయంటే అందుకు ద్రౌపదేకారణం. ఆమె ఎంతో విజ్ఞతను ప్రదర్శించి, ధర్మజుని ఆంతర్యాన్ని వెల్లడింపజేయటంలో విజయం సాధించింది. భీముడొక ప్రక్క, ఆమె ఒకప్రక్క అతని మనస్సాగరాన్ని మథించగా అందునుంచి వ్యాసభగవానుడు దిగివచ్చి ప్రతిస్మృతిని ప్రసాదించి, పాశుపతాస్త్రసిద్ధికి కారకుడయ్యాడు.

విపత్సమయాల్లో ద్రౌపది ప్రదర్శించిన వివేకం మహాశ్చర్యకరమైనది. కురుసభలో వ్యక్తమైన ఆమె వివేకాన్ని చూశాం. అలాంటివే మరిరెండు సన్నివేశాలు:

సైంధవుడు ఒంటరిగా ఉన్న ద్రౌపదిని అపహరించబోయినప్పుడు ఆమెమాట్లాడినతీరు ఒకవిధమైనదయితే, కీచకుడు బలాత్కరించబోయినప్పుడు ఆమె ప్రసంగించినతీరు మరొకవిధమైనది. సైంధవుడు బంధువు అవడంతో మర్యాదకు లోటురాకుండా, ఆత్మగౌరవానికి హాని కలుగకుండా ఎంతో జాగ్రత్తగా ఆమె మాట్లాడవలసివచ్చింది. అంతటి క్లిష్టతరమైన సన్నివేశంలోకూడా, ఆమె సన్నివేశంకంటే ఎన్నోరెట్లు ఎదిగి, ఎంతో ఉదాత్తతను ప్రదర్శించింది. సగౌరవంగా అతిథిమర్యాదలునెరపుతూనే అతడడిగినవానికి తగిన సమాధానాలు చెబుతూ కుశలప్రశ్నలు వేస్తున్నట్లుగా అతనిని చీవాట్లు పెట్టింది.

" నయమును ధర్మముఁగలయు
న్వయమున జనియించినాఁడ వకృటధర్మ
క్రియ యెఱుఁగంగా వలదె యు
భయలోకవిరుద్ధమైనపథ మేమిటికిన్."[1]

---

1. అరణ్య - 6 - 169

అని ఎంతో పెద్దదానిలా మందలించింది. అప్పటికీ అతడు దారికిరాక పోయేసరికి, "క్రోధకలుషితాంతరంగియై యిప్పాపాత్ముండు ప్రియవచనంబులం బోవండు బెట్టిదంబులంగాని చక్కంబడడని తలంచి" పాండవుల పరాక్రమాన్ని ఉగ్గడించి, 'ఇదినీవినాశనానికి దారితీస్తుంది' అనిహెచ్చరించింది. తనకు శ్రీకృష్ణుని అండ ఉన్నదనేవిషయాన్నికూడా గుర్తుచేసి 'నన్నుఅవమానించడం నీతరంకాదు, నాపాతివ్రత్యమహిమేనాకు రక్ష' అనిచెప్పింది.[1] భీమార్జునులు వానివేషాన్ని వికారంగామార్చి పాండవదాసునిగా ఒప్పించి, ధర్మజునిపాదాలపై పడవేయగానే ద్రౌపది వానివికృతరూపానికి నవ్వుతూ వాన్నివదలివేయండని చెప్పింది. సైంధవునిదురవస్థకు ఆమెలోని అంతకోపమూ చల్లారి ఆ స్థానంలో కరుణ చోటుచేసుకొంది. కనుకనే ఆమెవాన్నిక్షమించగలిగింది. ఆమెలో ఎంతటిపగఉన్నదో అంతటిక్షమా ఉన్నదనటానికి ఇదిఒకనిదర్శనం.

ఇంక కీచకుడు – ఉత్త కాముకుడు. అదుపుఆజ్ఞలు లేనివాడు. ఆసమయంలో ద్రౌపది అజ్ఞాతవాసదీక్షలో ఉన్నది. తానెవరో తెలియకూడదు, వాన్నిఏమీ అనకూడదు! వాడు

"చెలువ!యింకనొక్కించుకసేపునీవ
నాదరంబున నెప్పటియట్ల యున్న
మన్మథుండు సమయించిన మగుడ నన్నుఁ
బడయవచ్చునె యెన్నియుపాయములను!"[2]

అంటూ ఆమెను వేధించసాగాడు. ఆమె '...వేగిరపాటు వలనుగాదు, నెరవుతోడన తప్పించుకొనవలయునని తలంచి"నది. తనపట్ల వానికి అసహ్యం కలిగేలా చేయాలని తననుతాను హీనవంశాభిజాతగావర్ణించుకొంది.

---

1. ఆరణ్య - 6 - 188 2. విరాట - 2 - 4

"నా యున్న బాము దలఁపవ
యీయెడ లీచీర యిట్టి యేవపుఁజందం
బోయన్న మదనవికృతిం
జేయుననుట యెంతయును నిషిద్ధముగాదే!

అని అడిగింది. 'పతిపత్నినగు నన్నునడుగఁ దగునె?' అంటూ వాని సంస్కారానికి తగినట్లుగా, తనవేషానికి అనుగుణంగా కొంచెం తక్కువ స్థాయిలో మాట్లాడింది. అలామాట్లాడక తప్పనిస్థితి ఆమెది.

సాటిస్త్రీగా సైరంధ్రి కష్టాన్ని అర్థంచేసుకొని ఏదోవిధంగా ఆమెను కాపాడవలసిన సుదేష్ణ నిర్దాక్షిణ్యంగా మదిర తెమ్మని కీచకుని ఇంటికి పంపినప్పుడు ఆమె ఎంతో నిర్వేదం పొందింది. అంతటి దురవస్థలో కూడా ఆమె 'మహాపదలకుం బరిహారణంబు హరిస్మరణంబ' అని తన హృదయపుండరీకంబునం బుండరీకాక్షు నిక్షేపించు కొనగలిగింది.

భీముణ్ణి కీచకవధకు ప్రోత్సహించడంలో ద్రౌపది ఎంతో చాతుర్యాన్ని ప్రదర్శించింది. ముందుగా తనకు జరిగిన అన్యాయాన్ని వివరించింది. పూర్వపు అవమానాలను గుర్తుకు తెచ్చుకొంటున్నట్లుగా 'వగనాకు వింతయే'[2] అంటూ బాధను వ్యక్తం చేసింది. ధర్మజుడు తన పరాభవాన్ని చూసి ఉపేక్షించినందుకు నిరసన తెలిపింది. భీముడు 'సత్యవ్రత నిష్ఠుండగు యుధిష్ఠిరుండు పొగడ్తకుం దగువాఁడుగాని దూఱు వహనర్హుండు గాఁడని' వారించాడు. ఆమె వెంటనే సర్దుకొని ధర్మజుని మహిమను నోరారా కీర్తించింది. భీమార్జున నకుల సహదేవుల విశిష్టతలను, వైభవాలను కీర్తించి, వారి ఇప్పటి దురవస్థలను ఏకరువు పెట్టింది. ఈ చెప్పడంలో భీమునిపై తనకు ప్రత్యేకమైన ఆసక్తిఉండ

1. విరాట - 2 - 49.

2. విరాట 2 - 176.

టాన్ని నొక్కి చెప్పింది.[1] ఆపిదప, తనగొప్పతనాన్ని వర్ణించింది. తన ప్రస్తుతపుదురవస్థను వివరిస్తూ,

"ఏను మనంబు పెంపు సెడి యిప్పుడు నీచతర ప్రచారముం
బూని నికృష్టనై యుదరపోషణకై తగ వేది యెంతయున్
దీనతఁబొంది యిమ్మెయి సుదేష్ణపనుల్ గనుసన్నఁ జేయుచున్
హీనతనున్కి మీకు వగ పేమియుఁ జేయద యేమిసేయుదున్"[2]

అంటూ జాలికలిగేలా ప్రసంగించింది. సేవ చేసి చేసి సుకుమారమైన తనచేతులు ఏవిధంగా కాయలుకాచిపోయాయో చూపించింది. ఏడుస్తూ అతనివక్షానికి ముఖంచేర్చి కొద్దిసేపుఉండిపోయింది. తన్ను తానుసంబాళించుకొని, "...... మీముక్కున నూర్పుగల్గ నొకమూర్ఖుని చేఁబడితిన్ సభాస్థలిన్"[3] అంటూ, ఎలాగైనాసరే ఆకీచకుణ్ణి చంపితీరాలని పట్టుపట్టింది. భీముడు ఎట్టిపరిస్థితుల్లోనూ రేపటికివాడు మిగలడని మాటిచ్చాడు.

ఆమె కీచకుణ్ణి మెలకువగా ఉరివేసబిగించింది. వానికిమెత్తబడినట్లుగా నటించి చూపులతో ఆకర్షించి, తనహృదయాన్ని తెలుపుతున్నట్లుగా, "... నీహృదయంబునట్లు కాఁదలఁపు మనోజుతూపులకుఁ జిక్కటిచిత్తములంగడంగి విచ్చలవిడిసేఁత గర్జమె ..."[4] అంటూనర్తనశాలను సంకేతస్థలంగా చెప్పి వాడు ఒక్కడేవచ్చేలా అంగీకరింపజేసింది.

భీముని దగ్గరకువెళ్ళి అతనికోపాగ్నిని ప్రజ్వరిల్లజేస్తూ 'చతురోక్తిరీతి'ని

1. విరాట - 2 - 196 నుంచి 202 వరకు. 2. విరాట - 2 - 218
3. విరాట - 2 - 226 4. విరాట - 2 - 260

"నాకొఱంత దీర్చి వచ్చితి
నీకొఱంతయు యింక సూతునిం దెగఁజూడన్
లోకము వంచింపను దగు
చీఁకటి రేయొదవ నేమి సేసెదొ చెపుమా!"[1]

అని అడిగింది. భీముడు నవ్వుతూ వేళాకోళాలాడి, ఆర్భాటంగా సూతుణ్ణిచంపుతానన్ని చెప్పాడు. ఆమె కంగారుపడింది. అలా చేస్తే ధర్మరాజూ, జనులూ తమను నిందిస్తారనీ, కార్యంనెరవేరినా ప్రయోజనం ఉండదనీచెప్పి, "వంచనబాహిరపోవక యుండంగ మనరిపుంబరిమార్ప" వలెననిచెప్పింది. భీముడు సాధ్యమైనంతవరకూ అలాగేప్రయత్నిస్తానన్నాడు. అప్పుడామె అతణ్ణి"జయలక్ష్మిం జేకొనుమ''ని దీవించింది.

భీముడు కీచకుణ్ణివికృతంగా వధించి ద్రౌపదికి ప్రదర్శించినపుడు ఆమె ఆశ్చర్యమూ, భయమూ, ప్రియత్వమూ పెనగొనగా భీముణ్ణి చేరింది. ''కడునక్కజంబయిన చందంబునంబడియున్న పీనుఁగున్

''చూచుచుఁ జేరి వ్రేల్మిడుచుచుం దలయూఁచి విలక్షచిత్తయై
యేచపలాక్షి ముక్కుపయి నంగుళముం గదియించి దీన్నికై
కీచక! యింతసేసితి సుఖత్వము బొందుదుగాక యింక న
ల్లేచిన నిట్లు గా కుడుగునే ..................."[2]

అంటూ ముగ్ధత్వాన్ని ప్రకటించింది.

సైంధవునిదగ్గర ఎంతో ప్రౌఢత్వాన్ని ప్రదర్శించిన ఆమె ఈఘట్టంలో ఇంతటి ముగ్ధత్వాన్ని ప్రదర్శించగలడం మహాద్భుతం. ఆవశ్యకతనుబట్టి ఆమె ఎంతప్రౌఢకాగలదో అంతటిముగ్ధరాలుకూడా కాగలదన్నమాట!

---

1. విరాట 2 - 271    2. విరాట - 2 - 356, 357

సన్నివేశంలోని సూక్ష్మతను గ్రహించి తార్కికంగా ఆలోచించడం ద్రౌపది స్వభావంలో ఒకభాగం. కురుసభలో భీష్మాదిమహాజ్ఞానులందరినీ ఆమె ప్రశ్నించి నిలదీసినతీరూ, వరాలు కోరుకొంటూ ధృతరాష్ట్రుని హడలగొట్టిన తీరూ ఇంతకుముందే పరిశీలించడం జరిగింది. రాయబారానికి బయలుదేరిన కృష్ణునితో భర్తలతోపాటు ద్రౌపదికూడా తన మనస్సులోని మాట చెబుతుంది. ఆసందర్భంలోని ఆమె తార్కికత స్త్రీలలో చాలా అరుదుగా కనిపించే అంశం. స్త్రీలలోనే అనేమిటి? ప్రపంచంలోని ఏపెద్దన్యాయవాదీ ఆమె వాదపటిమకు సాటి రారనిపిస్తుంది.

ఆమెకు తనభర్తలు అసమర్థుల్లా అయిదూళ్లు ఇచ్చినా చాలని వేడుకోవడం ఎంతమాత్రమూ నచ్చలేదు. అవమానాలు పడిందీ, కష్టాల పాలయినదీ తాము. అన్నింటినీ మర్చిపోయి సంధికోసం దేవిరించవలసిన అవసరం వాస్తవానికి తమకులేదు. సంధి పొసగితే కౌరవుల కేలాభం. అదీగాక, భర్తలమాటల్లో ఎక్కడాతనకు జరిగిన అవమానానికి ప్రతీకారాన్నిగూర్చిన ప్రసక్తి లేకపోగా, వారు అసలావిషయాన్నే మర్చిపోయినట్లుగా మాట్లాడారు. అందువల్ల ఆమెకు హృదయ తాపం కలిగింది. కనుకనే 'మాటలనేర్చి' శౌరికి తనగోడు వెళ్లబోసుకొంది. సంధిప్రయత్నంవల్ల దుర్యోధనుడు పాండవులను అసమర్థులుగా భావించి, మరింతదురభిమానంతో కయ్యానికే కాలుదువ్వుతాడుగాని సంధికి ఒప్పుకోడని స్పష్టంచేసింది. ఒకవేళ సంధిపొసగినా తనస్థితి ఏమిటో సందిగ్ధమే అంటూ వ్యంగ్యంగా,

"అరయమిఁ జేసి కోడలనకప్పుడు దాసిగఁ జేసె నమ్మహా
పురుషుని పాలికిం బతులు వోవఁగ వీరలతోన యేను జె
చ్చెరఁ జని కోటరంబు దగఁ జేయుదునో యటుగాక పాడిమై
వరవుడు మోపి చేయుదునో వారికి మాధవ! నిశ్చయింపుమా!"[1]

1. ఉద్యోగ - 3 - 112

అని అడిగింది. అంటే, భర్తలు కోరుకొంటున్న సంధి కనుక సాధ్యపడితే వారు సేవకులుగా ఆ ధృతరాష్ట్రుణ్ణి ఆశ్రయించి అతడిచ్చినదానితో తృప్తిపడి పడిఉంటారా? లేక, న్యాయంగా తమకురావలసింది తాము పొంది పాండుపుత్రులుగా తమస్థానం తాము నిలుపుకొంటారా? అని ఆమె కృష్ణుణ్ణి అడుగపెట్టుకొని అడుగతోందన్నమాట! అన్యాయం చేసిన వారితో సంధికి ప్రాకులాడటం అన్యాయాన్ని అంగీకరించడమూ, సహించడమే అవుతుంది. అది ఆమెకు ఇష్టంలేదు. కనుకనే, "బంధురమైన తన క్రొమ్ముడి గ్రమ్మనవిడ్చి," 'గోవిందుముందటం బెట్టి,' 'కౌరవుల కడఁదీఱుమాటల యవసరమునఁదలఁప వలయు' నన్నది. ఒకవేళ కౌరవులు సంధికి అంగీకరిస్తే, రాజ్యం వస్తుందేగాని ప్రతీకారం తీర్చుకోవడం కుదరదుగదా! అందుకని,

"ఈ వెండ్రుకలు వట్టి యీడ్చినయాచేయి
  దొలుతగా భూరిలో దుస్ససేను
తనువింతలింతలు తునియలై చెదరి గూ
  పలియున్నఁగని యుదుకాలుఁగాక
యలుపాలఁ బోమపనునట్టి చిచ్చే యిది
  పెనుగద వట్టిన భీమసేను
బాహుబలంబును బాటించి గాండీవ
  మనునొకవిల్లెప్పుడును వహించు

కత్తివిక్రమంబుఁ గాల్పనే యిట్లు బ
న్నములు వడినధర్మనందనుండు
నేను రాజరాజుపీనుంగుఁ గన్నారఁ
గానఁబడయమైతి మేనిఁగృష్ణ!"[1]

1. ఉద్యోగ - 3 - 117

అంటూ ఏమిజరగాలో కూడా నిర్దేశించింది. ధర్మజునికి ముందరికాళ్లకు బంధంవేస్తున్నట్లుగా ఆయననుకూడా కలుపుకొని, ఆయనపక్షాన తానే, భీమార్జునులు ప్రతీకారం తీర్చవలసి ఉన్నదని చెప్పడంలోని వాక్యం సహృదయవేద్యం.

యుద్ధానంతరం బంధుక్షయానికి విరక్తుడైన ధర్మజుణ్ణి ద్రౌపది ఎంతో విజ్ఞతతో సమాధాన పరచడానికి ప్రయత్నించింది. వాస్తవానికి తండ్రినీ, సోదరులనూ, బిడ్డలనూకోల్పోయి, పుట్టెడు దుఃఖంతో ఆమె ఓదార్చబడవలసినస్థితిలో ఉంది. ధర్మజుడు అంతకుమించి విషాద మగ్నుడు కావడంతో ఆమె తనదుఃఖాన్ని ప్రక్కనపెట్టి అతనిని అనునయించక తప్పలేదు. ధర్మరాజు యుద్ధంవద్దని మొదటినుంచీ అంటూనే ఉన్నాడు. తానేవానిని యుద్ధానికి ప్రేరేపిస్తూ వచ్చింది. అదృష్ట వశాన కౌరవులు సంధికి ఇష్టపడలేదు కనుక సరిపోయిందికానీ, లేకపోతే, నింద అంతా ద్రౌపదిమీద పడేదేకదా! ఆమెతనను ఘోరంగా అవమానించి నందుకు, అతడు రాజుగా, కౌరవులను దండించినట్లయిందనీ, అందులో అతనిదోషం ఏమీలేదని చెప్పింది.

"గరదుని గృహదాహకు మం
త్రరహస్యవిభేది వధవిధాయిఁ బరసతీ
హరు బంధుఘాతిఁ బరధన
హరణపరునిఁ జంపి పుణ్యుఁడగు నృపుఁడనఘా!

దండార్హులైన వారల
దండింపక యున్నఁ జుమ్మె ధాత్రీవిభు నా
ఖండల సన్నిభునైనఁ బ్ర
చండపుఁ గిల్బిషము వొందు జగతీనాథా!"[1]

అంటూ నృపధర్మానుసారం అతడు దోషులైన కౌరవులను దండించి

1. శాంతి - 1 - 96, 97

మంచిపనే చేశాడని ఉత్సాహపరచడానికి ప్రయత్నించింది. చనువుతో పరిహాసిస్తున్నట్లుగా,

"వైదికధర్మచారి! జనవత్సల' నీమదిఁ బట్టుకొన్నయు
న్మాదము హీనమానవుమనంబునఁ బుట్టిన వెఱ్ఱివోలెన
న్యాదులఁ దీర్చు టొప్పదు నిజానువర్గము మీఁదఁగల్గున
త్యాదరసాంద్రసారకరుణామృత మానఁగనిమ్ము నెమ్మదిన్."[1]

అని పలికింది. ఒకరకంగా చూస్తే, చెయ్యవలసిందంతా చేసి, చావవలసినవారంతా చచ్చాక, తీరికూర్చుని విలపించడం వెర్రే మరి. ఆమాటను గట్టిగా ఎలా అంటుంది? అందుకని వేళాకోళంచేస్తున్నట్లుగా నచ్చచెప్పబోయింది.

"కౌరవులు దమదురితమునఁ
దా రెరిసిరి కల్మషంబు దానఁగలదె? భూ
భారము వహింపు బహు య
జ్ఞారంభణ మాచరింపు మఖిల హితముగన్."[2]

అని ఉద్బోధించింది. ద్రౌపది బుద్ధిసూక్ష్మతకు, ధర్మకుశలతకు ఆమె చేసిన ఈప్రసంగం పరమోదాహరణం.

పై పరిశీలనవలన సందర్భానికి తగినట్లుగా ద్రౌపదిద్వారా అసాధారణమైనశక్తియుక్తులు ఎన్నో వ్యక్తమైనట్లుగా తెలుస్తోంది. ఏవంవిధగుణాలన్నీ జన్మతః ఆమెకు సిద్ధించాయని చెప్పడంకంటే సందర్భతః ఆమెద్వారా వ్యక్తమయ్యాయని చెప్పడం సమంజసం. ఆమె అయోనిజకదా!

1. శాంతి - 1 - 101 2. శాంతి - 1 - 105

## 4. పాతివ్రత్యమహిమ

అరణ్యవాసంలో ఉండగా ధర్మరాజు మార్కండేయ మహర్షితో పుణ్యసతీ ప్రభావాన్ని గూర్చి తెలుపవలసిందంటూ

"సమధికదర్పదుర్జయములై నిగిడెడు
నింద్రియంబుల గుదియించి తెచ్చి
మనసు పొందుననిడి మనసహంకారంబు
పజ్జకుఁబాపి సద్భక్తియుక్తి
నెరయంగ నన్నిశంబు నిజభర్తృశుశ్రూష
యందు సమాహిత యైనవనిత
యఖిలలోకోత్కృష్ట యనియెప్డు నూహింతు
నరయఁబతివ్రత లైనవారి

చరిత మత్యంత ధర్మసూక్ష్మంబు గరము
దుష్కరంబును గావెనిర్ధూత దురిత
యట్లుగావున వినవేడ్క యయ్యెఁజెప్ప
వలయుఁబుణ్యసతీ ప్రభావంబు నాకు"[1]

అని ప్రార్థించాడు. ఇంద్రియాలను మనస్సులోకి; మనస్సును అహంకారంలోకి యోగించి, భక్తితో నిరంతరం భర్తృసేవాపరాయణురాలై ఉండే స్త్రీ లోకంలో అందరికంటే శ్రేష్ఠమైనదని ధర్మజుడు తనఅభిప్రాయంగా తెలిపాడు. అలాంటివారే పతివ్రతలు. వారి నడవడికలు మిక్కిలిఅయిన ధర్మసూక్ష్మతతోకూడి, సామాన్యులకు ఎంతమాత్రమూ అంతుబట్టనిరీతిలో ఉంటాయిట! పాతివ్రత్యాన్ని ఎంతచక్కగా నిర్వచించాడు ధర్మరాజు! ఈనిర్వచనానికి పరమోదాహరణ ప్రాయంగా

1. అరణ్య - 5 - 3

మార్కండేయమహర్షి పతివ్రతాతిలకమైన బ్రాహ్మణి వృత్తాంతాన్ని వినిపించాడు. ఆమె భిక్షను ఆలస్యంగా తెచ్చినందుకు తనపై కోపించిన కౌశికునితో తననుగూర్చి

"పతియచూవె నాపాలికిఁ బరమదైవ
మేను వాఙ్మనఃక్రియలదద్దితమ యెపుడుఁ
గోరియొనరింతు దీనమిగులఁగ నొండు
ధర్మములు గాననెందును దలఁచి చూచి"[1]

అని పలికింది. పతిసేవాపరాయణతను మించినధర్మాలు లేవన్ని ఆమె నిష్కర్ష. ఇలాంటి పతివ్రతామతల్లుల మహిమను గూర్చి భీష్ముడు

"పాతివ్రత్యము గలిగిన
నాతియనఁగ దైవమన జనస్తుత! వేఱే?
యాతతధర్మార్థ సుఖ
ఖ్యాతులు సద్భార్యవలనఁగాదే కలుగున్"[2]

అంటూ వారుసాక్షాత్తూ దైవస్వరూపులని వివరించాడు. అలాంటి భార్యలవల్ల భర్తలకువెల్లప్పుడూ ధర్మార్థసుఖ ఖ్యాతులు కలుగుతూ ఉంటాయన్నికూడా తెలిపాడు.

"ధర్మశ్చార్థశ్చ కామశ్చ పరస్పరవిరోధినః।
ఏషాంనిత్యవిరుద్ధానాం కథమేకత్ర సంగమః॥"

అని యక్షుడు అడిగినప్పుడు ధర్మరాజు కూడాసరిగ్గా ఇదేసమాధానం చెప్పాడు —

"యదా ధర్మశ్చ భార్యాచ పరస్పరవశానుగౌ।
తదా ధర్మార్థకామానాం త్రయాణామపి సంగమః॥"[3]

---

1. ఆరణ్య - 5 - 21 2. అనుశాసనిక - 2 - 219
3. సంస్కృత భారతం - వనపర్వం - 313 అధ్యాయం - శ్లో. 101, 102

ధర్మమూ, భార్యా పరస్పరవశవర్తులై ఎవనివిషయంలో ఉంటారో వానికి ధర్మార్థకామాల మూడింటి సంగమమూ సిద్ధించినట్లే — అని. భర్త పయనిస్తూన్న ధర్మపథంలోనే భార్యా పయనిస్తూంటే, ఆభర్తకు అంతకుమించిన అదృష్టం ఏముంటుంది?

పతినిదైవంగా భావించి, వాఙ్మనఃక్రియలతో నిరంతరం భర్తృహితాన్ని కాంక్షించడమనేది స్త్రీలస్వధర్మం. స్వధర్మాచరణమే తపస్సు - ("తపః కిం లక్షణం?" – అనియక్షుడు; 'తపస్స్వధర్మవర్తిత్వం" – అనిధర్మరాజు) అంటే తపస్సువల్ల కలిగే మహత్వం స్వధర్మాచరణంవల్ల కలుగుతుందన్నమాట. తపస్వులు దైవసంబంధమైన తమతమ భావన (concepts) లను ఆరాధించి ఎలాదైవత్వాన్ని పొందగలుగుతున్నారో స్త్రీలూ 'భర్త'ను దైవంగాభావించిఅలానే దైవత్వాన్ని పొందగలుగుతున్నారు. పాతివ్రత్యంగలిగినస్త్రీ అన్నా, దైవమన్నా ఒక్కటేసుమా! అని భీష్ముడు చెప్పినమాటల ఆంతర్యంఇదీ!

భర్త దుష్టపురుషుడైతే భార్యకు ఈవిధమైనసిద్ధి సాధ్యమా? అనే ప్రశ్నకు అవకాశంఉంది. ఇక్కడ గమనించవలసింది, ఆమెసిద్ధికి ఆమె భావన (concept) కారణంగానీ భర్తకాదు అని. మనపురాణాల్లో లోకకంటకులైనరాక్షసుల భార్యలు మహాపతివ్రతలైనవారి వృత్తాంతాలు ఎన్నిలేవు? వారిమహత్వానికికారణం వారిభర్తృభావనమాత్రమే. భర్తలుకారు. లౌకికులైనభర్తలు స్త్రీలలో అంతర్గతంగా ఉండే భర్తృభావనకు బాహ్యమైనఆలంబనలు. బిడ్డలుగలస్త్రీని మాతృమూర్తిఅంటాం. బిడ్డలు లేనామెగొడ్డుటాలు. ఇదిలోకరీతి. కానీ, ఒకస్త్రీ వరుసగాబిడ్డలనుకని, మమకారంలేక, అందరినీ అనాథాశ్రయాలపాలు చేసిందనుకొందాం. అప్పుడామెను మాతృమూర్తి అనగలమా? అలాగే, ఒకానొకగొడ్రాలు ఉదారహృదయంతో లోకులబిడ్డలపట్ల అపారమైనవాత్సల్యాన్ని ప్రదర్శిస్తున్నదనుకొందాం; ఆమెను

తొందరపడి గోడ్రాలని నిందించగలమా? మాతృత్వాన్ని కొలిచేందుకు ప్రమాణం స్త్రీలోని వాత్సల్యభావంగానీ బిడ్డలుఉండటం, ఉండకపోవ డంఅనేదికాదు అన్నది ఇక్కడగమనించవలసిన ప్రధానాంశం. పాతివ్ర త్యం సంగతికూడా ఇంతే.

'విపులశబ్దశాసను' డైననన్నయ, పాండురాజు కుంతిని స్వయంవరంలో పొంది, వివాహం చేసుకొన్నాడు అని చెబుతూ,

"యదుకుల విమలపయఃపయోనిధిసుధా
కర రేఖ కమనీయ కాంతినిలయ
.............................
.............................
బరమ పతివ్రతాభరణాభిశోభితc
దామరసేక్షణc దాల్మియందుc

బృథివిలోని దానిc బృథయను కన్యక
నధికవీర్యుc డై స్వయంవరమునc
బడసి పరనరేంద్రపరిభావి యప్పాండు
వరుcడు పేర్మితో వివాహమయ్యె"[1]

నని వర్ణించాడు. కన్యనువర్ణిస్తూ "పరమపతివ్రతా భరణాభిశోభిత" అని నన్నయ అనాలోచితంగా ప్రయోగించాడనటంకంటే, పాతివ్రత్య మనేది ఒకభావన, అదిసంస్కారగతంగా జన్మతః సిద్ధిస్తుంది అనేఅవగా హనతోనే ప్రయోగించి ఉంటాడనుకోవడం సమంజసం. భర్తృప్తి కోసమనీ, పవిత్రమైన అతని ఆదర్శాలకోసమనీ అంకితమై భర్తమరణా నంతరం కూడా జీవయాత్రనడిపిన పవిత్రమూర్తికుంతీదేవిని పరమ పతివ్రతఅనడానికి సందేహించవలసిన పనిలేదు.

1. ఆది - 5 - 34

స్త్రీ తనలోని వాత్సల్యభావపరితృప్తికై తహతహలాడు తుంది. మృత్యుతుల్యమైన ప్రసవానికి వెనుకాడకుండా బిడ్డలను కంటుంది. దాంపత్యసౌఖ్యం దక్కుతున్నదికదా, ఇంక బిడ్డలెందుకులే అని భర్త మూర్ఖంగా పలికితే మాతృత్వంలోని మాధుర్యం స్త్రీగా పుడితేనేగానీ తెలియదు లెమ్మని మందలిస్తుంది. దాంపత్యమనేది సుఖంకోసం కాదు అని ఎప్పటికోగానీ ఆభర్త తెలుసుకోలేడు.

స్త్రీ తనలోని మాతృత్వభావ తృప్తికి బిడ్డలను ఎలాకోరు కుంటుందో అదేవిధంగా పత్నీత్వభావతృప్తికి పతిని కోరుకొంటుంది. (కామోత్తరంగా జీవించేవారు కూడా ఏదో ఒకదశలో జీవితంలో తమకోతోడుకావాలని ఆరాట పడటంలోకంలో చూస్తూనే ఉంటాం.)

(కామమంటే కోరిక అని అర్థం. నాలాయని మౌద్గల్య మహర్షిని తృప్తిపొందించమని కోరింది తనలోని పత్నీత్వభావాన్ని గానీ లైంగికోద్రేకాన్ని కాదు. 'కామోపభోగేచ్ఛ' కు లైంగికోద్రేకం అని అర్థం చెప్పటానికి అభ్యంతరాలు చాలా ఉన్నాయి. నాలాయన్ని భౌతిక రూపానికి మాత్రమే సంబంధించి ఉండే ఆ క్షుద్రకామం భౌతిక దేహాలు ఉండని దివ్యలోకాల్లో విహరించడంవల్ల తీరుతుందని ఆ దంప తులు ఎలా అనుకొని ఉంటారు? అసాధారణమైన లైంగికోద్రేకం రోగం అవుతుందేకానీ యోగం ఎలాఅవుతుంది? భౌతికమైన తృప్తికి భౌతికప్రయత్నాలు చేయడం లోకసహజమైన విధానం. శివునిగూర్చి తపస్సుచేయడం ఏమిటి? చేసినా లైంగిక తృప్తికలిగే మార్గాన్ని అడగాలిగానీ పతిదానమని అడగటమేమిటి? పతివల్ల ఆ తృప్తి కలుగకనే గదా పశుపతిని ఆశ్రయించింది?)

విధివశాన భర్తను పొందలేని కాశీరాజకన్య తపస్సు చేయగా పశుపతి ప్రత్యక్షమై ఆమెలోని పత్నీత్వభావతీవ్రతకు తగి నట్లుగా పంచపతులను అనుగ్రహించాడు. అందువల్లనే ద్రౌపదిగా దిగి

వచ్చినప్పుడు ఆమెకు భౌతికంగా అయిదుగురు పతులయ్యారు. ఒక స్త్రీ ఒకభర్తను సర్వసమర్పణతో దీక్షగా ఎలా సేవిస్తుందో, ద్రౌపది అయిదుగురు భర్తలనూ అలా సేవించగలిగింది. అయితే పంచ పతిత్వమనేది లోకవిరుద్ధం కనుక ఆమె ప్రత్యేకించి అందులో ధర్మవిరుద్ధం లేకుండా చేయవలసిందనీ, "అన్యోన్యపురుషతుల యందును బ్రత్యేక సంగమంబునను నాకుఁ గౌమారంబును, బతి శుశ్రూషా సిద్ధియుఁ గామభోగేచ్ఛయు సౌభాగ్యంబునుం బ్రసాదింప వలయు" ననీ ప్రార్థించింది. (ఆమె సంగమ విషయమై కామభోగేచ్ఛను కోరుతున్నదంటే ఆమె అంతకు ముందు తపస్సు చేసిందీ, శివుడు ప్రసాదించిందీ 'ఆవిధమైన' వరంకాదనేగదా!) ఆమె కోరింది పతిని, శివుడు ఇచ్చింది పతులను అందువల్ల ఆమె ఇలా అడుగవలసి వచ్చింది.

ఒకభర్తను దైవంగా భావించి దీక్షతో సేవించిన స్త్రీ పరమ పతివ్రత అయితే, అయిదుగురు భర్తలను అదేవిధంగా సేవించిన ద్రౌపది అయిదురెట్లు పరమపతివ్రత అన్నమాట! ద్రౌపదిది లోకోత్తరమూ, మహామహిమాన్వితమూ అయిన పాతివ్రత్యం. కనుకనే కృష్ణుడు ఆమెను జగద్వ్యూహ నిర్వహణలో పాత్రధారిగా స్వీకరించాడు. దమయంతీ మొదలైనవారి పాతివ్రత్యం వ్యక్తిగత కక్ష్యకు పరిమితంకాగా ద్రౌపదీ పాతివ్రత్యం విశ్వ ప్రణాళికకు విస్తరించింది.

ద్రౌపదికి తనపాతివ్రత్య మహిమమీద ఎంతో నమ్మకం ఉంది. సైంధవునితో సంభాషిస్తూ ఆమె

" ననుఁ బెఱవనితలచందం
బున నవమానింప నీకుఁ బోలదు మత్పా
వనపాతివ్రత్య మహిమ
ననిశము నేకీడు నెందు నందదు నన్నన్."[1]

1. ఆరణ్య - 6 - 188

అని తన ఆత్మప్రత్యయాన్ని చాటుకొంది.

ఆమె అంతటిమహిమ గలదే అయితే కురుసభలో కేశాకర్షణ, సైంధవునిచే అపహరణయత్నం, కీచకుని వేధింపూ ఎలాసాధ్యపడ్డాయి? ఆమెను తాకగానే వారు భస్మమైపోవడమో, లేక, ఆమె వారిని శపించడమో జరుగలేదేమి? అని కొందరికైనా సందేహాలుకలిగే అవకాశం ఉంది.

రామాయణంలో సీతామహాసాధ్వి రావణాసురునితో
"అసందేశాత్తు రామస్య తపసశ్చానుపాలనాత్ ।
నత్వాంకుర్మి దశగ్రీవ భస్మభస్మార్హ తేజసా"॥

("రావణుడా! నీవుభస్మముగాఁ జేయఁదగినవాఁడవయినను "అపరాధముగలవాని దండింపు" మని పెనిమిటియాజ్ఞ లేకుండుటవలనను, పాతివ్రత్యమువలనగల్గిన తపస్సుతలుఁగుననియు నిన్నుభస్మము చేయకున్నాను" )[1] అని చెప్పింది. ద్రౌపదికికూడా తాను భర్తలవలె ఒకానొకపరమధర్మానికి కట్టుబడిఉన్నాననీ, వారుసమర్థులైఉండీ అన్ని అవమానాలనూ సహిస్తున్నట్లుగానే తానూశక్తురాలయిఉండీ అన్నిటినీసహించితీరాలనిభావించడంచేతనే ఆమెపట్ల వారివారిదుర్మార్గపు ప్రయత్నాలుసాధ్యపడినాయని మనం తెలుసుకోవలసిఉంది. ఆమె సుదేష్ణతో తననుగూర్చి చెప్పుకొంటూ,

"... నేను సైరంధ్రజాతి సంభూత నభిదానంబు మాలిని పురుషపంచకసనాథనైయుండుదు నొక్క కారణంబున నుద్ధతులగుప్రిరోధులచేతం బతులసన్నిధిం దలవట్టి యీడ్వంబడి వనంబునకరిగి వ్రతంబుమై ...... బ్రహ్మచర్యంబు నడిపితి"[2] నన్నది. ధర్మానికి కట్టుబడిఉండటం కార

1. శ్రీసున్దరకాణ్డే - ద్వావింశస్సర్గః - శ్లో. 20 - వావిళ్ళవారిప్రతి - 1972.
2 విరాట - 1 - 313

ణంగానే ఆమెవల్లవారికి అపకారంజరుగలేదు. ఈవిషయం మూలభార తంలో స్పష్టంగా పేర్కొనబడింది. సభాపర్వంలో ద్రౌపది మహాత్మ్యాన్ని గూర్చిధృతరాష్ట్రుడు సంజయునితో,

"సంజయా! ద్రౌపది కన్నెత్తిచూసినంతమాత్రంచేతనే ఈ జగత్తునంతటినీ సర్వనాశనంచేయగలదు. ఒక్కశాపవాక్యాన నన్నూ, నాబిడ్డలనూ దహించి వేయగలదు. కానీ ఆమె దయాహృదయంతో సహించింది"[1] అని చెప్పినట్లుగా ఉంది. దీనిని గమనించక

" తాపసులెట్లు శాపమిడ దక్షులటుల్ దమయంతి శాపమీ
నోపెఁ బతివ్రతా మహిమ నొక్కని చేతికిఁజిక్కకుండఁగా
ద్రౌపది కష్టమైన సతిధర్మముగాదని యీరకుండకా
క్షేపము సేయు భర్తల సుశీలత కయ్యది లోపమర్భకా!

" అలఘుదోషముంట దమయంతి విధాన స్వశక్తి శాపమీ
జాలదు యాజ్ఞసేనిసహజంబెదురాడుట యామెకింతఁదా
త్కాలిత భక్తిఁదన్మయత గాంచి జనార్దను దీనరక్షణా
శీలుఁ దయావిశాలుని భజించి తరించెవిపత్పయోనిధిన్"[2]

అని కొందరు విమర్శకులు సరిపెట్టుకో జూడటం దురదృష్టకరం.

" కృష్ణుడు వేదవాఙ్మయశాఖలను సమన్వయించి, మానవుడికి పరిపూర్ణమైన యోగమార్గాన్ని ప్రసాదించినట్లు, అదే పేరుతో కృష్ణగా పిలవబడిన ద్రౌపది అనితరసాధ్యమైన కుటుంబజీవితాన్ని నిర్వహించి, పరిపూర్ణమైన గృహిణీధర్మస్వరూపాన్ని మానవులకు దర్శింపజేసింది. ఆమె తాను నడచినమార్గానికి ముగ్గుర్ని మూదలగా పెట్టుకుంది. వారే కుంతి, కృష్ణుడు, ధర్మరాజు. కనుకనే ఆమెమార్గం ప

1. సంస్కృత భారతం - సభా - అధ్యాయం - 80 - శ్లో 18, 19.
2. శ్రీమదాంధ్ర మహాభారత సంశయ విచ్ఛేదము - టుట - 44, 45 1939
1 కర్త : శ్రీపర్ఘు సూర్యనారాయణ.

పూర్ణగృహిణీధర్మానికి మొదలుగా వ్యాస భగవానునిచేత స్వీకరించ బడింది. ... ... ... ..."

"ధర్మగ్లాని ఏర్పడినప్పుడు అవతారమూర్తి దిగివస్తాడు. అప్పుడు ఆ అవతారమూర్తి ధర్మస్థితినుంచి దిగజారుతున్న జీవులకు ధర్మాన్ని ఉపదేశించి, వారిలో ధర్మసంస్థాపనం చేస్తాడు. అప్పటి ప్రజలు ఆ అవతారమూర్తి వెలుగులో ధర్మస్వరూపాన్ని దర్శించడా నికి సిద్ధపడాలిగానీ, ధర్మంఅంటే తమకున్న అభిప్రాయాల ప్రకారం ఆ అవతారపురుషుడు నడుచుకోవడంలేదని మనస్సుల్లో గింజుకుపోకూడదు. అలాగే దివ్యత్వంతో ఒక పరిపూర్ణమైన గృహిణిదిగివచ్చినప్పుడు ఆమె నుచూసి గృహిణీధర్మాన్ని విశాలభావంతో రూపొందించుకోవాలిగానీ తామాచరిస్తున్న ధర్మాలను యథాతథంగా ఆదివ్యమూర్తి ఆచరించడం లేదని కోప్పడకూడదు. సముద్రం మనం తీసుకువెళ్లిన పాత్రలో పట్టక పోవడం సముద్రం తప్పుకాదు. అలాగే మానవులు ఎరిగిన నియమాల్లో ఇమడలేకపోవడం ద్రౌపదిలాంటి కారణజన్మ ఎత్తినవారికి దోషం కానేరదు."[1] అనే డాక్టర్ కృష్ణస్వామిగారి వాక్యాలు ఇట అనుసంధే యమైనవి.



1. భారతం - ధర్మాద్వైతం, వ్యాసునిదర్శనం - తిక్కనసందర్శనం, 1984, పుట 234.

## 5. అనన్యభక్తి

ద్రౌపది జీవితంలోని మరొక ప్రధానమైనఅంశం ఆమెకు కృష్ణునివట్ల గల అనన్యభక్తి. శ్రీకృష్ణుని పరమేశ్వరత్వాన్ని ఆమె ఈవిధంగా భావించింది:

"నిన్ను నాదిప్రజాసర్గంబునఁ బ్రజాపతివని యసితుండయిన దేవలుండును సత్యంబువలన యజ్ఞంబుద్ధరించుటం జేసి నిత్యసత్యమయుండవయిన యజ్ఞపురుషుండవని కశ్యపుండును శిరంబున దివంబును బాదంబుల మేదినియును, లోచనంబుల సూర్యుండును నవయవంబుల లోకంబులు నభివ్యాపించుటం జేసి సర్వమయుండవని నారదుండును నక్షయజ్ఞాననిధివని సర్వమునిముఖ్యులును జెప్పిరి.

"అని నివృత్తులై పుణ్యచరితులై యాత్మప్రబోధ
వినిహితచిత్తులై సర్వధర్మార్థవిదులయి తృప్తిఁ
దనరెడురాజర్షివరులకును యోగధరులకు సాధు
జనులకు గతినీవ నిత్యకారుణ్య సర్వశరణ్య!

"నీయంతః కరుణ ప్రవృత్తి కగోచరం బెద్దియు లేదు......"[1]

ద్రౌపది ఆమె పాతివ్రత్య మహిమకారణంగా కలిగిన జ్ఞానవికాసంవల్ల ఈవిధమైన అవగాహన కలిగి ఉంటుందని చెప్పవచ్చు. శ్రీకృష్ణుని వాసుదేవతత్త్వాన్ని గ్రహించగలిగింది కనుకనే కురుసభలో వాటిల్లబోయిన మహాపద సందర్భంలోకూడా ఆమె "భయార్తయై యార్తజన శరణ్యుండైన జగన్నాథు జనార్దనుం దలంచి'' నిలబడ గలిగింది. ఆమె విశ్వాసమే ఆమెను రక్షించింది. ఆమెకు అఖండ వస్త్రప్రాప్తి జరిగింది. "ఇది యనేక భర్తృక గావున బంధకి యనంబడు నిట్టిదాని విగతవస్త్రం జేసి తెచ్చిన ధర్మ విరోధంబు లేద"ని పలికిన కర్ణుని మాటలు పరాస్తములై ఆమె పాతివ్రత్యం ప్రత్యక్షంగా నిరూపితమైంది. అదేసభలో

1. ఆరణ్య - 1 - 133, 134, 135.

ధృతరాష్ట్రునకు ఆమెను "పరమపతివ్రత, తపస్విని, పాండవధర్మపత్ని అయోనిజ" అని చాటిచెప్పాడు. అలా ప్రకటించి, సన్నివేశాన్ని అంతతో వారించి ఉండకపోయినట్లయితే, ఆమె పాతివ్రత్యమహిమవలన కలిగిన ఉత్పాతాలకు ఎలాంటిఅనర్థాలు అప్పటికప్పుడు కలిగిఉండేవో! కృష్ణునియొక్క దివ్యశక్తి ద్రౌపదిద్వారా వ్యక్తమై ధర్మం వెనుక దైవం ఎప్పుడూఉంటాడు - అనే పరమసత్యం మరొక్కసారి ఆసభలో ఆవిష్కృతమయింది. ఆమె తన అనన్యమైనభక్తిద్వారా ధర్మమూ, దైవమూతనద్వారా వ్యక్తమవడానికి చక్కనివాహిక కాగలిగింది.

"అనన్యాశ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్॥[1]

అని శ్రీకృష్ణుడు గీతలో వాగ్దానం చేశాడు. వివిధసన్నివేశాల్లో, ద్రౌపదీపాండవులకు శ్రీకృష్ణునిఅండ ఉన్నదనేవిషయం నిరూపితమై, ఆ వాగ్దానం యథార్థకథనం అయింది.

ద్రౌపదియొక్క ఈ అనన్యభక్తి కారణంగానే ఆమెకు "పద్మనాభ సహోదరత్వం" సిద్ధించింది. ఆమె "పూజ్యుండవైననీసఖియునై"[2] అని కృష్ణునితో పలకడమేకాదు,

"అతులితవృష్ణికేకయ బలావళితో ......యదుసింహుండు వెన్నడిముట్టెనిన్ బరిక్షతబలుఁజేయ నాకు దెసగల్గుటెయుంగుదు గాక యత్తఱిన్" అని తనను అపహరించబోయిన సైంధవునితో కూడా చెప్పకొంది. కృష్ణుడు తనను "సుభద్రకంటెఁగడు నెయ్యముగారవముందలి సంభావనసేయు"[3] నని ఆమె ఆ కృష్ణునితోనేచెప్పింది. "దుష్టనిగ్రహము పూని జగంబులుగాచునట్టితోఁబుట్టువునీవు" ఉండికూడా నామదినిగల అల్కకు 'అఱుట' కల్గడంలేదనివాపోయింది.[4] ఇట్టిది ఆమెకృష్ణభక్తి!

---

1. శ్రీమద్భగవద్గీత - 9 - 22
2. ఆరణ్య - 1 - 136
3. ఉద్యోగ - 3 - 110
4. ఉద్యోగ - 3 - 118

# అధ్యాయం ఐదు - సందేశం

1. అత్తాకోడళ్ల అనుబంధం

2. సపత్నుల సంబంధం

3. ద్రౌపది మాతృత్వం

4. జీవిత సందేశం

5. ఉపసంహారం

# ఆంధ్ర మహాభారతము - ద్రౌపది

—ఒక ఐతిహాసిక విశ్లేషణ

## 1. అత్తాకోడళ్ల అనుబంధం

అత్తాకోడళ్ళుగా కుంతీద్రౌపదుల ఆత్మీయత ఆదర్శప్రాయమైనది. ద్రౌపదికి కుంతి అత్తగారుమాత్రమే కాదు; తల్లి, తండ్రి, గురువు, దైవం, సమస్తమూను. పాండవులకు కుంతిమాట వేదవాక్కు అయినట్లే ద్రౌపదికీను.

కుంతికి ద్రౌపది సాక్షాత్తూ దేవత. వ్యాసునినోట స్వయంవరానికి సంబంధించిన వృత్తాంతం విన్నదగ్గరనుంచీ ద్రౌపది కారణజన్మురాలూ, దివ్యమైన ప్రభావంగలదీ అనేవిషయం ఆమె హృదయంలో ఉండిపోయింది. వ్యాసుని సంకల్పానికి తగినట్లుగా ద్రౌపదిని గూర్చి కుంతినోటినుంచి "మీరేవ్వరు నుపయోగింపుఁడ" నేమాటలు అప్రయత్నంగా వెలువడటం ఆశ్చర్యం. ద్రుపదునకు ద్రౌపది ఈశ్వరానుగ్రహప్రసాది కాగా, పాండవులకు వ్యాసానుగ్రహప్రసాది.

మైనపుముద్దవంటి బాలికను స్వయంవరంలో జయించి తీసుకొనివచ్చి, అర్జునుడు తల్లికి సమర్పించగా, ఆతల్లి సహనంతో, నేర్పుతో ఆమెను ఒక దివ్యశిల్పంగా మలిచింది. తనకుమారులలో ఎవరెవరి స్వభావం ఎలాంటిదో, ఎవరిని ఏవిధంగా సేవించాలో కుంతి సహజమైన తీరున కోడలికి తెలియజెప్పింది. కోడలు, తాను చెప్పిన దానినిబట్టి అల్లుకుపోయినతీరుకూ, ఉత్తమగుణాలకూ కుంతి ఎంతగానో తృప్తిపొందింది. నిండైన హృదయంతో కోడలిని ఆశీర్వదిస్తూ,

" ..........................

సుందరి నీపతులందుఁ బ్రీతిఁ

బతిభక్తి యొప్ప నపత్యంబుఁ బడయుము
గురువృద్ధ బాంధవాతురవిశిష్ట
జనుల నతిథిజనుల సతతంబుఁ బూజింపు
మన్నదానమున ధరామరేంద్ర
వరులఁదనుపు మఖిలవసుమతీప్రజకెల్లఁ
గరుణ గలుగుమమ్మ కమలనేత్ర!"[1]

అని మెలగవలసినతీరును కూడా బోధించింది.

అత్తగారి సందేశాన్ని కోడలు అక్షరాలా పాటించిందనటానికి అనేకదృష్టాంతాలున్నాయి. ధర్మజునిపంక్తిని నిత్యమూ ఎనిమిదివేల మంది బ్రాహ్మణులు, పదివేలమందియతులూ బంగారుతళియల్లో భుజించేవారట. అన్నపానాలవిషయంలో అనుదినమూ తగినవిధంగా సహాయంచేస్తూ ద్రౌపది వస్త్రభూషణాదులతో అతిథులందరినీ సంతోషింపజేసేదని ఆమె సత్యభామకు చెప్పినమాటలను బట్టి తెలుస్తోంది. ఇదంతా "బ్రాహ్మణులకుఁబ్రియము పాయక చేయంగఁగాన్పఁజూవె పుణ్యకర్మఫలము''[2] అనివిశ్వసించిన కుంతియొక్క శిక్షణప్రభావం అనుకోవచ్చు.

దుష్టభావనతో ఆశ్రమానికి వచ్చినసైంధవుణ్ణి గృహస్థ ధర్మం ప్రకారం ఆదరించి, భూవర! తగువిందవైతి కురువర్యులయింటికి నట్లుగావునం బరువడి నాసనక్రియయుఁ బాద్యముఁగైకొను మాద రంబుతో సరసకురంగమాంసము లంజల్పుము భోజనకృత్యమిత్తఱిన్''[3] అంటూ మర్యాదకు లోపంరానీయక బాంధవప్రీతిని ప్రదర్శించింది.

కుంతిఎంతో ఉచితజ్ఞురాలు. కొడుకులకోసం ఎన్నోప్రయా

---

1. ఆది - 8 - 4
2. ఆది - 6 - 283
3 అరణ్య - 6 - 192

సలుపడి వారిని జాగ్రత్తగా పైకి తీసుకొనివచ్చింది. కొడుకులజీవితంలో కోడలు ప్రవేశించగానే తనకుతానుగా గౌరవంగా ప్రక్కకుతప్పుకొంది. కొడుకులు అరణ్యవాసానికి పోతున్నప్పుడుకూడా ఆమె మమకారపా శాన్నిత్రెంచుకొని విదురునిఇంట ఉండిపోయింది. పదమూడేండ్లు కొడు కులకు దూరంగాఉండి 'బావకొడుకుచే నదయుమగుకూడు గడుచుట'కు కూడా ఆమె సిద్ధపడిందంటే కొడుకులకు ఏలోటూరాకుండా సమర్థించు కొనే కోడలు ఉందనే కదా!

ద్రౌపదిపట్ల కుంతికి ఎంతటిప్రేమో అంతటి గౌరవమూను. ఈ గౌరవభావంతోనే ఆమె కోడలికి పనులు చెప్పటానికి ఎంతో సందేహించేది. ద్రౌపది భీమునితో '...... నన్నుఁ బనిగొనునెడ బాండుని యగ్రమహిషి గొంకుచుఁ బనిగఱపెడు చందమున పనుచు లెఱుఁగవే"[1] అన్నమాటలనుబట్టి ఈవిషయం స్పష్టమవుతోంది. అయితే ద్రౌపది ఆ గౌరవాన్ని నిలుపుకొంటూనే, చెప్పనవసరం లేకుండానే అత్తగారికి కావలసినపనులు స్వయంగా చేస్తూ ఉండేది. '...... సతతంబు భోజనస్నానాదికములయం దిమ్ముగఁ బరిచర్య యొనచేసి సంప్రీతఁ జేయుదు...' నని ఆమెచెప్పుకొంది.[2] ఇంకా, ఆమె 'అత్తకు భక్తిగల్గి మదినాయమ సెప్పినమాడ్కి జీవికావృత్తము లావ హింతు...'[3] ననికూడా చాటుకొన్నది. భీమునితో సుదేష్ణ విరాటు లకు నలుగులూ, మైపూతలూ 'మీ తల్లికి భక్తిఁ బెట్టెడు విధంబునఁ బెట్టుదు బ్రహ్మఁదిట్టుదున్[4]' అని చెప్పడాన్నిబట్టి ఎంతో శ్రమకోర్చి ద్రౌపది భక్తితో అత్తగారిని సేవించేదని తెలుస్తోంది.

శ్రీకృష్ణుడు పాండవరాయబారిగా హస్తినకు వచ్చి కుంతిని సందర్శించినప్పుడు ఆమెకొడుకుల క్షేమమూ, 'అకట! ద్రౌపది సాధ్వి,

1. విరాట - 2 - 219
2. అరణ్య - 5 - 305
3. అరణ్య - 5 - 204
4. విరాట - 2 - 220

ఆసుఖంబెదానికిన్?' అని కోడలి క్షేమమూ అడిగింది. కోడలిపట్లగల త్మీయతను

"కొడుకులకంటె నయ్యెనుఁగుఁగోడలి కెక్కుడు గూర్తుఁ గోడలుం
గొడుకులు సేయుభక్తికట కోటిమడుంగులు భక్తినాకునె
ప్పుడుదగఁజేయు చుండు నది పుణ్యచరిత్ర కులాగ్రగణ్యక్రో
త్తడి సకలంబుఁజూడ సభదైన్యము బొందుటసూచిపొక్కితిన్."[1]

అంటూ ప్రకటించింది. కోడలు పడుతున్నకష్టాలు చూసి సహించడం కంటె దుఃఖంమరొకటిలేదని తల్లడిల్లింది. తాను కుమారులను వివేకంతో నడిపించినట్లుగానే కోడలుకూడా నడిపించగలదన్ని ఆమె విశ్వాసం. కనుకనే, "ద్రుపదాత్మజఁగార్యంబడుగు మనుము తగనందఱతోన్"[2] అని కృష్ణునిద్వారా కొడుకులకు కబురుపెట్టింది. పాండవులను కర్తవ్యోన్ముఖులను చేయడంలో ఈ అత్తకోడళ్ళమధ్య ఒక చక్కనిఅవగాహన, ఏకవాక్యత ఉన్నాయనిపిస్తుంది. ద్రౌపది సంధిప్రయత్నాన్ని నిరసిస్తూ కృష్ణునితో "పెంపేదండమకిట్టి తక్కువలురూపింపవఁగా నేలా ... వారు బ్రాహ్మణులె యేకీడైన సైరింపఁగన్"[3] అని ప్రశ్నించింది. ఈ సందర్భంలో సరిగ్గాకుంతికూడా కృష్ణునిద్వారా ఇలాంటిసందేశాన్నే కొడుకులకు పంపింది:

"వేఁడికొన్న కృపణులైకను
పోఁడిమి యది యేలరాజపుత్త్రులు దమమై
వాఁడిమి దప్పిన నిప్పులు
వేఁడిమి సెడినట్లు జనులు వినియులుకుదురే!"
"భుజబలమున జీవించుట
నిజధర్మము మెత్తబడుట నింద్యము మాద్రీ

1. ఉద్యోగ - 3 - 187
2. ఉద్యోగ - 3 - 200
3. ఉద్యోగ - 3 - 103

ప్రజలకుఁ జెప్పుము ద్రుపదా
త్మజఁ గార్యం బడుగుమనుము తగనందఱతోన్." 1

ఇంతేకాక, ద్రౌపది తనపరాభవాన్ని గుర్తుచేసి ప్రతీకారాన్ని కోరినట్లే కుంతికూడా ద్రౌపదికి జరిగినఅవమానాన్ని గుర్తుచేస్తూ,

"మఱచిరె కొలువున ద్రౌపదిఁ
బఱచిన బన్నంబు ధర్మపథము దొఱంగన్
వెఱచుట కప్పటికది దగుఁ
జెఱచినబో వెదకవలదె చిరతరకీర్తిన్"2

అనిపలికింది. బుద్ధిహీనుల్లా 'నిస్తేజపుఁగూటికియ్యకొని దీనతఁబొంద వద్ద'ని సందేశంపంపింది.

తల్లి తనఆదర్శాలకు, ఆశయాలకు ప్రతిరూపాలుగా బిడ్డలను తీర్చిదిద్ది వారుపెద్దవారవగానే వారిబాధ్యతను కోడలికి వదిలివేస్తుంది. కోడలు అత్తహృదయాన్ని అర్థంచేసుకో గలిగినసహృదయురాలైతే భర్తలచే ఆమె ఆదర్శాలకు, ఆశయాలకు కార్యరూపం ఇప్పిస్తుంది. ఇది లోకసహజమైన విషయం. కుంతీదేవి ఎన్నోకష్టాలుపడి, బిడ్డలను తీర్చిదిద్ది, వ్యాసకృష్ణుల ప్రణాళికకు సమర్పించింది. ద్రౌపదికూడా వయస్సులోచిన్నదయినా శ్రీకృష్ణుని నారాయణతత్త్వాన్ని, జగన్నాయకత్వాన్ని గ్రహించగలిగింది.[3] తననితాను కృష్ణసహోదరిగా చాటుకొని, భర్తలతోపాటు తనజీవితాన్నికూడా విశ్వప్రణాళికకు సమర్పించుకొంది. ఈకారణంవలనే కుంతి, ద్రౌపదులకు అంతటిఆత్మీయత సిద్ధించింది. లోకంలో ఏ అత్తా కోడలిని గూర్చి

"కొడుకులకంటె నయ్యనుఁగుఁగోడలి కెక్కుడు గూర్తుఁగోడలుం
గొడుకులుసేయుభక్తి కటకోటిమడుంగులు భక్తినాకునె

1. ఉద్యోగ - 3 - 197, 200
2. ఉద్యోగ - 4 - 18
3. అరణ్య - 1 - 133

ప్పుడుదగఁజేయుచుండు ...... " ననికానీ, ఏకోడలూ తన అత్తనుగూర్చి "మాయత్త పృథ్వీసమాన ... " అనికానీ చెప్పుకో వడంచాలా అరుదైనవిషయం. ఈఅత్తాకోడళ్లు అరమరికలు లేకుండా ఒకరినిగురించి ఒకరు అలాచాటుకున్నారంటే వారిద్దరూ ఎంతటి ధన్యులో కదా! వారిఅనుబంధం సర్వకాలాలవారికీ ఆదర్శప్రాయం.

'కుంతీమహాదేవి కోడంద్రప లోపల సగ్గలంబునఁ గొనియాడఁ బరిగితినని' ద్రౌపది గర్వంగా చాటుకొన్నదంటే ఆ కోడిరికం ఎంత మహత్తర మైనదో కదా!

సర్వసంగాలూ త్రెంచుకొని ఆశ్రమవాసానికి వెళ్లిపోతూ కూడా కుంతి ధర్మజునితో '... ... ద్రోవది నెప్పుడు దృఢసంభావన మన్నింపుమయ్య కౌరవముఖ్యా!'[1] అని చెప్పిందంటే కోడలి దివ్యత్వం పట్ల ఆమెకుగల పూజ్యభావం ఎంతటిదో గ్రహించవచ్చు.

ఈవిధంగా కుంతీద్రౌపదుల అత్తాకోడళ్ల సంబంధం సర్వ కాలాల జనులకూ ఆదర్శ ప్రాయమైనది.



---

1. ఆశ్రమవాస - 1 - 155

## 2. సపత్నుల సంబంధం

ఆశ్రమవాసపర్వంలో సంజయుడు పాండవుల భార్యలను ఋషులకు పరిచయంచేస్తూ, వరుసగా అందరినీ వర్ణించి, కుంతికోడళ్ల చక్కని 'వర్ణచిత్రాన్ని' ఇచ్చాడు.

"నీలోత్పల చ్ఛాయఁబోలు మై చాయయు
నవపద్మదళములఁ దెగడు మెఱుఁగు
గనుదోయి మధ్యాత్వమునకుఁ బ్రవేశించు
ప్రాయంబు నత్యభిరామమూర్తి
యలవడఁ గైకొన్న యతులితసంపద
చందంబు దోఁపించు చారుగౌర
వంబును గలుగు నివ్వనిత పాంచాలి యి
య్యింతి పార్శ్వమునఁ గట్టెఱ మేను

వనజసన్నిభముఖమునై యునునిమహిమ
యుజ్జ్వలాకృతి దాల్చినట్లున్నయీల
తాంగి నారాయణుని చెలియలు సుభద్ర
నరునివల్లభ సంయమి నాథులార!

"ఫీరికెలనఁ గనకగౌరమధూకాభ
తనువు లొప్పుచున్నవసితలురగ
పాండ్యసుతలు నరుని భార్యలులూపి చి
త్రాంగద యనఁ బరఁగు నాహ్వాయములు.

"ఇందీవరచ్ఛాయ కెనయైనచాయ నొ
ప్పినమేను గలుగునీభీత హారిణ
నయన భీముని భార్య నవ్య చంపకదామ
గౌరాంగియైన యిక్కమలవదన

సహదేవు గృహిణి మేచకనవకువలయ
వర్ణంబునకు సరివచ్చుకాంతిఁ
జెలువైనతనువునఁ బొలుచు నిన్నలినాయ
తాక్షి మాద్రిదేవి యగ్రతనయ
పత్ని ... ... ... ... ... ... ... "[1]

ఈపద్యాల్లో ద్రౌపది, సుభద్ర, ఉలూపి, చిత్రాంగద, భీముని భార్య, సహదేవుని భార్య, నకులునిభార్య వర్ణించబడ్డారు. ధర్మజునిభార్య చెప్పబడలేదు. సుభద్ర, ఉలూపి, చిత్రాంగదల పేర్లు తప్ప తక్కినవారి పేర్లుకూడా, ఇక్కడేకాదు, తెలుగు భారతంలో మరెక్కడా, కని పించవు. సంస్కృతభారతంలో ధర్మజుని భార్య దేవిక, భీమునిభార్య (హిడింబకాక) జలంధర, అర్జునునిభార్యలు చిత్రాంగద, ఉలూపి, సుభద్రలు, నకులునిభార్య కరేణుమతి, సహదేవునిభార్య విజయ. వీరందరూ ఏకభర్తృకలు. ద్రౌపది ఈ అందరికీ సపత్ని. ఇది చాలా చిత్రమైనస్థితి. ద్రౌపది సామర్థ్యమూ, దివ్యప్రభావమూ ఆమెకు సవతులలో విశేషమైన గౌరవాన్ని, అగ్రగణ్యతను తెచ్చిపెట్టాయి. ద్రౌపది తన నడవడికచే సవతులకు ఆదర్శప్రాయురాలయింది. ఆమె సవతులకు ఆమెపట్ల ఆరాధనాభావమేకాని మాత్సర్యం ఉండేందుకు అవకాశం లేదు. కుంతీ, పాండవులూ ద్రౌపదిపట్ల చూపే మాన్యతా, ద్రౌపది ఉదాత్త స్వభావమూ అందుకు కారణాలు. సత్యభామ చెప్పి నట్లుగా పాండవులకు అయిదుగురికీ ప్రత్యేకించి ఎవరిభార్యలు వారి కుండగా ఆ అయిదుగురూ ఆమెపట్ల అనురక్తులై ఉండటం అత్యద్భు తమైన విషయం. దీనిలోని రహస్యం ఏమిటో ద్రౌపదినుంచి సత్య భామ తెలుసుకోవాలనుకొంది. ద్రౌపది పతికి అనుంగులైన బంధువు లను, మిత్రులను ఆదరిస్తే పతులు ప్రసన్నులవుతారని బోధపడేలా 'పతులాత్మనొండొక్క పడతులఁ గలసిన నలుగ' నని చెప్పింది.[2]

---

1. ఆశ్రమవాస - 2 - 42, 43, 44 2. ఆరణ్య - 5 - 300

శివుడు పార్వతికి పతివ్రతాధర్మాలను తెలుపుతూ
"............ సవతిగల్గినను బోరి
తంబు లేకొక్కపై యున్కి తగవు సతికి

"సవతాలికిఁ బతివలచిన
నవుఁగాకని యత్సయిచ్చకనురూపముగాఁ
దివిరినడచుసతి దైవము
శివ యద్దతగునెల్ల జనముచే మ్రొక్కఁగొనన్"[1]

అని చెప్పినట్లుగా భీష్ముడు ధర్మజునికి చెప్పాడు. ఆ ప్రమాణంతో చూస్తే ద్రౌపది సాక్షాత్తూ దేవతే!

భర్తలు అన్యస్త్రీలను భార్యలుగా తెచ్చుకోవడంలో ద్రౌపదికి ఎలాంటిఅభ్యంతరం లేకపోయినా, భర్తలు మాత్రంద్రౌపదికి ఎక్కడ అప్రియం కలుగుతుందోనని జంకేవారు. తీర్థయాత్రలకని వెళ్ళినఅర్జునుడు సుభద్రను వెంటబెట్టుకొని వచ్చినప్పుడు సరాసరి ఆమెతో అంతఃపురానికి వెళ్ళడానికి వెనుకముందులాడాడు. ముందుగా సుభద్రను 'నీవుపోయి ద్రౌపదిఆశీస్సులుపొందు, ఆమెకు కష్టంతోచ కూడదు. ఆమెకు బాధకలిగి ఏమన్నాఅంటే అది నిజమవుతుంది, అని చెప్పిపంపించాడు. సుభద్ర గోపబాలికలతో వచ్చి కుంతికి నమస్కరించి ద్రౌపదిని సందర్శించింది. ఆమె సుభద్రను సంతోషంతో దీవించింది.

ద్రౌపది సవతులతో ఎంతోఆత్మీయంగా ఉండేదనడానికి ఉపపాండవులు సుభద్రలో తమతల్లిని చూసుకొంటూ పదమూడేళ్ళు గడపగలడం చక్కని నిదర్శనం. సుభద్రవారిని తనకొడుకు కంటేగార వంతో చూసేదనిసత్యభామ చెప్పడం గమనించదగ్గవిషయం.

అశ్వమేధయాగానికి తరలివస్తున్న బభ్రువాహనుడు చిత్రాంగద, ఉలూపులను తనతో వెంటబెట్టుకొనివచ్చాడు. వారిద్దరూ

1. అనుశాసనిక - 5 - 291, 292

ముందుగా గాంధారిని, కుంతిని సందర్శించి, తరువాత ద్రౌపదిని, సుభద్రను సందర్శించారు. వారు 'వినుతిపూజనముల నతులసమ్మోదము నావహించి యోగ్యపీఠములనునిచి' వారితో సల్లాపసౌఖ్యంపొందారు.[1] తదాదిగా చిత్రాంగదా, ఉలూపీ హస్తినలో ఉండిపోయారు. ద్రౌపది ఎంతో ఆదరంతో వారిని చేరదీసింది.

ద్రౌపదిముందు తక్కినఆమెసవతులు ఊరూ, పేరూ లేనివారయ్యారు. వారిప్రసక్తే కాదు, దుర్యోధనాదుల భార్యలప్రసక్తి కూడా భారతంలో అంతగా కనిపించదు. దీన్నిబట్టిసాధారణమైన గృహస్థజీవనాలు గడిపే వ్యక్తులకథ కాక మహాభారతం విశిష్టమైన, విలక్షణమైన ప్రయోజనాత్మకమైనజీవనాలుకలవ్యక్తులయొక్క కథ అని గ్రహించవలసిఉంది.



1. అశ్వమేధ - 3 - 170.

## 3. ద్రౌపది మాతృత్వం

స్త్రీ జన్మకు సార్థకత మాతృత్వం. మాతృత్వంవల్లనే స్త్రీ జీవితానికి పరిపూర్ణత సిద్ధిస్తుంది. ప్రజాతంతువును విచ్ఛిన్నం కాకుండా నిలపడం అనే క్రతువులో భాగస్వామిని అయి పతివలన సత్సంతానాన్ని పొంది పితృదేవతలను ఊర్ధ్వగతులు పొందేటట్లుగా చేయడంలో స్త్రీ జాతి నిర్వహిస్తున్న పాత్ర దివ్యం అనదగినది.

మహాభారతంలో ద్రౌపది పాండవులధర్మపత్నిగానే కాక ఉత్తమమాతృమూర్తిగాకూడా దర్శనమిస్తుంది. ఆమెమాతృత్వం ఆమె కడుపున పుట్టినబిడ్డలకే కాక సపత్నులబిడ్డలకూ, పాలితులకూ కూడా విస్తరించింది.

ద్రౌపదికి పాండవులయిదుగురివలనా క్రమంగా ప్రతివింధ్య, శ్రుతసోమ, శ్రుతకీర్తి, శతానీక, శ్రుతసేను లనే అయిదుగురుకుమారులుకలిగారు. వీరు ఎప్పుడెప్పుడు జన్మించారో వివరాలు తెలియవు గానీ కురుసభలో ద్రౌపదీపరాభవానికి ముందే జన్మించారనిమాత్రం చెప్పవచ్చు. వారు సాధారణంగానేజన్మించారో, సద్యోజాతులోకూడా తెలుసుకొనేవివరాలు మనకు ఆంధ్రభారతంలో దొరకవు, ఈ అయిదుగురిపేర్లూ, వీరిని ఉపపాండవులంటారనీ మాత్రమే అందులో చెప్పబడింది. ద్రౌపదికి వారిపట్లగలఅనురాగాన్ని నిరూపించడానికి భారతంలోని రెండుమూడు సన్నివేశాలు పనికివస్తాయి.

ధృతరాష్ట్రుడు, తనకొడుకులు ద్రౌపదిపట్ల ప్రవర్తించిన తీరుకు పరిహారంగా, వరాలను ఇవ్వబోయినప్పుడు ద్రౌపది 'కురువృద్ధజన లాలితుండై పెరిగినప్రతివింధ్యుని కురుకుమారులు దాసపుత్త్రుడనకుండా ధర్మతనయునిదాస్యంబు వలన పాయవలయు 'ననికోరింది. ఈకోరికలోని

ఆంతర్యం ఏదైనప్పటికీ తల్లిగా ఆమె తనబిడ్డలకు ఏవిధమైననిందా రాకూడదని తలచినతీరు ప్రశంసనీయమైనది.

పాండవులు అరణ్యవాసంలో ఉండగా ప్రతివింధ్యాదులు మేనమామ అయినధృష్టద్యుమ్నునితో ద్రుపదునిపురానికి పోయి అక్కడ కొంతకాలమూ, ద్వారకలో కొంతకాలమూ గడిపినట్లుగా తెలుస్తోంది. ''......చక్రధరుండు పాండవుల వీడ్కొని సుభద్రాభిమన్యులంగాంచన రథంబెక్కించుకొని తోడ్కొని ద్వారవతి కరిగె; ధృష్టద్యుమ్నుండును బ్రతివింధ్యాదులైన ద్రౌపదేయులం దోడ్కొని ద్రుపదుపురంబునకుం జనియె''[1] నని చెప్పబడింది.

కృష్ణుడు రెండవసారి సత్యభామతో కూడి పాండవులను దర్శింపవచ్చినప్పుడు సమీపానగల పాంచాలిని ఉద్దేశించి

''నీపుత్త్రులేవురు నీరజలోచన
యదుకుమారులు దారు ముదముతోడ
ననుపమస్నేహ సమాహృత హృదయులై
కరిహయారోహణ పరతఁదగిలి
యాడుచు వివిధశస్త్రాస్త్ర విశేషముల్
గఱచుచు నొండెల్ల మఱచి యున్న
వారు ప్రద్యుమ్నుండు వారికి దివ్యాస్త్ర
జాతంబు లెల్లను బ్రీతినొసఁగెఁ
దన్వియాసుభద్ర దనపుత్త్రికంటె నీ
తనయులందుఁగూర్మిఁదనరఁజేయు
నూఱడిల్లుమింక నుజ్జ్వలోన్నతులఁబెం
పారఁగాల మనతి దూరమయ్యె''[2]

---

1. అరణ్య - 1 - 199 వచనం.   2. ఆరణ్య - 4 - 163

అని చెప్పాడు. ద్రౌపదియొక్క మాతృహృదయాన్ని ఎరిగినవాడు కను కనే కృష్ణుడు ఆమె అడుగవలసినపని లేకుండానే బిడ్డలక్షేమాన్ని ఆమె కు తెలిపి ఆశ్వాసించాడు. ఈసందర్భంలోనే సత్యభామకూడా ద్రౌపదితో

"........................
....... .........వనితనీవు
సుతుల నత్యంతనిర్మల శౌర్య
యుతులఁగాంచిన సద్గుణాన్వితవు వగపు
వలదు చిత్తంబులో నీకు జలజనయన!

"ప్రతివింధ్యాదులైన నీపుత్త్రులేవురు నిప్పుడువచ్చి యదుపురంబున నున్నవారు, వారికినొక్కటం గొఱతలేదు. రుక్మిణియు, సుభద్రయుఁద క్కినవారలు నక్కుమారులయెడం దమకొడుకులకంటె గారవంబు సేయుదురు. వారిదెసనిశ్చింతవుగమ్ము"[1] అని చెప్పి ఊరడించింది. కృష్ణుడూ, సత్యభామా తల్లిగా ద్రౌపదిహృదయావేదనను చక్కగా అర్థం చేసుకొన్నాడు.

వివేకమూ, కర్తవ్యనిష్ఠా పుష్కలంగా కలిగినది అవడంతో ద్రౌపది బిడ్డలను ఎంతప్రాణాధికంగా ప్రేమించినా, సాధారణస్త్రీలవలె బిడ్డలకొరకని విలపిస్తూ ఉండిపోక, కర్తవ్యపరాయణురాలు కాగలిగింది. తనకొడుకులు 'రూపగుణవిక్రమాలలో రూఢికెక్కినవార'నీ, తాను 'నీతివిక్రమస్థిరులగుపుత్త్రులంబడసితిన'నీ సమయం వచ్చినప్పుడల్లా ఆమె గర్వంగా చాటుకునేది. వారునిజంగా కూడా అంతటివారే.

"ద్రౌపదేయులు నాసుభద్రాసుతుండు
నుక్కు తునియలుగారె ......"[2]

అని సంజయునిమన్నిక.

1. ఆరణ్య - 5 - 323, 324 2. ఉద్యోగ - 2 - 175

"... ద్రౌపదీయులు మహారథులేవురు ... ..." అని భీష్ముని పరిగణన.[1]

ద్రౌపది మాతృత్వాన్ని 'సహృదయత'తో అర్థంచేసుకొన్నవారిలో కుంతీదేవి ఒకతె. ఆమె ద్రౌపదికి కుమారుల పట్లగల వాత్సల్యాన్నీ, శ్రద్ధనూ గమనించింది కనుకనే అరణ్యవాసానికి పంపేటప్పుడు 'ఎంతయున్ దీనతదోఁప' సహదేవుణ్ణి ద్రౌపదికి ఇల్లడపెట్టి, 'అమ్మా! నినునమ్మి చాల విషమంబగు నవ్వనవాస మీతఁడుం బూఁనగ నియ్యకొంటి' నని ఏడుస్తూ చెప్పింది.[2] కుంతికి సహదేవుని పట్ల వాత్సల్యం మెండు. గారాబమైనపుత్త్రుని విడిచి ఉండటానికి ఆమె మాతృహృదయం కొట్టుకుంది. ద్రౌపది మాతృత్వాన్ని గమనించిన ఆమెకు తనలా సహదేవుణ్ణి ఆమె చూసుకోగలదనే విశ్వాసం చిక్కింది. కనుకనే,

" కడుఁ బసిబిడ్డ వీఁడొకటి గాదవునా నెఱుఁగండు ముందరే
య్యెడ నొక పాటుఁగెడద యెంతయుఁ గోమల మెవ్వడైన నేఁ
గుడువఁగఁ బిల్తుఁగాని తనకుం గలయాఁకటె ప్రొద్దెఱుంగఁడీ
కొడుకిటు పోకకున్ మనము గుందెడు నిన్‌గని యాఱడిల్లెడున్.

"ఎప్పుడెయ్యెడ నేమిట నెట్టు లరయ
వలసె నమ్మాయి నారయు మలసి డస్సి
నొచ్చి యైనను నేమఱ కిచ్చఁ దలఁచి
తడమి నాచేత దీవన వడయు మమ్మ!"[3]

అని అప్పగించింది.

సహదేవుడు చంటివాడేంకాడు. ప్రాజ్ఞుడే. ద్రౌపదికి అతడు

1. ఉద్యోగ - 4 - 260
2. విరాట - 2 - 211
3. విరాట - 2 - 213, 214

సాక్షాత్తూ భర్త. అయినా తల్లిప్రాణం తల్లిది! భర్తగా ద్రౌపది సహదేవుణ్ణి ఎంతశ్రద్ధగానైనా చూసుకొంటూ ఉండవచ్చు. కానీ తల్లి తీరే వేరు. తాను సహదేవుణ్ణి ఎంతశ్రద్ధగా కనిపెట్టిఉండేదో అంతశ్రద్ధగానూ ద్రౌపదికూడా కనిపెట్టిఉండాలని కుంతి ఆకాంక్ష. ద్రౌపది అత్తగారి ఆదేశాన్ని అక్షరాలా పాటించింది.[1]

దుర్మార్గుడైన అశ్వత్థామ చేతిలో ఉపపాండవులు దుర్మరణంపాలయినప్పుడు ద్రౌపది ఉపప్లావ్యంలో ఉంది. ఆమెకు ఈవార్త తెలిస్తే తట్టుకోలేదని ధర్మజుడు ఎంతో బాధపడ్డాడు.

"మున్నిట్టి తెఱఁగుశోకం
బెన్నఁడుఁదాననుభవించి యెఱుఁగ దకటనేఁ
డన్నెలఁత యలతపెట్టున
నెన్నియవస్థలకు నోర్చి యెట్లయ్యెడినో."[2]

అని వగలుపొగిలి ఆమెను తీసుకొనిరమ్మని నకులుని పంపాడు. ఇక్కడ ధర్మజునికి బిడ్డలు మరణించారన్న ఒకబాధ, ద్రౌపది ఆవిషయాన్ని విని తట్టుకోలేదని మరొకబాధ. ఆమెకు బిడ్డలపైగలవాత్సల్యంఅంతటిది!

నకులునివల్ల సుత, సోదర మరణప్రకారం తెలుసుకొని,

"అలఁతగదరి నొరెండఁగఁ
బలవించుచుఁదోడుతోడ బాష్పజలంబ
గ్గలమై క్రమ్మఁగ సొలయుచుఁ
దెలియుచు ... నడలు దీపింపంగన్"[3]

---

1. "నేనును వనవాసకాలంబున నానేర్చు విధంబున మీకు నెల్లను గారామైన తమ్ముని నమ్మెయిం బరికించి కొనివచ్చితి ... '' నని ద్రౌపది - విరాట - 2 - 215

2. సౌప్తిక - 2 - 19 3. సౌప్తిక - 2 - 25

నకులున్ని వెంట వచ్చింది. ధర్మరాజున్ని చూడగానే ఆమెశోకం అగ్గల మైంది. ఆర్తితో ఆక్రందించింది. అప్పుడామె మొహం మంచుకప్పిన తమ్మిలాఉంది. కొడుకులను పలవిస్తూ, పాదాలు తొట్రుపడుతూ ఉండగా దీనగతితో కొన్నిఅడుగులువచ్చి, కూలబడిపోయింది. భీముడు ఆమెను లేవనెత్తి ధర్మజుని సమీపానికి తెచ్చాడు. ఆమె ఎలాగో నిలబడి, ధర్మజునిముఖంలోకి చూస్తూ, రాలుపడినగొంతుతో దైవమా నుషాలు సుసంగతాలయి ఉండటం, సామ్రాజ్యంచేకూరటం చెప్పి, ఇలావిలపించింది:

"కలిమికి నొప్పుఁగాఁగ బలగంబయి నీకడనాతనూభవుల్
మెలఁగఁగఁజూడఁగాఁనన యమేయ భుజాబలశాలి విక్రమో
జ్వలుఁడు సుభద్రపట్టియును వమ్మయిపోయెననూన భోగముల్
గలిగిన యేనియున్ మఱవగావశమే మనకాకుమారులన్"[1]

నిజమే, ఎన్నిసంపదలుండి ఏంలాభం? ప్రాణాధికులైనకొడుకులు లేనప్పుడు?

కొంతసేపటికి ఆమెకు అశ్వత్థామఘాతుకంపట్ల విపరీతమైన కోపంవచ్చింది. 'గాఢనిద్రలో మునిగినసమయాన నాకుమారులను పాపారంభుడైన గురుపుత్త్రుడు అక్రమంగా, క్రూరంగా చంపాడు. అది ఆరనిఅగ్నిలా నామనస్సును మండిస్తోంది. కఠినుడైనఅశ్వత్థామను రూపుమాపితేకాని ఈమంట చల్లారదు. ఓరాజా! వెంటనే వాయుపుత్త్రునిచే అతణ్ణి చంపించకపోతే ప్రాయోపవేశం చేస్తాను' అన్నది. ఆఖరికి ప్రాణాలకు బదులుగా ప్రాణంతో సమానమైన అతని శిరోరత్నాన్ని స్వీకరించి ఆమె శాంతించింది. ఇదేఘట్టం భాగవతంలో కూడా వర్ణించబడింది. మహోదారమైన ద్రౌపదిమాతృత్వం అక్కడ మరింతచక్కగా ఆవిష్కరించబడింది. తనకు కలిగినపుత్త్రశోకంవంటిశోకమే ద్రోణుని

1. సౌప్తిక - 2 - 29.

భార్యకు కలుగుతుందని తలచి, ద్రౌపది భర్తలను బ్రతిమాలి అశ్వత్థామను విడిపించినట్లుగా భాగవతంలో చెప్పబడటం విశేషం.[1]

ద్రౌపదికి అభిమన్యకుమారునిపై ఎంతో వాత్సల్యం ఉండేది. యుద్ధంలో అతడు మరణించినప్పుడు ద్రౌపది ఎంతగానో దుఃఖించింది. అర్జునుడు అభిమన్యుని మరణవార్త విని, "... అడలునఁదల్లడిల్లెడు ద్రౌపదివంత మాన్పంగ నెవ్వరికి వశమె?"[2] అంటూ బాధపడ్డాడు.

ప్రజ అంటే జనులని, బిడ్డలనికూడాఅర్థం. పాలకుడైనవాడు జనులను సొంతబిడ్డల్లా చూసుకోవాలి. అప్పుడు ప్రజాశబ్దానికున్న రెండర్థాలూ బిడ్డలనే అర్థంపట్ల సార్థకమవుతాయి. ధర్మరాజుని పాలనలో ప్రజలు రాజును, రాణిని తల్లిదండ్రుల్లా భావించేవారు. ముఖ్యంగా ద్రౌపది ప్రజలపట్ల ప్రదర్శించే ప్రత్యేకమైన అభిమానానికి వారు ఆమెను ఎంతగానో భక్తిభావంతో సేవించేవారు. అజ్ఞాతవాసంలో భీమునితో సంభాషిస్తూ ద్రౌపది

"........................
మదిఁదల్లిదండ్రుల మాఱుగాఁగొని జను
లనిశంబు భక్తిసేయంగనెగడి
................"[3] తినన్ని చెప్పుకోవడంగమనార్హం.

ద్రౌపదిమాతృత్వం ఇంతటిఉదారమూ, ఉన్నతమూ, విశిష్టమూ అయినది కనుక ఆమె 'విశ్వకుటుంబిని' అని చెప్పదగింది.

---

1. ఆంధ్రమహాభాగవతం - 1 - 165 . 2. ద్రోణ - 2 - 252
3. విరాట - 2 - 216

## 4. జీవిత సందేశం

"ధర్మశ్చార్థశ్చ కామశ్చ పరస్పర విరోధినః।
ఏషాం నిత్యవిరుద్ధానాం కథమేకత్ర సంగమః॥"

అని యక్షుడడిగిన ప్రశ్నకు ధర్మరాజు,

"యదా ధర్మశ్చ భార్యాచ పరస్పర వశానుగౌ
తదా ధర్మార్థకామానాం త్రయాణామపి సంగమః॥"

అని సమాధానం చెప్పాడు.[1]

ధర్మార్థకామాలు మూడూ ఒకేచోట సమకూడటం ఎలా సాధ్యం? అంటే, భార్య సహధర్మచారిణి అయితే చాలు, ఆమూడూ ఒకదగ్గర సమకూడినట్లేనట. ద్రౌపది జీవితంలో ప్రధానంగా కనిపించే లక్షణం ఇదే. ఆమెను పాండవులు చేపట్టడమే. లోకరీతికంటే భిన్నంగా ధర్మార్థమై జరిగింది. ఆమె పాండవుల జీవితాల్లోకి అడుగుపెట్టడం, కృష్ణుడు పాండవులను తనజగద్వ్యూహంలోనికి ప్రత్యక్షంగా స్వీకరించడం ఒకేసారి జరిగాయి. రూపంలోను, పేరులోనేకాక, ధర్మాచరణం విషయంలోకూడా ఆమె శ్రీకృష్ణునికి ప్రతిరూపమై, పాండవులను సేవించింది. ఆమెద్వారా ఆయా సన్నివేశాల్లో వ్యక్తమైన విభూతులన్నీ ఆమె దివ్యత్వనిరూపకాలే. భర్తలు ఏ పరమేశ్వరుణ్ణి శరణాగతిపొంది, ఏ పరమధర్మానికి అంకితమయ్యారో, ఆమెకూడా అదే దైవానికీ, అదేధర్మానికీ తననితాను సమర్పించుకోగలిగింది గనుకనే జీవితంలో అంతటివైభవాన్నీ, అన్ని పరాభవాలనూ, దుఃఖాన్నీ సమదృష్టితో భరించగలిగింది.

స్వధర్మాచరణపట్ల ఆమె ప్రదర్శించినస్థిరత్వమూ, భర్తృసేవాపరాయణత్వమూ, ధర్మంపట్లా, దైవంపట్లా ఆమెకుగల నిత్యాను

1. సంస్కృతభారతం - వనపర్వం - 313 అ. శ్లో. 101, 102.

రక్తి, ఎంతటిమహాపదల్లోనూ వివేకాన్ని కోల్పోకుండా ఉండగలగడం, మొదలైనవిషయాల్లో ఆమె లోకానికి ఆదర్శప్రాయురాలు.

ద్రౌపది శ్రీకృష్ణునివంటి అవతారమూర్తి. మానవభూమి నికాదు. కనుక లోకపురీతులూ, నీతులూ అన్వయిస్తూ ఆమె పాత్రను అర్థం చేసుకోవడానికి ప్రయత్నించకూడదు. అలా ప్రయత్నించడంవల్ల అంతగా ఉపయోగం ఉండకపోవడమేకాక, వ్యాసదృష్టికి భిన్నంగా భారతాన్ని అర్థంచేసుకొన్నవారమవుతాం.

"ఊర్ధ్వబాహుర్విరామ్యేష నచకశ్చిచ్ఛృణోతిమే।
ధర్మాదర్థశ్చకామశ్చ సకిమర్థం నసేవ్యతే॥"

అనిఘోషిస్తూగదా వ్యాసభగవానుడు భారతేతిహాసాన్ని మనకు అందించాడు! కనుక, భక్తియుక్తులతో భారతాన్ని అర్థంచేసుకోవటా నికి ప్రయత్నించాలి. అప్పుడు మాత్రమే భారతపాత్రలప్రయో జనమూ, భారతకథాపరమార్థమూ బోధపడతాయి.

## 5. ఉపసంహారం

మహాభారతాన్ని ఒకమహేతిహాసంగా, కవిత్రయంవారి ఆంధ్రమహా భారతాన్ని లోకహితార్థమై అవతరించిన దార్శనికపరివర్తనంగా పరిగ ణిస్తూ, మహాభారతకథలో ద్రౌపదీదేవి పాత్రనుగూర్చిన సమీక్షచే యబడింది ఇప్పటివరకూ. ధర్మమూ, దైవమూ, శరణాగతిపొందటమూ అనే అంశాల (concepts) ప్రమేయం లేకుండా భారతకథను పరిశీ లిస్తే అది ప్రయోజనశూన్యమైన శుష్కకావ్యంగా కనబడుతుంది. కనుక 'నేపథ్యం'లో ఈవిషయాలు చర్చించబడ్డాయి. భారతంపట్ల భక్తికుదరాలంటే ఏతత్కర్త వ్యాసభగవానుని దివ్యత్వమూ, ఆయన విశిష్ట వ్యక్తిత్వమూ కొంతైనా అర్థంకావాలి. అలా అర్థంచేసుకొనే ప్రయత్నంకూడా ప్రథమాధ్యాయంలో కించిత్తయినా సాగింది.

ద్రౌపదీసందర్శనానికి ముందు 'ప్రవేశా'న్తర్గత అవసరంకనుక సంస్కృతాంధ్రభారతాల సంబంధమూ, ఏదృష్టితో పరిశీలనజరుగనుందో ఆదృక్పథమూ, ప్రణాళికవివరాలూ, వివేచించబడే విషయప్రాధాన్యమూ రెండవ అధ్యాయంలో వివరించబడ్డాయి. 'సందర్శనం' లో కథాపరంగా ద్రౌపదీదేవిపాత్రప్రదర్శించబడింది. ఈప్రదర్శన కేవల కథాకథనంగా కాక వ్యాసరచనాప్రణాళికకు అనుగుణంగా విశ్లేషణప్రాయంగా సాగింది. ఆతరువాత ద్రౌపదీదేవి దివ్యత్వమూ, సౌందర్యమూ, శక్తిసామర్థ్యాలూ - ప్రజ్ఞాపాటవం, పాతివ్రత్యమహిమా, అనన్యభక్తీ సంభావించబడినాయి. 'స్వదేశప్రాయంగా ద్రౌపది ప్రవర్తనలోని విశిష్టత ప్రత్యేకించి అత్తాకోడళ్ళఅనుబంధం, సపత్నులసంబంధం, మాతృత్వం అనేశీర్షికలుగా చూపబడింది. ఏలోకహితైషను భారతకవులు తమరచనలో ఉద్దేశించారో అదేనిష్ఠను ఈరచనలోనూ వ్యాసకర్త ఉద్దేశించి, బహుజనాదరణపాత్రమైన వ్యావహారికభాషలో దీనిని రచించడం జరిగింది.

'దుర్గమార్థజలగౌరవ భారత భారతీ సముద్రముఁ దఱియంగ నీఁదను విధాతృనకైనను నేరఁబోలునే' అని సత్ప్రతిభాభియోగ్యుడైన నన్నయ మహాకవే చెప్పాడంటే సామాన్యులవిషయం చెప్పేదేముంది? ఇంతకు పూర్వం ఎందరో మహానుభావులైన పండితులు కేవలం భారతపరమార్థాన్ని యథామతి లోకానికి అందించడానికై ప్రయత్నించి అనేక గ్రంథాలు వెలువరించారు. వారందరికీ నమస్కరిస్తూ, వారి మార్గంలో, తోచిన రీతిని, భారతగాథలోని ద్రౌపదిపాత్రను గురించి విశ్లేషించడం జరిగిందిప్పుడు. దీనిలోని ప్రతిపాదనలు తిరుగులేనివనీ, ఈపరిశోధన సమగ్రమనీ ఈవ్యాసకర్త ఎంతమాత్రమూ భావించడంలేదు. ఇతిహాసదృక్పథంతో మహాభారత విశ్లేషణమనేది విశ్వవిద్యాలయాల ద్వారా ఇతోధికంగాజరుగవలసి ఉందని గుర్తించి, ఏతన్ముఖంగా సాగించిన తొలిదశకు చెందే ప్రయత్నం మాత్రమే ఇది.

ఈ మాత్రపు దర్శనానికైనా అనుగ్రహించిన ద్రౌపదీమహాదేవికి ఈవ్యాసకర్త నిరంతరం హృదయాంజలులు అర్పిస్తూనే ఉంటాడు.

-: స్వస్తి :-

# ఆంధ్రమహాభారతమూ - ద్రౌపది

—ఒక ఐతిహాసిక విశ్లేషణ

## అనుబంధం

1. జనమేజయుని దానశాసనాలు

2. ద్రౌపది పూర్వజన్మ వృత్తాంతమూ- ఒకసమన్వయమూ

## 1. జనమేజయ "దానశాసనం" (సర్పయాగంలోది) :-

# 1. అనుబంధం

1. (B) ... ... ఆవిష్కృతం విష్ణోర్వా రాహం క్షో ... ... ... ... ... ... ... ... ... ... ... ... భువనం విప్రః ॥

స్వస్తి సమస్త భువనాశ్రయ శ్రీ పృథ్వీవల్లభ మహారాజాధిరాజ పరమేశ్వర పరమభట్టారక, హస్తినాపురధీశ్వర, ఆరోహక భగదత్తరిపురాయ కాన్తాదత్త వైరి వైధవ్య పాండవ కులకమల మార్తాండ ఏకాంగవీర రణరంగ ధీర అశ్వపతిరాయ దిశాపట్ట, గజపతిరాయ సంహారక నరపతిరాయ మస్తక తల ప్రహారి హయారూఢ ప్రౌఢరేఖా రేవన్త సామంత, మృగచమూ కొంకణ చతుర్దిశా భయంకర, నిత్యకర పరాంగనాపుత్ర సువర్ణ వరాహ లాంచన ధ్వజసమస్త రాజావళివిరాజిత సమాలంకృత శ్రీసోమవంశోద్భవ శ్రీపరీక్షిచ్చక్రవర్తీ, తస్యపుత్ర జనమేజయ చక్రవర్తీ, హస్తినాపురే సుఖసంకథా వినోదేన రాజ్యం కరోతి. దక్షిణ దిశావరే దిగ్విజయయాత్రేయం విజయంకరోమి. తుంగభద్రా హరిద్రాసంగమే శ్రీహరిహర దేవసన్నిధౌ కటకం ఉత్కళితం, చైత్రమాసే కృష్ణ ... కరణ ఉత్తరాయణ సం ... ... ... II (a) వ్యతీపాత నిమిత్తే సూర్యపర్వణి అర్ధగ్రాస గ్రహీతసమయే సర్పయాగం కరోమి బనవాసీ సన్నిధ్యాహ ప్రమధ్యే (?) ఖమ్పణ సాంతలిగే సాహస్రమధ్యే (?) గౌతమి. గ్రామాత్ బ్రాహ్మణ కన్నడశాఖేయగౌతమి గోత్రజ గోవింద పట్టవర్ధనం, కన్నడ శాఖీయ వశిష్ట గోత్రజ వాయన్నపట్ట వర్ధనార్యం. కన్నడ శాఖీయ భారద్వాజగోత్రజ కేశవయాజ్వ దీక్షితం. కన్నడ శాఖేయ శ్రీవత్స గోత్రజ నారణదీక్షితం చతుర్ముఖ నానాగోత్రేభ్యో ద్వాత్రింశత సహస్ర బ్రాహ్మణ సర్పయాగ పూర్ణాహుతి తదఙ్గ సమియే మన్త్రాంగ ప్రణామం కరోతి. తస్యగ్రామస్య ధారా పూర్వకం దత్తతస్య గ్రామస్య సీమాన్తరాణి కథం. ...

(rest containing details of boundaries and usual final verses)

## 2. జనమేజయ దిగ్విజయ శాసనం :-

I (b) శ్రీ శఙ్కరనేగతి శుభమస్తు...

జయతి ఆవిష్కృతం విష్ణోర్వారాహం...

క్షోభితార్ణవం ... ...
దక్షిణోన్నత దంష్ట్రాగ్రే విశ్రాన్త భువనం వపుః॥

స్వస్తి సమస్త భువనాశ్రయ శ్రీపృథ్వీధరవల్లభ మహారాధిరాజ రాజపరమేశ్వర పరమ భట్టారక హస్తినాపుర వరాధీశ్వర ఆరోహక భగదత్త రిపురాయకాన్తా దత్తవైరి వైధవ్య పాండవకులక (మల) మార్తాండ కదన ప్రచణ్డ ఏకాఙ్గ వీర రణరఙ్గ ధీర అశ్వపతిరాయ దిశాపట్ట జగపతిరాయ సంహరక నరపతిరాయ మస్తక తలప్రహారి సామన్త మృగ చామూర కొంకణ చాతుర్దిశా భయఙ్కర చచ్ఛపుట కాచ్ఛపుట ఈశ్వర ముఖకమల వివిర్గత బ్రహ్మవీణాది భరతశాస్త్ర ప్రసిద్ధ అనేకశాస్త్ర ప్రవీణ కోరణ్డ వ్యాళి నాగార్జునాది మన్త్రిత్రయ శుద్ధప్రసిద్ధ సముదాయ నమిత పాదారవిన్ద అరిరాయకుల విలయకాలానల నీతి ఆకార వరాఙ్గనా పుత్ర సువర్ణవరాహలాంఛన ధ్వజ। శ్రీసోమవంశోద్భవ పరీక్షిత చక్రవర్తీ హస్తినాపురే సుఖసఙ్గథా వినోదేన దక్షిణదిశా వలయా దిగ్విజయ యాత్రేయం తుంగభద్రా హరిద్రా సంగమే శ్రీ హరిహర దేవ సన్నిధౌ కటికమ్, ఉత్కలితం చైత్రమాసే కృష్ణపక్ష సోమదినే భరణీ మహానక్షత్రే సన్క్రాన్తి వ్యతీపాత నిమిత్త సమయే సర్పయాగం కరోమి.

జయతి అవిష్కృతం విష్ణోర్వారాహం క్షోభితీర్ణ దందక్షిణోన్నత దంష్ట్రాగ్ర విశ్రాన్త భువనం వపుః

స్వస్తిసమస్త భువనాశ్రయ శ్రీపృథ్వీవల్లభ మహారాజాధిరాజ పరమేశ్వర పరమభట్టారక హస్తినాపుర వరాధీశ్వర ఆరోహ భగదత్త రిపురాయ కాంత దత్త వైధవ్య పాండవకుల కమలమార్తాండ ఏకాంగ వీర రణరంగ ధీర అశ్వపతిరాయ దిశాపట్ట గజపతిరాయ సంహరక నరపతిరాయ మస్తక తల ప్రహారి సామంత మృగ చామూర కొంకణ చతుర్దిశాభయంకర చచ్ఛపుట చాచపుట ఈశ్వర ముఖకమల శుద్ధసారంగ బ్రహ్మవీణా (వా) ది భరతశాస్త్ర ప్రసిద్ధానేక ప్రవీణ కోరంటక, వ్యాళి, నాగార్జునాది మంత్రశాస్త్ర ప్రసిద్ధ సముదయ నమిత పాదారవింద అరిరాయకుల విలయ కాలానల నీత్యాకర వరాంగనా పుత్ర సువర్ణ వ హలాంఛన ధ్వజ సమస్త రాజ్యావళీ విరాజిత సమాలకృత శ్రీసోమవంశోద్భవ శ్రీ పరీ క్షిచ్చక్రవర్తీ తత్పుత్ర జనమేజయ చక్రవర్తి హస్తినాపురీ సుఖసత్కథా వినోదేన దక్షిణాదిశోపక్రమమ్ రాజ్యం దిగ్విజయం యాతి విజయంకరోమి. తుంగభద్రాహరిద్రా సంగమే శ్రీ హరి హరదేవ సన్నిధౌ కటకం, ఉత్కలితం చైత్రమాస కృష్ణపక్షే సోమదినే తృతీయా

యాం విశాఖనక్షత్రే సంక్రాంతీ వ్యతీపాత తన్నిపాత్రే సర్వయాగం కరోమి.
శ్రీ కురువంశావతరస శ్రీ జనమేజయ భూపాలానాం

3. " జనమేజయ దానశాసన " పత్రిమ్ :-

శ్లో॥ పాంతువో జలదశ్యామాః శార్జజ్యా ఘాతకర్కశాః ।
త్రైలోక్యమండట స్తమ్భాశ్చత్వారో హరిదాహవః ॥

స్వస్తిశ్రీ జయాభ్యుదయే యుధిష్ఠిర శకేప్లవంగాఖ్యే (89) ఏకోనన వతి (89) వత్సరే నహస్యమాసి అమావాస్యాయాం సోమవాసరే శ్రీమన్మహా రాజాధిరాజ పరమేశ్వరో వై యగ్రగణీవై యాఘ్ర (?) పాతగోత్రజః శ్రీజనమే జయాభూపః। కిష్కింథా నగర్యాం సింహాసనస్థః సకల వర్ణాశ్రమ ధర్మ ప్రతిపాలక పశ్చిమదేశస్థ సీతాపుర వృకోదరక్షేత్రే తత్రత్య మునిబృంద మఠస్య గరుడవాహనతీర్థ శ్రీమ చ్ఛిష్య కైకయవాద్యై రారాధిత సీతారామస్య పూజార్థం కృత భూదాన శాసన మన్మ ప్రపితామహ యుధిష్ఠిరాధిష్టిత మునిబృంద క్షేత్రస్య చతుఃసీమా వరిమితి క్రమః :-

పూర్వభాగే ... ... ఉత్తరవాహిన్యాస్తుంగ భద్రయాః పశ్చిమే దక్షిణ భాగే అగస్త్యాశ్రమ సంగమా దుత్తరే। పశ్చిమే పాషాణ నద్యాః పూర్వే। ఉత్తర భాగే భిన్ననద్యా దక్షిణే। యే (ఏ) తన్మధ్యస్థిత ముని బృందక్షేత్ర భవచ్ఛిష్య పారంపరా చంద్రార్క పర్యంతం విధి విక్షేపజల పాషాణా క్షిణ్యా (?) గామిసిద్ధ సాధ్యతేజః స్వామ్య మహితం స్వబుధ్యా సుకూల్యే నాస్మతా పితౄణాం విష్ణులోక ప్రాప్త్యర్థం హరిహర సన్నిధౌ వుపరాగసమయె సహిరణ్యేన తుంగ భద్రాజలధారా పూర్వకం క్షేత్రం యతిహస్తేదత్తో (త్తవాన్, అ ?) స్మృహం ఏతద్ధర్మ సాధనస్య సాక్షిణః.

శ్లో॥ ఆదిత్యచంద్రా ననిలానచతా ద్యౌర్భూమిరాపోహృదయం మనశ్చ
అహశ్చరాత్రిశ్చ ఉభేచసంధ్యే ధర్మశ్చ జానాతి నరస్య వృత్తమ్. 2

శ్లో॥ దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం
దానాత్స్వర్గ మవాప్నోతి పాలనాదచ్యుతం పదమ్. 3

శ్లో॥ స్వదత్తాద్ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనే
పరదత్తా పహారేణ స్వదత్తం నిష్ఫలంభవేత్ 4

శ్లో॥ మద్దత్తా పుత్రికాజ్ఞేయా పితృదత్తా సహోదరీ
అన్యదత్తాతు జననీదత్త భూమింపపరిత్యజేత్. 5

శ్లో॥ అన్యైస్తు చర్థితం చద్వే శ్వాభిశ్చ ఛర్థితంనతు
తతఃకష్టాతతో నీచః క్వయందత్తాపహారకః 6

శ్లో॥ స్వదత్తాం పరదత్తాం వా బ్రహ్మవృత్తింహరేత యః
షష్టివర్ష సహస్రాణి విష్టాయాం జాయతే క్రిమిః 7



## ద్రౌపదిపూర్వజన్మవృత్తాంతమూ - ఒకసమన్వయమూ

ఆదిపర్వంలోను, స్వర్గారోహణ పర్వంలోను "శ్రీమూర్తియైయాజ్ఞసేనివుట్టె" నన్నీ,[1] "... ఈభామ మహాలక్ష్మి ద్రౌపది యనఁగ ద్రుపదునికిఁగూఁతురై యయోనిప్రభవంబగు మానుషరూపంబు మహితలీలముగఁదాల్చి భవదనుభూతిసెల్లించె గారీశ్వరునాజ్ఞ ..."[2] అనీ చెప్పబడింది. దీనినిబట్టి స్వర్గలక్ష్మి ద్రౌపదిగా అవతరించినట్లుగా గ్రహించవలసి వస్తోంది.

సంస్కృతభారతంలో కూడా

"స్వర్గశ్రీః పాండవార్థాయ సముత్పన్నా మహామఖే,
సేహ తప్త్వా తపోఘోరం దుహితృత్వం తవాగతా।"[3]

అని స్వర్గలక్ష్మి పాండవులనిమిత్తమై అయోనిజఅయి, ద్రౌపదిగా జన్మించినట్లుగా చెప్పబడింది. "ద్రౌపది జన్మవృత్తాంతం" అనేప్రకరణంలో ఈవిషయమై కొంతసమీక్ష జరిగింది.

మౌద్గల్యమహర్షి భార్య నాలాయని తరువాతిజన్మలో కాశీరాజుకుమార్తెగా జన్మించింది. పతినికోరి, శివునిగూర్చి తపస్సుచేసింది. శివుడు ఆమెకు వచ్చేజన్మలో అయిదుగురు పతులవుతారని వరమిచ్చాడు. ఆమె ఆ తరువాత ద్రౌపదిగా జన్మించింది. — ఇది ద్రౌపది పూర్వజన్మకు సంబంధించినవృత్తాంతం. స్వర్గలక్ష్మి పాండవార్థం ద్రౌపదిగా అవతరించినవిధం భారతంలో ప్రత్యేకించి ఎక్కడా వర్ణించబడలేదు. కాశీరాజకన్యను, పశుపతి, స్వర్గానికిపోయి ఇంద్రుని వెంటతీసుకు రమ్మని చెప్పగా, ఆమె స్వర్గానికి వెళ్ళి గంగాతీరాన ఇంద్రుణ్ణికై ప్రతీక్షించి, ఆ తర్వాత అతనిని వెంటగొనివచ్చినట్లుగా మాత్రం

---

1. ఆది - 3 - 84 2 స్వర్గా - 58 - (ఇంద్రుడు ధర్మజునితో)
3. సంస్కృత భారతం - ఆది - అ97

చెప్పబడింది.

"ద్రౌపదీ నిందా నిరాకరణము" లో బ్రహ్మశ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ఛాయాసీత స్వర్గలక్ష్మి అయిందనీ, ఆ స్వర్గలక్ష్మి కాశీరాజకన్యగా జన్మించి, తపస్సుచేసి, ఈశ్వరవరప్రభావంతో ద్రౌపదిగాజన్మించిందనీ వివరించారు. ఇందుకువారు లక్ష్మీదేవి వేదవతిగా జన్మించి, తపస్సుచేసి, రావణసంహారార్థం సీతామాతగా జన్మించడాన్ని దృష్టాంతంగా చూపారు.

"కృతయుగే వేదవతీ కుశధ్వజ సుతా శుభా
త్రేతాయాం రామపత్నీ చ సీతేతి జనకాత్మజా।
తచ్ఛాయా ద్రౌపదీదేవీ ద్వాపరే ద్రుపదాత్మజా
త్రిహాయణీచ సాప్రోక్తావిద్యమానా యుగత్రమే॥"

(స్క-9 - అ16)

"వ్యా - యతోయుగత్రయే వర్తమానా తస్త్రిహాయణీతినామ, హాయనశబ్దోఽత్ర యుగపరః" అనే దేవీభాగవతశ్లోకాలను వారు ప్రమాణంగా చూపారు.

వీరు చూపినప్రమాణాలు ఛాయసీత స్వర్గలక్ష్మి అయిందనటానికీ, ఆ స్వర్గలక్ష్మి ద్రౌపదిగా అవతరించిందనటానికీ మాత్రమే సరిపోతాయి. నాలాయనిగాను, కాశీరాజకన్యగాను జన్మించిందికూడా స్వర్గలక్ష్మేనని నిరూపించేప్రమాణాలను వారు ప్రదర్శించలేకపోయారు. అందువల్ల ఈవృత్తాంతానికి ఒకసమన్వయం అవసరమవుతోంది. ఆ దిశగా ఇదిఒకప్రయత్నం:

జీవికి పాంచభౌతికమైన స్థూలశరీరంతోబాటు, చైతన్యమయమైన సూక్ష్మశరీరం కూడా ఒకటి ఉంటుంది. ఈ రెండింటికీ కారణమైనమరొక చైతన్యంకూడా ఉంటుంది. దానిని కారణశరీరం అంటారు.

ఈమూడుశరీరాలనూ కలిగిఉండేది ఆత్మ. ఆత్మ అద్వైతమే. కానీ ఈ శరీరాలతాలూకూ అనుభవంతో ఉన్నప్పుడు (అవిద్యోపాధిచేత) దానికిజీవాత్మస్థితీ, అది తొలగినప్పుడు పరమాత్మస్థితీ కలుగుతూ ఉంటాయి. ఇందుకుప్రమాణాలు "వాసుదేవమననము" అనబడే బృహద్గ్రంథం[1]నుంచి గ్రహించబడుతున్నాయి.

"స్థూల, సూక్ష్మ, కారణశరీరా ద్వ్యతిరిక్తః, అవస్థాత్రయసాక్షీ, పంచకోశాతీతస్సన్ సచ్చిదానందరూపస్సన్ యస్తిష్ఠతి స ఆత్మా॥"

(తత్త్వబోధ)

"సర్వజ్ఞేశో మాయావేశ సమన్వితో వ్యష్టిదేహంప్రవిశ్య తయా మోహితో జీవత్వమగమత్। శరీరత్రయ తాదాత్మ్యాత్కర్తృత్వ భోక్తృత్వతా మగమత్। జాగ్రత్స్వప్న సుషుప్తి మూర్ఛామరణ ధర్మయుక్తో ఘటీయంత్రవదుద్విగ్నో జాతో మృతఇవ, కులాలచక్ర న్యాయేన పరిభ్రమతీతి॥"

పైంగల. ఉ. 1.అ.

శ్రీ శ్రీ పరమహంస యోగానందగారి "Man's Eternal Quest" అనే గ్రంథంలో[2] "What are ghosts?" అనేశీర్షికలో వారు హాలివుడ్‌లో చేసినప్రసంగం ఈయబడింది. ఆ ప్రసంగంలో మానవుని ఈ మూడుశరీరాలనుగూర్చి ఇలా వివరిచారు:

"To understand better what astral beings are, let us first understand what we are When god created us, we existed first only as consciousness. We are a creation of his mind. Is it not true that whenever you create something new, the initial step is to visualise a model of it in your mind? Then you gather together the

1. శ్రీవాసుదేవమననము - ద్వితీయభాగము, (ఆంధ్రవివరణము) శ్రీమాచిరాజు శ్రీరామకృష్ణ - సప్తమ వర్ణకము

2. "Man's Eternal Quest"-Sri Sri Paramahamsa Yogananda,1983, Page 270-271

materials and finally you construct the tangible image of your idea. In the same manner, we and every thing in creation are triune: mental (the idea), astral (the building material), and physical (the gross end-product)"

శ్రీయోగానంద ఆప్రసంగంలో శరీరత్రయనిర్మాణాన్ని, స్వభావాన్ని గురించికూడా శాస్త్రీయంగా వివరించారు. ఈమాత్రపు ప్రమాణాలతో దీనికి శరీరత్రయం ఉంటుందని అంగీకరిస్తూముందుకు సాగుదాం.

పరమాత్మ జీవులుగా దిగిరావడం, జీవులు శరీరత్రయానుభవాలనుదాటి పరమాత్మత్వాన్ని అనుభవించడం అనేవి సృష్టిలో జరుగుతూ ఉండే రెండుక్రమాలు. మొదటిదాన్ని అవతరణమనీ, రెండోదాన్ని యోగసిద్ధి అనీ అంటారు.

జీవాత్మ స్థూలదేహాన్ని వదలినతర్వాత సూక్ష్మ,కారణ దేహాలుగా ఉంటుంది. స్థూలదేహంద్వారా సమకూడిన అనుభవాలన్నీ విత్తనంలో చెట్టుతత్వందాగిఉన్నట్లుగా దాగిఉంటాయి, ఈసూక్ష్మ కారణ దేహాలుగాఉన్న జీవాత్మలో.

తపస్సంపన్నులైన జీవులవిషయంలో ఆత్మస్థూలదేహాన్నే కాక, సూక్ష్మదేహాన్నికూడా వదిలించుకొని కారణశరీరంగా ఉండగలుగుతుంది. నరనారాయణులూ, నారద, మైత్రేయాది ఋషులూ ఈవిధమైన శరీరాలద్వారానే తమ అస్తిత్వాని నిలుపుకొని, అవసరాన్నిబట్టి సూక్ష్మస్థూలప్రపంచాలలోకి దిగివస్తూఉంటారు. మరికొన్ని సందర్భాల్లో ఈకారణశరీరాలను వాహికలుగా చేసుకొని ఇంద్రాదిప్రజ్ఞలు సూక్ష్మస్థూలస్థితుల లోకిదిగివస్తూఉంటాయి కూడా. నరనారాయణులనేఋషుల కారణశరీరాలను వాహికలుగా చేసుకొని, ఇంద్రుడు విష్ణువు అనే ప్రజ్ఞలు అర్జునుడూ, శ్రీకృష్ణుడుగా దిగిరావడం ఇందుకొక నిదర్శనం. ద్రౌపది విషయానికి వస్తే

మౌద్గల్యముని మహాతపస్సంపన్నుడు. అతనిభార్య నాలా

యని మహాపతివ్రత. వారిద్దరూ భౌతిక శరీరాలతో ఉండగా అతడు కుష్ఠువ్యాధిపీడితుడూ, ఆమె భర్తృసేవాతత్పరురాలూను. నాలాయని తనను పరిచరించినవిధానానికి ఆమహర్షి ప్రసన్నుడయ్యాడు. ఆమె కోరిన ప్రకారం తనతపశ్శక్తితో ఆబీభత్సరూపాన్నివీడి, కామరూపధరుడై అయిదు దేహాలతో మర్త్య, దేవలోకాల్లో అనేక వేలసంవత్సరాలు ఆమెతో భోగించాడు. వారు సూర్యరథంఎక్కి ఆకాశగంగాజలాల్లో స్నానం చేశారు. చంద్రకిరణాల్లో మునిగారు. మేరుకైలాస పర్వతాల్లో క్రీడించారు. ఇంకాఅనేక దివ్యలోకాల్లో విహరించారు. మర్త్యలోకంలో మాత్రమే భౌతికశరీరాలు ఉంటాయి. దివ్యలోకాల్లో దివ్యశరీరాలతో మాత్రమే ఉండగలుగుతారు. కనుక వారు దివ్యశరీరాలతో సూక్ష్మలోకాల్లో విహరించారని గ్రహించవలసిఉంది. ఆ తరువాత మౌద్గల్యుడు తృప్తుడై, బ్రహ్మమయుడయ్యాడు. అంటే అతనిజీవాత్మపరమాత్మస్థితినిపొందింది. నాలాయనికి కామపరితృప్తి కలుగకపోవడంతో ఆమె మరల భౌతికలోకానికి దిగిరావలసివచ్చింది. కాశీరాజనే రాజర్షికి కుమార్తెగా ఆమె జన్మించింది. ఆజన్మలో ఆమెకు విధివశాన వివాహం కాలేదు. ఆమె తనదురదృష్టానికి బాధపడి శివునిగూర్చి తపస్సుచేసింది. శివుడుప్రత్యక్షమై పంచపతిత్వాన్నిచ్చి, ఆమెను స్వర్గానికిపంపాడు. అంటే తపస్సుచేసింది భౌతికదేహంతో (స్థూలదేహంతో) నే అయినా శివుడు ప్రత్యక్షంకావడం, స్వర్గానికి ఆమెనుపంపడం మొదలైనవన్నీ ఆమె సూక్ష్మకారణదేహాలకు అని గ్రహించాలి. శివుడు ఆమెను అనుగ్రహించి స్వర్గలక్ష్మీపదవిని పొందేటట్లు చేశాడన్నమాట అదెలాసాధ్యం? అంటే స్వర్గలక్ష్మిగా ఉన్నప్రజ్ఞ (శచీదేవి)తో కాశీరాజకన్యక యొక్క జీవాత్మ సంలగ్నం అయ్యేటట్లుచేశాడు. కొంతకాలం అక్కడఉండి, ఆతర్వాత జగద్వ్యాపారానికి అనుగుణంగా స్వర్గలక్ష్మి అయోనిజగా ద్రుపదుని యజ్ఞవాటికనుంచి ఆవిర్భవించి యాజ్ఞసేని అయింది.

**అయోనిజత్వం :** — "ద్రౌపదీనిందానిరాకరణము"లో వారణాసి సుబ్రహ్మణ్య శాస్త్రిగారు "వైశేషికదర్శనము" నుంచీ, "వేదాంతదర్శనము" నుంచీ, "ఛాందోగ్యోపనిషత్తు" నుంచీ ప్రమాణాలు చూపుతూ, యోనిజం, అయోనిజం అని శరీరాలు రెండురకాలుగా ఉంటాయనీ, దేవతలవీ, ఋషులవీ అయోనిజమైన శరీరాలన్నీ, శుక్రశోణితసంబంధం లేక ధర్మవిశేషంచే కలిగేవిఅయోనిజశరీరాలనీ ద్రోణ, ద్రౌపదీ, ధృష్టద్యుమ్నాదుల జన్మలు అలాంటివనీ వివరించారు. పుణ్యకర్మలు చేసినవారు శరీరం వదలినతరువాత చంద్రలోకంచేరి, అక్కడభోగాలు అనుభవించి మళ్ళీభూలోకంలోకి రావటానికి ద్యులోకం, పర్జన్యం, పృథివి, పురుషుడు, స్త్రీ అనే అయిదుస్థానాలున్నాయనీ, పురుషునిద్వారా రేతోరూపంలో స్త్రీగర్భంలో ప్రవేశించడం సాధారణమైనవిషయమనీ, కొన్నిసందర్భాల్లో స్త్రీపురుష ప్రమేయం లేకుండానే దేహోత్పత్తి జరుగవచ్చుననీ వారు స్పష్టపరిచారు.

ఆధునికకాలంలోకూడా కొందరుయోగులు, సిద్ధపురుషులు, అవతారమూర్తులూ స్థూలదేహాలను తమంతతాముగా కల్పించుకోవడం, ఒకేసారి అనేకమూర్తులుగా దర్శనం ఇవ్వడం మొదలైనసంఘటనలను గూర్చివింటూఉంటాం. నమ్మినవారు అలాంటివాటిని మహిమలుగా పరిగణిస్తూంటారు. నమ్మకంలేనివారు వాటిని భ్రమలుగానో, మూర్ఖత్వంగానో జమకట్టికొట్టి పారేస్తూఉంటారు. మనంనమ్మలేని విషయాలనుకట్టుకథలని త్రోసివేస్తే సత్యం ఏమిటో ఎప్పటికీ తెలుసుకోలేం. సత్యదృష్టి కలవిదేశీయులు మనలా ఈ విషయాన్ని త్రోసిపారవేయకుండా దీనిపై పరిశోధన మొదలుపెట్టారు. రష్యాలో స్థూలదేహానికంటె భిన్నంగా "ప్లాస్మాదేహం" ఒకటి ఉంటుందని శాస్త్రవేత్తలు కనిపెట్టి, దానిని గుర్తించగల యంత్రాలనుకూడా రూపొందించారు.[1] ఇంగ్లండు

1. వివరాలకు: "సోవియట్‌రష్యాలో ఆధ్యాత్మిక పరిశోధనలు,"1979.
రచన: ఇవేదవ్యాసఐ .ఎ. ఎస్

లోని ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో "ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైకోఫిజికల్ రీసెర్చ్" లో కూడా సూక్ష్మదేహాలపై పరిశోధనలు సాగుతున్నాయి.

## నీకునీవే ఎదురైతే ...

ఆంధ్రజ్యోతి ఏప్రిల్ 18, 1987 శనివారం 8వ పేజీ

లండన్, ఏప్రిల్ 17: మనం మన శరీరం నుంచి 'తాత్కాలికంగా' బయటకువచ్చి మనశరీరాన్ని చూసుకోవడం ఓ అద్భుతమైన అనుభూతి కదూ! అది అసాధ్యమో సుసాధ్యమోకాని అలాఎవరైనా తమశరీరంలోంచి వేరుపడి, బయటినుంచి తమశరీరాన్ని చూసుకోగలిగిన వారి అనుభవాలు తెలుసుకోవాలని బ్రిటిష్ పరిశోధకులు తహతహపడుతున్నారు.

ఎవరికైనా ఆ 'అనుభవం' వుంటే, ఆక్స్‌ఫర్డ్‌లోని "ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైకోఫిజికల్ రీసెర్చ్"కు వివరించవలసిందని ఆ సంస్థ బుధవారంనాడు విజ్ఞప్తి చేసింది.

"సూక్ష్మశరీరం" తో ప్రయాణం చేసే విధానంపై చేస్తున్న అధ్యయనంలో భాగంగా ఈ 'అశరీర ప్రయాణీకుల' అనుభవాలను తెలుసుకోవాలని ఆ సంస్థ ప్రయత్నిస్తోంది.

పురాణేతిహాసాలలో బొందితో స్వర్గానికి వెళ్ళడం దగ్గర నుంచి వివిధ రకాలైన శరీరాలతో అనేక లోకాలను సందర్శించడంపై రకరకాలైన కథలున్నాయి. మనిషికి మూడురకాలైన శరీరాలుంటాయని అవి స్థూలశరీరం, సూక్ష్మశరీరం, కారణశరీరమని యోగతత్వవేత్తలు వివరిస్తుంటారు.

రెండు శరీరాలున్న ఒక యోగిని చూసినట్టు యోగానంద అనే యోగి తన జీవిత చరిత్రలో వ్రాశారు. ఏదేమైనా ఈ విషయంపై పరిశోధనలు చేయడం విశేషమే.

ఆక్స్‌ఫర్డ్, కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయాలకు చెందిన పట్టభద్రులతో 1961లో నెలకొల్పిన ఈ సంస్థ "సైకిక్ ఫినామినన్" పై అధ్యయనం చేస్తోంది.

ప్రజలలో దాదాపు 10 శాతం మంది కనీసం ఒక్కసారైనా అటువంటి అనుభవం కలిగి వుంటారని నమ్ముతున్నట్టు అక్కడిరీసెర్చి ఆఫీసర్ ఛార్లెస్ మెక్రీరె చెప్పారు. అయితే సూక్ష్మశరీర ప్రయాణీకులు తమ ప్రయాణ విశేషాలను వివరించడానికి ఒప్పుకోరని ఆయన అన్నారు. ఈ అనుభవాలపై కేవలం శాస్త్రీయ దృక్పథం తోనే అధ్యయనం చేస్తున్నామని, దీనిని శాస్త్రవేత్తలు నిర్లక్ష్యం చేశారని ఆయనవెల్లడించారు.

కొందరు ఈ అనుభవాలను ఆధ్యాత్మిక, మతపరమైన భావాల ఫలితాలని భావిస్తారని, ఎందుకంటే మరణానంతరం శరీరం నుంచి ఆత్మ వేరుపడి పోతుందని కొన్ని మతాలు ప్రబోధిస్తున్నాయనీ మెక్రీరే తెలిపారు.



"ఆటోబయోగ్రఫీ ఆఫ్ ఏ యోగి" అనే మహాగ్రంథంలో శ్రీ శ్రీ శ్రీ పరమహంస యోగానంద తమగురువు శ్రీయుక్తేశ్వర్ గారి పునరుత్థానంగురించి వివరించారు. ఆవివరణంలో యోగులూ, దివ్యపురుషులూ సూక్ష్మరూపాలతో ఉండీ భౌతిక శరీరాలను తమంతతాముగా ఏవిధంగా కల్పించుకొంటారో చెప్పబడింది.

ఆక్రమాన్ని పరిశీలిద్దాం:

"Sitting on my bed in the Bombay hotel at three o'clock in the afternoon of June 19, 1936—one week after the vision of Sri

Krishna— I was roused from my meditation by a beatific light. Before my open and astonished eyes, the room was transformed into a strange world, the sunlight transmuted into supernal splendour.

Waves of rapture engulfed me as I beheld the flesh and blood form of Sri Yukteswar!

... ... ... .... ... ... .... ...

But is it *you* Master, the same Lion of God? Are you wearing a body like the one I buried beneath the cruel Puri sands?"

"Yes, my child, I am the same. This is a flesh and blood body. Though I see it as ethereal, to your sight it is physical. From cosmic atoms I created an entirely new body, exactly like the cosmic-dream physical body that you laid beneath dream-sands in. Puri in your dream-world. I am in truth resurrected—not on earth but on an astral planet. ... ... .... .... .... ... ....

... .... ... ... ... ... .... .... .... ...

You have read in the scriptures." Master went on, "that God encased the human soul successively in three bodies—the idea, or causal body; the subtle astral body, seat of man's mental and emotional natures; and the gross material body. On earth a man is equipped with his physical senses. An astral person works through his consciousness and feelings and a body made of lifetrons (prana). A causal-bodied being remains in the blissful realm of ideas. ... ... .... ... ...

.... ... ... .... ... .... ....

"There are many astral worlds, teeming with astral beings," Master began. "The inhabitants use astral vehicles, or masses of light, to travel from one planet to another, faster than electricity or radio active energies.

... .... .... .... .. ... ... .... .... ... ....

No one is born of woman. Astral persons, through fiats of their cosmically attuned will, bring offspring into being in significantly patterned astral forms .... .... ... ... "1

1. "Autobiography of a Yogi"—Sri Sri Paramahansa Yogananda, 43rd Chapter.

ఈశ్వరసంకల్పానుసారం స్వర్గలక్ష్మీప్రజ్ఞ మళ్ళీకొంతకాలానికి నాలాయని (కాశీరాజకన్య) యొక్క కారణ, సూక్ష్మశరీరాలుగా విడివడి, యాజుడూ, ఇతరఋత్విక్కులచే ఆవాహనచేయబడి, స్థూలదేహాన్నిపొంది, ద్రుపదునియజ్ఞవాటిక నుంచి ద్రౌపదిగా ఆవిర్భవించింది.

అవతారమూర్తి అయిన శ్రీకృష్ణుడు దేవకీదేవి అష్టమగర్భంలో అతిసామాన్యంగా జన్మించాడు. ద్రౌపదీదేవి మాత్రం అయోనిజగా అవతరించింది. ఈవిలక్షణతనుబట్టి అయినా ఆమెను సామాన్యదృష్టితో చూడరాదని గమనించాలి.

**అసాధారణకామం* :-**

తనపట్ల ప్రసన్నుడైన భర్తను నాలాయని, "నాకుకామభోగేచ్ఛ అధికంగా ఉంది, నీతపశ్శక్తిచే అయిదురూపాలను పొంది, నన్ను తృప్తిని పొందించు" అని అడిగింది. ఆఋషి ఆమెతో అనేక వేలసంవత్సరాలు క్రీడించి, తాను తృప్తినిపొంది, ఆమెనువిడి బ్రహ్మమయుడయ్యాడు. ఆమె మాత్రం కామతృప్తిని పొందక, శరీరాన్నివదలి కాశీరాజుకు కుమార్తెగా పుట్టింది. ఎన్నటికీ ఆమెకు వివాహంకాలేదు. ఆమె శివునిగురించి తపస్సుచేసింది. శివుడు ప్రసన్నుడై వరం కోరుకో అనగానే ఆమె పతిదానమని అయిదుసార్లు అడిగింది. శివుడు కరుణించి అయిదుగురు పతులు ఆమెకు కలిగేటట్లుగా వరమిచ్చాడు. లోకవిరుద్ధమైన ఆవరానికి ఆమె అంగీకరించలేదు. శివుడు ధర్మవిరోధం ఉండదనీ, అదిపరమార్థమనీ బోధించాడు. ఆమె అంగీకరించి ఆపతులతో ప్రత్యేక సంగమాన కౌమారమూ, పతిశుశ్రూషాసిద్ధీ, కామభోగేచ్ఛా, సౌభాగ్యమూ ప్రసాదించవలసిందిగా వేడుకొంది. శివుడు ఆమెకోరినవన్నీ ఇచ్చాడు.

ఈకథకు విమర్శకులు ఎవరికి తోచినవిధంగా వారు అర్థం

---

* ఈ అసాధారణ కామస్వరూపం 331 వ పుటలో వివరించబడింది.

చెప్పుకొన్నారు. "ఆంధ్రమహాభారతములో ద్రౌపదిపాత్ర - సమగ్ర పరిశీలనము" అనే సిద్ధాంతగ్రంథంలో కె. ఎస్. ఇందిరాదేవిగారు ఇలావ్యాఖ్యానించారు:

"దీర్ఘ కాలము రోగపీడితుడై కృశించినభర్తను అమితముగా ప్రేమించినసతి ఆతనికి రాత్రిపవలు సపర్యలుచేసి ఆరోగ్యవంతుని చేసినది. ఆ ప్రేమైకమూర్తులు ప్రేమయాత్రలు గావించుచు, పలుతావుల విహరించుచు క్రీడించిరి. ఆమె మనసుకు నచ్చినట్లు పతిని అనేక విధములుగ అలంకరించి ఆతనిసౌందర్యమును అనేకవిధములుగ చూడ నెంచినది. అతడును అట్లే పలువిధములుగా నామెకు దర్శనమిచ్చి ముచ్చట తీర్చినాడు. కాని ఉన్నట్టుండి ఆతడొకనాడు సర్వసంగపరిత్యాగియై ఎటకో వెడలినాడు. ఆమె మనసును సరిపెట్టుకొనలేకపోయినది. ఆతడిచ్చిన అనుభూతిని మరువలేకపోయినది. అతడికోసమే పలవించి అసువులు బాసినది. ఇట్లామె సుఖించినది కొంతకాలమే. అట్టితరి సహృదయుడైనవాడు ఆమెయెడ సానుభూతిని చూపునేకాని భర్తకై ఆమె పలవించుట చూచి 'విశేషకామభోగాసక్త' అనియు, 'దుర్భగ' అనియు తూలనాడడు. ఇది పౌరాణికమార్గమున పతిని పంచధావిభక్తుమై సంసారభోగములందు తనియ జేయుమనుటగా, బ్రహ్మమయుడై వెడలిన పతినిగూర్చి పలవించుటగా మార్పునొందినది". (పుట 134)

ఇది ఇందిరాదేవిగారి 'వాస్తవికదృష్టికి' తోచినసమన్వయం ఇంతకుమించినదంతా ఆమెదృష్టిలో కల్పనమే!

"ద్రౌపది మానవభామిని. పురాగాథాంశమగు జన్మకథన మున్నను, దివ్యశక్తులప్రభావమామె కంటగట్ట బడినను ద్రౌపది ఎన్నడును నేలవిడిచినసాము చేయదు. మానవమనస్తత్వమునకు మించి సుమారమున విహరించదు ..." (పుట 121) అంటూనే నాలాయని

కథను అంగీకరించి, నాలాయని పట్ల ఉదారమైన స్త్రీహృదయంతో సాను భూతిని చూపినందుకు ఇందిరాదేవిగారిని అభినందించవలసిందే!

కానీ, ఈకథను ఇంతకంటేలోతుగా ఆలోచించవలసిన అవసరముంది. ద్రౌపదిని మానవమాత్రురాలిగాను, నాలాయనిజన్మలో ఆమెద్వారా వ్యక్తమైన కామాన్ని లోకసామాన్యమైన లైంగికాసక్తి ( sex )గాను పరిగణించడానికి వీల్లేదు. ఆమె ప్రవర్తన కామిని అయిన స్త్రీలా ఎక్కడా ఉండకపోవడాన్నిబట్టి వేరుగా ఆలోచించక తప్పదు.

శ్రీకృష్ణుడు భగవద్గీతలో, మానవుడు తన ఇష్టానికి వ్యతిరేకంగా దేనిచే ప్రేరేపించబడి బలాత్కారంగా పాపాచరణకు దిగుతున్నాడు? అని అడిగినఅర్జునునికి సమాధానంగా ఇలా చెప్పాడు:

"కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః।
మహాశనో మహాపాప్మావిద్ధ్యేనమిహ వైరిణమ్॥

"ధూమేనావ్రియతే వహ్నిర్యథాఽదర్శో మలేన చ।
యథోల్బేనావృతో గర్భస్తథా తేనేదమావృతమ్॥

"ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్యవైరిణా।
కామరూపేణ కౌన్తేయ దుష్పూరేణానలేన చ॥

"ఇన్ద్రియాణి మనోబుద్ధిరస్యాధిష్ఠానముచ్యతే।
ఏతైర్విమోహయత్యేష జ్ఞానమావృత్య దేహినమ్॥"[1]

కామక్రోధాలనేవి రజోగుణంనుంచి పుడతాయి. అవి ద్రవ్యాన్నిహరించేస్వభావంకలవి. వికాసానికి అవి శత్రువులు కనుక పాపకారణాలుగా పరిగణించబడుతున్నాయి. నిప్పుకుపొగా, అద్దానికిదుమ్మూ, కడుపులో పెరిగేపిండానికి మావివలె జీవికి ఈకామక్రోధాలు తప్పనివి. ఇవితీరేవికావు, ఎంతప్రయత్నించినా ఆరేవికావు. కామతృప్తికి

1. శ్రీమద్భగవద్గీత - 3 - 37, 38, 39, 40

యత్నించడమంటే అగ్నిలో ఆజ్యంపోసినట్లే! భాగవతంలో యయాతి మహారాజు అనుభవపూర్వకంగా

"న జాతు కామః కామానాముపభోగేన శామ్యతి।
హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే॥[1]

(అనుభవించడంవల్ల కామం ఉపశమించడమనేది జరుగదు. అగ్నిలో నేతిని పోసినట్లుగా అది వృద్ధిఅవుతూనే ఉంటుంది.) అని చెప్పటాన్ని ఈసందర్భంగా గుర్తుతెచ్చుకోవాలి. ఈకామానికి ఇంద్రియాలూ, మనస్సూ, బుద్ధీ ఆశ్రయస్థానం. దీనివల్ల జ్ఞానంమూటుపడి, మానవుడు మోహానికి లోనవుతున్నాడు.

నాలాయనివిషయంలో అలాజరుగలేదు. ఆమె వివేకంతో తనలోనికామం ఎక్కడినుంచి బయలుదేరుతున్నదో ఆ మూలాన్ని కనుక్కోగలిగింది.

"ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశే ర్జున తిష్ఠతి।
భ్రామయన్ సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా॥"[2]

అనికృష్ణుడు అర్జునునికి బోధించిన మహాసత్యం, భర్త బ్రహ్మమయుడవటంతో ఆమెకు దర్శనమిచ్చి ఉంటుంది. దుష్పూరమైన కామవికారం ఈశ్వర విలాసంగా గుర్తించగలిగింది. కనుకనే, హృదయస్థుడగు ఆ ఈశ్వరుని సర్వభావాలతో (దేహేంద్రియమనో బుద్ధివ్యాపారాలతో) శరణాగతి పొందింది. వానిప్రసాదంవల్ల శాంతినీ, శాశ్వతపదప్రాప్తినీ పొందగలిగింది. ("తత్ప్రసాదాత్పరాం శాన్తింస్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్।")[3] మహాతపస్వి అయిన దుర్వాసముని యొక్క క్రోధం లోకహితానికి అనువుగా మలచబడినట్లుగా నాలాయని యొక్క కామం కూడా లోకహితానికి ఉపకరించేలా మలచబడింది. లోకరీత్యా పాప

1. సంస్కృత భాగవతము -9-14-1- 2. శ్రీమద్భగవద్గీత 18-61
3. శ్రీమద్భగవద్గీత -18-62

హేతువూ, పతనకారకమూ అయినకామం ఆ యోగీశ్వరేశ్వరికి స్వర్గప్రాప్తి హేతువూ, పద్మనాభసహోదరత్వ కారకమూ అయ్యాయి. కనుక ద్రౌపదిని ప్రకృతిమానవభామినిగాను, ఆమెకు పూర్వజన్మల్లో కలిగినది ఇంద్రియసంబంధమైన కామంగాను భావించడం సరికాదు.

"వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరో పరాణి।
తథా శరీరాణి విహాయ జీర్ణాన్యన్యాని సంయాతి నవాని దేహీ॥"[1]

అనే గీతావాక్యంపట్ల విశ్వాసం కలిగి ద్రౌపది పూర్వజన్మ గాథలను యథాతథంగా మనం అంగీకరించినా, ఆమె నాలాయనిగా, కాశీరాజ కన్యగా, ద్రౌపదిగా - మూడు జన్మల్లోనూ స్త్రీగానే ఎలాజన్మించింది? స్త్రీపుంసాది లింగభేదం ఉపాధికృతమే గానీ వాస్తవం కాదుగదా? ఆత్మకు జాతి, కుల, వర్ణాశ్రమ లింగాది భేదాలు లేవుగదా? అనే అనుమానం కలిగే అవకాశంఉంది. ఆత్మకు ఎలాంటి భేదాలూ లేనిమాట వాస్తవమే గానీ అది ఏశరీరాన్నిగ్రహిస్తుందో ఆశరీరంతో ఆధ్యాసిక తాదాత్మ్యం పొందుతుంది. అంతేకాక, జన్మాంతరవిద్యా, కర్మమూ, కర్మఫలవాసనా ఆ ఆత్మను పొందుతూ ఉంటాయి. ఇందుకు "శ్రీవాసుదేవమననము"లో చూపబడినప్రమాణాలను ఉపబలకంగా ప్రదర్శించడం జరుగుతోంది:[2]

"నైవ స్త్రీ నపుమానేవ నచైవా యం నపుంసకః।
యద్యచ్ఛరీరమాదత్తే తేన తేన స యుజ్యతే॥"
(శ్వే. ఉ. 5 - 10)

"తంవిద్యాకర్మణీ సమన్వారభేతే పూర్వప్రజ్ఞాచ॥" (బృ. ఉ. 4-4-2)

ద్రౌపదిద్వారా వ్యక్తమైన అసాధారణ ప్రజ్ఞావిశేషాలను దృష్టిలోపెట్టుకొంటే అవన్నీ ఆమెకు గతజన్మల సంస్కారాలుగా, తపఃఫల సిద్ధిగా సంక్రమించాయని చెప్పకతప్పదు.

1. శ్రీమద్భగవద్గీత -2-22 2. శ్రీవాసు దేవమననము - రెండవభాగం ఆంధ్రవివరణం: శ్రీమాచిరాజు శ్రీరామకృష్ణ పుట - 173

# ఉపయుక్త గ్రంథసూచిక

## తెలుగు


1. అంతరార్థమహాభారతం - డా. వేదుల సూర్యనారాయణశర్మ, 1986
2. ఆంధ్ర భారతకవితావిమర్శనము - శ్రీకోరాడ రామకృష్ణయ్య, 1929
3. ఆంధ్రమహాభాగవతము - పోతనమహాకవి
4. ఆంధ్రమహాభారతము - సంశోధితముద్రణము - ఉస్మానియా విశ్వవిద్యాలయ ప్రచురణ
5. ఆంధ్రమహాభారతము - ఔపదేశికప్రతిపత్తి - డా. నండులగోపాలకృష్ణమూర్తి
6, ఆంధ్రమహాభారతములో ద్రౌపదిపాత్ర - సమగ్రపరిశీలనము (అముద్రితసిద్ధాంత వ్యాసం) డా. కె. ఎస్. ఇందిరాదేవి - ఉస్మానియా, 1981.
7. ఆంధ్రమహాభారతములో రసపోషణము (విరాటోద్యోగపర్వములు) (అముద్రిత సిద్ధాంతవ్యాసం) డా. ఎల్లూరి శివారెడ్డి - ఉస్మానియా, 1981.
8. ఆంధ్రమహాభారతోపన్యాసములు - ఆంధ్రసారస్వతపరిషత్తుప్రచురణ, 1969.
9. ఆంధ్రవాఙ్మయము - కృష్ణకథ, రెండు భాగాలు, డా. ధారా రామనాథశాస్త్రి
10 ఆంధ్రవాఙ్మయారంభదశ, 1, 2 సంపుటాలు, డా. దివాకర్ల వేంకటావధాని
11. తిక్కనకావ్యశిల్పము, డా. కేతవరపు వేంకటరామకోటిశాస్త్రి, 1973
12 తిక్కనచేసినమార్పులు - ఔచిత్యపుకూర్పులు, డా. పి. సుమతీనరేంద్ర, 1982
13. తిక్కన - భారతదర్శనము, డా. నండూరి రామకృష్ణమాచార్య
14. తిక్కన సారస్వతమూర్తి (కవితాశిల్పవిన్యాసము - పదబంధసౌరభము), శ్రీమరుపూరి కోదండరామిరెడ్డి, 1980
15. తెలుగులో పరిశోధన. ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీ ప్రచురణ, 1983.
16. నన్నయగారి ప్రసన్నకథా కలితార్థయుక్తి, శ్రీవిశ్వనాథసత్యనారాయణ, 1962
17. నన్నయప్రసన్నకథ - రీతులు, ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం.
18. నన్నయభట్టు విజ్ఞాననిరతి, శ్రీగొబ్బూరి వేంకటానందరాఘవరావు
19 నన్నయమహిమ, శ్రీమతి కొలకలూరి స్వరూపరాణి, 1985
20. "నావాణి" దర్శనసూసప్రతికలు, జగద్గురుపీఠము, విశాఖపట్టణం ప్రచురణ
21. నృసింహ పురాణము - ఎఱ్ఱన
22. పంచమి - డా. రఘుముంచి రామలింగారెడ్డి.
23. పరిశీలన (వ్యాససంకలనము) డా. నాయని కృష్ణకుమారి, 1977

24. పాంచాలి( నవల ) డా. లత
25. ప్రభాకర ప్రవచనములు, ప్రచురణ యోగమిత్రమండలి, తిరుపతి, 1981
26. బి. ఏ. తెలుగు పాఠ్యగ్రంథం - మొదటిసంవత్సరం(1985 - 88) ఆంధ్రా యూనివర్శిటీ
27. బి. ఏ. తెలుగు స్పెషల్ పాఠ్యగ్రంథం 'తెలుగుసాహిత్య చరిత్ర', సంపాదకులు: డా. కలిదిండి వేంకటరామరాజు: తెలుగు అకాడమీప్రచురణ, 1986
28. భగవాన్‌వేదవ్యాస - 1, 2 సంపుటాలు డా. ఇ, వేదవ్యాస,ఐ.ఎ.ఎస్; యస్‌కెఫీ ప్రచురణ
29. భారతం - ధర్మాద్వైతం, వ్యాసుని దర్శనం - తిక్కన సందర్శనం, డా. మోపిదేవి కృష్ణస్వామి 1984
30. భారతధ్వని దర్శనము, డా, శలాక రఘునాథశర్మ, 1979.
31. భారతసంశయవిచ్ఛేదము, పర్ఘు సూర్యనారాయణ, 1939.
32. మంత్రగీత - వ్యాఖ్యాత: కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్య
33. మనదేశము - మనసంస్కృతి, డా. ఇ. వేదవ్యాస,ఐ ఎ.ఎస్;
34 మహాకవిమార్గము, ఆచార్యయస్వీజోగారావు
35. మహాప్రస్థానం, శ్రీ శ్రీ
36. మహాభారత చరిత్రము - శ్రీపెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి
37. మహాభారత తత్త్వకథనము - 8 సంపుటాలు, శ్రీవారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి
38. మహాభారతమీమాంస, అనువాదము; శ్రీచర్లనారాయణశాస్త్రి
39 మహాభారతము - మహిళ, శ్రీజక్కా వేంకటరమణప్ప, 1979.
40 మహాభారతము - మానవస్వభావచిత్రణము, డా. అప్పజోడు వేంకటసుబ్బయ్య
41 మహాభారతవిమర్శనము శ్రీపుట్టపర్తి నారాయణాచార్యులు
42 మహాభారతోపన్యాసములు, 5సంపుటాలు, శ్రీ నండూరు సుబ్రహ్మణ్యశర్మ
43 యుగధర్మప్రతిష్ఠాపకురాలు - హెచ్ పి బ్లావట్స్కీ జీవిత చరిత్ర, శ్రీ గుంటూరు వేంకటసుబ్బారావు
44 యుగపురుషుడు, ఇ.వేదవ్యాస, ఐ ఎ ఎస్
45 వికాసలహరి, యువభారతిప్రచురణ, 1973.
46 విమర్శవ్యాసములు, శ్రీ శిష్టా రామకృష్ణశాస్త్రి, 1940
47 వ్యాసభారతము - నన్నయపరిష్కారము, డా. జొన్నలగడ్డ మృత్యుంజయరావు
48 వ్యాససాహితీసంహిత, యువభారతిప్రచురణ, 1985

49 శంఖారావము - భగవద్గీతావ్యాఖ్యానగ్రంథం, కులపతిఎక్కిరాల కృష్ణమాచార్య
50 శ్రీ మదాంధ్రమహాభారతము - వావిళ్ళ వారిప్రతులు
51 శ్రీ మహాభారతరహస్యము, శ్రీ శిష్టాసూర్యనారాయణశాస్త్రి, 1938
52 శ్రీ మహాభారతవైజ్ఞానికసమీక్ష (ఆదిపర్వము), శ్రీ తిరుమల వేంకట శ్రీనివాసాచార్యులు, 1986
53 శ్రీ లలితా సహస్రనామస్తోత్రము
54 శ్రీ వాసుదేవమననము, ఆంధ్రవ్యాఖ్యానం శ్రీమాచిరాజు శ్రీరామకృష్ణ
55 సారమతి నన్నయ, శ్రీఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి, 1976
56 సారస్వతవ్యాసములు, ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీ ప్రచురణ
57 సోవియట్ రష్యాలో ఆధ్యాత్మికపరిశోధనలు, డా. ఇ వేదవ్యాస,ఐ ఎ ఎస్

## సంస్కృతం

1 తైత్తిరీయము - తెలుగువివరణ : డా జి యల్ ఎస్ శాస్త్రి
2 రుద్రసూక్తం - తెలుగు వ్యాఖ్యానం: కులపతి ఎక్కిరాలకృష్ణమాచార్య
3 సంస్కృతమహాభారతము - గీతాప్రెస్‌ప్రతి

## ఇంగ్లీషు

1. An abridgement of 'The Secret Doctrine.'
2. ''Autobiography of a Yogi'' -Sri Sri Paramahansa Yogananda
3. Hinduism in Space Age, E.VedaVyas,I.A.S.
4. Man's Eternal Quest-Sri Sri Paramahansa Yogananda
5. Spiritual Astrology ,Dr.E.Krishnamacharya
6. The Aryan Dharma Dr.E. Ananthacharya
7. The Holy Bible
8. The Status of Women in the Epics, Dr.Shakambari Jayal

కృష్ణార్పణం హవిః కృష్ణః కృష్ణాగ్నౌ కృష్ణేన హుతం।
కృష్ణో హి తేన గంతవ్యం కృష్ణ కర్మ సమాధినా॥

